



## తలనొప్పి:

యాస్పిరిన్ మాత్రలను దగ్గరకు రానీయవద్దు. గుండెజబ్బులను రానీయ వద్దు. తలనొప్పికి మందు :— **అమృతాంజనం అన్ని నొప్పు లకు అమోఘమైన ఔషధము**

## రొమ్ముపడిశము:



రొమ్ముపడిశమువల్ల దగ్గు పుట్టుచుండును. అమృతాంజనం ఉపయోగించండి అట్టివేవియు పుట్టనేపుట్టవు. **అమృతాంజనం శ్రీఘ్రాపశాంతికి సంజీవివంటిది**



## వాతపునొప్పులు:

నరములు లాగుకొనిపోవుచుండినప్పుడు అనవసరముగా బాధపడవద్దు. నొప్పిగలచోట కొంచెము అమృతాంజనము రుద్దవలెను. బాధ తొలగిపోవును. **అమృతాంజనం అన్ని నొప్పులకు అమోఘమైనఔషధము**

## పడిశములు:



శైత్య పడిశములకు మందులు మ్రింగవద్దు: ముక్కుమీద కొంచెము అమృతాంజనం రుద్దితే చాలును. శిరోభారము త్వరగా తగ్గిపోవును. **అమృతాంజనం శైత్యదోషములను పోగొట్టును**



ॐ

# ప్రస్తావన

ఓన్నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే,
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీ సచ్చిదానందాత్మక విశ్వేశ్వర లీలావిలాసములు చిత్రవిచిత్రములు. సాపేక్షములైన విశ్వేశ్వర లీలా విలాసములు నిరపేక్షమైన ఆత్మానందమునందు సార్థకము లగుచున్నవి. బ్రహ్మాండ మనంతము. ద్వాదశాదిత్యాది మండలములు, నవగ్రహమండలములు, ౧౬౦,౦౦,౦౦,౦౦౦ తారాగణములు బ్రహ్మాండ పరిగణనమును దుస్సాహ్యము చేయుచున్నవి. దూరస్థమైన తారలనుండి కాంతికిరణము భూగోళమును చేరుటకు అనేక కాంతి వత్సరములు కావలయును. అనంతమైన బ్రహ్మాండమునందు ౫,౭౫,౧౨,౦౦౦ మైళ్ళ భూప్రదేశము, ౧౩,౯౪,౪౦,౦౦౦ మైళ్ళ జలప్రదేశము చేరి ౧౯౬౯౫౦,౦౦౦ చదరపుమైళ్లు భూగోళపువిస్తీర్ణము. బ్రహ్మాండమునందు భూగోళ మొక స్వల్పప్రదేశము. భూగోళ విస్తీర్ణమునం దాసియాఖండవిస్తీర్ణము ౧౭౦౭౪౦౫౦, హిందూస్థాన విస్తీర్ణము ౧౮,౦౯,౦౦౦ గ్రేటుబ్రిటను విస్తీర్ణము ౨౧,౩౭౭ బ్రిటీషు సామ్రాజ్య విస్తీర్ణము ౧,౯౯,౦౯,౭౮౨ చదరపు మైళ్లు. బ్రిటీషు సామ్రాజ్య విస్తీర్ణము, సామ్రాజ్య జనసంఖ్య, సామ్రాజ్య ప్రజల కష్టసుఖములు ధర్మాత్ములకు ధర్మజిజ్ఞాసను జేయవలసిన యవసరమును విశదము చేయుచున్నవి. మానవ ధర్మాభ్యుదయమునందు ధర్మసంకల్పబలము సంకల్ప సిద్ధికి సాధనముగ నున్నది. ధర్మ సంకల్పములేని స్వదేశాభిమానము, సామ్రాజ్యాభిమానము, స్వజాతీయాభిమానము పరమానర్థములకు మూలమగుచున్నది. యూరపు రాజ్యములందు దినదిన ప్రవర్ధమానం బగుచున్న స్వార్థారాధనము, స్వజాతీయాభిమానము దురహంకారమునకు మూలమై అసురబలారాధనమును మితిమేరలు లేకను వ్యాపింప జేయుచున్నది. అఖండమైన బ్రహ్మాండమునందు స్వదేశస్వస్థల సంకల్ప సంకీర్తన సంస్మరణములు స్వార్థమునకు గాకను పరమార్థమునకు వినియోగించుట పురుషార్థమునకును, మానవధర్మాభ్యుదయమునకును, ప్రపంచశాంతికిని సాధనము. అనంతమైన కాలచక్రమునం దొక సంవత్సర ఫలసంస్మరణ మాత్మానుభవ సంస్మరణమునకు వినియోగపడుచున్నది. విశ్వప్రవృత్తియందు సాపేక్షములైన బ్రహ్మకల్పములు, పరార్థములు, కల్పములు, మన్వంతరములు, యుగములు, శకములు, చాంద్రమాస పరివృత్తులు, చాంద్రమానాబ్దములు, అయనములు, మాసములు నిరపేక్షమయిన ఆత్మానందమునకు నిమిత్తములుగ నున్నవి.

కాలమహార్ణవమునందు శాలివాహనశకాబ్దములు ౧౮౫౯, విక్రమార్కశకాబ్దములు ౧౯౯౪, క్రైస్తవశకాబ్దములు ౧౯౩౭, ఫసలిశకాబ్దములు ౧౩౪౫, భరతశకాబ్దములు ౫౦౭౯, కలియుగాది సౌరాబ్దములు ౫౦౩౮, సృష్ట్యాది సౌరాబ్దములు ౧,౯౫,౫౮,౮౫,౦౩౮ గతించినవి. కలియుగాదినుండియును ౮౪ చాంద్రమాన చాంద్రాయణ పరివృత్తులు ముగిసినవి. ౮౫ వ పరివృత్తియందు పదేండ్లు గతించినవి. పదకొండవ యేడు ఈశ్వరసంవత్సర మారంభమైనది. బ్రహ్మకల్పమునందు, ద్వితీయ పరార్థమునందు, ప్రథమవర్షమునందు ప్రథమమాస పక్షదినములందు ౧౩ ఘటికలు ౪౭ విఘటికలు గతించినవి. అనంతమైన కాలచక్రమునం దొక చాంద్రమానాబ్ద చరిత్రము పరమక్షణమైనను దురవగాహముగ నున్నది.

అఖండమైన విశ్వ సంస్మరణమువలెను అనంతమైన కాలసంస్మరణమును నిరపేక్షమైన ఆత్మానందమునకు సాధనముగ నున్నది.

ఈశ్వర చాంద్రమానాబ్దమునకు చంద్రుడు రాజు, సేనాధిపతి, అర్ఘాధిపుడు మేఘాధిపుడు :— ఫలము - రాజు చంద్రుడగుటవలన శుభములు చేకూరుట, పశువృద్ధి, సస్యసంపత్తి, రోగహాని, సుఖము, వృష్టి మొదలగునవి కలుగును. సేనాధిపతి చంద్రుడగుటచేత మంచి వర్షము, జనులకారోగ్యము, గోవులు క్షీరప్రదములై యుండుట మొదలగు శుభములు సర్వదేశములందును వర్తించును. అర్ఘాధిపతి చంద్రుడగుటచేత దేశమంతటను మంచివర్షము, సస్యాభివృద్ధి, ధరల పెంపు కలుగును. చంద్రుని మేఘాధిపత్యముచే సువృష్టి, మంచిపంట, పశువులు క్షీరప్రదములై వృద్ధిగాంచుట కలుగును. మంత్రి కుజుడు. ఫలము - పురగ్రామవనాదులు దహించబడుట, మధ్యముగ వర్షించుట, యుద్ధభయము మొదలగు ఫలములు పౌండ్రకళింగ దేశములందు వర్తించును. సస్యాధిపతి శుక్రుడు. ఫలము - మాగాని మెట్టపంటలన్నియు బాగుగపండును. తెల్లభూములందు పంట బాగుండును. ఈ ఫలము ఘూర్జరయవన దేశములందు ఎక్కువగ వర్తించును. ధాన్యాధిపతి బుధుడు. ఫలము - మేఘములు వాయుపీడితములై సామాన్యముగ వర్షించును. ప్రభువులకు గ్లాని గలుగును. రసాధిపతి రవి. ఫలము-నెయ్యి, నూనె, తేనె మొదలగు రసవస్తువులకు ధరలు తగ్గును. నీరసాధిపతి గురువు. ఫలము-పోకలు, రత్నములు, బంగారము, ధాన్యములు, దూది, చర్మములు, పుష్పములు, మంచి గంధము మొదలగు వస్తువులు వృద్ధి నొందును. ద్విజులు సుఖము నొందెదరు. పురోహితుడు శుక్రుడు. ఫలము- సస్యవృద్ధి, రాజులకు నైతికవర్తన, బ్రాహ్మణులు శుభకర్మాసక్తులగుట కలుగును. పరీక్షకుడు గురువు. ఫలము - సస్యార్ఘవృష్టులు బాగుండును. ప్రజలు అన్యోన్యానురాగులై యుందురు. పరీక్షకులు నీతియుక్తులై యుందురు. గణకుడు రవి. ఫలము- గణకులు మందబుద్ధులగుదురు. నువ్వులు, మినుములు, ఉలవలు బాగుగ ఫలించును. గ్రామపాలకుడు కుజుడు. ఫలము-గ్రామములందగ్ని భయము, ఆకలి, శత్రువర్ష బాధలు. దైవజ్ఞుడు చంద్రుడు. ఫలము- మాగానిపంటలు, వృక్షజాతులు బాగుండును. పశుపాలకుడు గోపాలుడు. ఫలము-పశువులు మేతగలిగి సుఖమున నుండును. సస్యాభివృద్ధి యుండి ధరలు బాగుండును. స్థానసంరక్షకుడు శ్రీకృష్ణుడు. ఫలము- గోవులు సుఖముగలవై బాగుగ పాలిచ్చును. ఈశ్వరసంవత్సర సామాన్య ఫలము:

ఈశ్వరాబ్దేఽథరాష్ట్రేశాః జగదానందవర్ధకాః
అధ్వరే నిరతావిప్రాః స్వస్వమార్గరతాః పరే

ధాతృసంవత్సరము: గత వత్సరములువలెను కాలప్రవాహమునందు లీనమైనను ఫలము మాత్రము నిత్యమైన ధర్మప్రయోజనమునందు సమన్వయమును పొందినది. గత సంవత్సరమునందు కుజరాజ్యాధిపత్యము పరమానర్థమునను గుణించినను జోస్యము సఫలముగాకుండుట ధర్మబల ఘటనము. ధాతృ సంవత్సరమునందు ప్రతిష్ఠితములైన సంగ్రామ సన్యము ఈశ్వర సంవత్సరమునందు వెలకలెత్తి బహుధాన్య సంవత్సరమునందు బహువిధములను ఫలించుట యీశ్వరసంకల్పముగను గనపడుచున్నది. యూరపు ఖండమునందు సకల రాజ్యములును మహాసంగ్రామ ప్రయత్నములను చేయుచున్న విధము భయంకరముగ నున్నది. రుద్రుడు ప్రళయతాండవము నే క్షణమున నుపక్రమించునో తెలియకున్నది. సంగ్రామ ప్రతికూలురును, సంగ్రామానుకూలురును సంగ్రామమునకు మహాస్వాగతము నొసంగుటకు సిద్ధముగనున్న విధమును సకల ప్రభుత్వప్రయత్నములు, ప్రజల యుత్సాహమును సువ్యక్తము చేయుచున్నవి. అయినను సంవత్సరారంభమునందు రుద్రుడు నటరాజమూర్తియై శాంతి నాట్యము ననుగ్రహించుటకు సంకల్పించుట సకల జనులకును విశ్వవ్యాప్త ధర్మముగ నున్నది.

"శ్రీ పరమేశ్వరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య ఆగ్నేయప్రదేశే, కృష్ణాకావేర్యోర్మధ్యదేశే, ఈశ్వరనామ సంవత్సరే, ఉత్తరాయణే, వసంతఋతౌ, చైత్రమాసే, శుక్లపక్షే, ప్రథమాయాం, అశ్వినీనక్షత్రే, సోమవాసరే"

ధర్మసంరక్షణమును, ప్రపంచ శాంతిని, ప్రపంచ క్షేమములు సంకల్పించుట పరమార్థము, పురుషార్థము;

ధర్మపరిణామము

ప్రపంచ పరిణామమునందు ధర్మ పరిణామ మతిగుహ్యము. ధర్మము సమస్త ప్రపంచమునకును నాధారభూతమైనను ధర్మస్వరూప స్వభావములు దుర్గ్రాహ్యములయి దురారాధ్యములుగనున్నవి. నిత్యమైనధర్మము అనిత్యములైన దేశకాలపాత్రావరణములందుబహువిధములైననామరూపభావములను పరిస్ఫుటమగుచున్నది. అనేకములైన సామ్రాజ్యములు, జాతులు, యుగములు గతించినను, ధర్మము మాత్ర మవిచ్ఛిన్నముగను మానవ ధర్మాభ్యుదయమునకు పరిణామము పొందుచున్నది. వ్యక్తులు, జాతులు ధర్మవ్యాజమునను చేయుచున్న ఘోరకార్యములు ధర్మనామమునే పరిహాసాస్పదము చేసినవి. ప్రపంచేతిహాసములందు శ్వేతజాతులు సాయుధపాణులై స్వదేశీయులను నిరాయుధులజేసి దేశాక్రమణము, ప్రజాస్వాతంత్ర్య నిర్బంధమును చేసిన విధము మానవధర్మేతిహాసములందు దారుణదురధ్యాయము. ఆఫ్రికా, ఆస్ట్రేలియా, హిందుస్థానము మొదలగు దేశములందు స్వదేశీయులు బానిసలై, ఆత్మవిశ్వాస విరహితులై కృశించి క్షీణించుచున్నారు. అమెరికాఖండమునం దాదిమవాసులు నామరూపములు లేక నశించి దేశము శ్వేతముఖులకు మాతృస్థానమైనది. ప్రపంచమునందు గల సుక్షేత్రములు, ఊషర క్షేత్రములు, జలస్థలమార్గములు, ఖనిజములు, సంపదలు శ్వేతజాతుల హస్తగతములైనవి. శ్వేతేతరదేశములందు స్వదేశీయులు విదేశీయులకు దాసానుదాసులై ప్రవర్తించుట మానవధర్మ పరిణామమునందు దురదృష్టాధ్యాయము. ప్రపంచమునందు గల ౧౮౭ కోట్లప్రజలందును ౧౨౦ కోట్ల ప్రజలు నిరంతరము పరదేశీయుల నాశ్రయించి జీవించుట మానవవికాసమునకును, ప్రపంచ వికాసమునకును, ప్రపంచ శాంతికిని ప్రతికూలము. ప్రపంచమునందలి సకలదేశములును శ్వేతజాతుల వశంగతమైనప్పుడు వారి రాజ్యములు పరస్పర వినాశనమునకు సాధనములగుట ప్రకృతి ధర్మము. స్వల్పమైన భూభాగములుగల ఇటలీ, జర్మనీ, జపాను రాజ్యములు మహారాజ్యముల ప్రతిఘటనమునకు పూనుకొనుటయందు విచిత్రములేదు. అయినను సంగ్రామ సాధనమునను చేయదలచిన ప్రతిఘటనము మానవధర్మమును మూలచ్ఛేదము చేయుటకే వినియోగపడగలదు.

యూరపురాజ్యములు సంపన్నములయి బలమును గలిగియున్నను వాటి స్థితిగతు లయోమయముగనున్నవి. దేశాదాయమంతయును సంగ్రామ సన్నాహమునకు వినియోగపడుచు ప్రజలన్నాతురులై పరితపించుచున్నారు. ధర్మము ధర్మసూత్రములందు గోచరించునటులు కార్యములందు గోచరించుటలేదు. ప్రేమతత్వమును బోధించుటకు క్రైస్తవబోధకులను ప్రపంచమునందంతటను సంరక్షించెడి యూరపు రాజ్యములు స్వదేశములందు ద్వేషగీతములను పాడుచు ద్వేషానలమును వ్యాపింపజేయుచున్నవి. జర్మనీయందు క్రీస్తుస్థానమును ఓడిం దేవత నాక్రమించిన విధము పరిహాసపాత్రమైనను విధివిహితమైనది. రుష్యాయందును క్రైస్తవమతము దీనదశయందున్నది. ఇటలీయందు ముస్సోలినీ ఆరాధన పీఠమధిష్ఠించుచున్నాడు. స్పెయినునందు విప్లవము మతమునకును, బలమునకును ప్రబలుచున్న ప్రతిఘటనమును విశదము చేయుచున్నది. గ్రేటు బ్రిటను, ఫ్రాంసు మొదలగు రాజ్యములందును మత ప్రతిష్ఠ క్షీణించి, బలప్రతిష్ఠ వృద్ధియగుచున్నది. యూరపు రాజ్యములందు ధర్మప్రతిష్ఠ క్షీణించి, బలప్రతిష్ఠ దినదినాభివృద్ధిని పొందుచున్న విధమును రాజ్యములవలంబించుచున్న ఆయుధధారణ, వ్యయ, వ్యవహారములు వెల్లడి చేయుచున్నవి. యూరపు రాజ్యములన్నియును గతించిన పదేండ్లయందును ఆయుధ ధారణమున కర్బుదముల ద్రవ్యమును వ్యయము చేసినది. సంగ్రామ సన్నాహ వ్యయము రాను రాను వాయువేగముతో పెరుగుచున్నది. గ్రేటుబ్రిటను రాగల నాలుగేండ్లయందును ౨[illegible] కోట్ల రూప్యములను సంగ్రామ సన్నాహములకు వ్యయముచేయుటకు చేసిన నిర్ణయములు జర్మను, రుష్యా, జపాను, ఫ్రాన్సు, ఇటలీ రాజ్యముల సంగ్రామ సన్నాహ ప్రయత్నములను ద్విగుణీకృతము చేసినవి. సకలరాజ్యములందును రాజ్యాధికారులు సంగ్రామ సన్నాహములు సంగ్రామనివారణమునకు మూలాధారమని ఘోషించుచున్నను సంగ్రామ ప్రయత్నములకు ఫలము మహాసంగ్రామము కాని శాంతి కాజాలదు. [illegible]

సంగ్రామానంతరము సర్వసంహారము గలిగినపుడు శాంతిపర్వము సిద్ధికృతము. సర్వసంహారము శోకపూర్వమే శాంతి పర్వ స్థాపనము శ్రేయస్కరము, ధర్మసాధనము. కాని వర్తమానసంగ్రామసన్నిపాతావస్థయందు సంహారమే శాంతికి మూలమని యెంచదగియున్నది.

పశుబల ధర్మబలములు

గతించిన మహాసంగ్రామానంతరము ప్రపంచ మంతయును శాంతిఘోష పెట్టినది. మహాసంగ్రామమునందు ౮౦,౦౦,౦౦౦ సైనికులు మృతినొంది ౧౩,౯౦౦ కోట్ల రూప్యములు వ్యయమై ప్రజ లష్టకష్టములకు పాలైనపుడు సకలరాజ్యములందును సంగ్రామప్రతిఘటనము, శాంతిసుముఖత్వము ప్రబలినవి. కాని ఈ వైరాగ్యము శ్మశాన వైరాగ్యమువలెను వెంటనే అంతరించినది. మున్సులోని హిట్లరుగారులు యూరపురాజ్యములందు నూతన శకస్థాపనమున కుపక్రమించిరి. యూరపు రాజ్యములందు చిరకాల దుఃఖానుభవానంతరము క్రమవికాసమును పొందుచున్న ప్రజాస్వామ్య వికాసమునకు ప్రతిఘటనము గలిగినది. ప్రజాస్వామ్యమునకు మూలాధారములైన సమత్వము, స్వాతంత్ర్యము, సోదరత్వము, ధర్మముల స్థానము నియంతృత్వమాక్రమించు చున్నది. సకల రాజ్యములందును విప్లవదేవత ప్రళయ తాండవమును జేయుచు మహాబలిని గోరుచున్నది. మహాబలి ఫలము నూహించుట దుర్లభమైనను భయంకర బలిదాన బీభత్సమును ప్రవర్ధమానంబగుచున్న చీనాజపానుసంగ్రామములు, గతించిన ఇటలీ అబిసీనియా యుద్ధము, ప్రవర్ధమాన మగుచున్న స్పెయిను విప్లవసంరంభము పశుబల విజృంభణమును, ప్రపంచము నావరించిన దుఃఖవేదనను విశదము చేయుచున్నవి. ప్రపంచమునందంతటను విజయ ధ్వానముల నడుమను దుఃఖవేదన తాండవమాడుచున్నది. నానారాజ్యములును చేరి "నాకాయుష్యము, నాకారోగ్యము, నాకైశ్వర్యము" మార్గమును విడిచి "సకలజనులు సుఖపడుగాక !" యని పని పూననంతవరకును ప్రపంచ శాంతి దుర్లభము. ఈ పరమార్థమును నానాజాతిసమితివ్యవహారములు కరతలామలకమును చేసినవి.

నానాజాతిసమితి

విజయధ్వానములతో ౧౯౨౦ వ సంవత్సరమునందు మహా సంగ్రామానంతరము ప్రారంభమైన నానాజాతిసమితి సాంఘిక సిద్ధాంతములను, ధర్మములను విమర్శించి నిర్ణయించుటకు కొంత యుపచరించినను సమితి మూలప్రయోజనమునకు నిరర్థకమైనది. అంతర్జాతీయ సహకార సంయోగములు యుద్ధ ప్రతిషేధమునకును, శాంతి స్థాపనమునకును నిరాధారములైనవి. జపాను చీనామీదను, ఇటలీ అబిసీనియామీదను నిర్నిమిత్తముగను స్వార్థారాధనమునకు దండయాత్రను చేయుచున్నను జర్మనీ రైనులాండు నాక్రమించినది. సర్ శామ్యుల్ హోర్, యాంథొనీ ఈడెన్ గార్లు విదేశాంగ రాజ్యాంగము లం దవలంబించిన రాజనీతి ప్రపంచమునం దంతటను. బ్రిటిష్ ప్రతిష్ఠాగౌరవములను క్షీణింపజేసినది. సమితికిలేని ప్రతిష్ఠ ప్రపంచ న్యాయస్థానమునకు కలుగజాలదు.

నానాజాతిసమితి ప్రబల రాజ్యముల స్వత్వసంరక్షణమునకును, దుర్బలరాజ్యముల పీడనమునకును, ఏర్పడినపథమును గతించిన పదేండ్ల వ్యవహారమును ఋజువు చేసినది. ప్రపంచమునందు శాంతిస్థాపనమునకు పూనుకొనగల పురుషుడు గాంధీ మహాత్ముడు. కాని పరువు ప్రతిష్ఠలు లేని శ్వేతేతర నాయకులను శ్వేత ప్రముఖులు కన్నెత్తిచూచుటయును దుర్లభము. అమెరికాయందు ప్రెసిడెంటుపదవిని నూతనముగ నధిష్ఠించిన రూజ్వెల్టుగారిమీద ప్రపంచ లక్ష్యము శాంతిస్థాపనమునకు ప్రసరించు చున్నది. కాని వర్తమాన పరిస్థితులందు శాంతిస్థాపన మెవ్వరికిని సాధ్యముకాదని జాతియుద్ధగర్భమాన దురహంకారములు వెల్లడి చేయుచున్నవి. సకలజాతులును సహా మహామికను శాంతిస్థాపనమునకు గాకను సంగ్రామసన్నాహములకు జూపుట ప్రపంచము నావరించిన దురదృష్టము. సకల దేశములందును రాజ్యాధికారులు స్వోత్కర్షకు, దంభాహంకార ప్రకటనములకు పూనుకొనుట పశుబలారాధన ప్రభావమును విశదము చేయుచున్నది.

యూరపు రాజ్యములు

యూరపు రాజ్యములు పూనిన యహమహమికకు హిట్లరుగారి ప్రసంగములు, వ్యవహారములు దివ్య వ్యాఖ్యానములు. ఆబాలగోపాలమందరి హృదయములందును హిట్లరు దేవత సుప్రతిష్ఠితము. నాజీవిజయ ఘోషలు

వ్యాపించినవి.జాతి, మతాది సంస్కారములందు విలక్షణత్వము సుప్రతిష్ఠితము. ఈ సంస్కారమున కనురూపముగను ప్రపంచ ధిక్కారమునకు హిట్లరుగారు రుపక్రమించిరి. రైనుల్యాండాక్రమణము, స్పెయినునందు విద్రోహులకు సహాయము, మొరాకోయందు ప్రవేశము, ఆఫ్రికాయందు నాజీప్రచారము మొదలగు వ్యవహారము లన్నియును హిట్లరుగారు సంగ్రామమునకు కాలును దువ్వుచున్న విధమును రుజువుచేయుచున్నవి. రుష్యా జర్మనుప్రగల్భములను ప్రతిఘటించుటకు సంసిద్ధముగ నున్నది. రుష్యాయందు సంభవమైన యపారాభ్యుదయము జర్మనులు మాటలందు తృణీకరించినను హృదయ శల్యముగ నున్న(ది.) జర్మను జపానుసోదరు లిరువురును సమయమును రుష్యాను మ్రింగివేయుటకు సంకల్పించినను రుష్యా నిర్భయముగను విజయధ్యానములను పాలించుచున్నది. రుష్యా యుద్ధసన్నాహములకై బంగారమును అమెరికా సంయుక్త రాష్ట్రములందు సమీకరణము చేయుచున్నది. ఆకాశ విమానములందు రుష్యా యగ్రస్థానమును వహించుచున్నది. రుష్యా మార్గమునే ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను లవలంబించుచు యూరపు రాజ్యములందు బలీయమైన పక్షమును సుస్థిరము చేసినవి. రుష్యా, గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు,అమెరికా రాజ్యములు శాంతి స్థాపనమునకు దీక్షను బూనినచో కొంతవరకైనను శాంతిస్థాపనము సాధ్యముగావచ్చును. కాని బ్రిటీషురాజనీతిజ్ఞులు వర్తమాన విషాదావస్థయందు నిశ్చితమైన రాజనీతిలేకను కాలయాపనము చేయుట బ్రిటిషుసామ్రాజ్యము నావరించిన దురదృష్టము. బ్రిటిషురాజ్యాంగములందు జాతీయ పక్షము స్థిరాసనమును కల్పించుకొని కలుగజేయుచున్న బీభత్సము ప్రజలకేహ్యముగ నున్నను గత్యంతరము గనుపడకున్నది. ధనస్వాములు సంకల్పించిన సంగ్రామ కపటనాటకము పరమానర్థములకు మూలముగా నున్నది. అష్టమ ఎడ్వర్డు రాజ్యత్యాగము, షష్ఠజార్జి పట్టాభిషేకము, బాల్డువినుగారి మంత్రిత్వవిరామము బ్రిటిషురాజ్యాంగములందు ప్రముఖవిషయములు. నిస్సహాయస్థితియందు హిందూస్థానము బ్రిటిషుసామ్రాజ్యాంతర్భాగమై స్వదేశములందును విదేశములందును ననుభవించుచున్న దైన్యావస్థ వర్ణనాతీతము.

హిందూ స్థానము

హిందూస్థానము 35 కోట్ల ప్రజలను, ౧౮,౦౫,౦౦౦ చదరపుమైళ్లి విస్తీర్ణమును,సుజలపూరితములైన నదీనదములను, ఖనిజసంపదలను, సుక్షేత్రములను, పాడిపంటలను, కన్యాకుమారి కైలాసశిఖరములను, సనాతనధర్మ విజ్ఞానసంస్కారములను కలిగియును పరమదైన్యస్థితి ననుభవించుట పరమదురదృష్టము. పరాధీనస్థితియందు పండితులకును ఆత్మవిశ్వాసముగలుగకున్నది. హిందూస్థానమునకు సహజమైన సాహస ధైర్యములు, ఆయురారోగ్యైశ్వర్యములు, ప్రజ్ఞాపాండిత్యములు క్షీణించి పరాశ్రయము శరణ్యమైనది. ప్రజలు దారిద్ర్యగ్రస్తులై, వ్యాధిపీడితులై, పూర్ణాహారవిహీనులై దుఃఖవేదన ననుభవించుచున్నారు. దేశము నావరించిన సకలారిష్టములకును, పరావలంబనము, పారతంత్ర్యము మూలములని ప్రాజ్ఞు లంగీకరించుచున్నారు. ప్రజల శరణోపాయము ప్రజల హస్తములందే కలదని గతించిన ఇరువదేండ్ల కాంగ్రెసుచరిత్రము సువ్యక్తము చేసినది. సకలవిధములను దిగ్బంధమైన దేశమునందు ప్రజలకు స్వతంత్రించి ఏ పనిచేయుటకును అవకాశములు లేకున్నవి. స్వతంత్ర భావములు, స్వతంత్ర నిర్మాణములు స్వతంత్రాచరణములు రాజద్రోహములై నిర్బంధములకు గురియగుచున్నవి. నిర్బంధ నిషేధభరితమైన శాసనము రాష్ట్రీయ స్వపరిపాలన శాసనము. మహాతంత్రజ్ఞునకైనను ప్రపంచము నెల్లపుడును వంచించుట సాధ్యము గాదు. రాష్ట్రీయస్వపరిపాలన శాసనమునందు స్వపరిపాలన వాసనయైనను లేదని గాంధిమహాత్ముడు ౧౯౩౭ లోనే చెప్పియుండెను. గాంధిమహాత్ముడా సత్యమునే నేడును హిందూస్థానమంత్రికి, వైస్రాయికి, గవర్నరులకు, స్వదేశీయులకు, విదేశీయులకును చాటుచున్నాడు. స్వారాజ్య శాసన నామమునను హిందూస్థానమును ఆయుధబలముతో పాలించుచున్న విధము సకలజనులకును తెలిసినవిషయము. కాంగ్రెసు ఆయుధబలమును ప్రతిఘటించి ప్రజాస్వామ్యమును స్థాపించుటకు చేయుచున్న ప్రయత్నములు ప్రతిఘటనములకు పాలయి నిరర్థకములయినను ప్రజాశక్తి దినదినాభివృద్ధిని పొందుట యాశాజనకముగనున్నది. ఇది సత్యాగ్రహప్రభావము.

## కాంగ్రెసు

ఉమేశచంద్ర బానర్జిగారు ౧౮౮౫ లో బొంబాయి నందు సమావేశమైన మొదటి కాంగ్రెసు అధ్యక్షులు. గత సంవత్సరము నందు కాంగ్రెసునకు ౫౦ ఏండ్లు నిండినవి. ఆసేతు హిమాచలపర్యంతమును గతసంవత్సరమునందు కాంగ్రెసురజతోత్సవములు పరమోత్సాహములతో జరుపబడినవి. కాంగ్రెసుపేరుప్రతిష్ఠలు మూలమూలలను వ్యాపించినవి. కాంగ్రెసు ప్రతిభ అద్వితీయము. దేశసేవా పరాయణులును, స్వాతంత్ర్య ప్రియులునునైన మహానుభావు లెందరో దేశారాధనమున కాత్మార్పణము చేసినవిధము స్వాతంత్ర్యసమరమునందు నూతనపర్వము. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహాయుధము ప్రతిఘటనమునకు పాలైనను క్రమాభివృద్ధిని పొంది స్వాతంత్ర్యస్థాపనమునకును, శాంతిస్థాపనమునకును సాధనము గాగల విధమును కాంగ్రెసుబల విజయములు పరిస్ఫుటము చేయుచున్నవి. గతించిన ౫౦ ఏండ్లయందును గలిగిన విశ్వభావపరివర్తనమును ఫెయిజుపూరు కాంగ్రెసువ్యవహారములు విశదము చేయుచున్నవి. నెహ్రూగారి యుపన్యాసము గంభీరభావభరితమై ప్రతిపక్షులకును జిజ్ఞాసాపాత్రముగ నున్నది.

## ఫెయిజుపూరు కాంగ్రెసు

పండిత జవహరిలాలుగారి అధ్యక్షోపన్యాసమునందలి యుదారభావములు ప్రపంచవ్యాప్తమయిన స్వాతంత్ర్యభావ పరివర్తనమును ఘోషించుచున్నవి. ఏకధర్మసూత్రబద్ధమై ప్రవర్ధమానం బగుచున్న విశ్వమునందు మానవస్వాతంత్ర్యధర్మాభ్యుదయము నిగూఢనిహితము. యూరపు రాజ్యములందు ప్రవర్ధమానం బగుచున్న స్వాతంత్ర్యసంరంభము ప్రపంచమునందంతటను ప్రతిబింబించుచున్నది. అబిసీనియాహత్యలు, పలస్తీను ఘోరములు, నాజీదౌర్జన్యములు, స్పెయిను విప్లవదౌర్జన్యములును మానవస్వాతంత్ర్యసంరంభమునందు జరుగుచున్న సంరంభమునకు ప్రపంచవ్యవహారముల నంతర్జాతీయలక్ష్యముతో నవలోకించవలసిన యవసరమును తెలుపుచున్నవి. విదేశములందలిధర్మపరాజయవిజయములకును సంబంధములేని మధ్యస్థులవలెను గాక సంబంధముగల సన్నిహితుల సంబంధమై యున్నది. ప్రపంచమునందే ప్రాంతమునందును ప్రవర్ధమానంబగుచున్న స్వతంత్రధర్మసమరము పరాధీనరాజ్యములందతిరయమునను వ్యాపించి సంక్షోభమును గలుగజేయుచున్నది. శ్వేతముఖులు హిందూస్థానమునందు సర్వజ్ఞులై సర్వస్వతంత్రులయి వ్యవహరించుచుండగాను స్వదేశీయులాచంద్రార్కము దాసానుదాసులై బ్రతుకజాలరు. భారతీయులు "సామ్రాజ్యతత్త్వమును, పరాక్రమణతత్త్వమును స్వదేశమునందువలెను విదేశములందును ప్రతిఘటించుట" స్వాతంత్ర్య విజయమునకు సాధనము. "హిందూస్థానమునందు ౧౦౦ కి ౮౦మంది వ్యవసాయదారులు, రయితులు. రయితులమోక్షమే దేశమోక్షము. రయితులమోక్షమునకు సాంఘికధర్మాధారమైనది సంఘనిర్మాణము. ప్రస్తుతము ప్రజాస్వాతంత్ర్యములేని పరావలంబన స్థితియందు ప్రజాస్వామ్యస్థాపనము పరమావసరము. సకలసంస్కారములకును స్వాతంత్ర్యస్థాపన మాద్యసాధనమని మనము గ్రహించవలెను" అని నెహ్రూగారు తెలిపియుండిరి. సకలజనులకును సుపరిచితమైనను స్వాతంత్ర్యస్థాపనమునకు భారతీయులను భరించవలసిన దుఃఖవేదనను భావికాలము నిర్ణయింపగలదు.

## గ్రామసీమలు-కాంగ్రెసు

ఫెయిజుపూరులో పల్లెటూరిని ౫౦ వ భారతమహాసభ పల్లెటూరి పొలములందు దిగ్విజయముగను జరుగుట యొకవిశేషము. ఆంగ్లవిద్యావంతులనుండి మధ్యతరగతి ప్రజలకును, మధ్యతరగతి ప్రజలనుండి రయితులకును స్వాతంత్ర్యాభిలాష ప్రసరించుట స్వాతంత్ర్యసిద్ధికి కీలకము. గాంధిమహాత్ముని నాయకత్వముక్రిందను కాంగ్రెసునందు గలిగిన పరిణామములకు సత్యాగ్రహక్షేత్రము. అహమదాబాదు, పేనగ్రాము నివాసము, ఫెయిజుపూరు కాంగ్రెసు మహోపన్యాసములు. నెహ్రూగారు చెప్పినటుల సకల వ్యవహారములందును పరివర్తనము గలుగకను గ్రామవాసులందు పరివర్తనమును గలుగజేయుట సాధ్యము గాదు. గాంధిమహాత్ముని నాయకత్వముక్రిందను నాయకులలక్ష్యము క్రమముగను గ్రామములకు మరలుటయును, గ్రామస్థు లాత్మవిశ్వాసమును, కాంగ్రెసుపట్ల భక్తిశ్రద్ధలును గలిగి యుండుటయును శుభచిహ్నములు.

శాసనసభలు-కాంగ్రెసు

మాంటుఫర్డు సంస్కరణ శాసనసభలను బహిష్కరించిన కాంగ్రెసు నూతనశాసనసభలయందు ప్రవేశింపబూనుట ప్రతిపక్షులకును, సపక్షులకును ఆశ్చర్యవిషాదములను గలుగజేసినది. శాసనసభా ప్రవేశమే గాకను మంత్రిపదవీ స్వీకారమును విపరీతాభిప్రాయములకు కారణమైనది. సాంఘికపక్షనాయకులును, పూర్ణసత్యాగ్రహ నాయకులును పదవీస్వీకారము నారంభము నుండియును ప్రతిఘటించిరి. కాంగ్రెసు నాయకులు ఫెయిజుపూరు కాంగ్రెసునందైనను పదవీస్వీకారమును నిర్ణయింపకను ఎన్నికలు జరిగిన తరువాతను నిర్ణయించునటులు నిర్ధారణ చేసిరి. ఎన్నికలందు కాంగ్రెసు నకఖండ విజయము సమకూడినది. ఏడు రాష్ట్రములందు కాంగ్రెసు పక్షమునకధిక సంఖ్యాకులు సమకూడిరి. ఢిల్లీయందుమార్చిమధ్యనుసమావేశమైన అఖిలభారత స్థాయిసంఘము మంత్రిపదవీస్వీకారమును కొన్ని షరతులతో నిర్ణయించినది. గవర్నర్లు వారి రక్షణాధికారమును శాస్త్రీయ విషయములందు ప్రయోగింపనటులు అభయమును పొందినగాని, మంత్రిపదవీస్వీకారము నిరాకరణీయ మని నిర్ణయింపబడినది. కాంగ్రెసుపక్షమునం దధికసంఖ్యాకులుగల ఏడురాష్ట్రములందును, గవర్నర్లు కాంగ్రెసు నాయకులను పిలిచి, మంత్రివర్గము నేర్పాటుచేయగోరిరి. కాంగ్రెసు నాయకులు స్థాయిసంఘము నిర్ణయించిన అభయమును కోరినపుడు గవర్నర్లు అభయము నిరాకరించి ఏ బొమ్మలనో పెట్టి మంత్రివర్గమును ఏర్పాటుచేసిరి. ఇది అన్యాయ మని రాజ్యాంగశాస్త్రజ్ఞులు ఘోషించుచున్నను గవర్నర్లు బొమ్మమంత్రుల ద్వారా ప్రభుత్వమును నడపుచున్నారు. రాష్ట్రీయస్వపరిపాలన శాసనమునందుగల ఒకను గవర్నర్ల నిరంకుశత్వము విశదము చేసినది. ప్రబలమైన ఆందోళనము లేకుండ సంస్కరణశాసనము గవర్నరుల మూలముననే నిర్మూలింపబడినది.

గవర్నరుల చర్యలు శాస్త్రీయములా అశాస్త్రీయములా అను విషయము నిర్ణయము కావలసియున్నది. రాజ్యాంగశాసనమును స్వప్రయోజనార్థము సంకల్పించిన బ్రిటిష్ ప్రభుత్వాధికారులు శాస్త్రీయము లని సిద్ధాంతము చేయుట సహజము. ఎన్నికల తరువాతను శాసనసభలను సమావేశముచేయకుండుట అశాస్త్రీయమని సామాన్యరాజ్యాంగసూత్రమువిధించుచున్నది. ప్రజాభిప్రాయమును తృణీకరించి, బొమ్మమంత్రులను నిర్మించి ప్రభుత్వమును నడుపుట ప్రజాస్వామ్య ప్రథమసూత్రమునకే విఘాతము. జట్లండుప్రభువు తన నిర్ణయమును ఎంత సమర్థించినను ధర్మస్థానమునందు నిలువజాలదు. గవర్నరులకు మంత్రుల కభయ మొసంగుట సాధ్య మగునదియును, లేనిదియును మంత్రులే నిర్ణయించుట భావ్యమును గాదు. గాంధీమహాత్ముడు కోరినటులు సుప్రసిద్ధులయిన మధ్యవర్తులద్వారా ఈ విషయములను పరిష్కరించుట న్యాయమై యున్నది. కాని నిరంకుశప్రభుత్వమునకు గర్వాభిమానములంపై గల ప్రమాణమునం న్యాయధర్మములందు గలుగుట దుర్లభము. నవీన రాజ్యాంగశాసనము ప్రారంభమునందే మృతాకృతిమైనది. ఏప్రిల్ మొదటి తేదీయందు ప్రారంభమైన రాజ్యాంగ శాసనము ఏప్రిల్ ఫూలు వలెనే పరిణమించుటయందు విచిత్రము కనుపడదు. శ్రీయుత రాజగోపాలాచారి, ప్రకాశం, వల్లభభాయి పటేలు, రాజేంద్రప్రసాదు, నెహ్రూగారులు చేయుచున్న తీవ్రప్రచారమున కనురూపముగను ప్రజలు పూర్వమువలెనే కాంగ్రెసు ఆదేశములను పాలించి కాంగ్రెసుబల, గౌరవములను కాపాడుట పరమ ధర్మమై యున్నది.

కన్వెన్షను

లక్నో, ఫెయిజుపూరు కాంగ్రెసులు నిర్ణయించిన కన్వెన్షను సభ ఢిల్లీయందు మార్చిమాసముమధ్యను సమావేశమై చేసిన ఈ తీర్మాన మపూర్వమై భారతీయుల కర్తవ్యమునకు లక్ష్యముగ నున్నది:

"అఖిలభారత కన్వెన్షను సభ్యుడనగు నేను శాసనసభలయందును, బయటను, భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యము కొరకు, భారతీయుల భాగ్యమును చూరగొను యత్నముల నెదుర్కొని ప్రజల దారిద్ర్యమును అంతరింపజేయుటకు ప్రయత్నింతునని ప్రమాణము చేయుచున్నాను. భారతదేశము స్వాతంత్ర్యము బడసి, కోట్లకొలది భారతీయు లిపు డనుభవించుచున్న బాధలు తొలగుటకు కాంగ్రెసు ఆదర్శముల ప్రకారము కాంగ్రెసు శిక్షణకు లోబడి పనిచేయుటకు బాసచేయుచున్నాను."

కాంగ్రెసు అధ్యక్షుడు, కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యులు అఖిల భారతస్థాయిసంఘసభ్యులు, శాసన సభాసభ్యులు నిలువబడి దివ్యగంభీర స్వనములతో చేసి యీ ప్రతిజ్ఞ పూర్ణస్వాతంత్ర్యమునకు ప్రజపుగ నున్నది.

ప్రజల తరణోపాయము వారి హస్తములందే కలదు. స్వాతంత్ర్య ప్రతిజ్ఞ విషయమై నెహ్రూగారు చేసిన యుత్సాహోద్రేక పూరితమైన వ్యాఖ్యానము శ్రోతలకును, నితరులకును పరమార్థమును వ్యక్తము చేసినది. కన్వెన్షనునందు నాయకులు చేసిన ప్రతిజ్ఞను త్రికరణశుద్ధిగను పాలించుటకు భగవంతుడు శక్తిసామర్థ్యములను ప్రసాదించుగాత! కాంగ్రెసుపట్ల ప్రజలకు గల గౌరవాభిమానములను రాష్ట్రీయ సభల ఎన్నికలు రుజువుచేసినవి.

ఆంధ్రాభ్యుదయము

సనాతనమైన ఆంధ్రోద్యమము దేశకాలపాత్రల స్థితిగతుల కనురూపముగ వికాస, క్షీణతలకు పాలయినను, నవిచ్ఛిన్నముగ, చైతన్యప్రదమై, ప్రవర్ధమానం బగుచున్నది. స్థానబలములేని ఉద్యమములు పోషణము లేకను వికాసమును పొందజాలవు. పరమోత్సాహముతో ఇరవయ్యేండ్లకు పూర్వము ఆరంభమైన ఆంధ్రోద్యమము శాఖోపశాఖలుగ వికాసమును పొంది వర్ధిల్లుచున్నను, ప్రధానలక్ష్యము కారణాంతరముల వలన క్షీణించుటచే దేశమునకు, ప్రజలకును తగిన ప్రయోజనము కలుగకున్నది. హిందూస్థానమునందు గల ప్రజలందు ఆంధ్రులు ౨౬౩ లక్షలును, చెన్నరాష్ట్రమునందు ౧౭౮ లక్షలును నున్నను ప్రజాబాహుళ్యమున కనురూపమగు అభ్యుదయము గలుగకున్నది. ప్రధానకారణము పరావలంబనము, పారతంత్ర్యము. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునందు విశ్వాసముగల నాయకులు జస్టిసు పక్షమునందు చేరి రాష్ట్రనిర్మాణావసరమును నిరాకరించిరి. రాష్ట్రనిర్మాణావసరమును గ్రహించిననాయకులు ఇతరోద్యమములందు వారి శక్తిసామర్థ్యములను వినియోగించుచు సమష్టిదేశక్షేమమునకై పాటుపడిరి. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘము ఏర్పడినతరువాత గతించిన ౨౦ ఏండ్లయందును వ్యక్తిగతముగ దేశక్షేమమునకు పాటుపడుట కవకాశములు కలిగినను సంయోగబలములు వినియోగించుట కవకాశములు దుర్లభము లయినవి. స్థలభేదములు, కులతత్త్వములు, పక్షబలములు, స్వప్రయోజన పరాయణత్వము ఆంధ్రోద్యమ ప్రవాహమును కూలంకషముగ ప్రవహింపజేయుటకు ఆటంకములయినవి. ఈ ప్రతిబంధకములను తొలగించి ఆంధ్రోద్యమప్రవాహమును కూలంకషముగ ప్రవహింపజేయుట కాంధ్రనాయకులు పాటుపడి ప్రజాక్షేమమునకు సకలవిధములను పనిపూనుట పరమధర్మము. ఆంధ్రోద్యమమునకు హృదయమైన రాష్ట్రనిర్మాణమునకు ప్రతిఘటన మేర్పడినను, ఆంధ్రోద్యమాంగములయిన సాహిత్య, కళాద్యంగములందు అభ్యుదయము అవిచ్ఛిన్నముగ కలుగుచున్న విధమును సాహిత్యసభలు, సాహిత్య ప్రచురణములు, కళాపరిషత్తులు, కళాప్రదర్శనములు, సాంఘిక మత పరివర్తనములు, ప్రజాప్రబోధము మొదలగు అనేకములయిన విషయములు విశదము చేయుచున్నవి. కాని గతించిన ౨౦ ఏండ్లయందును సర్వవ్యాప్తమగుచున్న అభ్యుదయమును పరమార్థలక్ష్యముతో విమర్శించి సమన్వయించి, నిర్ణయించుట సమగ్రమాభ్యుదయమునకు సాధనము. గతకాలపరిజ్ఞానము వర్తమాన కాల పరిజ్ఞానమునకును, వర్తమాన కాల పరిజ్ఞానము భావికాలకర్తవ్యనిర్ణయమునకును సాధనములు. ఈమహాసంకల్పముతో నాంధ్రనాయకు లాంధ్రమహాపరిషత్తును సమావేశపరచి, ఆంధ్రోద్యమాంగములను పరిశీలించి, కార్యవిధానమును నిర్ణయించి, భావికర్తవ్యమును నిర్ణయించుట దేశక్షేమమునకును, ప్రజాక్షేమమునకును పరమావసరము. కాలయాపన చేయక ఆంధ్రప్రజానాయకులు ఈ మహాకార్యమునకు పూనుకొని ఆంధ్రోద్యమమును సార్థకము చేయుదురుగాక!

ఈశ్వరసంవత్సరాది సంచిక

కీలక సంవత్సరముతో ప్రారంభమైన సంవత్సరాదిసంచికలకు ౨౮ ఏండ్లు గడచినవి. నూతన సంవత్సరారంభమునందువలెనే సంవత్సరాదిసంచికల ప్రచురణమందును మహత్తరము లయిన ఆశయములు నిర్వాహకులకు గలుగుట సహజము. కాని సంకల్పములందు గల మహదాశయములు నిర్వహణమునందు రిక్తమనోరథములవలె గోచరమగుచున్నవి. నిర్వాహకులకు గల

సంకల్పోత్సాహములు ప్రజాహృదయములందు ప్రతిబింబితము లయినపుడే అవి సఫలము లగుచున్నవి. ఈశ్వరసంవత్సరాదిసంచికలోని వ్యాసములను, విమర్శలను, పద్యములను, చిత్రములను, ఇతరవిషయములను అవలోకించినవారలకు ఆంధ్రరచనలయందు స్వతంత్రరచనావసరము వెల్లడియగుచున్నది. ఆత్మానుభవముగలరచనలు రచయితలకును, ప్రజలకును విజ్ఞానదాయకములు.

ఈసంచికకు వ్యాసములను వ్రాసిన లేఖకులకును, చిత్రములు రచించిన చిత్రకారులకును, ఇతరవిధముల సహాయము చేసిన మహాశయులకును నిర్వాహకులు కృతజ్ఞులు. సంచిక ముఖపటము దేశవ్యాప్తమైన స్వాతంత్ర్యధర్మభావప్రవర్తనమును ప్రకటించుచున్నది. కాంగ్రెసు ఉత్సవములకు, అధ్యక్షులకు వాహకమైన మోటార్లు, గుఱ్ఱములు వనియం నదృశ్యములైనవి. కాంగ్రెసు అధ్యక్షుడు జవహరులాలు నెహ్రూ వృషభరథారూఢుడై పంటచేల నడుమను వ్యవసాయదారుల రక్షణమునను చేయుచున్న కాంగ్రెసుతీర్థయాత్రాదృశ్యము సకలజనులకును కర్తవ్యము హృద్గతము చేయుటకు తగియున్నది. ఈశ్వరసంవత్సరమునందు సకలజనులును కామితార్థములను బడసి స్వధర్మనిర్వహణము చేయుటకు భగవంతు డనుగ్రహించుగాక!

---

# ఈశ్వరోపాయనము

కేసరి ఆదినారాయణ శర్మ

శ్రీమన్మంజులజీవితోన్నతిని వాసి గ్గాంచి, నిక్కప్రశ
స్తామేయార్థచయంబుల నొదలి, విశ్వారాధ్యశీలాదులం
బ్రాముఖ్యమ్ము వహించి, పొల్పుగనుతన్, భద్రాశయాంచద్విలా
సామోదోన్నతి, భారతీయతతి, సాహార్ద్రాప్తి నీయీశ్వరన్.

క్రమవాగ్భూషిత కావ్యోపహారముల్ కవికుంజరులు కాన్కగా నొసంగ,
సర్వసమత్వ విశంకటంబ కార్యసాహసకుం బ్రజ్ఞానిధుల్ తమిం గడంగ,
నిఖిలశరణ్యమై నెగడి చిరస్థాయిగాం బొల్పు స్వేచ్ఛకై ఘనులు పూన,
సకలజన క్షేమ సన్న్యస్తసంసారసౌఖ్యులై నెగడువిజ్ఞాను లొప్ప,
ఐకమత్యప్రతిష్ఠాపనాధ్వరవర సంతతాచరణప్రశంస్యు లొదవ,
స్థైర్యసారము జనతాహృదంతరసీమఁ బూరించి ధన్యులౌ ధీరు లెసఁగఁ,
పాఁడిపంటలు విశ్వసంపన్మహామ-హీరుహమ్మున కెనలేని సొగసు గూర్చ
దోహదమ్మిడ, నిఖిలసంస్తూయమాన-శాశ్వతయశోన్నతులఁ గాంచు మీశ్వరాఖ్య!

సకలాచేతనచేతనాకలితవిశ్వం బీశ్వరామేయ మో
ద కనత్సౌఖ్యవివర్ధితం బగుత, నిత్యప్రోల్లసన్మంగళ
ప్రకరప్రాభవకారణంబు లగుచుం బ్రాజిల్లువాక్ప్రౌఢిమన్
సుకవిశ్రేష్ఠులు కీర్తిఁ గాంచుత సుధాశుభ్రమ్ము నీయీశ్వరన్.

ఈయీశ్వరవత్సరమున - శ్రేయోదాయకవిశిష్ట శీలోన్నతులన్
ధ్యేయు లగుచు వఱలుచు దీ-ర్ఘాయువులయి మనుత సద్గుణాఢ్యులు జగతిన్.

భూషణముగఁ గైకొని, బుధ - పోషణముగఁ గ్రాలు సర్వపోషణమున, ని
ర్దూషణముగ నెగడుము, సంతోషణ! యీశ్వరసమాఖ్య! తుదిదీవెసలన్.

---

రచ.

# ఆత్మ ప్రబోధము

(౧౮౦-వ పేజీ తరువాయి)

ఇంద్రియ వ్యతిరేకత నెన్నఁబడుచుఁ
జూడఁదగ నెద్ది వేదాంత సూక్తివలన
నది యఖండ ప్రమోదావ్యయాద్వితీయ
భాసుర బ్రహ్మమనుచు నేర్పరుపవలయు

అయ్యఖండ సచ్చిదానంద లేశాంశ
మజముహేశముఖ్యులాశ్రయించి
యనుభవించుచుందు రానందలవమును
తారతమ్యులగుచు వారు నెపుడు.

అది సమస్త జగద్వ్యాప్త మైనకతన
పంచభూతాత్మకమగు ప్రపంచమందు
నఖిల వ్యవహారములయందు నాత్మ పొలుచుఁ
బాలలో నేయివలె సముద్భాసితముగ

అణువుకాదు స్థూల హ్రస్వదీర్ఘములుగా
దజము నవ్యయంబు నస్వరూప
జాతి నామ గుణ విచారణంబగు నెద్ది
దాని బ్రహ్మమనుచుఁ దలఁపవలయు.

ఏ ప్రకాశమ్ము నొంది సూర్యేందుముఖ్య
సర్వజగములు భాసిల్లఁ జాలుచుండు
దీప్తులన్నింటిచే నెద్ది దీప్తిఁగందు
దాని బ్రహ్మంబటంచును దలఁపవలయు.

వ్యాపకంబై సమస్త ప్రపంచమందు
బాహ్యాంతర్గతంబులఁ బ్రజ్వలించి
తనకుఁ దానెల్ల బ్రహ్మంబు గనఁగవలదె
యనల సంతప్తమై యొప్పు నినుపముద్ద.

బ్రహ్మము జగద్విలక్షణోద్భాసితంబు
బ్రహ్మమునకంటె నన్య మేర్పరుపలేము
బ్రహ్మమున కన్యముగ నెల్ల పరగెనేని
మరుమరీచిక సుమ్ము బ్రహ్మంబు కాదు.

ఏది చూడఁబడు? మఱేది వినంబడు?
నదియు నెల్లఁ దత్త్వ వివరణమున
సచ్చిదాత్మకమున జరుగు బ్రహ్మముకంటె
వేరుకాదు దాని విడిచి లేదు.

జగతినిండి నెల్లు సచ్చిదాత్మక మది
జ్ఞానచక్షువునకె కానిపించు
చూడఁదగదు జ్ఞాన శూన్యచక్షువునకు
నంధునకునుగాని యర్కునోలె.

శ్రవణమునన సందీపిత జ్ఞానవహ్ని
పరితపింపఁగఁజేసినఁ బ్రత్యగాత్మ
తనకుఁదానె ప్రకాశించి గణనకెక్కు
సర్వకల్మషరహితమై స్వర్ణమట్లు.

హృదయమవాయుపథంబునం దుదితుఁడగుచు
జ్ఞానభానుండు సంతమసమ్ముఁ జెఱచి
సర్వవస్తుసంవ్యాపియై సర్వమగుచు
వెలుఁగుచున్నాఁడు సకలంబు వెలుఁగఁజేసి.

ఎవఁడు దిగ్దేశకాలంబు లెంచుకొనక
నిత్యసుఖద నిర్ద్వంద్వంబు నిర్మలంబు
స్వాత్మతీర్థంబు సేవించు నన్నివిడిచి
యతఁడు సర్వగుం డమృతుం డనంతమూర్తి.

---

# నేను

సామవేదం జానకీరామశర్మ

నన్ను మృత్యువు కబళించుచున్నగాని
నాకు నాశములే దొకనాఁడు నేను
జన్మమొందను లేదు; విశాలసాగ
రమున నుండెడి యలలట్టు లమితములును
వివిధములు నాదు భౌతిక వేషకల్పి
తములు తనువులు.

ఈ శరీరము మృత్తిక, ఎపుడుగూడ
మృత్తికనె చేరు నిద్ది నిమేషమంద
ఐన వేడుక నీ యనంతాలయమున
నే నమర కేళిసల్పుదు.

కానబడెడి
కన్నులన్నియు, చెవులును, కరములన్ని
అన్ని మనసులు నావె! నా కమరపదవి
మున్నె లభియించినది నేను భిన్నభావ
ములను మ్రింగితి.

నవనవరసాలకిసలయాసవము మెక్కి
నిక్కి గర్వించు పికరాజు నేనె! రమ్య
శృంగకలితోరు గిర్యగ్రసీమనుండి
జారుసెలయేటి తుంపురుచాలు నేనె!
నన్ను మృత్యువు కబళించుచున్నగాని
నాకు నాశము లేదొకనాఁటికైన.

---

# చిత్రపటముల వివరణము

### డబీరు నారాయణమూర్తిశర్మగారు

వీరు గంజాంజిల్లాలోని హైస్కూళ్లలో ఇరవైరెండుసంవత్సరములనుండి ప్రధానాంధ్ర పండితులుగా నుండి, మంచివిద్వాంసులని పేరు పడ్డారు. ఆంధ్రపత్రిక, బొంబాయిలో ఆరంభమైనది లగాయతు, సారస్వత సంబంధమైన వ్యాసములు విరివిగా ప్రకటించుచుండినవారు. భారతికిన్నీ పెక్కువ్యాసములు వ్రాసియున్నారు. పాఠశాలలకుపయుక్తమైన గ్రంథములు, గంజాంమండలాంధ్రకవుల చరిత్రములు, కొన్ని పద్యకావ్యములు రచించియున్నారు.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి.

### కొత్త సన్యాసయ్యశ్రేష్ఠిగారు

వీరు నక్కపల్లి వాస్తవ్యులు. ఆర్యవైశ్యకులజులు. నిరతాన్నప్రదాతలు. ధర్మసంస్థాపోషకులు. శ్రీ శ్రీ శ్రీ వేంకటేశ్వర విలాస పుస్తకభాండాగారమునకు అధ్యక్షులు.

### నాగులకొండ వెంకటచలంగారు

వీరు మంగవంపరవాస్తవ్యులు. ౧౯౩౦ సంవత్సరమున తమ గ్రామోద్యోగమునకు రాజీనామాయిచ్చి ౧ సంవత్సరము జైలుకు వెళ్లిరి. ౧౯౩౨ సంవత్సరములో తిరిగి అర్ధసం. జైలును పొందిరి. నిరంతరము ప్రజాసేవ-కాంగ్రెసుసేవ చేయుచున్నారు.

### శ్రీరాజా బొప్పరాజు రామకృష్ణరాజులుంగారు, బి. ఏ., బి. యల్., యం. యల్. ఏ.

చిత్తూరులో అడ్వొకేటు. కార్వేటినగర రాజవంశమునకు జేరినవారు. చిత్తూరుజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు ఛేర్మెన్‌గ బహుకాలము పనిచేసినారు. పెక్కేడులు జిల్లాబోర్డు ఉపాధ్యక్షపదవిలోనుండినవారు. టెంపరెన్సు కమిటీ అధ్యక్షులుగ కూడ నుండిరి. చిత్తూరు రామవిలాస సభయందలి నాటకకార్యదర్శిగను, శాశ్వతోపాధ్యక్షులుగను నున్నారు. పరోపకార పారీణులు, కవితాపోషకులు. మంచిసరసులు.

—కుమారదేవ.

### శ్రీమతి అన్నాప్రగడ చెన్నగంటమ్మగారు

ఈ యేడు యం. ఏ. (ఫిజిక్సు) పరీక్షయందు మదరాసు విశ్వవిద్యాలయమున కంతకును ప్రథమురాలుగా ప్రథమశ్రేణియందుత్తీర్ణురాలైన మహిళారత్నము.

### శ్రీమతి కల్యాణసుందరి సీతారాంగారు బి. ఎ., యల్. టి.

చెన్నపురి విమెన్స్ క్రిష్టియన్ కాలేజిలో నుపన్యాసకురాలుగానుండినది. ఢిల్లీలో లేడీహార్డింజి మెడికల్ కాలేజి హాస్టలుకువార్డనుగా నియమింపబడినది.

### సి. యస్. నాయుడుగారు

ఇంగ్లండులో భారతీయ క్రికెట్ ఆటగాండ్రకు వరుసగ కలుగుచుండిన అపజయముల వలని అపఖ్యాతిని పారదోలుటకు బయలుదేరిన క్రికెట్టు వీరుడు.

### శ్రీమతి సేతూబాయిగారు, బి. ఏ.

మైసూరు యూనివర్సిటీలో అనేకములయిన బంగారు, వెండిపతకములను బహుమతిగా పడసిన విద్యావతి.

### శ్రీమతి కుసుమతాకూరుగారు

అమెరికాలోని అయోవా యూనివర్సిటీ యం. ఇ. పట్టమును బొందివచ్చినది.

### కంచెర్ల వెంకటకృష్ణయ్యగారు

ప్రయాగ హిందీ విశ్వవిద్యాలయమువారి యుత్తమపరీక్షలో నుత్తీర్ణులై 'హిందీసాహిత్యరత్న' అను బిరుదమును బడసిన ఆంధ్రులు.

### మౌల్వీ షేర్ ఆలీగారు

కొరానును ఇంగ్లీషులోని కనువదించుటకు ఇంగ్లండుకు పయనమైరి.

### జి. సి. ఆర్యాగారు

వైమానికశిక్షణ బడయుటకు ప్రభుత్వము నుండి వేతనాదికములు పొంది ఇంగ్లండుకు తరలిన ప్రథమ మద్రాసీయుడు.

### చిరంజీవి కొత్త సచ్చిదానందమూర్తి

౧౨ ఏండ్ల బాలుడు హిందీరాష్ట్రభాషా విశారద పరీక్షలందుత్తీర్ణుడయినాడు.

### డా. యస్. చంద్రశేఖరన్ గారు

చికాగో యూనివర్సిటీలో రీసెర్చి ప్రొఫెసరుగా నియమింపబడినారు.

### శ్రీమతి ఎ. నారాయణన్ సతి

టాకీఫిలిముల సౌండు ఇంజనీరింగులో పాల్గొన్న ప్రథమ భారతీయ యువతి.

### పాత్రుని వెంకటనారాయణగారు

వీరు కూర్ట్‌టాల్సు లిమిటెడ్ కంపెనీలో పనిచేయుచున్నారు. బొంబాయి ఆంధ్రమహాసభాధ్యక్షులు. బొంబాయి ఆంధ్ర కోఆపరేటివు సంఘమునకు అధ్యక్షులు.

### సి. అశ్వత్థ నారాయణరావుగారు

వీరు మదనపల్లె ప్రాంతపు ఆంధ్రులు. అడయారులో బి. ఏ. చదివినవారు. బెంగుళూరు చేరి 'నవజీవన' అను దినపత్రికను, 'మక్కళ పుస్తక' అను పిల్లలకు పనికివచ్చు మాసపత్రికను కన్నడమున చక్కగా నడుపుచున్నారు.

### శ్రీ సుజనసమాజము - మౌల్మేన్ (బర్మా)

ఈ సంఘము 1936 సం.న స్థాపించబడినది. దీనియొక్క ఉద్దేశములు:— జీవకారుణ్య ప్రచారముచేయుట, విద్యావ్యాపనకై కృషి, దైవభక్తిని పెంపొందించుట. ఈ సమాజమునకు శ్రీయుతులు సాలాపుబుల్లి అప్పన్న, కర్రి అప్పలస్వామిగార్లు ప్రధానపోషకులుగను, శ్రీయుత ఆర్. కే. పతిగారు, బి. ఏ. (ప్లీడరు) అధ్యక్షులుగను, శ్రీయుతులు బొండా మానిస్వామి, గుళ్ల సుబ్బరాజుగార్లు ఉపాధ్యక్షులుగను, శ్రీయుతులు కత్తుల జగనాయకులు, భీమని మానిస్వామిగారు కార్యదర్శులుగను నున్నారు. ప్రస్తుతము ఈ సమాజమువారు ఒక రాత్రిపాఠశాలను నిర్వహించుచున్నారు.

# జవహర్ లాల్

కుంముర్తి నరసింహారావు

ఏరీ సైన్యబలాతిగర్వితులు భూమీశుల్ పరారామనం
చారోన్మత్తులు నిత్యభోగరతు లైశ్వర్యాంధు లల్పాశయుల్?
వీరాగ్రేసర, నిన్నుగాంచుటకె యుత్కళ్లాగను నీ భూప్రజా
పారావారమునందు వారి కనుమానమ్మైన లేదయ్యొగా!

కలకల మింటు రేగు విహగస్వరవాళి నతిక్రమించి యీ
జలనిధి ముక్తకంఠమున స్వాగతగీతిక లాలపింప భూ
తల మదరన్ దిశల్ ప్రతిరుతిమ్ముసగన్ జనకోటి నీమహో
జ్జ్వలవచనమ్ములన్ దలచి సల్పు జయధ్వనులే జయించెనన్.

నెలల కొలంది నీపలుకు నిష్ఫలకలన్ దరిలేని చీకటుల్
తొలగె సమస్తరాష్ట్రముల దోర్బలకాంతులు ప్రజ్వరిల్లెడున్
మలయసమీర చందనసమానము దావకవహ్ని నేడు నీ
వెలుగు చలింపదింతగ శ్రమించియు దివ్యరుచుల్ స్రవించెడున్.

ఆలోకింతురు ప్రీతిమై నదె అసూర్యంపశ్య లోకోమలీ
జాలం బిం దరుదెంచి నేడు నిను స్వేచ్ఛాదూత, సాత్రాజితీ
లోలాక్షిం దలపోతురో కదనకల్లోలాత్మయా నాస్పెయిన్
బాలాసాహసగాథ నేర్తురొ భవత్ప్రాచీన నవ్యోక్తులన్!

పల్లెలు పట్టణమ్ములు భవన్నవమంత్రవిధుల్ జపింప వి
ద్యుల్లతవంటి నీదు నయనోజ్జ్వలతేజము గాంచి చేరరా
నొల్లరు భీతిమై పరధనోన్నతిపై మనసున్నబానిసల్
పిల్లయికల్ జగన్నుతరవిప్రభ డాయగ సాహసించునే?

చండార్కప్రభవోలె ప్రాకెడు మొగల్ సామ్రాజ్యమున్ రాష్ట్రమొ
క్కండున్ లేక ప్రతాపసింహుడెదురై కంపింపగా జేసె, మా
ర్తాండుండెన్నడు నస్తమింప డను సామ్రాజ్యమ్ముపై రిక్తహ
స్తుండై యిట్టు లెదిర్చి నిల్చె నెవడంచున్ భూమి నిస్తబ్ధమా.

సమరదిన ప్రభాతమున శంక యెరుంగని సవ్యసాచివై
విమతపతుల్ నుతింప రణవీరత జూపిన నీవు సాగరా
గ్రమున నుపన్యసించుటకు గద్దియపై నిలువన్ ధనుర్ధరో
త్తముడను యోగిపుంగవుడు దాల్చెరొ కేతనువంచు దోచెడున్

---

# 50-వ అఖిలబారతజాతీయమహాసబ (ఫైజుపూరు)



౧. శ్రీయుత జవహరలాలునెహ్రూ (అధ్యక్షుడు)

## ౫౦-వ అఖిలభారత జాతీయమహాసభ, ఫైయిజుపూరు





౨. తిలకనగరమందు మహాత్ముని కుటీరము



3. తిలక నగరమునందు ప్రతినిధుల బసలు, ఇతరకార్యాలయములు



౪. తిలకునగరమున స్వదేశీ ప్రదర్శన శాలలు



౫. తిలకనగరమున అధ్యక్షుని కుటీరము



౧౫. నెహ్రూగారు జాతీయపతాకను ప్రతిష్ఠించుచుండుట



౧౬. జాతీయ పతాకారోహణోత్సవ దృశ్యము



౧౭. స్త్రీ వాలంటీరుదళము పతాకావందనోత్సవము జరుపుట



౧౮. పతాకారోహణోత్సవమప్పుడు జండా కప్పీ సరిగా అమరక పతాక పడనున్నప్పుడు ప్రాణములకు తెగించి ౮౦ అడుగుల ఎత్తు గల ధ్వజస్తంభము నెక్కి పతాకను నిలువబెట్టిన



౧౯. ఖాదీ, గ్రామపరిశ్రమల ప్రదర్శన ప్రారంభోత్సవమునకు హాజరయిన ప్రేక్షక బృందమున నొకభాగము



౨౦. మహాత్ముడు, కస్తూరిబాయి, మహాదేవదేశాయిగార్లు స్వదేశీ ప్రదర్శనమును పరిశీలించుచుండుట



౨౧. స్వదేశీప్రదర్శన ప్రారంభోత్సవమునందు గాంధీనెహ్రూల సల్లాపగోష్ఠి



౨౨. ఖాదీ, గ్రామపరిశ్రమల ప్రదర్శన ప్రారంభోత్సవమునందు మహాత్ముడుపన్యసించుచుండుట

# రజతోత్సవ సంవత్సరము

## 1937

ట్రావెన్కూరు నేషనల్ బ్యాంకు 1912 సం॥లో స్థాపింపబడెను. కాబట్టి యిప్పటికి 25 సంవత్సరము లైనది. ఈకాలములో సదరు బ్యాంకుపొందిన అభివృద్ధి దిగువ దాఖలా[illegible] తెలిసికొనవచ్చును.

## అభివృద్ధిసూచకమగు పట్టీ

| సం॥ | మూలధనము | | రిజర్వు ఫండ్సు | డిపాజిట్లు | నగదు నిలవ | గ. ప. నోట్లు వగైరాలపై పెట్టుబడులు | నిర్వాహణమునకైన మొత్తము ఖర్చులు |
|---|---|---|---|---|---|---|---|
| | అనుమతిపొంది జారీచేసినది | చెల్లించినది | | | | | |
| | రు. | రు. | రు. | రు. | రు. | రు. | రు. |
| 1912 | 2,00,000 | 13,000 | Nil | 19,000 | 211 | Nil | 33,000 |
| 1917 | 2,00,000 | 59,000 | 8,000 | 1,10,000 | 500 | Nil | 1,87,000 |
| 1922 | 10,00,000 | 2,60,000 | 24,000 | 3,75,000 | 15,000 | 14,000 | 7,17,000 |
| 1927 | 10,00,000 | 3,02,000 | 1,10,000 | 9,27,000 | 1,07,000 | 68,000 | 15,27,000 |
| 1932 | 10,00,000 | 4,22,000 | 2,00,000 | 36,69,000 | 5,86,000 | 4,30,000 | 58,18,000 |
| 1936 | 50,00,000* | 11,61,000 | 3,50,000 | 1,77,65,000 | 31,55,000 | 28,98,000 | 2,12,29,000 |

* జారీచేసినది, చందా వేసినది రు. 30,00,000 లు

ఈ బ్యాంకుకు 46 బ్రాంచీలు కలవు. ఇండియాలో దీని తాలూకు బ్రాంచీలు లేనిచోట్ల యేజన్సీలు యేర్పాటు చేయబడినవి. లండనులో వెస్టుమినిస్టరు బ్యాంకు దీనికి యేజంటుగా నున్నది.

ఇంతకాలమునుండి ఈ బ్యాంకుకు సర్వవిధముల మిక్కిలి ఆదరణతో తోడ్పడుచున్న అభిమానులందరికి డైరక్టరులు కృతజ్ఞులైయున్నారు. ప్రయోజనకారకమగు సేవను యింకను బ్యాంకు చేయకలుగుటకై, అభిమానులందరు వెనుకటివలెనే ముందును గూడ తమ సహకార ప్రోత్సాహముల నొసంగెదరని డైరెక్టరులు కోరుచున్నారు

## ట్రావెన్కూర్ నేషనల్ బ్యాంక్ లిమిటెడ్.

(1912 లో ట్రావెన్కూరునందు స్థాపింపబడినది.)

హెడ్డాఫీసు: ఆలెప్పె.

కే. సి. మమ్మెన్ మాప్పిళ్ల, బి. ఏ.,
చైర్మన్.

కే. సి. యూపెన్, బి. ఏ.,

# ఆహ్వానము

సుంకర వేంకటేశ్వరరావు

౧

మకరందమును కొంత మందారములనుండి
ప్రోగుఁజేసితి నీకు భోజనమిడ
తియ్యమామిడిగున్న తెలిసోగ చిగురుల
భద్రపరచితి నీకు పళ్లెరముగ
మన వసంతపు పికాంగనచేత నొప్పించి
పాడింతు నీదు నివాళిపాట
మలయమందసమీరముల నెట్లో బ్రతిమాలి
వేయింతు మెలమెల్ల విరులసురటి

బండిగురివెంద పొదరిల్లు బసగ నిడుదు
పద్మసింహాసనమున నిన్నదిలపరతు
అడవిమల్లెలఁ బైఁజల్లి హారతిడుదు
రమ్ము! పూజింతు వేగ నా రామభద్ర.

౨

మధుకరంబుల నోట మన్నుఁగొట్టినఁగాని
తేలేను నీకునై తేనె నేను
చిగురుకోవెలపొట్టఁ జిచ్చుపెట్టినఁగాని
చేకూర్పఁగాఁ జాలఁ జిగురుటాకు
పుష్పవల్లరిశోభ బూదిఁగల్పినఁగాని
కొలువఁగాఁ జాలనిఁక గ్రొత్తపూల
కలకంఠి మగని కౌఁగిలిఁ బాపిననగాని
పాడింపలేను నీ పైఁడిపాట

నిన్నుఁ బూజింపఁదలఁచిన నిఖిలజగము
కష్టజాలంబులకు లోనుగాకపోదు
ఎదుట నేడ్పించి తినుపించు నేటి ఫలము?
రమ్ము! పూజింతు హృదయాన రామభద్ర.



౬. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శంకరరావు దేవుగారి ఉపన్యాసము



౭. బహిరంగసభలో మాలవ్యా, శంకరరావుదేవు, గాంధీగార్లు సంభాషించు కొనుచుండుట



౮. శ్రీమతి మణిబెన్ పటేలు, అబ్దుల్ గఫూర్ ఖాను, జవహరలాల్ నెహ్రూ, వల్లభాయి పటేలుగార్లు విషయనిర్ణయసభకు పోవుచుండుట



[illegible] కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూగారి ఉపన్యాసము



౧౦. మహాసభదృశ్యములో ఒక భాగము


౧౧. శివాజీ ద్వారమువద్ద అధ్యక్షుని ఆగమనమునకు నిరీక్షించుచున్న ప్రేక్షకబృందము


౧౨. బొంబాయినుండి కాంగ్రెసు జ్యోతి తిలకునగరమును చేరవచ్చుట


౧౩. కిసానుయాత్రికులు తిలకునగరమునకు చేరవచ్చుట


౧౪. కిసాన్ కాంగ్రెసుసభలో జవహరలాల్ నెహ్రూగారు ఉపన్యసించుచుండుట
అధ్యక్షులు : ఆచార్య గోగినేని రంగనాయకులుగారు

# వార్తాపత్రికలు

మల్లంపల్లి సోమశేఖరశర్మ



నేటికాలంలో వార్తాపత్రికలకున్న ప్రాముఖ్యమూ, ప్రాబల్యమూ మరి వేటికీ లేనట్లు కనిపిస్తున్నది. ప్రజల అజ్ఞానం పోగొట్టడం లోను, విజ్ఞానం వ్యాపింపజేయడంలోను విద్యాలయం తరువాత పత్రికే ప్రబలస్థానంగా ఉన్నది. క్రమక్రమంగా పత్రికకు కలిగిన పరిణామ వికాసాలవల్లా, ప్రాముఖ్యమువల్లా అనేక శాస్త్రంగానే కాదు, నాగరికత మించిన దేశాలలో లాభసరళియైన వ్యాపార సంస్థగా కూడా తయారయినది.

నేటి నాగరికతాభివృద్ధికీ, విద్యావికాసానికీ పత్రిక ఎంతవరకు తోడ్పడుతున్నదో పూర్తిగా తెలుసుకోవాలంటే యూరోపు, అమెరికా ఖండాలలోని పత్రికలను గమనిస్తే చాలు. నేడు ఏ యుద్యమం జయప్రదం కావాలన్నా, ఏ యభిప్రాయాలు లోకంలో బహు వ్యాపకం పొందాలన్నా పత్రిక లేనిదే సాగదు. నేటి నాగరికతకు పత్రిక ఉండక తీరని ఒక ప్రధానానుబంధమై పోయినది. పత్రిక లేనిదే నేడు వ్యాపారమే లేదు; విజ్ఞానప్రచారమే లేదు. ప్రతిమనుష్యుడూ వికాసం పొందవలెనన్నా, తానుకూడా ఇతరలోకంతో పాటు ముందడుగువేసి సాగిపోవాలన్నా పత్రిక నాశ్రయించక తప్పదు నేటికాలంలో. నేడు పత్రిక మానవునికి గురువుకాని గురువు, మిత్రము కాని మిత్రము, భాగ్యముకాని భాగ్యము, నేతకాని నేత, ప్రాపుకాని ప్రాపు. ప్రపంచమంతా నేడు పత్రికతో ఉన్నది. పత్రిక అభివృద్ధిపొందుతున్నదంటే ప్రపంచమభివృద్ధి పొందుతున్నదన్నమాట; ప్రపంచమభివృద్ధిపొందుతున్నదంటే పత్రికయభివృద్ధిపొందుతున్నదన్నమాట. విజ్ఞానవికాసానికి పత్రిక పర్యాయపదమయ్యే స్థితి వచ్చినది. ప్రపంచమునుబట్టి పత్రికా, పత్రికనుబట్టి ప్రపంచమూ పరస్పరసహకార, ఆశ్రయాలతో వర్ధిల్లుతున్న కాలమిది. నాగరిక దేశాలలో లక్షలకొద్దీ ప్రతులు ప్రతిదినమూ అమ్ముడుపోయే పత్రికకు సంపాదకులయినవారూ, యజమానులయినవారూ అవునన్నది కాదనీ, కాదన్నది అవుననీ, మంచి చెడ్డనీ, చెడ్డను మంచనీ అనిపించగలరంటేను, తిమ్మిని బమ్మినీ బమ్మిని తిమ్మినీ చేయగలరంటేను ఆశ్చర్యమేముంది? పత్రికా ప్రభావం అంతవిపరీతంగా ఉంది. మనదేశంలో కూడా అటువంటిస్థితి కొంచెం శీఘ్రంగానో, ఆలస్యంగానో రాక తప్పదు. ప్రపంచం ముత్తంమీద పొర్లెత్తివస్తూవున్న ప్రవాహవేగం ఇది—దానిని తప్పించుకొనే దెట్లా? ఈ కాలంలో దానికంతటి ప్రజ్ఞాప్రభావాలున్నపుడు దానిని కాదనడమెట్లా?

పత్రిక పుట్టి మూడువందలేళ్లు కేమాత్రమో కొంచెం పైనయింది. అది పుట్టినది కూడా యూరోపుఖండంలోనే. పదహారోశతాబ్ది నాటికి టైపు (అక్షరపుములుకులు) పోతపోయడమూ, దానిసాయంతో గ్రంథాలు అచ్చువేయడమూ ప్రారంభమయింది. కాని ముద్రాయంత్రముమాత్రం పసిఅయినది అమరలేదు. అయినప్పటికీ ఏదోవిధంగా ఆముద్రణయంత్రాల మీందే పత్రికలుకూడా అచ్చువేయడం ఆరంభించారు. పదిహేడవశతాబ్ది ప్రారంభమయ్యేసరికి యూరోపు ఖండంలో పత్రిక లవతరించినవి.

శీఘ్రముద్రణానికి వీలిచ్చేయంత్రం వచ్చినప్పటినుంచీకాని పత్రికల కభివృద్ధి లేకపోయింది. యూరోపులోనూ, అమెరికాలోనూ కూడా ముద్రణయంత్రంలో శీఘ్రముద్రణాని కవకాశమిచ్చే మార్పులు చేయాలని అనేకు లప్పటినుంచి ప్రయత్నిస్తూనే వచ్చారు. కాని ఆ ప్రయత్నాలు పందొమ్మిదో శతాబ్దిదాకా సఫలంకాలేదు. ఈప్రయత్నాలకు ఫలితంగా ముద్రాయంత్రంలో నానారకాల మార్పు లధికమవుతూ రావడమూ, శీఘ్రకాలంలో ఎక్కువ కాగితాలు అచ్చువేయడానికి అవకాశం కలగడమూ సంభవించింది. ౧౮౪౬ లో 'మార్చి హూ' అనే వాడు 'హూ లైట్నింగ్ ప్రెస్' (మెరుపంతటి వేగంతో అచ్చు వేసే) అని ఒకముద్రణయంత్రం కనిపెట్టాడు. ౧౮౬౫ లో 'విలియం బుల్లక్' అనేవాడు గంటకు ౧౦,౦౦౦ చిన్న కాగితా లచ్చువేసే యంత్రం కనిపెట్టాడు.

౧౮౭౧ లో 'వెబ్ పెర్ఫెక్టింగ్ ప్రెస్' అనేముద్రణయంత్రంమీద గంటకు ౧౨,౦౦౦ కాగితా లచ్చువేసేవారు. అయినప్పటికీ ఇంకా శీఘ్రకాలంలో ఇంకా విశేషం కాగితా లచ్చువేసే యంత్రాలు కనిపెట్టాలని అప్పటినుంచీ ఇంకా ప్రయత్నం సాగుతూనే వచ్చింది. ఇటీవల వచ్చిన యంత్రాలన్నీ ఇట్టి నిరంతర ప్రయత్నముల ఫలితాలే.

నేడు గంటకు ౩,౦౦,౦౦౦ కాగితాల చొప్పున అచ్చువేసి, అంటించి, కోసి, ఎనిమిదిపుటలుగ మడతలుపెట్టేవీ, గంటకు ౧,౫౦,౦౦౦ ల చొప్పున అచ్చువేయడం మొదలయిన పనులుచేసి ౧౬ పుటలుగ మడతలు పెట్టేవీ, గంటకు ౭౫,౦౦౦ ల చొప్పున ముద్రణాదికములుచేసి ౩౨ పుటలుగ మడతలుపెట్టేవీ—అద్భుతముద్రణ యంత్రాలు వచ్చినవి.

ఇటువంటి యంత్రాలకు కాగితము ఠావులుగా కాకుండా, తయారయిన కాగితము చుట్టలు చుట్టలుగానే ఎక్కిపోతూవుంటుంది. గొప్పశక్తిగల ముద్రణయంత్రములలో ఉపయోగించే కాగితం వెడల్పు ఆరడుగు లుంటుంది; యంత్రంలో ఆ కాగితపుచుట్ట గంటకు ౧౦౫ మైళ్లు చొప్పున తిరిగిపోతూ ఉంటుంది.

హిందూ, ఆంధ్రపత్రికల సైజువి కొన్ని కొన్ని చిన్నపత్రికలలో నాలుగుపుటలే ఉంటవి. పట్టణాలలో వేసే దినపత్రికలు సాధారణంగా ఎనిమిదిపుటలవి. అమెరికా, యూరోపు మహానగరాలనుంచి వచ్చే దినపత్రికలు ౨౪ పుటలకు పైనకూడా ఉంటవి. ఆదివారంనాడు ప్రకటించే పత్రికలు ౭౦ పుటలకు మించేఉంటవి. ౫,౦౦,౦౦౦ అమ్మకం కంగల ౭౦ పుటల ఆదివారంపత్రిక అచ్చు వేయాలంటే ఒక్కొక్క కూర్పుకు (Edi-

tion) సరిపడ్డ కాగితం తయారు చేయడానికి కాగితపుగుజ్జునిమిత్తం (Paper pulp) ఒక చిన్న అడవే నాశనమవుతుంది. లక్షలకొద్ది ప్రచారంగల గొప్ప దినపత్రికలకు కాగితం కోసం ఎన్నో యెకరాల విస్తీర్ణంగల సొంత అడవులే వుంటవి.

అత్యంత శీఘ్రకాలంలో కాగితాలు అసంఖ్యాకంగా అచ్చువేసే యంత్రాలు వచ్చేటప్పటికి టైపుకూర్పులోకూడా సౌకర్యం కలుగజేసుకోవలసిన అవసరం కలిగింది. కంపోజిటరులు ఒక్కొక్క అక్షరమే తీసి కంపోజుచేసే అచ్చుకు మేటరు తయారుచేసేటప్పటికి విశేషం కాలహరణం కావడమూ, యంత్రం పనిలేక వ్యర్థంగా ఉండడమూ సంభవించింది. ఈ కారణంచేత మేధావులు తమ బుద్ధికుశలత అంతా ఉపయోగించి కడకు 'లినోటైపు' తయారుచేశారు. ఈయంత్రాన్ని టైపురైటరు లో నిర్దుష్టంగా ఉండేటట్టు చక్కజేశారు. ఇది టైపురైటింగుయంత్రంవంటిది. దానికివలెనే దీనికికూడా 'కీబోర్డు' మొదలైనవి ఉంటవి. ఈ వొక్కొక్కయంత్రం కంపోజింగు, టైపుక్యాస్టింగు, డిస్ట్రిబ్యూషను – ఈ మూడుపనులూకూడా చేస్తుంది. టైపుయంత్రంమీద కొట్టినట్టు 'కీబోర్డు'లో గల అక్షరాలు కొట్టుతూపోతే అక్షరపంక్తికి పంక్తే ఏర్పాటయి సీసంలో పోత అయి ఒక కడ్డీలాగ వస్తుంది. ఒక్కొక్క గొప్ప దినపత్రికాకార్యాలయంలో పైని చెప్పినటువంటి ముద్రణయంత్రాలూ, ఇట్టి 'లినోటైపు' యంత్రాలూ చాలా ఉంటవి.

అక్షరాలు ఎంతతక్కువుంటే 'లినోటైపు' యంత్రం తయారుకావడం అంత సులువు. 'లినోటైపు' యంత్రాలు లేకుండా ముద్రణ కార్యం శీఘ్రంగానూ, లాభకరంగానూ జరగడమే కష్టమవుతున్నది. మన హిందూ దేశంలో విద్య అంత ఎక్కువగా జనసామాన్యంలో ఇంకా వ్యాపింపకపోవడంవల్ల 'లినోటైపు' యంత్రం ఆవశ్యకత ఇప్పుడంతగా లేదు కాని ఇక కొద్దికాలంలో అయినప్పటికీ దాని ఆవశ్యకత ఉండక తీరదు. అందువల్ల దేశభాషా లిపులకు 'లినోటైపు' యంత్రాలు కనిపెట్టవలెనని ఇప్పటినుంచీ మనదేశంలో ప్రయత్నాలు జరుగుతున్నవి. మనదేశభాషలకు సంయుక్త, ద్విత్వాదులతో అక్షరాలు ఎక్కువగా ఉండడంచేత, 'లినోటైపు' యంత్రం తయారుచేయడం కష్టమవుతున్నది. అయినప్పటికీ నాగరిఅక్షరాలలో కొన్ని మార్పులు చేసి, అక్షరసంఖ్య తగ్గించి ఈమధ్యనే నాగరిలిపికి 'లినోటైపు' యంత్రం కనిపెట్టినారు. దీనిని తయారుచేసినవారు అమెరికావారు. ఈయంత్రం ఇంకా సుకరంగా ఉండకపోయినా, దానికి పరిపూర్ణత ఇంకా రాకపోయినా, ఈటైపుతో అచ్చుపడ్డ గ్రంథం చదవడం కొంత కష్టమయి దానికి అలవాటుపడవలసినా ప్రయత్నంమాత్రం ప్రశంసనీయమైనది. ఇప్పుడు కాకపోతే ఇక కొన్నాళ్లకయినా నాగరిలిపికి ఇంతకంటెను చక్కని 'లినోటైపు'యంత్రాలు వస్తవని ఆశించవచ్చును. మన తెలుగు వర్ణసమామ్నాయమంతా నాగరిదేకనుక ఆంధ్రులలో కొంతతీవ్రప్రయత్నమే జరిగితే తెలుగుకు కూడా 'లినోటైపు' యంత్రం రావచ్చు. ఈ విషయంలో కూడా కొన్ని అమెరికా కంపెనీలు ప్రయత్నిస్తున్నట్టు తెలుస్తున్నది. అరవానికి 'లినోటైపు' యంత్రం'—అమెరికాలోనే—ఇటీవలనే నిర్మాణ మయివచ్చింది.

వర్తకవ్యాపారం బాగా అభివృద్ధిచేసుకొన్నవారవడంచేత నయితేయేమి, సామ్రాజ్యం నిర్మించుకొన్నవారవడంచేతనయితే యేమి, ఏ విషయంలోనయినా 'ప్రోపగాండా' చేయడంలో అప్రతిమానులవడంచేతనయితేయేమి ఇంగ్లీషువారు పత్రికలవిషయంలో ఎక్కువగా కృషిచేసి వాటినిచాలా అభివృద్ధికి తీసుకువచ్చారు. ఇంగ్లండుదేశంలోని పత్రికలనేడు ఎట్లున్నదో తెలిస్తే ప్రపంచంలో నేడు పత్రిక ఎంత అభివృద్ధిపొందిందో తెలుస్తుంది.

ఇంగ్లండుదేశంలో వార్తాపత్రిక పుట్టినది పదహారవశతాబ్ది కడపటిదశకంలో; కాని వృద్ధిచెందడంమాత్రం పందొమ్మిదోశతాబ్దినుంచి. పద్దెనిమిదోశతాబ్ది ప్రారంభంలో వార్తాపత్రికకు ఇంగ్లండుదేశంలో ప్రాముఖ్యం వస్తూరావడంచేత ప్రభుత్వానికి అదంటే అయిష్టంకలిగింది. అందువల్ల పత్రికలనణచవలెనని అయితే యేమి, వాటివల్లకూడా ఆదాయం తీసుకవలెనని అయితే యేమి ప్రభుత్వంవారు వాటిమీద 'స్టాంపు డ్యూటీ' విధించారు. అయినప్పటికీ పత్రికల సంఖ్య తగ్గలేదు. ౧౭౦౯ లో లండను నగరాన్నుంచి మాత్రమే ప్రకటన అవుతూవచ్చిన పత్రికలు ౧౮ వరకు ఉండేవట. పత్రిక లెక్కువయి ఈ విషయంలో ఆందోళన జరిగినమీదటనే ౧౮౫౫ లో 'విజ్ఞానంమీద ఉపన్యాసం'తోలపోయింది. పన్నుభారం తగ్గడంతోనే పత్రికలు చవకయినవి. ౧౮౫౫ నుండి పత్రికల సంఖ్య ఇంకా పెరిగిపోయింది. పెట్టుబడి పెట్టగలవారనేకులు పత్రికలు పెట్టి డబ్బు సంపాదించడమే కాకుండా, తమ క్షేమలాభాలు కాపాడుకొంటూఉండడమూ, తమ రాజకీయ, పారిశ్రామిక, వ్యాపార భావాలను ప్రజలలో బాగా వ్యాపింప జేయడమూ జరుగుతూవచ్చింది. పత్రికారచన ఒక వృత్తీ, పత్రికాప్రకటనము లాభసాటి అయిన ఒక వ్యాపారమూ అయినది.

యూరోపు మహాసంగ్రామంతో పత్రికాప్రపంచం ఎన్నివిధాలనో మార్పుచెందింది. యుద్ధప్రారంభ కాలంలో మందుగుండుసామగ్రి తయారుచేయడమే విధాయకమయిన, అత్యవసరమయిన పని అయినందువల్ల వార్తాపత్రికలకుకూడా కొంత దెబ్బ తగిలింది. పత్రికావ్యాపారంకూడా అస్తవ్యస్తమయింది; అట్టి వాతావరణంలో వార్తాపత్రిక జాతీయ సుస్థితికే ఉండక తీరని ఒక ప్రధానద్రవ్యం కావడంవల్ల ప్రభుత్వమువారదికనిపెట్టి దానికి కావలసిన సాధన సామగ్రి సంపాదనలోను, సైన్యంలో చేరమని ఆహ్వానించడంలో దాని అంగబలాన్ని నిలుపుదలచేయడం విషయంలోను కూడా ఎన్నో సౌకర్యాలు కలుగజేశారు. మొట్టమొదటిసారి యుద్ధవార్తాహరులు స్కంధావారానుచరుల (Camp followers)కంటెను ముఖ్యులయిపోయినారు. ప్రభుత్వంవారు వారికి ... 'యూనిఫారము' లిచ్చారు. ఈవార్తాహరులు సైన్యాలను వెన్నంటి ఉండేవారు.

యుద్ధానంతరకాలంలో విడివిడిపత్రికాధిపతులకాల మంతరించింది; 'లిమిటెడ్ లయబిలిటీ కంపెనీ'లకాల మారంభమయినది. సహకారం ప్రధానలక్షణమయింది. విడివిడిగా పత్రికలు పెట్టి నడుపుతూవచ్చినవారిప్పుడు సంఘంగాకూడి లిమిటెడ్ కంపెనీలుగా ఏర్పడి పనిచేయడం మొదలు పెట్టారు. పత్రికాప్రకటనకూడా ఒక పరిశ్రమ అయి, ఇతర పరిశ్రమలలోవలెనే దీనిలోకూడా కలిసి పనిచేయడం ప్రధానధర్మ మయింది. ఇప్పుడు ఇంగ్లండుదేశంలో విడివిడి పత్రికాధిపతులు కాక పత్రికాప్రకటనసంఘాలు (లిమిటెడ్ కంపెనీలు) ఎన్నో ఉన్నవి. ఒక్కొక్క సంఘం కొన్నికొన్ని

పత్రికలు సొంతంగా పెట్టి నడపడమో, తన అధికారంకిందికి తీసుకొని నడపడమో చేస్తున్నది. ఈ పైకారణాలచేత యుద్ధానంతర కాలంలో పత్రికలు కొన్ని ఒకదానిలో ఒకటి అంతరించిపోయినవి; ఒకదానితో ఒకటి చేరిపోయినవి; నీతిప్రణాళిక(Policy) ఒకటిచేసుకొని ఒకదానితో ఒకటి సహకారం చేస్తున్నవి. లిమిటెడ్ కంపెనీ లవడంచేత మూలధనం పెరిగిపోతున్నది. వాటాదారుల కందరకూ ఈ వ్యాపారంలో శ్రద్ధ హెచ్చుతున్నది. తుదకు పత్రికలను నడిపేవారు ఇది ఒక వ్యాపారమూ, పరిశ్రమా కావడం చేత, భాగ్యవంతు లవుతున్నారు. ఇతర పరిశ్రమలను నడిపే భాగ్యవంతులే, లక్షాధికారులే తుదకు వార్తాపత్రిక కంపెనీలలోకూడా వాటాదారులు. ఇతర పరిశ్రమల నేశక్తులు, ఏరూపంగా నడుపుతున్నవో ఈ పరిశ్రమను కూడా ఆశక్తులే ఆట్లే నడుపుతున్నవి. పరిశ్రమలకూ, వార్తాపత్రికలకూ అధినేత లొక్కరే అవడం చేత వారు తమప్రయోజనాలకు భంగంకాని, తమ అభ్యుదయానికీ లాభానికీ తోడ్పడే 'పాలిసీ' — నీతిప్రణాళిక — పెట్టుకొని పత్రికలను దిద్దుతున్నారు; పరిశ్రమలను నడుపుతున్నారు; రాజ్యతంత్ర నౌకను చుక్కాని తిప్పుతున్నారు. ఇంగ్లండు దేశంలో ఇప్పుడు 'ప్రెస్‌సిండికేట్లు'—పత్రికా ప్రకటన కర్తల సంఘాలు—వెల్లివిరిశాయి. 'స్టాక్ ఎక్స్చేంజి కొలేమన్సు'- ధరలు- చూస్తే ఆయం (Finance)మీద పత్రికా ప్రభావం ఎంత ఉందో, పత్రికమీద ఆయప్రభావం ఎంత ఉందో తెలుస్తుంది. వాటిని పత్రికా, పత్రికను అవీ పరస్పరమూ శాసించుకొంటూ ఉంటవి.

ఎప్పుడయితే పత్రిక ఈ విధమయిన వ్యాపార, పారిశ్రామిక సంస్థ అయిందో అప్పటినుంచి ఈ పరిశ్రమతో సంబంధంగల ఒక్కొక్క వృత్తివారు తమతమ స్వామ్య లాభాలు కాపాడుకొనేటందుకు ప్రత్యేక సంఘాలుగా ఏర్పడ్డారు. పత్రికారచయితల సంఘాలు, కంపోజిటర్ల సంఘాలు, ప్రూఫ్ రీడర్ల సంఘాలు, ప్రకటనకర్తల సంఘాలు, అడ్వర్టయిజింగు మేనేజర్ల సంఘాలు—ఇంతెందుకు పత్రిక తయారుచేయడానికీ, తయారయిన పత్రికను దేశంలో వెదచల్లడానికీ కారణభూతులయిన, అవసరమయిన వృత్తుల వారి అందరిసంఘాలూ ఏర్పడ్డవి. న్యూస్ ఏజెంట్లకు సంఘం ఉంది; 'ఎంపైర్ ప్రెస్ యూనియన్' ఉంది. చివరకు 'ఇంటర్ నేషనల్ ప్రెస్ కాన్ఫరెన్సు' కూడా 'లీగ్ ఆఫ్ నేషన్సు' పక్షాన ౧౯౨౭ లో జెనీవా నగరంలో సమావేశమైంది.

ఈవిధంగా ఇంగ్లండుదేశంలో పత్రిక అభివృద్ధి అయిందంటే క్రమంగా ఈ యభివృద్ధి — ఏరూపంగా అయితేనేమి — ఇతర దేశాలలోకూడా వస్తుందన్నమాటే. స్టీము నౌక, వాయువిమానము వచ్చి జాతులకూ జాతులకూ, దేశాలకూ దేశాలకూ మధ్య ఉండే విభేదాలనూ, మారాన్నీ తొలిగించివేశాయి. క్రమంగా ప్రపంచమంతా నేడు ఒకటే మానంలోకి వస్తున్నది. ఒకచోట ఒకవిషయంలో అభివృద్ధి కనబడిందంటే కాస్తనేటికో కాస్తనేపటికో అది యితరచోట్లకూడా కనబడిందన్నమాటే. ప్రపంచంలో ఏ మారుమూల ఉదికిన భావమయినా సరే ఇతరచోట్ల మారుమోగకుండా ఉండడంలేదు. అందువల్లనే నేడు వేరువేరు జాతులశక్తులు వేరువేరు రూపాలు దిద్దుకొంటున్నవి. ప్రపంచ మొత్తంమీద కార్మికులంతా ఒక్కటవుతున్నారు; పెట్టుబడిదారులంతా ఒక్కటవుతున్నారు. పత్రికావ్యాపారంలోను అంతేజరుగుతున్నది.

రాజకీయవిషయాలలో పత్రికయొక్క ప్రాబల్యమూ, ప్రభావమూ ఫ్రాన్సులో లాగ ఏదేశంలోనూ అంత ఎక్కువగా లేదు. పత్రికలలో పడేవ్యాసాల భాషావైదుష్యంకూడా ఫ్రాన్సులోలాగ ఎక్కడా ఎక్కువగా ఉండదు. ఫ్రాన్సుదేశంలో పత్రికా రచనమే సారస్వతం; సారస్వతమే పత్రికారచనం. ఫ్రాన్సులో అమిత ప్రసిద్ధిగాంచిన గొప్ప సాహిత్యవిశారదులు కొందరు పత్రికలకువ్రాసి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకొన్నవారే. పేరు మోసిన గొప్ప సారస్వతవిమర్శకులుకూడా పత్రికలకు వ్రాసినవారే.

౧౯౨౯లో దినపత్రికలైతే యేమి, వారపత్రికలయితే యేమి, పక్షపత్రికలైతే యేమి, మాసపత్రికలైతేయేమి ప్యారిస్ నగరాన్నుంచి ప్రకటన అయ్యేవి ౩౩౮ ఉన్నవి. వీటిలో రెండు అధికారివర్గంపక్షాన ప్రకటనఅయ్యే దిన పత్రికలు; ౫ ఇతర దినపత్రికలు, ౧౨౮ క్రీడాసంబంధమైన పత్రికలు. ఫ్రాన్సుదేశంలోని అన్నిరాష్ట్రాల మొత్తంమీదా ప్రకటన అయ్యే పత్రికలు ౩,౧౦౦లు. ఫ్రాన్సుదేశంలో జాతీయ పత్రికల అమ్మకం లక్షకు పై నుంటుంది.

ఏ దేశంలోని పత్రికలకంటెను జర్మనీదేశం పత్రికలు సారస్వతం, నాటకం, కళ, సంగీతం, ఆర్థికవిషయాలు ఎక్కువగా ప్రకటిస్తవి. జర్మనీపత్రికవంటి భావప్రకాశకమయిన పత్రిక మరొకటిలేదు. జర్మనీలో మిక్కిలి జనాదరంగల పత్రికకు ౨,౫౦,౦౦౦ పై నుంటుంది అమ్మకం; ఆదేశంలో ౨౨,౦౦౦ ల ప్రతులకు తక్కువ అమ్మే పత్రికే లేదు.

యుద్ధం ముగిసిననాటినుంచి అనేకవిధాల అభివృద్ధిపొందుతూ వస్తున్న రష్యాలో ౧౯౪౭ లో ౭౦ దినపత్రికలకంటె ఎక్కువ లేవు.

బెల్జియం చిన్నదేశమయినా అక్కడ ౧౪ దినపత్రికలున్నవి.

జనసామాన్యంలో విద్య బాగా వ్యాపించడంవల్ల జపానుదేశంలో పత్రిక లీమధ్య చాలా ఎక్కువయినవి. జపానులో నేడు ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దేవి పత్రికలే. జపానులోని చాలా పత్రికలు ప్రధానంగా టోకియో, ఒసాకాపట్టణాలనుంచి ప్రకటన అవుతవి. జపానులోని గొప్పపత్రికలు 'ఒసాకామైనిచి' 'ఒసాకా అసహీ'లకు అమ్మకం ప్రతిదినమూ పదిలక్షలపైన ఉంటుంది. ఈమధ్య కొన్నియేళ్లనుంచి అక్కడ విద్యావిషయకపత్రికలు చాలా వృద్ధి అయినవి. వీటిలో నాటికి డెబ్బయి పత్రికలదాకా స్థాపించినవాడు నొజినోమా. ఇతన్ని జపాను 'మేగజైన్‌కింగ్' అంటారు.

౧౯౩౬-వ సంవత్సరాంతానికి జపానులో ఉన్న దినపత్రికలు ౧,౨౧౯. ఇవికాక నెలకు నాలుగుమారులూ, అంతకెక్కువ మారులూ ప్రకటన అయ్యేవి ౬౮౦; నెలకు మూడుసారులూ, అంతకు తక్కువసారులూ ప్రకటన అయ్యేవి ౫,౩౯౨. దినపత్రికలు ఒక్క టోకియోనగరంలోనే ౨౩౧, ఒసాకా నగరంలో ౯౮ ఉన్నవి.

౧౯౧౧ తరువాతనుంచి చైనాలో పత్రికలు చాలా పుట్టినవి. మన దేశంలోలాగే ఉత్సాహవంతులయినవారు రాజకీయాభిప్రాయాలతోనో, మరోవిధమయిన లక్ష్యాలతోనో చాలాపత్రికలు స్థాపిస్తూవచ్చారు. మనదేశంలోలాగే చాలా పత్రికలు ఇట్టే పుట్టుతూ వుంటవి; ఇట్టే గిట్టుతూవుంటవి. జాతీయ, యువజనోద్యమ ప్రచారాల కివి చాలా తోడ్పడుతున్నవి. దేశంలో జాతీయ

భావాన్ని ఉద్దీపింపజేసే. ప్రజాస్వామ్యదేశాలలో ఉన్న తాళింపులను రేకెత్తిస్తున్నవి ఎక్కువగా ఇవే. యూరోపియనులయితేనేమి, అమెరికనులయితేనేమి—విదేశీయులు పెట్టి నడుపుతున్న పత్రికలు ౨౦, ౩౦ దాకా ఉన్నవి. వీటిలో చాలాపత్రికలు షాంగ్‌హైనగరాన్నుంచి ప్రకటన అయ్యేవే.

౧౯౩౪-౧౯౩౫ లో మన మద్రాసు రాజధానిలో ప్రకటన అవుతూవచ్చిన వార్తాపత్రికలు ౩౨౧. వీటిలో ౧౨౮ చెన్నపట్టణంనుంచే ప్రకటన అవుతున్నవి. ఏయేభాషలలో ఎన్నెన్ని వున్నవో క్రింద తెలుపుతున్నాను.

| | |
|---|---|
| ఇంగ్లీషు పత్రికలు ... | ౬౩ |
| అరవ పత్రికలు ... | ౧౯ |
| తెలుగు పత్రికలు ... | ౫౧ |
| మలయాళపత్రికలు .. | ౭౧ |
| కన్నడ పత్రికలు ... | ౧౫ |
| ఇతర భాషలలోనివి ... | ౧౬ |
| రెండుమూడు భాషలలో ఉన్నవి | ౩౬ |

ఎన్నెన్నో ఇతర వృత్తులకున్నట్టు ఈపత్రికావిలేఖనవృత్తికి మనదేశంలోలాగే యూరోపులోని ఇంగ్లండు మొదలయిన దేశాలలోకూడా ఒక ప్రామాణ్యం అంటూ లేదు; ఒకయోగ్యత (Qualification) అంటూ లేదు. దీని కొకపట్టా లేదు. ఇతర వృత్తులవలంబించాలంటే, ఆవృత్తిలో పని చేయు అధికారం సంపాదించుకోవాలంటే చదువవలసినవి కొన్నిగ్రంథాలుంటవి; నేర్చుకోవలసిన కొంత విషయముంటుంది; ఇవ్వవలసిన కొన్ని పరీక్షలుంటవి; పొందవలసిన కొంత తర్ఫీదు ఉంటుంది. ఈపత్రికావిలేఖనవృత్తి కట్టి దేమీలేదు. సొంతప్రతిభ, సొంతప్రజ్ఞ, లోకజ్ఞానము, సొంత అనుభవమే పనికి ఈవిషయంలో తోడ్పడేది. ఈవృత్తికి కూడా ఒకపద్ధతిక్రమమూ, ఒకప్రమాణమూ ఏర్పరిచి, పరీక్షలుపెట్టి తరిఫీదు ఇవ్వాలని ఇంగ్లండుదేశంలో ప్రయత్నాలు చాలా జరిగినవి. ౧౯౨౨ లో లండను విశ్వవిద్యాలయంలో 'జర్నలిజం కోర్సులు' పెట్టారు. లండను విశ్వవిద్యాలయం 'జర్నలిజం కమిటీ' వారు ప్రసిద్ధులయిన పత్రికారచయితలచేత, సాహితీపరులచేత ఉపన్యాసా లిప్పించే యేర్పాట్లు చేశారు. మన మద్రాసు రాజధానిలో మద్రాసు విశ్వవిద్యాలయం వారుకూడా ఆనడుమ కొంతకాలం క్రిందట 'జర్నలిజం కోర్సులు' పెట్టి డిగ్రీ లేర్పాటు చేయాలని యోచనచేశారు. ఈ విషయంలో కొంతచర్చకూడా జరిగింది. ఫలితము ఏమయినదో మాత్రం నాకు జ్ఞాపకం లేదు.

నాగరికతకు పట్టుకొమ్మలయిన గొప్పసభ్యదేశాలలో దినపత్రికకు సాధారణంగా ఒక ప్రధానసంపాదకుడు, ఒక సహాయసంపాదకుడు దినసంపాదకుడు (Day editor), రాత్రి సంపాదకుడు, (Night editor), తన రిపోర్టర్ల సంఘంతో వార్తా సంపాదకుడు (News editor), విదేశవిషయ సంపాదకుడు (Foreign editor), సారస్వత సంపాదకుడు (Literary editor), క్రీడావిషయసంపాదకుడు (Sporting editor) మొదలయినవారుంటారు. వీరిలో ఒక్కొక్కరికి ఒక్కొక్క శాఖ. ఒక్కొక్కశాఖలో సహాయసంపాదకులు, ఉపసంపాదకులు మొదలయినవారుంటారు. వీరందరు కాక నాటకవిమర్శకులు, సంగీతవిమర్శకులు, ప్రధానవ్యాసరచయితలు, ఆయా శాస్త్రాలలోను, రాజకీయాలకు సంబంధించిన వేరువేరు ముఖ్యశాఖలలోను ప్రత్యేకకృషిచేసిన పండితులు ఉంటారు. ఇదంతా కలిస్తే సభ్యదేశాలలోని నేటి గొప్ప దినపత్రికలలోని సంపాదకవర్గాలు. ఈ విధంగానే దినపత్రికకు సంబంధించినవి ప్రకటనశాఖ, వ్యవహార నిర్వాహకశాఖ మొదలయిన పన్నో ఉంటవి. మళ్లీ ఈ యొక్కొక్క శాఖకు సంపాదకవర్గశాఖ కున్నంత బలగమూ ఉంటుంది. దీనినిబట్టి చూస్తే నేటి పత్రికది అనేక ప్రపంచమే — పత్రికా ప్రపంచం.

పత్రికలలో పనిచేసేవారికీ, పత్రిక యజమానులకూ సంబంధం 'కాంట్రాక్టు నాకిచట్టము'నుబట్టి ఉంటుంది. పనివారికి కాంట్రాక్టు ఉత్తరువేమీ లేనప్పుడు ఇంగ్లండుదేశంలో ఆచారాన్ననుసరించి పనిలోనుంచి తొలగవలసినప్పుడు ఈవిధంగా నోటీసు లిస్తూ ఉంటారు — పత్రిక ప్రతిష్ఠ, ప్రాముఖ్యములనుబట్టి సంపాదకులకూ, సహాయ సంపాదకులకూ ఆరుమొదలు ౧౨ నెలలలోపు నోటీసు, ఉపసంపాదకులకు ౩ మొదలు ౬ నెలల నోటీసు, రిపోర్టర్లకు మాసం మొదలు మూడుమాసాల నోటీసు.

తనపత్రికలోపడే మొదలు కంతకూ, అన్ని విషయాలకూ—ఆఖరుకు ప్రకటన కాలాలలో పడే విషయానికయినా సరే — సంపాదకుడే ఉత్తరవాది. పరువునష్టానికి సంబంధించినట్టి కాని, మరేవిధమయినట్టికాని దావా వస్తే ఆతడే జవాబుదారు—వార్తలూ, వ్యాసాలూ పంపినవారూ కాదు, ఆ మేటరు అచ్చుకిచ్చినవాడూ కాదు. కాని పత్రికాకార్యస్థానంలో మాత్రం సంపాదకుడికి ఉపసంపాదకుడు ఆవిషయంలో సమజాయిషీ చెప్పుకోవాలి.



# కుంతీకుమారి

జంధ్యాల పాపయ్యశాస్త్రి

అది రమణీయపుష్పవన, మావనమందొక మేడ, మేడపై
నది యొక మారుమూలగది, యాగదితల్పులు తీసి మెల్లగా
పదునయిదేండ్ల యీడుగల బాలిక, పాలిడి రాచపిల్ల—జం
కొదవెడు కాళ్లతోడ దిగుచున్నది క్రిందికి మెట్లమీదుగన్.

కన్నియలాగె వాలకము కన్పడుచున్నది, కాదు కాదు—ఆ
చిన్ని గులాబివన్నెయరచేతులలో పసిబిడ్డడున్నయ
ట్లున్నది—ఏమికావలయునో గద యిద్దరు? అచ్చుగ్రుద్దిన
ట్లున్నవి రూపురేఖ, లెవరో యనరాదు తల్లి యా బిడ్డయే.

తొరగలు నానందబాష్పాలొ? పొరలు దుఃఖ
బాష్పములొగాని? యవి గుర్తుపట్టలేము.
రాలుచున్నవి యామెనేత్రాలనుండి
బాలుని లేతచెక్కుటద్దాలమీద.

పొత్తులలోని బిడ్డనికి పుట్టియుపుట్టుటకన్న ముందె క్రొం
గ్రొత్తవి వజ్రపుం గవచకుండలముల్ గయిసేసి రెవ్వరో?
పుత్తడి తమ్మిమొగ్గజిగిబుగ్గల ముద్దులుమూటగట్టు నీ
నెత్తురుకందు నెత్తుకొని నెచ్చెలి మెచ్చటి కేగుచున్నదో?

గాలితాకున జలతారుమేలిముసుగు
జారె నొక్కింత—అదిగో చిన్నారిమోము
పోల్చుకొన్నాములే! కుంతిభోజు పుత్రి
స్నిగ్ధసుకుమారి యామె కుంతీకుమారి.

* * * *

కడువేగంబున చెంగుచెంగున తరంగాల్ పొంగ - ఆ తోటవెం
బడి గంగానది పారుచున్నయది బ్రహ్మాండమ్ముగా - అల్లదే
బుడుతన్ చేతులలోన బెట్టుకొని యాపూబోడియుంగూడ న
య్యెడకే పోవుచునుండె గద్దదికతో నేమేమొ వాపోవుచున్.

"ముని మంత్రమ్ము నొసంగనేల? నిడెబో మున్ముందు మార్తాండు ర
మ్మని నే కోరగనేల? కోరితిని బో, నాతండు రానేల? ప

చ్ఛానుగా, కన్నియ నంచు నెంచక నన్నా చేపట్టగా నేల ? నీ
యమనుగుంటానని నేసంగ నేల ? యిపు డహా ! ఏమి కావించితివే ?

“ఏమని కేగుదాన నిపు డీ కసుగందును జూచినేని మా
నాయన నేమనునే ? చెలులు నవ్వకపోదురె ? చుట్టపక్కములు
సీయకుందురే ? జనులు చెప్పుకు చూతురె ? దైవయోగమున్
ద్రోయగరాదు — ఈ శిశువు నేడెగట్టితి లోకనిందలన్.

“ఈ పసిపాప ప్రేగులతోడ నింక నెంత
కాల మీనేను దాల్తు ? గంగా స్రవంతి
కలుషహారిణీ, యమ్మతల్లి కడుపులోన
గలసిపోయెద నా కన్నకడుపుతోడ.”

అనుచు పసివాని రొమ్ములో నదుముకొనుచు
కుంతి నదిలోనికిం దిగె — నంతలోన
అట్టె నట్టేటిలోనుండి పెట్టె యొకటి
కొట్టుకొనివచ్చుచుండె నా గట్టుకడకు.

మందసము రాక గనెనేమొ ? ముందుకిడిన
కాలు వెనుకకు బెట్టి — బాష్పాల నెమ్మొ
గమ్ములో చిన్ని యాశాకణమ్ము మెరయ
నా దెసకె చూచు నామె కన్నార్పకుండ.

* * * *

“ఆత్మహత్యయు శిశుహత్య యనక, గంగ
పాలుగానున్న యీ దీనురాలిమీద
భువనబంధునకే జాలి పుట్టెనేమొ
పెట్టె నంపించి తెరువు చూపెట్టినాడు.

ఎటుల కానున్నదో యీశ్వరేచ్ఛ” యనుచు
సగము తడిసిన కోకతో మగువ తిరిగి
దరికి జనుదెంచి పేటికదరికి పోయి
మూత వెడలించె కంపించు చేతితోడ.

* * *

ఒత్తుగా పూలగుత్తులు నెత్తువెట్టి
మెత్తగా పొత్తిగుడ్డల మెత్తలునిచి

క్రొత్త నెత్తావిరాకుల గూర్చి పేర్చి
ఒత్తుకొనకుండ చేతితో నొత్తిమోము
ఎట్టకేలకు మది బిగబట్టి "ఇంక
నన్ను విడిపోదువే! నాయనా!" యటంచు
బాష్పముల సాముదడిసిన పక్కమీద
చిట్టిబాబును బజ్జుండబెట్టె తల్లి.

చిన్ని పెదవుల ముత్యాలు చిందుపడగ
కలకల మటంచు నవ్వునే గాని — కన్న
యమ్మకష్టము తనయదృష్టమ్ము గాన
మెరుగడింతయు నా యమాయికపుబిడ్డ.

చెదరు గుండియ రాయి చేసికొని, పెట్టె
తలుపుమూయంగబోవును — వలపు నిలుప
లేక చెయిరాక — సుతు కౌగిలించి వెక్కి
వెక్కి యేడ్చును కన్నీరు గ్రుక్కుకొనును.

భోగభాగ్యాలతో దులదూగుచున్న
కుంతిభోజుని గారాపు కూతు నయ్యు,
కన్ననలుసును కొంగ పట్టుకొనగనైన
పెట్టుకొన నోచనైతి పాపిష్ఠిదాన.

పెట్టియలోన నొత్తిగిలబెట్టి నినున్ నదియేటిలోనికిన్
నెట్టుచునుంటి తండ్రి! యిక నీకును నాకు ఋణంబు తీరె, ఏ
పెట్టులనున్నదో మనయదృష్టము? ఘోరము చేసినాను నా
పుట్టుకమాసిపోను నినుబోలిన బిడ్డను నాకు దక్కునే?

పున్నమచందమామ సరిపోయెడి యీ వరహాలమోము నే
నెన్నటికైన జూతునె! మరే, దురదృష్టము పట్టియున్న నా
కన్నుల కంత భాగ్యమును గల్గునె? ఏ యమయైన నింత సే
కన్నము బెట్టి యాయువిడినప్పటిమాటగదా కుమారకా!

పాలబుగ్గల చిక్కదనాల తండ్రి
వాలుగన్నుల చక్కదనాల తండ్రి,
మేలినీలి ముంగురుల వరాలతండ్రి
కాలుచెయిరాని తండ్రి, నాకన్నతండ్రి.

కన్నతండ్రి నవ్వులపాలు గావించేసి
చిన్నినాన్నకు కన్నులు చేరవేసి
చక్కనయ్యను నరికుసుల్ జాగచేసి
చిట్టిబాబు మైనిగనిగల్ పెట్టువేసి
బాలభానుని బోలు నాబాలు నిదు
గర్భమున నుంచుచుంటి గంగాభవాని!
వీని నేతల్లి చేతిలోనైన బెట్టి
మాట దక్కింపుమమ్మ! నమోస్తుతే....

"సూర్యభగవానుండా! ప్రభూ చూచుకొనుమా
ఈ కుమారు"నటంచు కుంతీకుమారి
మరలు లేకత్తు బిడ్డను మరల మరల
నెత్తుకొంచు పాలిండ్లపై నొత్తుకొంచు.

బుజ్జగింపుల మమకార మాజ్ఞగించి
పెట్టెలోనుంచి జోకొట్టి—యెట్టులెటులొ
మనసు బిగబట్టి "హరహరా" యనుచు కనులు
మూసికొని యేటిలోనికి ద్రోసి పెట్టె.

ఏటికెరటాలలో పెట్టె యేగుచుండ
సుదతి కనుచూపుమేరకు చూచిచూచి
"ఉస్సు" రని యొక్క నేడినిట్టూర్పు పుచ్చె
పైటపై రాలె రెండు కన్నీటిబొట్లు.



వానియొద్దను బైరాముఖానుఁడను వెడి
మంత్రి సంరక్షకుఁడు రాజ్యతంత్రనులను
నడపె నైదువత్సరములు నయముతోడ
పానిపట్టున గెలిపించె ప్రభుని సేన.

పదియు నెనిమిదివర్షాల ప్రాయమందు
స్వయముగా రాజ్యపాలన ప్రభుత బూని
బైరముని తీర్థయాత్రకంపంగ వాని
మడియఁజేసిరి శత్రులు మార్గమందు.

మిక్కిలికీర్తిగాంచిన యమేయపరాక్రమ మెక్కు వెంతొ తోఁ
జక్కఁగ రాజ్యపాలనము సర్వజనప్రమదప్రదుండునై
దక్కనురాజ్యభాగములఁ దా విజయంబును గాంచి సాదరం
బక్కువమీఱె హిందువుల మన్నన స్వీయమతిస్థిఁ గొనన్.

వీరులు రాజపుత్రులరిభీకరులంచు నెఱింగి వారితో
వ్వారఁగ బంధుభావముఁ బ్రియమ్మొనరించెను వారితోడుతన్
భూరియశస్సుగాంచె రణభూముల వారల సాయమున్ బ్రనౌ
నౌర! విశిష్టతంత్రము తిరంబగుకీర్తినిఁ దెచ్చె వానికిన్.

అనిలోనఁ దన్నెదిర్చిన రాణి దుర్గావ
తిని గెల్చి రాజ్యంబుఁ గొనియె నతఁడు
జయపురాధీశుని స్వాధీనమునకు దా
తని కూఁతుఁ బ్రీతి నుద్వాహమాడె
చిత్తూరు కోటలో స్త్రీలగ్నిఁ జొచ్చిన
ధ్వంసంబుఁ జేసి పంతంబుఁ జూపె
తగు సమయంబునఁ దా నాఘనిస్థాన
మున శత్రులనడంచి కొనియె దాని
వీరవనితయౌ చాందు బీబీని దక్షి
ణాపథంబున నోడించి యేపుఁ జూపె
నాల్గువిధముల శత్రుల నీల్గఁజేసి
పాలనముఁజేసె నేకాతపత్రముగను.

మొగలురాజ్యంబు పరగణాలుగ సుబాలు
నాఁగ విభజించి పాలకోద్యోగి నొకని
నీమమొప్పఁగ సుబేదారునామ మొసఁగి
తమ ప్రతిష్ఠించి యక్బరు ఘనతకెక్కె.

మతములఁగల్గు సత్యమును మాన్యుఁడు గన్గొన నెంచి సర్వస
మ్మతమగు నోలగంబునఁ గ్రమంబగు వాదనలన్ గ్రహించి స్వ
చ్ఛతమమతంబు సర్వమతసారముఁ గూర్చెను దీనిలాహి నా
నతనిని సన్నుతించి మహితాత్ముఁడటంచు జనంబులెంచఁగన్.

సుందరి స్వీయభర్తృచితిఁ జొచ్చి గతించుట పున్నెమౌరయన్
హిందువులందు, తా నదిసహింపక నారుల రక్షణార్థమై
పొందగు చట్టము న్నిలిపె భూపతి, బాల్యవివాహపాతకం
బుం దగ మాన్పఁజొచ్చె జనముల్ దనుమెచ్చ యశంబు హెచ్చఁగన్.

నారోజాయను నుత్సవంబు గడు విన్నాణంబుగాఁ జేయుచున్
నీరేజాక్షిని రాజపుత్రయువతి న్వీక్షించె మోహాంధుఁడై
మారాకారముగు ర్తెఱింగి తగుసమ్మానంబు తాఁ జేయ గం
భీరుండై ఋజుమార్గ మక్బరు గనెన్ ప్రేమంబు నేమంబుగన్.

జిజియాసుంకము మాన్పె హిందువులపై స్నేహంబు దీపింపఁగాఁ
బ్రజలందున్ ఘను రాజపుత్రులకు గారామొందియో మాపుమన్
స్వజనానీకముతోడ నెప్పుడవుల్ భావ్యంబుగా నిచ్చెఁ దా
విజయోత్సాహజనైకరక్తుల నుర్విం బొందె నాక్రాంతమున్.

మొగలు లగుచాలందు సంపూర్ణవిభవ
శాశ్వతానంతకీర్తి చంద్రికాప్ర
సారవిస్తారగరిమ రాజ్యంబు నేలె
సద్గుణవర్తి అక్బరుచక్రవర్తి.

అక్బరుతరువాత నతనికుమారుండు
రాజపుత్రిసతికిఁ బ్రభవమంది
నట్టి జహాంగీరుఁడా మొగల్ సామ్రాజ్య
మును వహించె ప్రజల మునుము గాంచె.

స్వీయశక్తి యటుండి దివిజవిలాస
భామినీమణులున్ దలవంచుకొనఁగ
రమణమణిమయ దివ్యచిత్రంబు, నూర్జ
హాను తనరాణి గాఁగ రాజ్యంబొనర్చె.

జనకుని రాజనీతిఁగల సత్యమెఱింగి మహాత్మ్యదీయునిన్
ఘనరసపుత్రితోడ నధికారమునన్ సముపస్థితిచెప్పి, పా
లనమొనరించె స్వీయచతురత్వము న్యాయపథానువర్తనం
బును మెఱయంగ రాజ్యము ప్రమోదముతో నభివృద్ధిచేయుచున్.

అసమలావణ్య నారాశి కుసుమశరుఁడు
ప్రార్థనోపేతుఁడై రాజ్యవైభవముల
నూర్జహాన్ సతి గొల్వ వినోదగరిమ
ఆజహాంగీరు నిత్యంబు ననుభవించె.

నవ్యరసానుభావకథనంబున స్వీయచరిత్ర వ్రాయుచున్
దివ్యవిలాస భాసురగతిం దనరారెడి హృద్యసత్కళల్
భవ్యహృదంతర ప్రమదవైభవ సంపద గానశిల్పముల్
కావ్యరసానుమోద జనకంబుగఁ గీర్తివహించె నాతఁడున్.

ప్రాచ్యవిభుఁడు జహాంగీరుపాదుశాహి
సాయమున కాంగ్లదేశంపు రాయబారి
వచ్చి కానుకలతో విన్నపములొనర్చెఁ
దనర పాశ్చాత్యులకు స్వతంత్రములనీయ.

తనసభ రాయబారి నుచితంబగుమన్ననలన్ దనర్చుచున్
గణనకువచ్చు హక్కులు విశా, నెఱపల్కుల నాదరించె నా
ఘనుఁ డెనుపాగుపా, తనదు కాలము నీల్గఁగ రెండువర్గముల్
మనమువిసుంబు నొంద నిజమార్గముబట్టి నతండు నుండియున్.

తనునివసించు కాలమున నాఁగనుఁగొన్న విశేషవార్తలన్
జననదినోత్సవోపవనవర్ణ్యలసన్మృగభూమి జాగముల్
ఘనవిభవప్రసంగ మెసఁగంగ రచించె నతండు కావ్యమున్
గనుఁగొనవచ్చు నయ్యధిప కాలమునం గల వింతలందునన్.

మధుపానవ్రతదీక్ష రాజ్యమల వామాక్షీవశంబందుఁ బ్రో
యు ధవుం జెంచుఁ దలంపనేల నతఁడా యుద్ధంబులం దెల్ల సా

# జూపిటర్ జనరల్ యిన్సూరెన్సుకంపెనీ, లిమిటెడ్.

(స్థాపితము 1919)

---

పరిపాలకవర్గము:

ది ఆనరబుల్ శాంతిదాస్ అస్కురన్‌గారు, చైర్మన్.

చతుర్భుజ గోవర్ధన్‌దాస్‌గారు | మథురదాస్ ద్వారకదాస్‌గారు

సర్ బైరాంజి జీజీ భాయిగారు కే.టి. | ధరంసే యం. కాటాగారు

మణిలాల్ బి. నానావటిగారు

మేనేజింగు యేజంట్లు:—లాల్‌జీ నారన్‌జీ అండ్ కో.,

| | | |
|---|---|---|
| చందాలువేసిన మూలధనము | రు. | 1,50,00,000 |
| చెల్లించిన మూలధనము | రు. | 23,74,800 |
| చెల్లించిన క్లెయిములు | రు. | 1,60,00,000 |
| ఆస్తులు | రు. | 60,00,000 |

| | | |
|---|---|---|
| అనుకూలములైన షరతులపై అన్ని తరగతుల భీమావ్యాపారము నిర్వహింపబడును. | సమస్త కతిపయ పరిస్థితులకు నోనయి, దిగ్విజయముగా 16 సం॥ రముల నుండి పనిచేయుచున్న కంపెనీ. | కంపెనీవారు అన్ని క్లెయిములను చెల్లించి యున్నారు. జనాదరణ అంతకంతకు వృద్ధియగుచున్నది. |

అగ్ని – జీవితము – నీరు – ఆకస్మిక ప్రమాదములు – కూలీల పరిహారము – పోస్టలు, రవాణా భీమాలు వగైరా చేయబడును.

ఈ కంపెనీ యేజన్సీ అనగా లాభకరముగా ధనమును సంపాదించి పెట్టు సాధనము. జీవితము, అగ్ని, యింకా యితర శాఖల యేజన్సీ షరతులకై వ్రాసి కనుగొనుడు.

---

ది ఆనరబుల్ నారాయన్‌దాస్ గిర్ధరదాస్,

లోకల్ మేనేజర్లు,

99 ఆర్మీనియన్‌వీధి, మద్రాసు.

# కవిప్రతిమా ప్రదర్శనప్రశంస

వడ్డాది సుబ్బారాయుఁడు

"భారతపారవేళను బ్రభావతిపెండ్లిఁ బఠించునప్పుడుం
గోరిక లూర కూరుఁగద, కొమ్మనతిక్కన సూరనన్ గనన్;
వారలనాఁటివార లలవారలరూపు లుపేక్ష నిల్పమిన్
నేరను గేఁటిలోఁచు నవి నెమ్మది కుమ్మలికన్ ఘటించెడిన్.

—(వ. సు. రాయచాటు ప్రబంధము.)

శ్రీపతి కృపఁగాంచుత సు-స్థాపిత వీరేశలింగ సంస్మారకరూ
పోపేత పృథూపల వీ-క్షాపేక్షాగత మహాజనాతత సమితిన్.

వేఁగీదేశపు రాజధానినగరిన్, వేయేండ్లక్రిందన్, వరం
బౌ గోదావరివారిఁ గైతవ్యవసాయం బూనె నన్నయ్య; త
ద్వాగీశుండు మొదల్గఁ, దత్కృషిని సల్పం బాయకారీలె కా
నీ, గాలించినఁ గానరాఁ డొకరుఁ డేనిం, బ్రోలికాఁ పెవ్వఁడున్.

ఈ కాలపుఁ గవులందు వి-వేక వివర్ధనిగురుండు వీరేశుఁ డొకం
డే కాని, వాసు, వ. సు., శుక, శ్రీ.కృష్ణులు పాయకారి సేద్యపువారే

కందుకూరి వీరేశలింగ గురువరుఁడు
పావిలాలాన్వయుఁడు వాసుదేవ గురుఁడు
నవల వడ్డాది సుబ్బరాయాంధ్రగురుఁడు
రాజ రాజేంద్రపురిఁ గవిత్రయ మిటీవల.

కలిఁ బురుషాయువున్ మిగులు కాలముక్రిందటి పాఠశాలలో
జ్జ్వలగుట వీర వాసు వ. సు. సంజ్ఞలు, నాఁ డిటుఁ జూడ నెవ్వరున్
దెలుఁగునఁ బద్దెమల్లఁగల నేర్పరులుండమి, వారి ముగ్వురన్
బిలిచిరి రాణ్మహేంద్రపుఁ గవిత్రయమం చలనాఁటి సజ్జనుల్.

నన్నయ తొల్కవిత్రయమునం బలె, నాధునిక త్రయంబునన్
మున్నగు పేరు గన్న కవిముఖ్యుఁడు భౌతికముం ద్యజించి కై
కొన్న యశశ్శరీరమునకున్ నయిదోడుగ రాణ్మహేంద్రమం
దున్నతలక్ష్యులౌ వారు సుజనుల్ నడువీథిఁ గనన్ శిలాకృతిన్.

పల్లెదెఱఁగౌ కృతుల్ చదివి, భావిజనంబులు నేఁటి సత్కవీం
ద్రుల నిజరూపముల్ గనఁ గుతూహలమొందెదరంచు లోపమున్
దొలఁపను, రాణ్మహేంద్రసుజనుల్ కవిలింగము సాంగరూపమున్
శిలఁ దిలకింప శిల్పమున నిల్పిరి ప్రోల మహోపకారకుల్.

భాసుర పౌరమందిరము, బాలుర యున్నతపాఠశాల, యె
న్నో సరసంబులౌ కృతులు నున్నను, నామమె తెల్పుఁగాని, పె
న్వాసినిగన్న తన్నవి గనంబఱుపం గొఱఁగా వటంచు వి
చ్చేసెనొ వీరలింగకవి స్వీయపదంబున కీశిలాకృతిన్.

పలుకులకుం బ్రమాణ మగు పంచమవేదము పుట్టె మున్నెటన్
దెలుఁగున, శారదేందిర లతిస్థిరమైత్రి నెటన్ వసింతు, ర
న్నెలవునఁ గందుకూరి కులనీరధిచంద్రకవిప్రవీరు రూ
పిల గలయంతకాల మిట నిప్పురి నీశిల నిల్పుఁ గావుతన్.

శకవర్షంబుల వార్ధిభూతవసు భూసంఖ్యన్, యువాబ్దంపుఁ గా
ర్తికమాసాంత చతుర్దశీతిథి యుత శ్రీభానువారంబునం
బ్రకటింపంబడెఁ గందుకూరికులవారాశీందు వీరేశలిం
గకవిగ్రామణి గ్రావవిగ్రహము జోకన్ రాణ్మహేంద్రంబునన్.

రాష్ట్రమంతటఁ గడుఁబెద్ద, రాజధాని-చెన్నపురి; దానఁ బేర్వడ్డశిల్పివరుఁడు
సత్పినాగప్ప, వీరేశసత్కవీంద్రు-విగ్రహముశిలఁ జూపఱు వెఱఁగుపడఁగ.

రామానంద చటర్జీ-నామ బ్రాహ్మమతమండన ప్రథితుఁడు, స
ర్వామోదకరముఁ దెఱచె, శిలామయ వీరేశలింగ లలితప్రతిమన్.

తనరూపంబు శిలామయంబుఁ బురి సంస్థాపించు నీయుత్సవం
బును, వీరేశకవీశ్వరుం డిట సజీవుండైన కాలంబునం
దునె కావించిరయేని, యెంత తతఁడు సంతోషించియున్నో కదా
చను చర్పించెను స్వార్జితంబు ప్రజకున్ సర్వస్వమున్ బ్రాజ్ఞుఁడై.
జననం బొందెను రాణ్మహేంద్రమున; శిష్యత్వంబునన్ దత్పురీ
ఘనవిద్యాలయమందె విద్దెఁ గఱచెం; గాలేజి నవ్వీటనే
తెనుఁగొజ్జయ్యె; దిగంత విశ్రుతియు నందే కాంచె సంస్కర్తనాఁ;
గనుఁడీ లింగకవీంద్రు, నేఁడచటనే గాంచెన్ శిలారూపమున్.

అభిజనంబునందు నధికసత్కారంబు-నందు కొంతవారి కైన నరిది;
రాణ్మహేంద్రపురిఁ జిరస్థాయిఁగనె, శిలా-విగ్రహప్రతిష్ఠ వీరసుకృతి.

సమకాలిక సఖవీరే-శమహాకవి విగ్రహప్రశంస నభారం
గమున వ. సు. రాయఁడొనరుచుఁ- బ్రమదమునొందం దదాత్మ పరలోకమునన్.

వానఁదడియుచుఁ, జలికిఁ బాల్పడుచు, వీథి-నెండకెండుచు రాయిగా యుండవలసె,
నిందుకీర్తి గడించిన నేరమునకుఁ-గందుకూరి వీరేశలింగ కవివరుఁడు.

---

# హాళేబీడు దేవాలయశిల్పము

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

మహమ్మదీయులు దక్షిణ హిందూదేశముపై దండెత్తివచ్చినపుడు అందు విలసిల్లుచుండిన రాజ్యములలో హొయిసలరాజ్యము గూడ నొకటి. ఈ సామ్రాజ్యము రమారమి క్రీ. శ. ౧౧౦౭-వ సంవత్సరమునందు ఆరంభమై క్రీ. శ. ౧౩౪౩ వరకును, అనగా సుమారు ౨౩౬ సంవత్సరములు మహావైభవముతో వెలసెను. ఈ మహాసామ్రాజ్యమునకు రాజధానియై ఖ్యాతిగాంచిన ద్వారసముద్రనగరమే పాడుపడి నేడు హాళేబీడు అను నామమున బరగుచున్నది. హాళేబీడు అనగా పాతపట్టణమని యర్థము. మహమ్మదీయుల కీపట్టణము సులభముగ వశము కానందున కోపోద్దీపితులై తుదకిది తమచే జిక్కినప్పుడు సంపూర్ణముగ కొల్లగొట్టిరి.

ధన, కనక, వస్తు వాహనాదులనిటనుండి కొనిపోవుటయేకాక ఇందలి శిల్పమునుగూడ కొంతవరకు నాశనమొనర్చిరి. పట్టణము శత్రువులచేత జిక్కినందున హొయిసలరాజు తనరాజధానిని వేరొకపట్టణమునకు మార్చుకొనెను. కాన మహమ్మదీయులు వెడలిపోయినపిమ్మటగూడ ఈ పట్టణము మునుపటిస్థితికి రాలేదు.

హాళేబీడునందెన్నియో దేవాలయములు గలవు. కాని వీనిలో ముఖ్యమైనవి రెండే. ఇవి కేదారేశ్వరాలయము, హొయిసలేశ్వరాలయము. ఇప్పటికి కొంతకాలమునకు పూర్వము కేదారేశ్వరాలయ శిఖరమునందొక మఱ్ఱిచెట్టు నాటుకొని క్రమక్రమముగ పెద్దదై దేవాలయమును శిథిలము గావింపజొచ్చెను. మైసూరుదొరతనమువారీ చెట్టును నరికించి ఈ దేవాలయమును పునర్నిర్మాణము గావించియున్నారు. ఇట్లు చేయుటలో కొన్ని భేదములేర్పడినందున పునర్నిర్మితమైన దేవాలయము సరిగా వెనుకటి యాలయమువలెనే లేదు.

హొయిసలేశ్వర దేవాలయము మాత్రము అధికముగ శిథిలము జెందక ఇంచుమించుగ హొయిసలుల కాలమందున్నట్లే ఇప్పటికిని గాన్పించుచున్నందున నాటి వాస్తు పద్ధతిని గాని, శిల్పసంపదనుగాని పరీక్షింపగోరువారి కిది యొక అమూల్యవస్తు ప్రదర్శనాలయము.

ఈ దేవాలయమున నిజముగ రెండు సన్నిధులు గలవు. ఒకదానియందు హొయిసలేశ్వరలింగమును, రెండవదానియందు శాంతలేశ్వర లింగమును గలవు. వీని కొక్కొక దానికిని ప్రత్యేకముగ సుఖనాసి, నవరంగమంటపములు గలవు. ఈ యాలయములు రెండును ఒకదానినొకటి యానుకొని తూర్పు దిక్కున ముఖద్వారముండునట్లు కట్టబడినవి. ఈ రెండు ఆలయములందలి నవరంగమంటపములును మధ్య చేరిపోయియున్నందున ఇవి రెండును ప్రత్యేకాలయములైనను ఒకటే యాలయముగ పరిగణించుట కాస్పదమున్నది. ఒకొక ఆలయమునకును ఎదురుగను ప్రక్కవైపునను ద్వారములున్నందున మొత్తముగ ఇందు తూర్పువైపు రెండు ద్వారములును, ఉత్తరదక్షిణములందు ఒకొక ద్వారమును గలవు. ఇందు దక్షిణద్వారమునుండ హొయిసలరాజు సాధారణముగ ఈ యాలయములను ప్రవేశించుచుండెనట. కాననే ఇతరద్వారములకన్న ఈ ద్వారమును, దీని చుట్టు శిల్పమును ఎక్కువ మనోహరములుగ గాన్పించుచున్నవి.

ఈ యాలయముల కెదురుగ రెండు నందిమంటపములు గలవు. దక్షిణము వైపున (అనగా హొయిసలేశ్వర సాన్నిధ్యమున) నన్న మంటపము నానుకొనియే మరియొక చిన్నయాలయము గలదు. ఇందున్న దేవత సూర్యుడు. ఈ విధముగనే ఉత్తరము వైపుననున్న నందిమంటపము నానుకొని ఒక చిన్నయాలయముండెననియు, అందు చంద్రుని ప్రతిష్ఠించియుండిరనియు చెప్పుకొందురు. కాని ఇందున కెట్టి యాధారములును కానరావు.

ప్రధానాలయములలో నొక్కొక్కదానియందును ఒకగర్భగృహమును, దాని నానుకొనియే సుఖనాసియు, దానిని చేరి నవరంగమంటపమును గలవు. గర్భగృహ, సుఖనాసుల చుట్టునున్న గోడలు చాల మందమైనవి. నవరంగమంటపములు

రెండును కలిసిపోయి అచట ఒక పడసాలవలె నేర్పడుభాగమున కూడ పడమటివైపుగోడ చాల మందమైనది. ఈ పడసాలమధ్యయందే తూర్పు పడమరలకు చిన్నగదులున్నవి. తూర్పు వైపుననున్న గదిని చీకటి గదియందురు.

ఈ నవరంగమంటపములచుట్టును సరంధ్రములగుశిలాఫలకములున్నవి. ఈ దేవాలయమును కట్టించిన ఆదిని ఈ శిలాఫలకములుగాని, నవరంగ మంటపమునకు ద్వారములు గాని లేవనియు, వీనిని మొదటి నరసింహుండే నిర్మించెననియు ఒక శాసనము వలన తెలియుచున్నది. ఈ దేవాలయము నెప్పుడు కట్టిరో తెలియదు. కాని శకవర్షము ౧౦౪౩ అనగా క్రీ. శ. ౧౧౨౧ యందు ఈ దేవాలయమునకు కొన్ని భూములను దానము చేసినట్లు శాసనము వలన తెలియుచున్నందున, ఆ సంవత్సరమునకో, లేదా అంతకు పూర్వము ఒకటి రెండు సంవత్సరములకు మునుపో ఈ దేవాలయమును కట్టించియుందు రని తెలియుచున్నది.

౧-వ పటమునందు ఈ దేవాలయ ముఖద్వార మగపడును. సుమారు ౫ అడుగుల ఎత్తుగల దిబ్బపైచుట్టును కొంతస్థలము సుమారు ౧౫ అడుగుల వెడల్పువదలి ఈ దేవాలయమును గట్టి రని ఇందుండి తెలియుచున్నది. ఈదిబ్బ ౩ వ పటమునందు గూడ గాన్పించుచున్నది. భక్తులు విశ్రమించుటకును, గోడలపైచుట్టు నున్న శిల్పమును జాగ్రత్తగ పరీక్షించుటకును ఈ దిబ్బ చాల నుపయోగకరము. ఈ దిబ్బ చక్కగ నాలుగుపక్షములుగ నుండక నక్షత్రాకృతిని నానాపక్షములు తిరిగియున్నందునను, పైనున్న దేవాలయముకూడ సరిగా నిదేయాకారముగ నున్నందునను దూరమునుండి చూచుటకే దేవాలయము ఎంతో అందముగ నుండును. ఈ అరుగు నెక్కుటకు సుమారు ౮ మెట్లు గలవు. ౧ వ పటమును జూడుడు. ఈ అరుగుపైన ముఖద్వారమునకు క్రింద మరియొక మెట్లవరుస గూడ నున్నది. ఈమెట్లవరుసల కిరుపార్శ్వములందును చిన్నచిన్న విమానములున్నవి. ద్వారమున కిరువైపులనున్న ద్వారపాలకవిగ్రహములును, ఈ చిన్నవిమానములును, పటమున కుడివైపున గాన్పించుసరంధ్రము లగు శిలాఫలకములును ఎంతో యందముగ నున్నవి. ఈ శిలాఫలకములకు క్రింద వరుసలువరుసలుగ శిల్పము గాన్పించుచున్నది. ౬ వ పటమునందీ శిల్పమునందలి కొన్ని వరుసలు విశదముగ దెలియుచున్నవి. అడుగున కాన్పించు వరుసయందలి శిల్పము చాలవరకు శిథిలమైనది. కాని ఇది సింహములవరుస యని తెలియుచున్నది. దీనికి క్రింద ఏనుగులవరుస కలదు (౧౨-వ పటము చూడుడు) సింహముల వరుసపైన అశ్వారూఢుల వరుస గానవచ్చుచున్నది. ఈ వరుసకు క్రిందను, పైనను శిల్పి ఒక తీగెలవరుస నల్లినట్లు చిత్రించినాడు. ఈ వరుసకు పైన భారత రామాయణ భాగవతాదిగ్రంథములయందలి కథా సందర్భములు చిత్రితము లైనవి. ఈ వరుసపైన మకరములును, వానిపైన హంసలును గనుపడుచున్నవి. ఒక్కొకవరుసకు మధ్య కొంత ఖాళీ యుండుటవలన ఈ శిల్పపట్టికల కొక అపూర్వమైన అంద మేర్పడినది.

౧-వ పటమును జూచిన వీనియందము నూహింపవచ్చును. ఈ పటమున ఎడమవైపు గోడలో కొంత భాగము వపుగ నొక బురుజువలె ముందునకు ఉబికియున్నట్లు గనుపడుచున్నది. ఇదియే పైనజెప్పిన చీకటి గది. ఇచ్చటను శిల్పము వరుసవరుసలుగ గాన్పించుచున్నది. కాని ఈవరుసలపైన గోడమీద నానామూర్తులును, మూర్తులపైన కొన్ని కృత్రిమ స్తంభములును, ద్వారములును అగపడుచున్నవి. మిగతభాగమున నిట్లుగాక మరిమూడువరుసల శిల్పమును, పైన సరంధ్రములగు శిలాఫలకములును, స్తంభములును గనబడుచున్నవి. ఈ మూడువరుసలలోను మొదటిదానియందు మానవాకారములును, రెండవదానియందుచిన్నచిన్న గోపురములును, మూడవదానియందు స్త్రీ పురుష గ్రామ్యశృంగారసందర్భములును చిత్రితములయినవి. ఈ పద్ధతి దేవాలయములలో దేనియందైనను ఈ వరుసలలో కడపటిదానియందు ఇట్టిశృంగార చిత్రములే కాన్పించుచున్నవి. ౪-వ పటమునం దీవరుసగాని, దీనిక్రింది రెండువరుసలుగాని కానరావు. కాని మూడవవరుసయందు ఏదోయొక యుద్ధము చిత్రితమైనది. ఇది భారత యుద్ధములో నేదోయొక భాగమై యుండును. ధనుర్ధారులు, ఖడ్గధారులు, రథములు, చక్రములు, రథమునకు కట్టినగుఱ్ఱములు, అన్నియు విశదముగ గాన్పించుచున్నవి. బలభ

పురాతిని మైనమువలె నీ విధముగ దిద్దితీర్చగల ఆనాటిశిల్పు లెంతసమర్థులో కదా!

ఈ దేవాలయమునందున్న శిల్పమునంతటిని సమగ్రముగ వర్ణించుటకు ఒక ప్రత్యేకగ్రంథమును వ్రాసినను సాధ్యముగాదు. ఇందున్నమూర్తులు ఒకటి రెండు గావు. పడమటివైపునందే సుమారు ౧౬౭ స్త్రీమూర్తులును, ౧౧౮ పురుషమూర్తులును గలవు. పురుషమూర్తులలో గణేశ, సుబ్రహ్మణ్య, ఉమామహేశ్వర, గజాసుర, జలంధర, అంధకాసుర, వేణుగోపాల, వరాహ, నారసింహ, వామన, త్రివిక్రమ, బ్రహ్మ, హరిహర, దక్షిణామూర్తి, భైరవమూర్తులు గలవు. స్త్రీమూర్తులలో కాళి, మహిషాసురమర్దని, పార్వతి, సరస్వతిమూర్తులు గలవు. ఇవిగాక ఇంద్ర, అర్జున, రావణ, మోహినీ మూర్తులు గూడ ఈ దేవాలయ కుడ్యములపైన అందందు గాన్పించుచున్నవి.

దక్షిణమువైపున నున్న మూర్తులలో మీనకట్టు అతి సులలితముగ చిత్రింపబడినది. గుర్రములజీను మొదలగువానిని చిత్రించుటయందును స్త్రీమూర్తు లొక్కొకచోట ధరించిన మేజోళ్లను, నానావిధములగు వేషభూషణాదులను చిత్రించుటయందును శిల్పి చాలనేర్పరితనమును జూపియున్నాడు. ఈశిల్పములనుచిత్రించిన వారిపేర్లు చాలచోట్ల కాన్పించుచున్నవి. మణిపాలకి, బల్లన, బోచన, కేతన, రేవోజా మొదలగునవి కొందరు శిల్పుల పేర్లు.

ఇక ఒకటి రెండు మూర్తులను పరీక్షింతము. మన పరిశోధనమును విఘ్నేశ్వరమూర్తితో ప్రారంభించవచ్చును (౫౬-వ పటమునుజూడుడు.) గణపతినిగూర్చిన ప్రస్తావన ఐతరేయ బ్రాహ్మణమునందే కలదు. అందు గణపతియే బ్రహ్మయనియు, బ్రహ్మణస్పతియనియు, బృహస్పతియనియు చెప్పబడియున్నది. సంస్కృతభాషయందలి పదముల నన్నిటిని వ్యాకరణశాస్త్రజ్ఞులు కొన్ని గణముల క్రింద విభజించియున్నారు. ఇట్టి గణములను ప్రాతిశాఖ్యలయందును యాస్కుని నిరుక్తమునందును చూడవచ్చును. గణములకు నాథుడే గణాధిపుడు, బ్రహ్మణస్పతి. క్రమముగ ఈ యభిప్రాయము వృద్ధియై గణపతియే విజ్ఞానమున కంతటికిని అధ్యక్షుడని కడ కేర్పడెను. గణపతినిగూర్చి ఇంకను ఎన్నియో పుక్కిటిపురాణములు గలవు. గణపతికి ఏనుగుతల ఏల కలదు? పొట్ట నేల పాముతో కట్టివైచుకొనినాడు? అను మొదలగు సంశయముల కాధారములగు కథలెన్నియో కలవు. ఏది ఎట్లున్నను గణపతియందు అతని బలిసినపొట్టయు, విజ్ఞానతేజముతో దేదీప్యమానమగుచున్న ముఖమును ప్రధానములు. ౬ వ పటమునందున్న మూర్తియందు ఈ రెండువిషయములును విశదముగ బోధపడుచున్నవి.

విఘ్నేశ్వరమూర్తిని ఎన్నియో విధముల చిత్రింపవచ్చును. బాలగణపతి, తరుణగణపతి, భక్తివిఘ్నేశ్వర, వీరవిఘ్నేశయని నాల్గురూపములుగ గణపతిని చిత్రింపవచ్చును. ఇందు వీరవిఘ్నేశునికి ౧౬ చేతులుండును. ఇవి గాక శక్తిగణపతి యని కొన్ని తరగతులమూర్తులు గలవు. లక్ష్మీగణపతి, ఉచ్ఛిష్టగణపతి, మహాగణపతి, ఊర్ధ్వగణపతి, పింగళగణపతి యనునవి ఇందు ముఖ్యములు. ఈ శక్తిగణపతిమూర్తులవద్ద సాధారణముగ నొకశక్తి యుండును. విఘ్నేశ్వరుడు పద్మాసనముపైని గూర్చున్నట్లును, ప్రక్కనున్న శక్తిని ఆలింగనము చేసికొనుచున్నట్లును ఈ రకము మూర్తులను చిత్రింతురు. ౫౬ వ పటమునందున్న మూర్తి సాధారణముగ గాన్పించు విఘ్నేశ్వరమూర్తియే కాని ఇట్టి విశేషమూర్తులలో నొకటి గాదు. చతుర్భుజములలో నొకటి విరిగిపోయినది. వాహనము గూడ గాన్పించుటలేదు. కాని నాగబంధము, మెడలోని హారములు, కిరీటమకుటము, ప్రభావళి యన్నియు విశదముగ గన్పడుచున్నవి.

ముక్కు, మొగము కొంచెము శిథిలమైనది గాని లేకున్నచో ౧౦ వ పటమునందున్న నృత్తమూర్తి ఈ దేవాలయమునందున్న ఉత్తమమూర్తులలో నొకటి యని చెప్పవచ్చును. ఈ మూర్తికి ౧౬ చేతులు గలవు. ఒక్కొక్క చేతియందును నడిమివేలికి తప్ప మిగత యన్నిటికిని ఉంగరములు గలవు. ఈ చేతులయందు నానా ఆయుధములును గలవు. కుడివైపు మొదటి చేతియందు అక్షమాల గలదు. రెండవచేయి విరిగిపోయినది. మూడవదానియం దేమియు లేదు. ఇది లంబహస్తము. నాల్గవదానియందు ఖడ్గముండెనేమో కాని అది ఇప్పుడు శిథిలమై పిడిమాత్రము గాన్పించుచున్నది.

ంగత రెండుచేతులందును ముసలమును, బాణమును గాన్పించుచున్నవి. ఇక కుడివైపు ఖట్వాంగము, ఖేటకము, ధనుస్సు, హలము, గరళపాత్రముగాబోలు కనిపించుచున్నవి. ఒక చేతియందుమాత్ర మేమియు లేదు. చేతులందు కంకణ, కేయూరములను, నూపురములను, హారములను, జటామకుటమును శిల్పి చాల జాగ్రత్తగ చిత్రించియున్నాడు. ఈ మూర్తి కమలము మీద నిల్చుని ఎడమకాలు ఒయ్యారముగ పైకెత్తి కుడికాలిని కొంచెము వంచి లలితముగ నాట్యము చేయుచున్నాడు. ఇరువైపులను ఇద్దరు మృదంగములను వాయించుచున్నారు. మరి ఇద్దరు తన్మయులై నాట్యము చేయుచున్నారు. కుడివైపున మరియొకడు మురళీనాదము చేయుచున్నాడు.

దక్షిణదేశమున సాధారణముగ గాన్పించు లోహమయనటరాజ మూర్తులందు ఈ సౌకుమార్యమును, ఈ లాలిత్యమును గాన్పింపదు. జడలు విరియబోసుకొని, చేత అగ్నిని బట్టుకొని, వ్యాఘ్రాజినధారియై, అపస్మారపురుషునిపై నాట్యము చేయుచున్నట్లు గాన్పించు ఈ లోహమయమూర్తులలో రౌద్ర, బీభత్స, భయానక రసము లుప్పతిల్లినట్లు గాన్పించును. కాని విశ్వమునందలి అఖండశక్తిని ప్రతిఫలింపజేయుచు, సృష్టి, స్థితి, లయములనెడి త్రిభావములను స్ఫుటముచేయు శాంతమూర్తి ఈ పటమునందు గాన్పించుచున్నాడు

ఈ ప్రశాంతభావమే ౨-వ పటమున గాన్పించు నందివాహను లగు పార్వతీ పరమేశ్వరులందును గాన్పించుచున్నది. ఇరువైపుల గూళ్లయందున మూర్తులును,నందియాకారమును ఈ ప్రధానమూర్తుల కొకయుత్తమ భూమిక (Back ground) నేర్పరచుచున్నవి. ౫-వ పటమున గాన్పించు లక్ష్మీ, విష్ణుల మూర్తులుగూడ చాల రమ్యములుగ నున్నవి. రాయి ఒకటి విరిగిపోయినది కాని విరిగతయన్ని విధములను ఈ మూర్తులు సర్వాంగ సుందరములుగ నున్నవి.

౭-వ పటమునందున్నది బ్రహ్మ లేక సుబ్రహ్మణ్యస్వామియో అని కొందరనుమానము తోచవచ్చును; కాని జాగ్రతగ పరీక్షించినచో కార్తికేయుడే యని స్పష్టమగును ఇతని వాహనమగు నెమలిని జాగ్రత్తగ చిత్రించి, పింఛమును, పింఛమునందలి కన్నులనుగూడ శిల్పి విశదము చేసినాడు.

౧౦-వ పటమునందు గాన్పించు మూర్తి ఎవరని విశదముగ తెలియుటలేదు. కుడివైపున నున్నది చామరగ్రాహిణి యనుట స్పష్టము. ఎడమవైపున నున్నది మోహిని యేమో యని తోచుచున్నది. ఈ స్త్రీ మూర్తి వస్త్రవిహీనముగా నుండుటయేకాక, నాట్యముచేయుచు తన కుడిచేతిని తలపై నిడుకొనియుండుటచే ఇది మోహినిరూపమని తలచుట కవకాశమున్నది. కాళ్లకుచుట్టుకొని ఒక సర్పమును,ఎడమచేతిమీద నొక చిలుకయునుగూడ ఈ పటమునందు గాన్పించుచున్నవి. ఈ దేవాలయమునందు మోహినీరూపమెన్నియోచోట్ల గాన్పించుచున్నది. వీనియందు సాధారణముగ చేతిలో విధముగ ముంతి, చిలుక మొదలగునవి గాన్పించుచుండుటచేత ఇదియు అట్టిమూర్తులలో నొకటి యని తోచుచున్నది. కాని మోహినికి ప్రక్కను సాధారణముగ దక్షిణామూర్తిగాన్పించుచుండును. ఇచటమాత్ర మేలశిల్పి ఒక చామరగ్రాహిణిని చిత్రించెనో తెలియుట లేదు. ఈ పటమునందు మోహిని తొడుగుకొనియున్న పాదరక్షలు గమనింపదగును.

నగ్నస్త్రీచిత్రణమున హైందవశిల్పి ఎవరికిని తీసిపోవువాడు కాడు. నగ్నచిత్రములును, గ్రామ్యశృంగారచిత్రములును హేయములని రసికు లెవ్వరును తలపరు. "సంపూర్ణ సౌందర్యపిపాసు వగుటచేత శిల్పికి తన కళయందు జూపరానిది కాని, అనుచితమయినదికాని యేదియు లేదు." ఉత్తమ సౌందర్యప్రదర్శనము నగ్నచిత్రములందు జూపగలిగినట్లు, శిల్పి మానవరూపమునకు ఎట్టి మనోహర వేష, భూషణాదులను కల్పించినను చూపజాలడు. ఈ కారణమున కళయందు నగ్నతావాద మను నొక వాదము కలదు. దీనిని ప్రబలముగ జేపట్టినవారు యవనులు. వీరయినను నగ్నపురుషచిత్రములను నిర్మించుటలో అధికసామర్థ్యమును గడించిరి. కాని నగ్న స్త్రీచిత్రణమున అట్టిసామర్థ్యమును జూపలేకపోయిరి. నగ్నపురుషచిత్రములందు స్థిరతా గాంభీర్యాదులు సువ్యక్తమగును. కాని సౌకుమార్యమును, లాలిత్యమును, లావణ్యమును నగ్న స్త్రీ చిత్రణమునందే వ్యక్తములుకాగలవు అట్టి అనమానభావములను శిల్పరూపముగ ప్రదర్శనము చేయుటలో భారతీయశిల్పి అనన్యసాధ్య

మగు చాతుర్యమును జూపెను. ఆది నుండియు భారతీయశిల్పమున ఈ విశిష్టత గాన్పించుచున్నది. కాని కాలక్రమమున ఈవిశేషగుణములు ఇంకను పరిపాకము చెంది హోయిసలుల కాలమునాటికి ఒక పరిపక్వదశకు వచ్చినవి. కావననే హైందవకళారసికులలో నగ్రగణ్యుడని చెప్పదగు ఫెర్గూసన్ దొర భారతీయశిల్పమునుగూర్చి ఈ క్రిందివిధముగ వక్కాణించియున్నాడు: "తమ సమగ్రసౌందర్యముచే ప్రపంచమునందెల్ల నత్యుత్తమములుగ జెప్పదగిన శిల్పనిర్మాణములు భారతదేశమున ననేకములు గలవు. కాని భావనావిశేషముగ, బట్టియు, చిత్రణస్వాతంత్ర్యమును బట్టియు బేలూరు, హాళేబీడు దేవాలయములు వానినిగూడ మించుచున్నవి."

ఆకటిచిచ్చు

టి. వి. యస్. శర్మ.



# విజయనగర సామ్రాజ్యస్మారకోత్సవము, హంపీ

(27-12-36)

## శ్లోకరత్నములు

### తోగర్చేటి భాస్కరశాస్త్రి

విద్యారణ్య మునీంద్రభాసురతపశ్శక్తి ప్రభావోదయా
దుద్యద్దివ్యసువర్ణవృష్టి రభితో యద్రాజధాన్యా మభూత్,
స్వస్వాతంత్ర్య సుఖైకవైభవయుతా నిత్యం యదీయాః ప్రజాః
సోఽయం సద్గుణమండితో విజయతాం శ్రీకృష్ణరాయప్రభుః.

భాస్వద్దేశీయభాషాభ్యుదయహితమతేరాంధ్ర కర్ణాటభాషా
ప్రోద్యత్పీయూషధారా గ్రహణయుత మహాలంపటశ్రోత్రయుగ్మః
సంరక్షన్ యః కవీంద్రాన్ సహృదయహృదయానష్టదిగ్దంతి తుల్యాన్
స్మర్తవ్య స్సర్వలోకై స్సజయతు సతతం కృష్ణరాయక్షితీంద్రః.

హస్తో యస్య సమస్తయాచకతతే స్సత్కల్పశాఖాయతే
వాగ్దేవ్యాః కిల యస్య దివ్యరసనా శుద్ధాంతసౌధాయతే
భూదేవ్యాః పరమోహి యస్య సుభుజ శ్శృంగార గేహాయతే
సోఽయం క్షత్రియవంశ దీపకమణి శ్శ్రీకృష్ణరాయ ప్రభుః.

కీర్తి ర్యస్య దిగంగనాకుచగిరిస్థానే దుకూలాయతే
శౌర్యం యస్య సపత్నశైలహననే దుశ్ఛేద్య వజ్రాయతే
బుద్ధి ర్యస్య వసుంధరావనవిధౌ శ్రీరామ రక్షాయతే
సోఽయం సంస్మరణైక పవిత్రచరిత శ్శ్రీకృష్ణ రాయప్రభుః.

యః ప్రతాపవిశేషతః కవివర్య పోషణకార్యతో
"మూరురాయరగండ" ఇత్యపి "చాంధ్రభోజ" ఇతీరితః
దైవభక్తిలతావృతాఖిల చిత్తవృత్తి విభూషితం
భావయే హృది తం సదా మమ కృష్ణరాయమహీపతిమ్.

జయతు జయతు విద్యారణ్య కారుణ్యధన్యః
జయతు జయతు కర్ణాటాంధ్ర భాషాభిమానః,
జయతు జయతు సర్వాశాంత విశ్రాంతకీర్తిః
జయతు జయతు మాన్యః కృష్ణరాయ క్షితీంద్రః.



వసంతము

— కొత్తపల్లి సుబ్రహ్మణ్యం —

# హళేబీడు చిత్రములు

[K. P. S.]

౧. హొయిసలేశ్వర శాంతలేశ్వర దేవాలయముల దక్షిణ (ప్రధాన)ద్వారము



౨ పైద్వారమునకు కొంత పడుమటగా వెలుపలిభాగమున ఎగువవైపుననుండు శిల్పరచన. [వృషభవాహనముమీద శివ పార్వతులు]

3. నందిమంటపము. హొయిసలేశ్వరునిసన్నిధి కెదుటనున్నది. ఇందు నగము నొక పెద్ద నందిప్రతిమ కలదు.



౪. ఉభయదేవాలయములకు తూర్పువైపున శిల్పరచనగల వెలుపలిగోడ. (మధ్యభాగమునుండి ఉత్తరముగను)



౨. దక్షిణద్వారమున కెట్టయెదురనున్న విఘ్నేశ్వరుడు. ఇంచుమించు పదడుగులఎత్తుండును.



౬. దక్షిణద్వారమునకు తూర్పువైపున వెలుపలిగోడయందలి శిల్పరచన

# ౫౦-వ భారతజాతీయ మహాసభ

## ఫెయిజ్‌పూర్ (27-12-36)

# అ ధ్య క్షో ప న్యా స ము

సహచరులారా!

ఎనిమిదిన్నరమాసముల క్రిందట యీ అధ్యక్షపీఠమునుండియే నేను మీ కుపన్యసించియుంటిని. తిరిగి మీ యాజ్ఞను శిరసావహించి నే నీ పీఠము నధిష్ఠించితిని. అనురాగపూరితులై మీరు నాయం దుంచిన విశ్వాసభావమున కెంతయు కృతజ్ఞుడను. ఇట్టి మహాసంస్థల వ్యవహార బాధ్యతలను వహింపవలసిన పురుషులుగాని, స్త్రీలు గాని వర్తమానకాలమున అపార భారమును నిర్వహింపవలసినవా రగుచున్నారు ఇట్టి యుచ్చపదవులు అలంకారప్రాయములుగా నుండుట లేమ చాలమ ది ఇట్టి పదవులను నిర్వహింపజాలక అశక్తు లగుచున్నారు. పరసీమలలో నిట్టి వ్యవహార బాధ్యత లెంతటి దుర్భరములో భారతదేశమునంగును అంతటి దుర్భరములేయనుట నిస్సంశయము. ప్రస్తుత మీ అధ్యక్షపదవీ నిర్వహణము కష్టసంభరిత మగుటయే గాక, భవిష్యత్కాల గర్భమునం దింకను మహోన్నత జటిలక్లిష్ట సమస్య లంతర్గతమైయుండగలవు. కనుక, మీ రందరును నా యం దనుగ్రహించి యొసంగిన యీ పదవిని స్వీకరించుటకు నేను కొంచెము వెనుకాడుటలో వింతయేమున్నది?

## స్వర్గస్థుల సంస్మరణము—నిర్బంధితుల పరామర్శ

మనకుగల వ్యవహారసమస్యలను చర్చించుటకు పూర్వము, గడచిన కొలదిమాసములలో తనువువీడి మనల నెడబాసిన మనమిత్రులను, సంవత్సరముల తరబడి విమోచనావకాశములు లేకుండ చెరసాలలందును, ప్రవాసములందును బంధితులైయున్న మన సహచరులను మనము స్మరింపవలసియున్నది. ముక్తారు అహమ్మదు అన్సారీగారును, అబ్బాసు తయాబ్జీగారును, వీ రిద్దరును, మన కత్యంతాప్తులైన సహచరులు. కాంగ్రెసుచరిత్రయందు వారినామములు చిర గౌరవమును పొందినవి. అనేక క్లిష్టావస్థలలో వారు ధైర్యవివేకపూరితులై మనకు హితోపదేశకులై యుండిరి.

చెరసాలలందును, నిర్బంధ ప్రవాసములందును బంధితులైయున్న మన యనుంగుమిత్రులకు శుభవాదములను పలుకుచున్నాను. వారి కష్టము లింకను కడతేరలేదు. వారి కష్టపరంపరలు పెరిగి పెంపొందుచునే యున్నవి. ఇటీవలనే ముగ్గురు ప్రవాస నిర్బంధితులు ప్రవాసకష్టములను భరింపజాలక ఆత్మహత్య గావించుకొనిరను ఘోర వార్త వినియుంటిమి. అకళంకమైన రమ్య వంగరాష్ట్రములో వారికి జీవితము దుర్భరమయ్యెను! వంగరాష్ట్రపు బిడ్డలు, లెక్కకు మిక్కిలిగా స్త్రీలును పురుషులును, అంతులేని నిర్బంధశిక్షల ననుభవించుచున్నారు. ఇట్టి వైపరీత్యమునకు సాటి మరొక దేశములో కన్పించుచున్నది. నాజీప్రభుత్వ పరిపాలితమైన జర్మనీలో బంధితులకూటములనునవి వెలసియున్నవి. అచట ఆత్మహత్యలు పరిపాటియైయున్నవి.

గడచిన కాంగ్రెసుసభ జరిగినతోడనే, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు నాచే నియోజింపబడవలసినవారైరి. అప్పుడా కార్యవర్గసభలో మన సహచరుడగు సుభాసుచంద్రబోసును కూడ నేను చేర్చియుంటిని. కాని బొంబాయి రేవులో దిగగానే ఆయన బంధితుడై గొంపోబడెను. ఆరోగ్యము చెడి వ్యాధిగ్రస్తుడైనను తదాదిగా నేటివరకును ఆయన నిర్బంధ ప్రవాసమునందే బంధితుడైయున్నాడు. అట్టి ధైర్యోత్సాహియైన సహచరుని సలహాలను గ్రహించవలెనను నాశతో నుంటిమి. కాని వారి సదుపదేశసంపద గడచిన సంవత్సరమంతయును మాకు లభింపలేదు. మన స్త్రీలును, పురుషులును ఈ రీతిని క్రుంగి కృశించుచుండగా, మన మందరమును దిక్కులేని దీనులమై కండ్లుపెట్టుకొని చూచుచున్నాము. కాని, మన అసహాయస్థితియే మన హృదయమును దహించి నిప్పులోకాలిన యుక్కుముక్కగా జేసి సోదరదేశీయుల దుర్భరావస్థలను తొలగించుటకై మన కచంచల సంకల్పబలమును కల్పించుచున్నది.

లక్నో కాంగ్రెసులో మనతోబాటు హాజరైయుండని మిత్రుడొకడు చిరకాల కారాగార ప్రవాసశిక్షితుడై నేడు తిరిగి మనవద్దకు వచ్చియున్నాడు. ఖాన్ అబ్దుల్ గఫూరుఖానుగారికి మనము సానురాగమైన స్వాగత మొసంగుచున్నాము. ఆయన మహాధీరోదారుడనియే కాదు. భారతదేశ స్వాతంత్ర్యసమరమునందు వీరుడై నిలచి పశ్చిమోత్తరపరగణాలలోని ప్రజలను సమర్థుడై నడిపించెను. ఆ సరిహద్దురాష్ట్రవాసుల నిమిత్తమై వారికి మన మనఃపూర్వక స్వాగతము లర్పించుచున్నాము. ఆయన నేడు మన సమక్షమున సన్మానితుడై

బ్రిటిషు గవర్నమెంటువారి ప్రస్తుతపు ఉత్తరువుల ప్రకారము స్వరాష్ట్రమును ప్రవేశించుటకుగాని, స్వగృహమున కేగుటకుగాని, పంజాబురాష్ట్రములో అడుగుపెట్టుటకుగాని ఆయనకు అధికారము లేదు. ఆయనరాష్ట్రములో నేటికిని కాంగ్రెసుసభలు అక్రమ సంఘములై యున్నవి. తదితర రాజకీయోద్యమము లనేకము నిషేధింపబడియున్నవి.

యువకుడైనప్పటికిని భారతదేశ స్వాతంత్ర్య సమరమునందు బిరుదుగట్టిన మేటియోధుడగు నొక ప్రముఖునకు మీ యందరి సమక్షమున స్వాగత మొసంగుచున్నాను. అతడే మన సఖుడగు యం. యన్. రాయిగారు. ఇనుములబడి-చెరసాలలో చిరకాలము గడపి మనవద్దకు మరల వచ్చినాడు. దేహస్వాస్థ్యము చెడినను, పదును బెట్టిన బుద్ధిబలముతో, ఆత్మతేజముతో మరలివచ్చినాడు. విజయము చేకూరు నందాక విధివిరామరహితమై సాగింపబడు స్వాతంత్ర్య సమరములో మనతో చేరి పోరాడుట కుత్సాహియైయున్నాడు.

## గుంటూరుమండల ప్రచండవాయువు

గడచిన కొలదిమాసములలో పంచభూతములును ప్రకోపించి ఉగ్రరూపమును దాల్చెను. వానలేమి, కరవులు, వరదలు పెక్కు రాష్ట్రములను పీడించి లక్షలకొలది ప్రజలను కష్టములపాల్జేసెనవి. ఇటీవలనే దక్షిణమున గుంటూరుజిల్లాలో గొప్ప తుపాను చెలరేగి, అపారనష్టమును కలిగించినది. వేలకొలది ప్రజలకు స్థిరచరాస్తులు ధ్వంసమైనవి. వారు ఇల్లు వాకిలిలేక అల్లాడుచున్నారు. పంచభూతములను శాసించుట మానవ సామర్థ్యాతీతమైన విషయమగుటచేత మన క్షేమమియును చేయజాలమని తలంప నేర్తుము. కాని, మనకు తెలిసిన కారణార్థములవల్ల వరదలు పలుమారు పునరావృత్తిగా సంభవించుచున్నప్పుడు మన బుద్ధికుశలతచేత వానికి పరిహారములనుగాని, ప్రతిక్రియలనుగాని చేసికొనవచ్చును. అనావృష్టి మున్నగు అరిష్టములవల్ల కలుగు బాధలను తొలగించుటకు తగిన ఆధారములను కల్పింపవచ్చును. ప్రకృతిసిద్ధమైన యిటువంటి మహోత్పాతములచే పీడితులైన ప్రజలకు తగిన సహాయ మొనర్చుటకు ఏర్పాట్లు చేయవచ్చును. కాని, మన యోగక్షేమములకు కర్తలైయున్న అధికారులకు మాత్రము ఈ వివేకము లేదు. ఎప్పటికప్పుడు గర్భదరిద్రులైయున్న మనదేశపు ప్రజల కిటువంటి యాపదలు మూడినయెడల వారు అడుగంటుటయే గాని మరల తలయెత్తుకొనజాలరు.

## రానున్న ఎన్నికలు

త్వరలోనే ఆయారాష్ట్రములందు జరుగనున్న ఎన్నికల వ్యవహారములలో మన మందరమును ప్రస్తుతము నిమగ్నులమై యున్నాము. కాంగ్రెసు తరఫున వేయిమందికి పైగా అభ్యర్థులు ప్రతిష్ఠింపబడిరి. అనేకవిధములుగా ఈ ఎన్నికల సంరంభము మనల నందరిని ఏకము చేయుచున్నది. కాని, ఇదివరకు నేను లక్నోకాంగ్రెసులో హెచ్చరించియుండినరీతిగా అఖిల ప్రపంచ విచిత్ర భీకరనాటక రంగమునంత నొకమారు పరికింపవలసినదని కోరుచున్నాను. మన యోగక్షేమములు ఆ ప్రపంచపరిణామములనే యనుసరించియుండును. భిన్నతత్వసిద్ధాంతములకును, భిన్నశక్తులకు సర్వత్ర జరుగుచున్న యీ పరస్పరసంఘట్టన ఫలితమునుబట్టియే తదితర దేశములతోబాటు మనదేశపు భావిభాగ్యోదయము కూడ నిర్ణయింపబడును. మనజాతీయ స్వాతంత్ర్యసమస్యయును, మన సాంఘికాభ్యున్నతి సమస్యయును విశ్వవ్యాప్తమైన బ్రహ్మాండపుసమస్యలోని యంతర్భాగములై యున్నవనియు, మన స్థితిగతులను మనము సరిగా బోధపరచుకొనుటకు తదితరుల స్థితిగతులను కూడ మనము గ్రహింపవలసియున్నదనియు మీకు జ్ఞాపకము చేయుచున్నాను.

## అంతర్జాతీయ వ్యవహారములు

కడచిన ఎనిమిదిమాసములలోను అంతర్జాతీయ పరిస్థితులందు చాల గొప్పమార్పు లేర్పడినవి. లోకాభ్యుదయకారకులును, తత్ప్రతీకారులును అంతకంతకు సమీపస్థులై డీకొనుచున్నారు. ఒక రొక ప్రపంచ సంగ్రామమహాగాధమువరికి మన మందరమును చేరుకొనుచున్నాము. ఈ మహాప్రళయము మనలను కబళించుటకు తన ముఖగహ్వరమును తెరచుకొనుచున్నది. ఐరోపాఖండమందు "ఫాసిజమ్" తత్వము అంతకంతకు జయపరంపరలతో విజృంభించుచున్నది. తనమాట కెదురులేకుండ ఆటసాగించుచున్నది. అంతర్జాతీయ వ్యవహారములలో బాహాటముగా నొకకుతంత్రకూట మేర్పడుచున్నది. ఈ వ్యాపారతంత్రమంతయును సమరావేశముతో, ద్వేషదౌర్జన్యములతో సాగింపబడుచుండుటవల్ల ప్రపంచ సంగ్రామమునకే దారితీయుచున్నది. సకాలములో ఈ కుతంత్రము నరికట్టబడి ద్వైన సంభవించిననే తప్ప మరొక ప్రపంచసంగ్రామ మికతప్పదు. అది అనివార్యము. ఆ వ్యవహార తంత్రమునకు అబిసీనియా ఆహుతియైనది. మనము కండ్లారచూచియే యున్నాము. నేడు స్పెయినులో ఘోర విషాదములు జరుగుట చూచుచున్నాము.

## ఫాసిజం విజృంభణ

ధనాఢ్య ప్రాబల్యముగల ప్రభుత్వాహంకార మనదగిన యీ ఫాసిజంతత్వము ఇంత వేవేగముగా ఎట్లు విజృంభింప గల్గుచున్నది? ఈ ధనాఢ్య ప్రభుత్వాహంకారము (ఫాసిజం) యూరోపుఖండము నంతను ఆవరించి ప్రపంచమంతటను ధ్వజ మెత్తెదనని బెదరించుచుండుటకు కారణ మేమి? ఈ విషయమును అవగాహన చేసికొనవలెనన్న బ్రిటిష్‌వారి విదేశాంగతంత్రమును గ్రహించవలెను. మూలకీలక మందులో కలదు. ఈ బ్రిటిష్ విదేశాంగతంత్రములోని వ్యవహారధోరణి పైకి ఎన్నివేషములు వేసినను, ఎన్నివిధములుగా కనుకొం



శ్రీ పండిత జవహరలాల్ నెహ్రూగారు,అధ్యక్షుడు, ఏబదవ అఖిలభారత జాతీయ మహాసభ—1936, ఫైయిజ్‌పూరు.

ముందంజవేసి నటించినను, జర్మనీలోని నాజీప్రభుత్వమునకే సదా సుముఖులై తోడునీడగా బ్రిటిష్‌వారు ప్రవర్తించుచున్నారు. ఇంగ్లీషు వారును, జర్మనీవారును నౌకాదళ ప్రమాణపత్రము నొకటి వ్రాసికొనినతోడనే, జర్మనీవల్ల ముప్పురాదునని భయపడుచున్న ఫ్రెంచివారిక ఇటలీయండజేరిరి. ఇదే తరుణమని ఇటలీ అబిసీనియాను బలాత్కరించి నిరాటంకముగా చేపట్టెను. అబిసీనియా యుద్ధ కాలములో జాతిసమితివారు ఇటలీపై ఆంక్షలను ప్రయోగించెద మని ప్రగల్భములు పల్కిరి. కాని, సార్థకమైన ఆంక్షల ప్రయోగమునకు బ్రిటిష్‌వారెప్పుడును అంగీకరించియుండలేదు. కిరసనాయిలు ఇటలీ వారికి సప్లయికాకుండ ఆంక్షను ప్రయోగించుటకై తోడ్పడగలనని అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము తెలియజేసినప్పుడు కూడ బ్రిటిష్‌వారందు కంగీకరింపలేదు. అబిసీనియనులపై బాంబులను ప్రయోగించుచుండగా వారు మిన్నక చూచుచుండిరి. జాతిసమితి యొక్క సమష్టిసంరక్షణసూత్రము భగ్నమగుచుండగా వారు మిన్నక చూచుచుండిరి. బ్రిటిష్‌వారెప్పుడును జాతిసమితిచే ఆధార ప్రమాణముగా గ్రహించి మాట్లాడుచుండిరి. సమష్టిసంరక్షణ సూత్రమునే సమర్థించుచు మాట్లాడుచుండిరి. ఇదంతయు నిజమే. కాని, వారి క్రియలు వారి మాటలను బూటకము చేయుచుండెను. ఫాసిస్టు ప్రభుత్వపు దండయాత్రలు నిరాఘాటముగా సాగుచుండవలెననియే బ్రిటిష్‌వారట్లు ప్రవర్తించిరి. జర్మనీలోని నాజీప్రభుత్వమువారి ధాటికూడ ఒక్కొక్క అడుగు ముందుకు వేయుచు జాతిసమితిని తృణీకరించుచునే యున్నది; యూరపులోని కట్టుదిట్టములను తల క్రిందు చేయుచునే యున్నది. అట్లయ్యును ఇంగ్లాండులోని బ్రిటిష్ "జాతీయ" ప్రభుత్వము ఈ తృణీకరణమునంతను చూచి చేయునది లేక చేతులు జోడించుకొని, "తథాస్తని" చాటుగా తాళము వేయుచునే యున్నది.

ఇట్టితరుణములో అందరి తత్వములను పరీక్షించుటకు స్పెయినులోని యుద్ధము తటస్థించినది. స్పెయినులో వెలసియున్న ప్రభుత్వము ప్రజాస్వాతంత్ర్య ప్రభుత్వము. కాని, దేశములో ఫాసిజం తత్వము గల ఫాసిస్టులు పరదేశముల కిరాయిపటాలముల సాయముతో ప్రభుత్వముపై తిరుగుబాటుచేసిరి. ఫాసిజంప్రభుత్వము గల దేశములు తిరుగుబాటుదారులకు సహాయము చేయుచున్నవి. ఇట్టి తరుణములో నానాజాతిసమితి యీ స్పెయిను దేశాంతఃకలహములో జోక్యము కలుగజేసికొనక తటస్థముగా నుండవలెనని ప్రకటించెను. ఇందలి ముఖ్యోద్దేశము కన్పించుచునే యున్నది. తిరుగుబాటు దారులను అణచివేయుటకు తగిన సామర్థ్యావకాశమును, సాయమును స్పెయినులోని ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు లేకుండజేయవలెననియే జాతిసమితి సంకల్పము.

ఈ విధముగా బ్రిటిష్ సామ్రాజ్యాధికారతత్వము కాలక్రమేణ ఫాసిస్టు ప్రభుత్వములతోనే అంతకంతకు చెలిమి చేయుచున్నది. కాని బ్రిటిష్‌వారి మాటలలో మాత్రము ప్రజాస్వామ్య ధర్మసూత్రము లుట్టిపడుచుండును. పుణ్యమూర్తులవలె ధర్మోపదేశము చేయుచుందురు. బ్రిటిష్‌వారీరీతిగా చెప్పునది యొకటియు, చేయునదింకొకటియు నగుటచేత ఐరోపాఖండమునం దంతటనే గాక, ప్రపంచమంతటను కూడ బ్రిటిష్‌వారికి పరువుమర్యాదలు క్షీణించుచున్నవి. గత పురుషాంతరములంటుకంటె నేడు బ్రిటిష్‌ప్రతిష్ఠ చాలా చెడినది.

నేడు ప్రపంచమంతటను రెండు బ్రహ్మాండమైన శక్తిస్వరూపములు పరస్పరవిజయకాంక్షకై పెనగులాడుచున్నవి. ప్రజాస్వామ్య సాంఘికసమత్వములకై కృషిచేయువారొకవైపునను, ఈ సామ్రాజ్యాహంకారముచేతను, ధనాఢ్యప్రభుత్వాధికారమును ఫాసిజంవలనను ప్రజాస్వామ్యాభిలాషను అణగగొట్టి నలగగొట్టవలెనని ప్రయత్నించువారింకొకవైపునను ప్రత్యక్ష ప్రతికక్షులుగా వెలసియున్నారు. ఈ మహాసంక్షోభమునందు బ్రిటిషుప్రజాబాహుళ్యము మాత్రము అన్యథావర్తించినను, ఇంగ్లాండుదేశపు బ్రిటిషుప్రభుత్వము ప్రజాస్వామ్య వికాస ప్రతికూలపక్షముతో చేతులు కలుపుచున్నది. నేడు స్పెయినులో జరిగెడి యుద్ధమునందు ఈ రెండుకక్షలను స్పష్టముగా కన్పించుచున్నవి. సమర మతిభీకరముగా సాగుచున్నది. ఈ సమర పర్యవసానమునుబట్టి ఇకముందు ప్రపంచసంగ్రామమే రానున్నదో, ప్రపంచశాంతి సంస్థాపనమే జరుగనున్నదో నిర్ణయము కాగలదు. ఫాసిస్టులకే సర్వాధిపత్యమేర్పడునో, లేక ఫాసిజము, సామ్రాజ్యాహంకారము దగ్ధమగునో చూడవలసియున్నది. ఈ మహాసమరమువల్ల మన మొక మంచిపాఠము నేర్చుకొనవలసియున్నాము. ప్రపంచములో పరసీమలతోబాటు ఆర్థికాభ్యుదయమును గాని, సాంఘికాభ్యుదయమును గాని పొందగోరినయెడలను, స్వదేశాంతర్గత విభేదస్పర్థలను సమన్వయింపగోరినయెడలను మన ప్రజాప్రతినిధులే స్వయంసామర్థ్యమున స్వయంకృషి చేసినంతమాత్రమున కోర్కె లీడేరజాలవు. కోర్కె లీడేరకుండుట దేశాభ్యుదయాభిలాషుల కృషిప్రయత్నలోపమువల్ల కాదు. ప్రజాప్రాతినిధ్యపద్ధతులనే అందరును అభిలషించుచున్నారు. కాని, సామాన్య జనాభీష్టములు స్థిరాధికారప్రాభవోపేతులకును ఆస్తిపరులైన సామంతులకును ముప్పు కల్పించునని తోచినప్పుడు అట్టి ప్రజాభీష్టములకు వారంగీకరింపరు, ఎదురుతిరిగి పోరాడెదరు. ఈ సామంతుల హక్కుభుక్తములకు భంగము రాకుండ వారికి సర్వాధిపత్యము నొసంగెడి ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వవిధానమునే వారు సదా కోరుచుందురు. వారికోరికల నీడేర్పజాలని ప్రజాస్వాతంత్ర్యపద్ధతి వారికి పనికిరాదు. అందువల్ల అట్టి ప్రజాస్వామ్యప్రభుత్వమును వారు నిర్మూలింప యత్నించెదరు. ఎట్టి కుతంత్రములనయిన పన్ని నిర్మూలింప యత్నించెదరు. విదేశాల సైనికబల సహాయమును కూడ తెచ్చుకొనెదరు. స్వజాతీయవికాస విముఖులగువారి నందరి నాశ్రయించెదరు. ఈ సామంతులు తాము దేశాభిమానులమనియు, జాతీయవాదుల మనియు చెప్పుకొనుచుందురు,

కాని, వీరు విదేశములనుండి కిరాయిపటాలములనైన తెప్పించి తమ సోదరదేశీయులమీదనే దండెత్తి తమవారినే తాము సంహరించి సాధించి బానిసలుగాజేయ జూచుచుందురు.

## స్పెయినులో ప్రజాస్వామ్య వినాశనము

స్పెయినులో నేడు మనకందరికిని సంబంధించిన మహాయుద్ధము జరుగుచున్నది. మనము బయట నిలువబడి పరామర్శచేయు స్నేహితులవలె స్పెయినుదేశాంతఃకలహములను పరికించుట లేదు. ఆ మహాసమరములో మన యోగక్షేమములును, ఉత్తరగతులును అంతర్లీనమై యున్నవను హృదయావేదనతో గమనించుచున్నాము. స్పెయినుదేశములోని ప్రజల పౌరుష తేజములు మంటగలియుచుండగా చూచి మనము విచారహృదయములతో ఆ విషాదమును పరికించుచున్నాము. సర్వనాశనము కానున్న సమయములో స్పెయిను ప్రజాస్వాతంత్ర్య జ్యోతి దివ్యతేజముతో ప్రజ్వలించినది. ఇక తనకు జయము నిశ్చయమని లోకమునకు చాటినది. స్త్రీలు పురుషులు, బాలురు బాలికలు ప్రాణముల గోల్పోయిరి. స్పెయిను ప్రజాస్వామ్యము సజీవమై వర్ధిల్లవలెననియు, ప్రజా స్వాతంత్ర్యమును కాపాడవలెననియు ఆబాలగోపాలము సమరమున సమసిపోయిరి. స్వాతంత్ర్య దుర్గమును భేదించు శత్రుకర్గ మెప్పుడను లోకములో యుగ యుగములనుండియు ఘోరకార్యములను చేయుచునే యున్నది. ఆ విషాద నాటకమే యిప్పుడు స్పెయినులో జరుగుచున్నది. ప్రజల ఆత్మగౌరవ స్వాతంత్ర్యముల కెన్నిమార్లు లోకములో ముప్పు రాలేదు, ఎన్నిమార్లు లాముప్పు తప్పించుకొనలేదు? ఎన్నిమార్లు స్వాతంత్ర్య దుర్గము నాశనము చేయబడలేదు, ఎన్నిమార్లు పునర్నిర్మాణము కాలేదు?

స్పెయినులో ఇడుముల బడుచున్న మన మిత్రులకు మనమేదైన సార్థకమైన సహాయము చేయగల్గిన బాగుండును. మనమెంతటి హృదయావేదనను కనుబరచినను కేవలము నోటిమాటల సానుభూతికంటె మేలైన సహాయమును చేయదగును. కష్టనష్టముల బాల్పడి పోరుచున్న స్పెయిను ప్రజలు సాయమునకై మొఱవెట్టుచున్నారు. మనలనుకూడ దేహియని యర్థించుచున్నారు. వారి మొఱల నిరాకరింపజాలము. కాని, అసహాయులమై అసమర్థులమై యున్న మనము, మనలను బంధించి పీల్చి పిప్పిజేయుచున్న సామ్రాజ్యహంకార ప్రభావమునుండి తప్పించుకొనజాలక తన్నుకొనుచున్న మనము, వారి కేరీతి చేయూత నొసంగగలమో నాకే తెలియకున్నది.

కాబట్టి యిదివరలో నేను నొక్కి వక్కాణించియున్న విధముగా ప్రపంచములోని యితరదేశ పరివర్తనములకును మనకును గల అన్యోన్యాశ్రయసంబంధమును అంగాంగీభావమును గ్రహింపగోరెదను. ఒక్క ప్రాంతములో జరిగెడి వ్యవహార వర్తనమునుబట్టి తదితర ప్రాంతములలోకూడ పరస్పర పరివర్తనములు కలుగుచుండును. ప్రపంచ మంతయును ప్రత్యేక ప్రత్యేక భిన్నఖండములుగా భిన్నరూపములుగా వెలసియున్నను, ఈ భిన్నత్వమునందే ఏకత్వము కన్పించుచున్నది. ఈ విశ్వవ్యాప్త పరమార్థమునే గ్రహింపవలెనని నేను కోరుచున్నాను. దూర ప్రాచ్యదేశములలోను, ఐరోపాఖండములోను ఒక్కటే విధమైన మహాసంక్షోభము జరుగుచున్నది. ఎక్కడ చూచిన నొక్కటే కల్లోలము. భారతదేశములో బ్రిటిష్ సామ్రాజ్యాధికార దాస్యమునుండి విముక్తినందుటకు భారతీయులు పోరాడుచున్నారు. పాలస్తీనాదేశములో అరబ్బులు, ఈ బ్రిటిష్ సామ్రాజ్యహంకార ప్రభావమునుండి తప్పించుకొనవలెననియే తగవులాడుచున్నారు. ప్రపంచములో జరిగెడి మహాధర్మసంరంభమునందు ఈ రెండు కల్లోలములును అంతర్భాగములే. ప్రజాస్వాతంత్ర్యమునకును ఫాసిజం తత్త్వమునకును; జాతీయ స్వాతంత్ర్యమునకును సామ్రాజ్యహంకారమునకును; సామ్యవాదమునకును, సాహుకార్ల ప్రాబల్యమునకును తత్త్వభేదము, పరస్పరసిద్ధాంతరాద్ధాంతము నిత్యము కలుగుచునే యున్నది. ఈ తత్త్వభేదమే వ్యవహారప్రపంచములో ప్రత్యక్షమైనప్పుడు ప్రజల వోట్లతోను ఇష్టానిష్టములతోను పనిలేదు. వాని స్థానే బాంబులు, బలమైన బందూకులు, వాడి మొనగల సన్నీలు తయారగును. ప్రపంచపరిస్థితులు తారుమారగుచున్నప్పుడు ఆర్థిక రాజకీయ రంగములలో మన కొక నూతన జ్ఞానోదయము కలుగవలెను. ఇట్టి నూత్నపరిజ్ఞానము త్వరలో కలుగనియెడల సంక్షోభము, సంఘర్షణ సంభవించుట తప్పదు. కాలక్రమేణ ప్రజల చిత్తప్రవృత్తి పూర్తిగా మారిపోవును. నూత్న ప్రజాతత్త్వము కార్యరూపేణ పరిణమించును. దినములు గడచినకొలది క్రొత్త కలతలు, కొట్లాటలు పుట్టుచుండును. అమలులో నున్న స్థితిగతుల స్తిమితము చెడిపోయినప్పుడు, క్రొత్త సంప్రదాయముల వల్లనైనను స్తిమిత మేర్పడవలెను. అట్టి సమాశ్రయమాత్ర మొకటి ఏర్పడనియెడల అంతయును భ్రష్టమగును. పరస్పర ప్రతీకారములు జరుగును. మహావిలయమే వెలయును.

## నవ్యసంకల్పములు - సంశయాత్ములు

ఇట్టి విలయమే నేడు ప్రపంచమును కబళింపజూచుచున్నది. యుద్ధము జరుగుట సిద్ధమని సూచించు బ్రహ్మాండ ప్రయత్నములు ప్రత్యక్షముగా జరుగుచున్నవి. ఫాసిజం తత్త్వము గల దేశాల ప్రభుత్వములు తప్ప తదితరు లందరును రాగల సమరమును గూర్చి వెరగందుచున్నారు. ఎట్లయిన నేమి, అన్నిదేశాలవారును వీరావేశముతో యుద్ధమున కాయత్తమగుచునే యున్నారు. ఇట్టి సన్నాహములను సాగించుచు, అటో ఇటో ఏదైన నొక కక్షలో జేరుచున్నారు. అటు యిటు గాక అర్థాంతరముగా నున్న వర్గములవారు ఊరుపేరు లేకుండపోవుచున్నారు. లేదా, ప్రేతభూతములవలె, సూక్ష్మరూపులై ఉపాధిలేక ఊగులాడుచు, అనిశ్చయులై, నిత్యసంశయాత్ములై, మాయలో బడితిమని తెలివిదెచ్చుకొని, ఆత్మావేదన పొందుచు,

ధారశూన్యులై అల్లాడుచుండగలరు. మితవాదశాఖవారి గతి సర్వత్ర నిట్లే యున్నది. భారతదేశములో మాత్రము మితవాదులమని చెప్పుకొనువారును, మితవాదతత్త్వము ననుసరించువారును తాము నమ్మినదేశభాగ్యమను అజ్ఞానాంధకారములోనుండి బయటకు రావలెను. వారి సంగతి ఎట్లున్నను, మన మిక—

"నవ్య సంకల్పములతోడ నడువవలయు;
ప్రాత యభిమాన సౌధనిర్మాణభూమి
మానవశరణ్యమను భ్రాంతి మాను డింక!
రెండునై పుణ్యజ్వాలలు మండుచుండ
ప్రేత భూతగణంబెదో సెలయనేర్చు."

ఈ నవ్య సంకల్పము లెవ్వి?:— యుద్ధ సంక్షోభములకు ప్రపంచమునంతను రంగవేట్లు సెత్తినట్లుగా పురిగొల్పి వేలకొలది జనులను కూల్చుచుండెడి అహంకారోన్మాదమును రూపుమాపవలెను. దుర్భర దారిద్ర్యమును నిర్వ్యాపారత్వమును తొలగించి ప్రజలకు శక్తిసామర్థ్యముల నొసంగి, మానవసౌఖ్యాభ్యుదయములకు వారి శక్తిసామర్థ్యములను సద్వినియోగ మొనర్పవలెను. జననాశనార్థమై జరుగుచున్న కృషికి స్వస్తి చెప్పి లోక కల్యాణమునకై సర్వము నిర్మించవలెను. గడచిన ఎనిమిది మాసములలోను నే నీవిశాల భారతదేశమంతట పర్యటన మొనర్చితిని. సామాన్యజనుల హృదయ మెట్లు పరితపించుచున్నదో గ్రహించితిని. వారు దుర్భర దురవస్థల దురపిల్లుచు దిక్కేది యని కండ్లుపైకెత్తి చూచుచున్నారు. ఇదియే మనదేశ దురవస్థ - ఇదియే మనలను బాధించుచున్న మహాసమస్య. తదితరవిషయము లన్నియును దీనికనుబంధములైన చిల్లరవిషయములే. ఈ మహాసమస్యను పరిష్కరింప గల్గుటకు సామ్రాజ్యాధిపతుల యధికార ప్రభావమును నిర్మూలించవలెను. వారీదేశపు ప్రజలను, ఐశ్వర్యమును పీల్చి పిప్పిజేయకుండ కట్టుదిట్టము చేయవలెను. అయితే, మనలను పీడించుచున్న యీ సామ్రాజ్యాధికారతత్త్వ మెటువంటిది? ఒకదేశమువా రింకొకదేశమును బలాత్కరించి వశపరచుకొనుటవంటిది కాదు. ఈ సామ్రాజ్యాధికారము ఈ దేశమునందే నాటుకొని వేరుపారియున్నది. ఈ నవయుగ సామ్రాజ్యాధికారము ధనాఢ్యప్రాబల్యోపేతమై యున్నది. శ్రీమంతులు సామంతులు లేని సామ్రాజ్యాహంకారము లేనేలేదు. ధనస్వాముల తృష్ణయే సామ్రాజ్యతృష్ణ.

కనుక, సామ్రాజ్యాధికారతత్త్వమును, సామ్యవాదమును తదంతరార్థములతో సహా మనము సరిగా గ్రహింపనియెడల మనదేశ సమస్యలు మనకు బోధపడజాలవు. దేశమును పీడించు ఈ వ్యాధి జీర్ణించియున్నది. అందువల్ల దీనికి దారుణమైన తీవ్ర చికిత్స జరుగవలెను. సాంఘిక సమత్వమనెడి సమైశ్వర్య వాదమే (సామ్యవాదమే) జాడ్యాపహారామృతము. సాంఘిక సమత్వమునకై యీ దేశములో మన మింకను పోరాటము సాగించలేదు. సామ్యవాదసూత్రముల ననుసరించి మనలో వివాదములు ప్రారంభమగుట కింకను కొంత కృషిజరుగవలెను. అట్లయ్యును, అప్పుడప్పుడు ఏవైన కొన్ని సమస్యలను పరిష్కరించుటలో సామ్యవాద సూత్రముల ననుసరించియే ధర్మనిర్ణయము చేయగల్గుచున్నాము. స్వరాజ్యముయొక్క లక్ష్యలక్షణములను పరమార్థమును కూడ ఈ సామ్యవాద సూత్రముల ననుసరించియే గ్రహింపగల్గుచున్నాము.

## కాంగ్రెసుతత్త్వము: ప్రపంచశాంతిమహాసభలో ప్రసక్తి

కాంగ్రెసుమహాసభ ప్రజాపరిపాలనమునే ప్రస్తుతము పరమావధిగా స్వీకరించియున్నది. ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వవిధానము కొరకే కాంగ్రెసుసభ ఆందోళనచేయుచున్నది. సాంఘిక సమత్వమునకై ఇంకను పోరాడుటలేదు. కాంగ్రెసుసభ సామ్రాజ్యాధికారమును ధిక్కరించుచు దానికి ప్రతిపక్షిగా నున్నది. మనదేశీయుల ఆర్థిక సౌభాగ్యమునకును, రాజకీయ స్వాతంత్ర్యముకొరకును కాంగ్రెసుసభ కష్టించుచున్నది. కనుక, ఈ సంకల్పాశయముల సంసిద్ధికై మనము చేయుకృషి తప్పక సామ్యవాదమునకే దారి తీయును. కారణార్థములన్నియును అటువైపునకే హేతుప్రమాణములతో సూచించుచున్నవి. భారతదేశారిష్టముల కది యొక్కటే పరమహంసక్రియగా కన్పించుచున్నది. కాని, ప్రస్తుతము మన మందరమును రాజకీయ స్వాతంత్ర్యముకొరకే ముఖ్యముగా తపించుచున్నాము. ప్రజాప్రాతినిధ్యముగల స్వపరిపాలనకొరకై ఆవేశన చెందుచున్నాము. ఇట్టి సంకల్పములు మనకు కలిగినవి గనుక, అఖిలప్రపంచవ్యాప్తమైన అభ్యుదయ ధర్మసూత్రములనే కాంగ్రెసుసభ కూడ చేప్పవలెను. ప్రపంచశాంతి ప్రతిష్ఠాపనకే చేయూత నొసంగవలెను. ఇటీవల ఐరోపాఖండమందు బ్రుస్సెల్సు నగరములో గత సెప్టెంబరుమాసమందు అఖిలప్రపంచ శాంతి మహాసభ యొకటి జరుపబడెను. ప్రజాబాహుళ్య ప్రతినిధివర్గము లనేక మచట సమావేశమయ్యెను. శాంతిసంస్థాపనకు పట్టుదలతో పూనుకొనిరి. ఈ పూనికవల్ల యుద్ధములు రాకుండ తప్పిపోవునో లేదో మనము చెప్పజాలము. కాని, శాంతిప్రియుల కందరికిని ఇది శ్లాఘనీయమైన ప్రయత్నము. కనుక, ఈ సత్సంకల్ప మీడేరవలయునని యే కోరదగును. మన కాంగ్రెసుసభ తరఫున శ్రీ వి. కే. కృష్ణమీనను గారు ఈ బ్రస్సెల్సు సభలో హాజరైరి. వారు పంపిన నివేదిక మీ యెదుట సమర్పింపబడును. సుస్థిరశాంతిప్రతిష్ఠాపనకయి నెలకొల్పబడిన యీ సంస్థలో మన కాంగ్రెసు కూడ ప్రసక్తివహించి ఆ మహాప్రయత్నమునకు శక్తివంచన లేకుండ తోడ్పడగలదనియే నా నమ్మకము. ఈ రీతిగా మనము తోడ్పడుటకు ముందు మన సందర్భావకాశములను మనము పూర్తిగా గ్రహించవలెను. సామ్రాజ్యాహంకారముతో ప్రసక్తి లేకుండ మనముగాని, యితర ప్రపంచముగాని శాంతిసంస్థాపన విషయమై యోచించుట సంభవము, యుద్ధ

కారణ బీజములను పూర్తిగా తొలగించుటకై, సామ్రాజ్యతృష్ణను పోగొట్టవలెను. ఇదివరలో వ్రాసికొనబడిన సంధిపత్రములు పవిత్ర ప్రమాణపత్రములే యనుగాక! కాని ఆ పత్రములు వ్రాసికొనబడినప్పుడు భారతీయుల కెట్టి ప్రసక్తి ప్రమేయమును లేదు. కనుక, ప్రమాణ పత్రములను ఉత్తరోత్తర మనము ఆమోదించిననే తప్ప, ప్రస్తుతము వానికి బద్ధులమై వానిని శిరసావహింపవలసిన యగత్యము మనకులేదు. యుద్ధప్రయత్నములను మనము ధిక్కరింపని యెడల శాంతి ప్రతిష్ఠాపనకై ప్రయత్నింపజాలము. సామ్రాజ్యాధిపతులు సాగించెడి యుద్ధములలో మనము పాల్గొనకూడదని కాంగ్రెసు సభ స్పష్టముగా తీర్మానించియున్నది. కనుక అట్టి యుద్ధములలో భారతదేశమునుండి అంగబలమును గాని, అర్థబలమునుగాని సామ్రాజ్యాధీశులు సంగ్రహించిన సహింపజాలము. అట్టి ప్రయత్నముల కడ్డుతగిలి ప్రతిఘటింపవలయును.

## జాతిసమితి కపటనాటకము

జాతిసమితియొక్క ప్రతిష్ఠాగౌరవములు నష్టమయినవి. జాతిసమితి శాంతిసంరక్షణార్థమైన ప్రతిష్ఠాపనయని నిజముగా నెవడును నమ్ముటలేదు. జాతిసమితినిగూర్చి భారతీయుల కెవరికిని ఆశలు, ఉత్సాహములు లేవు. జాతిసమితిలోని భారతదేశప్రతినిధి నామమాత్రావశిష్టుడు. ఆ ప్రాతినిధ్యమొక కపటనాటకము. ఆ ప్రతినిధిని బ్రిటిష్ ప్రభుత్వమువారే నిర్ణయించి పంపుచున్నారు. మన మిక నిజమైన ప్రజాప్రాతినిధ్యము గల జాతిసమితిని ప్రతిష్ఠించవలెను. అది "నానాప్రజాసమితి" గా సార్థకమై యుండవలెను. ప్రస్తుతము అమలులో నున్న జాతిసమితి నిర్వీర్యమై నిరుపయోగముగా నున్నప్పటికిని శాంతిసంరక్షణార్థమై అది వినియోగపడునెడల దానిని కూడ మనము వాంఛించెదము.

## రానున్న ఎన్నికలు

పై జెప్పిన అంతర్జాతీయవ్యవహారధోరణిని గ్రహించి, గమనించి, తదనుగుణముగా జాతీయసమస్యలను పరిశీలించెదము గాక! 1935 సం॥ ఇండియా గవర్నమెంటు ఆక్టు ననుసరించి మన కిప్పుడేర్పడిన నూత్నరాజ్యాంగవిధానము కంటకమై కండ్లయెదుట కన్పించుచున్నది. మనలను తేరిపారజూచుచున్నది. మనము దీనిని నిరాకరించి తృణీకరించినను, ఈ కట్టుత్రాడొకటి మన కంటగట్టబడినది. ఈ నూత్నవిధానబంధనము నూతిగాగొని మనము రానున్న ఎన్నికలలో గెల్పొందజూచుచున్నాము.

ఈ ఎన్నికలలోనికి మనము ప్రవేశించుటకు కారణమేమో, ఈ నూత్నవిధానము నేరీతిగా చేబట్టదలంచితిమో అఖిలభారత కాంగ్రెసుకమిటీవారిచే ప్రకటింపబడిన ఎన్నికల ప్రతిజ్ఞాపత్రమునందు పూర్తిగా వివరింపబడెను. ఈ ప్రతిజ్ఞాపత్రమును మీరు ఆమోదింపవలయు నని కోరుచున్నాను. బ్రిటిష్ సామ్రాజ్యాధికారముయొక్క పరిపాలనాచక్రమునకు తోడ్పడుటకై మన మీ శాసనసభలో ప్రవేశించుట లేదు. ఈ క్రొత్తరాజ్యాంగచట్టమును ధిక్కరించుటకును, దానిని తుదముట్టించుటకును, భారతీయులను పేల్చి పిప్పిచేసి బంధించునట్టి యీ బ్రిటిష్ సామ్రాజ్యాధికారమును సకల విధముల ధిక్కరించి ఎదిరించుటకొరకే యీశాసనసభలలో ప్రవేశించుచున్నాము. ఇదియే కాంగ్రెసుయొక్క ముఖ్యసంకల్పము. ఈ విషయమును కాంగ్రెసువాదు లెవ్వరును మరువరాదు. కాంగ్రెసు అభ్యర్థియైనవా డెవ్వడును మరువరాదు. ఈ సంకల్పధోరణికి అనుగుణముగానే మన వ్యవహారచర్య లన్నియు నుండవలెను. ఈ శాసనమునకు బద్ధులమై ప్రవర్తింపదలంచిగాని, రిక్తవ్యర్థ నూత్నసంస్కరణాభిమానముతోగాని మనము శాసన సభలలో ప్రవేశించుట లేదు.

ఈ ఎన్నికలలో ఏవిధముగానైన కాంగ్రెసు పక్షమున అధిక సంఖ్యాకులు లభింపగల్గుటకై ఇతర పక్షములవారితో కొంత సామ్యపద్ధతి నవలంబించుట యుక్తమని కొందరు తలంచుచున్నారు. ఇది చాల ప్రమాదకరమైన ధోరణి, అట్టిది జరుగకుండ నిరోధింపవలెను. కాంగ్రెసు ధ్వజమును మారుమూల కుగ్రామములలో కూడ ప్రతిష్ఠించుటకును, కాంగ్రెసు సందేశమును లక్షోపలక్షలైన వోటర్లకందరకుపదేశించుటకును, వోటర్లుకానివారికిగూడ బోధించుటకును, జనసామాన్య ప్రబోధ సంచలనమునే మరింత విజృంభింప జేయుటకును ఈ తరుణమును వినియోగించి ఎన్నికల ప్రచారమును సాగింపవలెను. ప్రజాబాహుళ్యము మనయందు నుండనియెడల, శాసనసభలలో మన కెంత యంగబలమున్నను ప్రయోజనము లేదు. శాసనసభలో మన బలము హెచ్చుటకై ప్రజాభ్యుదయవిముఖులైన భిన్నకక్షులవారితో గాని, ప్రముఖులతోగాని మన మెట్టి నేస్తములు కట్టినను, కాంగ్రెసు సంకల్పమును నాశనముచేసినవార మగుదుము.

## జాతీయ సమావేశమును జరిపి

## నూత్నరాజ్యాంగమును నిర్ణయింపవలెను

క్రొత్త రాజ్యాంగచట్టమును ధిక్కరించుటకై కృషిచేయుచు, సవ్యమైన రాజ్యాంగవిధానము నొకటి ప్రజాభీష్టానుసారము నిర్ణయించుటకై యీ దేశములో యుక్తవయస్సు వచ్చిన ప్రతివాడు వోటునిచ్చి ఎన్నుకొనిన ప్రతినిధులతో కూడిన అఖిలభారతజాతీయ ప్రతినిధిసమావేశమును జరుపవలెనని మనము పట్టుబట్టి గట్టి యాందోళన చేయవలెను. అదియే నేడు కాంగ్రెసుసభ యవలంబించుచున్న వ్యవహారధోరణికి, పట్టుగొమ్మ. మన ఎన్నికల యుద్యమము తత్సంకల్ప ప్రయోజనార్థమైయున్నది. ఆ రీతిగా జరుపబడు జాతీయసమావేశము బ్రిటిష్ సామ్రాజ్యాధికారముతో రాజీపడుటకొరకు కాదు. బ్రిటిష్ గవర్నమెంటువారి ప్రేరణమున జరిగెడి సమావేశమును కాదు. ఈ జాతీయ సమావేశము నిజమైన జాతీయసమావేశము కావలెనన్న ప్రజా

సంకల్పము, ప్రజాభీష్టము తదనుకూలముగా నుండవలెను. ఈ జాతీయ సమావేశము స్వతంత్ర భారత దేశముయొక్క స్వపరిపాలనా విధానమును తయారుచేయగల వ్యవహారాధికారమును ప్రజామోదపురస్సరముగా పొందవలెను. కనుక, ఈ ఎన్నికల ప్రచారమువల్లను, అనంతరము తదితర కృషిప్రయత్నములవల్లను, జనబాహుళ్యముయొక్క యండ మనకుండునట్లుగా కట్టుదిట్టము చేయవలెను.

ఈ జాతీయసమావేశమును జరుపవలసినదిగా మనము నొక్కి యడుగుటకును, క్రొత్తరాజ్యాంగచట్టములో ఢిల్లీ ప్రభుత్వమునకు సంబంధించిన ఫెడరేషనుపద్ధతి అమలులోనికి రాకుండ సాధ్యమైన సకల సాధనోపాయముల నవలంబించుటకును ఈ ఎన్నికలైనతోడనే వివిధరాష్ట్రీయ శాసనసభ్యులగు కాంగ్రెసువారు లందరును ఒకమారు సమావేశము కావలెనని కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు సలహా యిచ్చుచున్నారు. ఈ సమావేశమునకు పై జెప్పిన శాసనసభ్యులేగాక కాంగ్రెసు కార్యవర్గమువారు తదితరులనుకూడ కొందరిని ఆహ్వానింపగలరు. ఇట్టి సమావేశములో అఖిలభారత కాంగ్రెసుకమిటీ సభ్యులు కూడ ఉండి శాసనసభలలోను, వెలుపలను మన పోరాటము నేరీతిగా ఏకముఖమొనర్చి నడిపించవలెనో సలహాల నొసంగదగును. ఈ రీతిగా సమాలోచన చేయుటవల్ల వివిధ రాష్ట్రములలోని కాంగ్రెసుపక్షు శాసనసభ్యులు స్వరాష్ట్రవ్యవహారసమస్యానిమగ్నులై ఆ యా ప్రాంతీయ భిన్నకక్షుల దగుల్కొని కాలక్షేపము చేయకుందురు. ఇట్టి సమావేశమువల్ల వారికి సవ్యమైన పర్యాలోకన మేర్పడును. అఖిలభారతదళముగా వారు సుశిక్షితులు కాగలరు. ఈసమావేశము జనబాహుళ్యమునకు సంబంధించిన యుద్యమములను సాగించుట కెక్కువగా సక్కరకువచ్చును. ఈ సమావేశపద్ధతి బహుఫలప్రదమైనది. కనుక కాంగ్రెసుసభవా రిందు కంగీకరించెదరని నా నమ్మకము.

## ఫెడరేషను అత్యంతదుస్సహము

జాతీయసమావేశమును జరిపించి నూత్నరాజ్యాంగమును ప్రజాభీష్టానుసారముగా నిర్ణయింపవలెనని కోరుట ముఖ్యవిషయము. దాని తర్వాత ఫెడరేషను అమలులోనికి రాకుండ నిరోధించుటకూడ పెద్ద విషయమైయున్నది. ఈ నూత్నరాజ్యాంగ చట్టము సమూలముగా గర్హ్యమై యున్నది. అందులో ముఖ్యముగా ఈ ఫెడరేషను ప్రభుత్వభాగమే అత్యంత దుస్సహము. కనుక దీనిని ఛేదించుటకై మన సర్వశక్తులను వినియోగించి యీ రాజ్యాంగచట్టమును పూర్తిగా తుదముట్టించవలెను. బ్రిటిషు సామ్రాజ్యాధికారమునకు లోబడి యుండుటయేగాక స్వదేశసంస్థానాధీశులకు గూడ మనము దోసిలొగ్గి ప్రవర్తింపవలెననుట దుస్సహము. ఏది ఎట్లుమూడినను అదిమాత్రము దుస్సహము. భారతదేశములోని బ్రిటిషుపరిపాలన యవసానదశలోనికి వచ్చుచున్న దనుచున్నారు. ఇట్టితరుణములో ఈ దేశములోని ప్రజాభ్యుదయ ప్రతికూలపక్షములవారినే బ్రిటిషు సమ్రాట్టులు తమను చేయూతగా చేరదీసికొని, తమకు హస్తగతమైన యధికారమును కొంత సంస్థానముల నేలు సామంతులకు ఒప్పజెప్పుట విమర్శింపదగిన విచిత్రవిషయమై యున్నది.

ఈ ఫెడరేషను విధాన నిర్ణయము ముఖ్యముగా యోచింపదగినదై యున్నది. భారతదేశమునకు స్వరాజ్యము లభించినప్పటికిని ఈ స్వరాజ్యవిధానము భిన్నరాష్ట్రీయప్రభుత్వముల సమాఖ్యగానే యుండవలెను. ఎట్లయినను దేశమున కంతకును వర్తించెడి ఏకైక కేంద్ర ప్రభుత్వపీఠ ముండవలెను. కాని, ఇప్పు మన కంటగట్టబడుచున్న సమాఖ్య శృంఖలాబద్ధమైనది. దేశములోని జాతీయోద్యమవిముఖులై సాంఘిక వ్యవహారములందును రాజకీయములందును దేశమును వెనుకకీడ్చెడి తత్త్వముగలవారికే ఫెడరేషనులో అధికార ప్రాబల్య మొసగబడుచున్నది. సక్రమమైన బ్రిటిష్ పరిపాలన ఏర్పడని ప్రారంభదశయందు పందొమ్మిదవ శతాబ్దములో ప్రస్తుతపు ఈ స్వదేశసంస్థానములన్నింటికిని నామరూపము లేర్పడెను. ఆనిరంకుశ స్వదేశరాజులతో కొన్నియొడంబడికలు వ్రాసికొనబడెను. అవి అనుల్లంఘనీయములైన పవిత్ర ప్రమాణపత్రము లనియు, చేతితో ముట్టిన మైలపడు ననియు చెప్పుచున్నారు. ఆ సంధిపత్రములన్నియు అప్పుడు వ్రాసికొనబడినవే.

## సంస్థానాధిపతుల నిరంకుశాధికారము

అప్పట్లో యూరోపుఖండ మెట్లుండెనో, భారతదేశ మెట్లుండెనో పరిపోల్చిచూచుట చాలమంచిది. అప్పుడు యూరోపునందు చిన్నచిన్న రాజ్యములు, సామంత రాజ్యములు అనేకము వెలసియుండెను. ఆ రాజులు నిరంకుశులైయుండిరి. రాజులకు పలువిధములైన ప్రత్యేకాధికారము లుండెడివి. పృథ్వీపతులు విష్ణ్వంశులై యుండిరి. గతించిన నూరు సంవత్సరములలోను యూరోపుఖండములో విపరీతమైన మార్పులు కలిగెను. వెనుకటి రాజ్యస్వరూపములు గుర్తించుటకైనను వీలులేకుండ తారుమారైనవి. అనేక ప్రజావిప్లవములు, పరివర్తనములు జరిగినవి. రాచరికములు మటుమాయమైనవి. కొలదిదేశాల రాజులు మాత్రము మిగిలియున్నారు. బానిసవ్యాపారము పూర్తిగా తొలగిపోయినది. ఆధునిక యంత్రాగార పరిశ్రమలు పెంపొంది వ్యాప్తిజెందినవి. అధిక సంఖ్యాకులైన ప్రజలకు వోటింగు హక్కులు విస్తరించి, ప్రజాస్వామ్య ప్రతిష్ఠాపనలు వెలసినవి. కాని, కొన్నిదేశములలో ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వములకు సర్వాధికార నియంతలగు డిక్టేటర్లు ఫాసిజం తత్త్వావలంబులై వెలసిరి. అన్నిటికన్న వెనుకబడియున్న రష్యా రాజ్యము ఒక్కపెట్టున సాంఘిక సమత్వ సముపేతమైన సోవియటు ప్రభుత్వమును ప్రతిష్ఠించినది. సర్వతోముఖమైన దేశాభ్యుదయ దాయకమగు ఆర్థిక సంప్రదాయములను ప్రవర్తింపజేసినది. ప్రపంచము మారిపోవుచునే యున్నది. మరొక నూత్న సంస్కారమునకు సంసిద్ధమగుచునే యున్నది. కాని,


Art & Designers



౩. దక్షిణద్వారమునకు ఇంచుక పడమటనున్న శిల్పఖండము (బ్రహ్మ ప్రతిమ)



౨. హొయిసలేశ్వరాలయపు తూర్పుద్వారమునకు దక్షిణపుప్రక్కనున్న ద్వారపాలక విగ్రహము



౧. హొయిసలేశ్వరుని గర్భగృహమునకు పడమటి గోడమీద (వెలుపల)నున్న సుందర శిల్పఖండము

౧౦. శాంతలేశ్వరుని గర్భగృహమునకు వెనుకగోడ మీద (వెలుపల) నున్న తాండవమూర్తి



౧౧. పైశిల్పమునకు చేరువనేకల సుందర శిల్పరచన. ఎడమవైపున దిగంబర సుందర స్త్రీవిగ్రహము నర్తకి నాగములనుదాల్చి నర్తనముచేయుచున్నది. అవయవ నిర్మాణసౌష్ఠవముతీర్చిదిద్దినట్లున్నది. కుడివైపునచామరగ్రాహిణి.

మన స్వదేశసంస్థానములు మాత్ర మట్లుకాదు. నిరంతర నూత్న వికాస సంచలితమైన యీ విశ్వమందు మన స్వదేశ సంస్థానములు మాత్రము 'స్థిరోభవ' యని స్తబ్ధముగా నున్నవి. కడచిన పదొమ్మిదవ శతాబ్దము నాటి వ్యవహారదృష్టితోనే నేటికిని వ్యవహరించుచున్నవి. తొలినాటి ప్రాతసంధిపత్రములే వీరికి స్థిరప్రమాణములుగా నున్నవి. ఆ సంధిపత్రములు సంస్థాన ప్రజలుగాని, సంస్థాన ప్రజాప్రతినిధులుగాని వ్రాసియిచ్చినవి కావు. వారి నిరంకుశప్రభువులు యథేష్టముగా వ్రాసియిచ్చిన యొడంబడికలై యున్నవి.

ఇట్టి వ్యవహార పరిస్థితులను ఏ దేశవాసులును, సహింపజాలరు. నూరు సంవత్సరముల క్రిందట వ్రాసికొనబడిన ఆ పురాతన పత్రములను శాశ్వత శిలాక్షరములుగా నెవరును సర్వదా శిరసావహింప నొల్లరు. సంస్థానాధీశులు కూడ భారతజాతి కోరుచున్నట్టి స్వతంత్ర పరిపాలనావిధానమున కనుగుణముగా ననువర్తింపవలెను. మిగిలిన భారతదేశ మంతటను ఎట్టి పౌరస్వాత్వములును, ప్రజాస్వామ్యములును వర్తించునో, అట్టి పౌరస్వత్వములను, ప్రజస్వామ్యములను సంస్థాన ప్రజలకుకూడ విధిగా వర్తింపజేయవలయు నని కాంగ్రెసుమహాసభ నిర్వచించియున్నది.

చాలకాలమువరకు సంస్థానాధీశులకును, బ్రిటిష్ సమ్రాట్టులకును గల యొడంబడికలగూర్చిన ప్రస్తావన జరిగియుండలేదు. ఈ బ్రిటిష్ సామ్రాజ్యవ్యవహార చక్రములో తమకు గల హద్దుమేర లెట్టివో స్వదేశరాజులకు తెలియును. బ్రిటిష్ ప్రభుత్వము వీరిపై చలాయించెడి అధికార ప్రాబల్యము ఎప్పటికప్పుడు విశదమగుచునే యుండెను. ఇటీవల భారతదేశములో విజృంభించిన జాతీయోద్యమ వికాసమువల్ల ఈ సంస్థానాధీశుల కొక క్రొత్త పెత్తనము కృత్రిమ కల్పనగా ఏర్పడవలసివచ్చినది. ఎందువల్ల ననగా, దేశములోని జాతీయోద్యమమును అణచివేయుటకై యీ సంస్థానాధిపతుల సహాయమును బ్రిటిష్ ప్రభుత్వమువారు తరచు పొందవలసినవా రైరి. బ్రిటిష్‌వారికి గల్గిన కార్యావసరమును, క్రొత్తధోరణిని స్వదేశరాజులును, వారిమంత్రులును కుశాగ్రబుద్ధితో గ్రహించి, తమ లాభము నీ తరుణములో చూచుకొనిరి బ్రిటిష్ ప్రభుత్వమునకును, భారతదేశ ప్రజలకును వారు తరచు తగులాటములు కల్పించి యిరుదెసలనుండియు తమ కనుకూలించు అధికార సౌకర్యములనే సంపాదించుకొనిరి. ఈ విధముగా చాలవరకు వారియాట నిరాఘాటముగా సాగెను. క్రొత్త ఫెడరేషను విధానములో వారికి అపరిమితమైన అధికార ప్రాబల్యము లభించినది. వారు యథాతథముగా స్వసంస్థానములలో నిరంకుశప్రభువులై యుండగలరు. మిగిలిన భారతదేశమంతయును వారి యాట నరికట్టజాలదు. మీదుమిక్కిలి భారతదేశమంతకును సంబంధించిన వ్యవహారములలో కూడ వారికి గొప్పపలుకుబడి ఏర్పడుచున్నది. తాము సర్వస్వతంత్రులమనియు, ఫెడరేషనులో చేరుటకు ముందు తమయిష్టానుసారము మరతు నియమములను నిర్ణయించెదమనియు చెప్పుచున్నారు. బ్రిటిష్ రాజప్రతినిధియైన వైస్రాయికి కూడ ఈ సామంతరాజులపై అధికారముండరాదని కొందరు వాదించుచున్నారు. దీని అర్థమే మనగా, అఖిల ప్రపంచములో అప్రతిహత నిరంకుశాధికారమును నిరాఘాటముగా తాము చలాయింప సమర్థులైయుండవలె నని వీరి కోరిక. ఏ రాజ్య శాసనమైనను వీరిని నిరోధింపకూడదని యర్థము. కొన్ని పెద్దసంస్థానములలో సర్వసమర్థమైన సైనికబలమును సమృద్ధిగా వృద్ధిచేయవలెనను రహస్యోద్యమము కూడ కలదు.

కనుక, నూత్నరాజ్యాంగచట్టములోని ఫెడరేషను విధానమును మనము ధిక్కరించుట కేవలము ధర్మసూత్రములకు మాత్రమే సంబంధించిన వివాదము కాదు. ఈ ఫెడరేషను మన జాతీయస్వాతంత్ర్య సమరమునకును, మన భవిష్యద్యోగక్షేమములకును ప్రబలప్రతిబంధకమైన పెద్దవిషయమై యున్నది; ఈ నూత్నరాజ్యాంగ చట్టమును ధిక్కరించుటలో మన కిది ప్రధానాంశమై యుండవలెను. ఈ ఫెడరేషను విధానమును మనము ధ్వంసము చేయవలెను.

ఈనూత్నరాజ్యాంగచట్టమును అంతరింపజేసి తెల్లనికాగితముల మీద తిరిగి క్రొత్తచట్టము నొకటి తయారుచేయించవలెననియే మనము సంకల్పించియున్నాము. శాసనసభా కార్యక్రమము తప్ప మరొకటి గ్రహింపనేర్వనివారు చెప్పెడి దేమనగా, ఈ నూత్నరాజ్యాంగవిధానమును మనము భగ్నముచేయలేమనియు, ఎంతటి యధికసంఖ్యాకబలముగల పార్టీ శాసనసభలో ఏర్పడి ప్రభుత్వమును ధిక్కరించుచున్నను, దానిని లక్ష్యముచేయక ప్రభుత్వమువారు తమవ్యవహారమును తాము సాగించుటకు వీలుగా ఈ రాజ్యాంగచట్టములోనే అనేక ప్రత్యేకాధికారములు బందోబస్తుగా కల్పింపబడియున్న వనియు వాదించుచున్నారు. ఈ బందోబస్తు లున్నవని మాకు తెలియును. అందువల్లనే ఈచట్టమును మనము నిరాకరించుచున్నాము. ఒక్కొక్కరాష్ట్రమునకు రెండేసిశాసనసభ లుండుటవల్ల, దిగువసభలో తీర్మానించినదానిని రద్దుచేయుట కెగువసభ లేర్పడియున్నవి. ఇది కూడ మాకు తెలియును. మనము శాసనసభలలో ప్రవేశించి, అనేక విషమావస్థలను ప్రభుత్వమువారికి కల్పింపవచ్చును. వ్యవహారములను స్తంభింప జేయవచ్చును. బ్రిటిష్ సామ్రాజ్యచక్రము సాగకుండ ఆటంకముల గల్పింపవచ్చును. ఎన్నిచేసినను ఇన్నింటిని తప్పించుకొని తిరుగుటకు వారికి అవకాశములు కలవు. కాబట్టి శాసనసభా వ్యవహార తంత్రములవల్ల మాత్రమే యీ రాజ్యాంగచట్టమును భగ్నము చేయ సాధ్యపడదు. ఈ సభల వెలుపలనే జనసామాన్యము విజృంభించవలెను. అది అత్యంతావశ్యకము. కనుక జనసామాన్యమును సంఘీభవింపజేసి జనబాహుళ్యమును ప్రదీపింపజేయుట మన స్వాతంత్ర్యోద్యమమునకు ఆయువుపట్టని సదా జ్ఞప్తియం దుంచుకొనవలెను.

## మంత్రిపదవీ స్వీకరణము

శాసనసభా ప్రవేశముతో కాంగ్రెసు సభాసంకల్పధోరణి స్పష్టముగా నిర్వచింపబడినది. ఒక్కవిషయము మాత్ర మింకను నిర్ధారణ కాలేదు. అదేదనగా, మంత్రిపదవీస్వీకరణము. ఎన్నికలు పూర్తియైనతర్వాతనే యీ విషయ మాలోచింపబడునని నిలిపివేయవచ్చును. నూత్న రాజ్యాంగశాసననిరాకరణమున కీ పదవీస్వీకరణము ప్రత్యేక విఘ్నముని లక్నో కాంగ్రెసులో నా యభిప్రాయమును సాహసించి చెప్పియుంటిని. అంతియగాక, ఇంతవరకును మన మనుసరించియుంటిన 1920-వ సంవత్సరమునాటి నిర్ణయములను తలక్రిందు చేసినట్లగును. లక్నో కాంగ్రెసు జరిగినపిమ్మట ప్రకటింపబడిన ఎన్నిక ప్రతిజ్ఞాపత్రములో కాంగ్రెసుసభ తనభావములను మరింత స్పష్టీకరించినది. ఈరాజ్యాంగచట్టమును కేవలమాత్రమును తోడ్పడజాలమనియు, దానికి తోడ్పడుటకై గాక, దానిని భగ్నము చేయుటకే మన మీ శాసనసభలలో ప్రవేశింపనున్నా మనియు స్పష్టీకరించెను. కనుక నీ మంత్రిపదవీస్వీకరణ విషయము పై జెప్పిన కర్తవ్యసూత్రముచే నిబంధింపబడుచున్నది. మంత్రిపదవీస్వీకరణమునకు సుముఖులైనవారున్నయెడల, అట్టి పదవీస్వీకరణమువల్లనే యీ రాజ్యాంగ చట్టమునకు మనము సహాయనిరాకరణమొనర్చి దానిని తుదముట్టింపగలమని ఋజువుచేయవలసియుందురు.

కాబట్టి మన కాంగ్రెసు సభాతీర్మానములలోను, ఎన్నికల కొరకై ప్రచురించిన ప్రతిజ్ఞాపత్రములోను వ్యక్తీకరింపబడిన కాంగ్రెసు వ్యవహారధర్మమునుబట్టి పదవులతోను, మంత్రిత్వముతోను మన కెట్టి సంబంధము నుండరాదనియే సహేతుకముగా పర్యవసానము తేలుచున్నది. కనుక ఈ పర్యవసానమును మేరమీరి యతిక్రమించుట వల్ల మనసంకల్పమునే మనము తలక్రిందుచేయుట యగును. అట్టి మంత్రిపదవులను స్వీకరించుట యనగా, భారతీయులను పీడించెడి బ్రిటిషు సామ్రాజ్యాధికారములో మనము కూడ పాల్గొనుట యగును, నూత్నరాజ్యాంగ చట్టమును మన మధిక్షేపించుచున్నను కొన్నివరకు సమ్మేరలకు లోబడి, ఆ చట్టములోని మూలసూత్రమును ఆమోదించినట్లగును. దేశాభ్యుదయకాంక్షులై ముందంజవేయువారిని అణగద్రొక్కుటకై యత్నించు బ్రిటిషు సామ్రాజ్యాధికారులను ఛీ యనిరోయక చేయూతనొసంగినవార మగుదుము. ఇది వినా మరొక భావముతో మంత్రిపదవులను నిర్వహించుట అసంభవము. ఒకవేళ సాధ్యమైనయెడల, వెంటనే ప్రభుత్వవ్యవహారములు స్తంభించి సంఘర్షణ మేర్పడును. అట్టి ప్రతిష్టంభనములకును, వ్యవహారస్తంభనములకును మనము భీతిజెందబోము. అట్టి వొనగూడుట మంచిదనియే భావింతుము. కాని, అట్టి ధోరణిలో నున్నప్పుడు మంత్రిపదవులను నిర్వహించు టెట్లని మనము యోచింపము. ప్రభుత్వమును స్తంభింపజేయు టెట్లనియే యోచించుచుందుము.

మనము మంత్రిపదవులను స్వీకరింపనియెడల, తదితరు లాపదవుల వహించెదరనియు, అట్టిచో మన స్వాతంత్ర్యోద్యమమునకు వారు ప్రతిబంధకములను కల్పించెదరనియు కొందరు భీతిజెందుచున్నారు. మనమే అధికసంఖ్యాకపక్షముగా నున్నప్పుడు ఇతరుల కుటిలవర్తనములు సాగకుండజేయవచ్చును. మంత్రివర్గమే యేర్పడకుండ నిరోధింపవచ్చును. కాని, కాంగ్రెసుపార్టీవారికి నిస్సంశయముగా అధికసంఖ్యాకులు సమకూడనియెడల, కాంగ్రెసువాదులు కానట్టి తదితరులతో కొంత సమాధానమునకు వచ్చినపిమ్మటనే మనము మంత్రిపదవులకై యత్నింపవలసియుండును. ఇది మన కాంగ్రెసు ఉద్యమమునకే ప్రమాదకరము. ఇతరపక్షములతో మనము చేరుటవల్ల నూత్నరాజ్యాంగశాసనమును నిరాకరించుటకుమారు తద్విరుద్ధముగా వ్యవహరింపకతప్పదు. కాంగ్రెసుసభా నిర్ణీత కర్తవ్యమునే ఉల్లంఘించినవార మగుదుము. శాసనసభలలో మన పార్టీ యొక్క అంగబలము అధికసంఖ్యాకమైనను, అల్పసంఖ్యాకమైనను, కట్టుదిట్టమైన ప్రజాబాహుళ్యమే మనకు నిజమైన అంగబలముగా నుండవలెను. అట్టి జనసామాన్యము మనకు తోడునీడగా లేనియెడల శాసనసభలలోని కాంగ్రెసుపక్షము అధికసంఖ్యాకపక్షముగా నుండినను మనము సాధింపగల్గినదేమియు నుండదు. మనము శాసనసభలలో అల్పసంఖ్యాకులమై యుండినప్పటికిని, సామాన్య జనాంగబలము మనకు దండియైన యండగా నుండిన, నూత్నరాజ్యాంగచట్ట మికనములుజరుగుట కష్టసాధ్య మనిపించవచ్చును.

జాతీయసమావేశమును జరిపించి ప్రజాభీష్టానుగుణముగా నూత్నరాజ్యాంగవిధానమును నిర్ణయింపజేయుటయే మన ప్రథమకర్తవ్యము. రాజ్యాంగచట్టములోని ఫెడరేషను విధానము అమలులోనికి రాకుండ ధిక్కరించుట మన రెండవ కర్తవ్యము. ఈరెండు కర్తవ్యములను సాగించుటకై ప్రజాసామాన్యమును ప్రబోధించి ప్రచారముచేయవలసియున్నాము. అట్టిచో మన మీమంత్రిపదవీస్వీకరణ లంపటములో జిక్కి ఊగులాడుచుండినయెడల, పై రెండుకర్తవ్యములను సాధించుటకిక మన కేపాటి శక్తిసామర్థ్యము లుండనేర్చును?

## ప్రజాసామాన్యముతో సన్నిహితానుబంధము

మనము సాధింపవలసిన మహాత్కార్యము లన్నియు ముందున్నవి. భారతదేశపు సమస్యలను, అంతర్జాతీయ సమస్యలనుకూడ మనము పరిష్కరింపవలసియున్నాము. ఇట్టి బ్రహ్మాండమైన సమస్యలను పరిష్కరింపగల సమర్థులింకెవరు గలరు? ఏబది సంవత్సరములు కష్టించి సేవచేసి త్యాగ మొనర్చి త్రింశత్కోటి భారతీయుల రాయబారియై మాటలాడగల అధికారగౌరవమును గడించిన మన కాంగ్రెసు సంస్థతప్ప మరెవ్వరీ బ్రహ్మాండమైన సమస్యలను పరిష్కరింపగలరు? ఈ కాంగ్రెసు మహాసభ ప్రజాభీష్టములను ప్రతిబింబింపగల సిద్ధంపు

బద్ధముకాదా ? ఈ కాంగ్రెసు మహాసభ స్వాతంత్ర్య మంత్రము నుపదేశించు గురుపీఠము కాదా ? ఎదురొడ్డి భీష్మించి ఇచ్చుట కిచ్చగింపనివారి చేతులలో నుండి స్వాతంత్ర్యమును పెనగులాడి పెకల్చితీయుటలో ఆరితేరిన హస్త మీ కాంగ్రెస కాదా ? ధీరులైన యాదపురుషులు కొందరు చిన్న సమాజముగా నేర్పడి యీ కాంగ్రెసుసభను ప్రారంభించి యుండిరి. ప్రారంభదశలోనే తత్పూర్వచరిత్రానుగతమైన జాతీయోత్తేజమున కీసంస్థ లాంఛనముగా వెలసెను. భారతజాతీయాదరణాభిమానముల కిది నిలయ మయ్యెను. సంవత్సరములు గడచినకొలది సభకూడ వర్ధిల్లుచుండెను. పురోభివృద్ధికై యత్నించినపు డెల్ల కాంగ్రెసుసభ తనలోని ఆంతరంగిక విభేదములను సమన్వయించుకొనవలసిన దగుచుండెను. కొందరు సభ్యులు ముందడుగువేయకుండ దానిని వెనుకకు బిగబట్టుచుండిరి. ముందంజవేయవలె నను సంకల్పబల మతితీవ్రమై యుండుటంజేసి, క్రిందినుండి జ్వాల పైకి విజృంభింపసాగెను. మార్పుజెందిన క్రొత్త సందర్భములకు సరిపుచ్చుకొనలేని కొలది పెద్దలు సభనువీడి వెడలి పోయినను, అనంతర మనేకు లీసంస్థలో సభ్యులుగా చేరిరి. భారతదేశములో ప్రజాప్రబోధమున కిదియే సభావేదికయై వెలసినది. కాని, అవయవస్వరూపము తేర్పడని పిండమువలెనే యుండెను. కాంగ్రెసుయొక్క అంగబలము కట్టుదిట్టముగా లేకుండెను. గాంధీజీ కార్యరంగమున ప్రవేశించినపిమ్మట పల్లెగ్రామములలోని ప్రజలు కూడ కాంగ్రెసులో చేరిరి. 1920-వ సంవత్సరములో నాగపూరునందు గాంధిమహాత్ముని సదుపదేశము ననుసరించి, కాంగ్రెసున కొక నూత్నవిధాన మేర్పరుపబడెను. ఈ నూత్నవిధానమువల్ల కాంగ్రెసు మహాసభ కట్టుదిట్టము చేయబడెను. జనసంఖ్యాప్రమాణము ననుసరించి ప్రతినిధులసంఖ్య నిర్ణయింపబడెను. తదాదిగా, సమర్థముగా సమష్టిగా దేశమంతయును ఒక్కమాటమీద వ్యవహరింపగల సామర్థ్యావకాశము కొంత యేర్పడెను. వెనువెంటనే ఈ కార్యసామర్థ్యము ఆసేతుహిమాచల వ్యాప్తమైన మహోద్యమమునందు కన్పించెను. ఈ యుద్యమమే అటుపిమ్మట కూడ మరికొన్నిమార్లు సాగింపబడెను. కాని కాంగ్రెసు మహాసభ కేర్పడిన పేరుప్రఖ్యాతులనుబట్టి అయోగ్యులు కూడ కొందరీసంస్థలో చేరి కాంగ్రెసు నియమనిబంధనావళిలోని దోషములే మరింత వ్యక్తమగునట్లుగా ప్రవర్తించిరి. కాంగ్రెసు మహాసంస్థ అంతకంతకు అలవికానిదై పెరిగి, వ్యవహారములను చురుకుగా సాగింపలేకపోవుటవల్ల, ఆయాప్రాంతములలోని కొన్నివర్గముల వారి ప్రాబల్యమున కిది భుక్తియగుచుండెను.

రెండుసంవత్సరములక్రిందట తిరిగి గాంధీజీసలహామూలమున కాంగ్రెసునిబంధనావళియందు సమూలమైన మార్పులు కొన్ని చేయబడెను. ఆయాప్రాంతములలోని కాంగ్రెసుసభ్యుల సంఖ్యాప్రమాణమునుబట్టి కాంగ్రెసుసభాప్రతినిధులను నిర్ణయించిరి. ఈ మార్పువల్ల కాంగ్రెసు ప్రతినిధుల ఎన్నికల కొక సార్థకత్వ మేర్పడినది. కాంగ్రెసుసభయొక్క అంగబలము కట్టుదిట్టమైనది. ఇంకను కాంగ్రెసుసభకు గల ప్రతిష్ఠాప్రాబల్యమునకు తగినంత కట్టుదిట్టమైన వ్యవహారప్రక్రమ నాంగోపాంగముగా నేర్పడనే లేదు. అందువల్లనే మన కాంగ్రెసుకమిటీలు ప్రజాబాహుళ్యముతో సంబంధములేనివై త్రిశంకు స్వర్గములో నూగులాడుచున్నట్లుగా వ్యవహరించుచున్నవి. కొంతవరకు ఈ లోపమును తొలగించుటకుమాత్రమే కాంగ్రెసుసభకు జనబాహుళ్యానుబంధమును కలుగజేయవలెనని లక్నో కాంగ్రెసులో తీర్మానింపబడెను. కాని, యీ జనసామాన్యానుబంధ మేరీతిగా ఏర్పడవలెనో సూచించుటకొరకయి నియమింపబడిన విచారణ సంఘము వారు దురదృష్టవశాత్తు ఇంతవరకును తమనివేదకను తయారుచేసి సమర్పించలేదు. లక్నో కాంగ్రెసు తీర్మానములో చెప్పబడిన యంశములకన్న ఈ సమస్యలో చాల విశేషాంశము లిమిడి యున్నవి. కాంగ్రెసుసభ మరింత సన్నిహిత సహచరవర్గముతో, సుశిక్షితముగా సమర్థముగా వ్యవహారములను సాగింపగలదై యుండుటకు నియమావళినంతను పూర్తిగా మార్చవలెను. ఏఉద్యమవ్యవహారమైనను సర్వసమర్థముగా నుండవలెనన్న నది జనసామాన్యముచే సాగింపబడవలెను. ప్రజాబాహుళ్యమే కాంగ్రెసుయొక్క మూలబలముగా వెలసియున్నది. కాంగ్రెసుసందేశమును జనసామాన్యము శిరసావహించుటవల్లనే, కాంగ్రెసుకు జీవప్రతిష్ఠ యగుచున్నది. జనబాహుళ్యము అండగా నుండినప్పటికిని, ఆ జనాంగము కట్టుదిట్టమైన సంఘబలముగా ఏర్పడియుండలేదు. అందువల్లనే కాంగ్రెసుసభయొక్క మహోద్యమములు దుర్బలములై కొనసాగుటలేదు. కాంగ్రెసుమహాసభ అధికులైన కులీనులతో ప్రారంభమై, కాలక్రమేణ మార్పుజెంది మధ్యతరగతిలోని క్రిందిమెట్టువారు కూడ విశేషముగా నిందులో చేరియున్నారు. ఇకముందు ప్రజాబాహుళ్య మంతకును కాంగ్రెసుసభలో ప్రాతినిధ్య మేర్పడవలసియున్నది. జనబాహుళ్యమువైపునకే అంతకంతకు కాంగ్రెసు మరలుచున్న తరుణములో కాంగ్రెసు సభా రాజకీయధర్మము కూడ నూతనాకృతిని దాల్చినది. ఈ సంస్థ నాశ్రయించియున్న ప్రజల ఆర్థికావస్థలనుబట్టియే యీ సంస్థయొక్క రాజకీయాశయములును మార్పుజెందవలయును, అది విధాయకము.

మన మిదివరలో గత్యంతరములేక ప్రజాసామాన్యమే కాంగ్రెసుసంస్థకు ప్రాణాధారమని ఒప్పుకొనియుంటిమి. ఆ జనాంగ బలము లేనిచో మన సంస్థ కిక సత్తువలేదు. కనుక, మన మాసామాన్య జనాంగమునకు సలక్షణముగా కాంగ్రెసుసభలో కార్యాసక్తిని కల్పింపవలెను. చందానిచ్చెడి ప్రాతిపదిక సభ్యులకందరకును కొంత వ్యవహార స్వాతంత్ర్యమును, నిగ్రహణాధికారమును, నిత్యకృత్య కార్యకలాపములో అనేక వ్యవహారావకాశములను కలుగజేయవలెను. వేయిమాటలేల? ఒక్కముక్కలో మనవి చేసెదను. కాంగ్రెసుసంస్థను మరింత ప్రజాప్రతినిధిసంస్థగా వికసింపజేయవలెను.

ఈ విషయమునకు సంబంధించిన మరొకయంశము గత సంవత్సరమందు చర్చింపబడెను. జాతీయ స్వాతంత్ర్య లక్ష్యమునే గల్గియున్న కార్మిక కర్షకసంఘములు మన్నగువానిని కాంగ్రెసుసభకు అనుబంధించుటవల్ల సామ్రాజ్యాధికారప్రతికూలతత్వము ఏకముఖముగా కృషిచేయగల్గునుగనుక ఇది వాంఛనీయమా యను విషయమై చర్చ జరిగినది. ఈ కార్మికకర్షకవర్గములకు చెందినవారిలోనే చాలమంది నేడు కాంగ్రెసులో సభ్యులైయున్నారు. కాంగ్రెసు సభ్యవర్గములో ముప్పాతికవంతు కర్షకులైయున్నారు. కార్మికకర్షకజనులలో వారివారి వృత్తులకు చెందిన స్వసంఘములేర్పడి ఆ సంఘముల తరఫుననే కాంగ్రెసుప్రతినిధు లేర్పడుట వారి కెక్కువ సార్థకముగా, ప్రయోజనకరముగా నుండునని వాదింపబడెను. కాని, యీ పద్ధతి కూడదని కొందరు ప్రతిఘటించిరి. అట్టి ప్రాతినిధ్య పద్ధతివల్ల కాంగ్రెసు సభలోనికి క్రొత్తరకములవారు వచ్చెదరనియు, రాజకీయ పరిజ్ఞానములేని సంస్కారశూన్యులకు గూడ కాంగ్రెసుసభలో పలుకుబడి ఏర్పడు ననియు కొన్ని కారణములను చెప్పిరి. ఈ ప్రశ్న చాల ముఖ్యమైనదైనప్పటికిని, నిజ మాలోచించినయెడల, ప్రస్తుతము మన మేరీతిగా నిర్ణయించినను వ్యత్యాసమేమియు నుండదు. మన మిప్పుడు చేసెడి నిర్ణయము మన సత్సంకల్పములను మాత్రము విశదీకరించును. ఎందువల్లననగా, కాంగ్రెసుసభను అనుబంధింపదగిన కట్టుదిట్టమగు కార్మిక కర్షకసంఘములు దేశములో అత్యల్పముగానున్నవి. కనుక కాంగ్రెసు సభ చిల్లరజనముతో నిండిపోవునను భయము ప్రస్తుతములేదు. అట్టిది జరుగకుండ నివారింపవచ్చును. కాని నా ఉద్దేశమునుబట్టి మొత్తముమీద ఇంకొకప్పుడైనను ఆయావృత్తిసంఘముల ద్వారా కాంగ్రెసు ప్రతినిధులు ఎన్నుకోబడవలెను. అది అనివార్యము. అవశ్యము వాంఛనీయము. అట్టి సంఘములు అసంఖ్యాకములుగా బుద్బుదప్రాయములుగా బయలుదేరి కాంగ్రెసులో ప్రాతినిధ్యమును సంపాదింపవలెనని మోసముచేయకుండుటకై, కాంగ్రెసుతో అనుబంధింపబడు సంఘములకు కొన్ని వరతునియమములను సులభముగా నిర్ణయింపవచ్చును. ఈ రీతిగా కాంగ్రెసమహాసభ కనుబంధింపబడిన సంఘములతరఫు ప్రతినిధులసంఖ్య కొక గరిష్ఠప్రమాణమును నిర్ణయింపవచ్చును. సంయుక్తపరగణాల కాంగ్రెసుకమిటీవారటువంటి సలహా నొకటి సూచించియుండిరి.

సామ్రాజ్యాధికార ప్రతికూలములైన సర్వశక్తులను కేంద్రీకరించుటయే మనకు ముఖ్యలక్ష్యమైయున్నది. ఇదివరలోనేగాక నేడు కూడ ప్రజలకందరికిని కాంగ్రెసుమహాసభయే పట్టుగొమ్మగా నున్నది. కాబట్టి జాతియంతయును ఏకముఖముగా వ్యవహరించుటకు కాంగ్రెసు మహాసంస్థయే ఆటపట్టుగా నుండవలెను. అట్టి మహాసంస్థలో కట్టుదిట్టమైన కార్మిక కర్షకసంఘముల ప్రతినిధివర్గముచేరి చురుకుగా పనిచేయుచుండినయెడల కాంగ్రెసు సంస్థకు మరింత బలము చేకూరగలదు. కనుక, అట్టి మార్పును హర్షింపదగును. కార్మికకర్షకులకును కాంగ్రెసుసభకును సాహచర్యసంబంధము వృద్ధియగుచున్నది. గత సంవత్సర మిదియొక ప్రత్యేక లక్షణముగా గమనింపదగియుండెను. ఈ ధోరణినే మరింత ప్రోత్సహింపవలసి యున్నది. సామ్రాజ్యాహంకారమును ధిక్కరింప సమకట్టిన జనసంఘముల భిన్నశక్తులను కేంద్రీకరించి ఏకముఖముగా సమకూర్చుటయే భారతదేశమునం దిప్పు డత్యవసరముగా జరుగవలసిన ప్రధాన కార్యమైయున్నది. కాంగ్రెసు మహాసభలో ఈ భిన్నశక్తులు వెలసియున్నవి. భిన్నస్వరూపములైయున్నను సమష్టి శ్రేయమునకే సంఘీభవించి తోడ్పడినవి. ఇటువంటి మహాసభోద్యమమునందు భిన్నప్రకృతులు సమశ్రుతిలో మేళవించుటయే యీ మహాసభకు జీవకళయై యున్నది. అట్టి సమైక్యభావమే మనలను చేరదీసి చేతులుకల్పి పనిచేయించుచున్నది. మన కందరకును స్వాతంత్ర్యకాంక్షయే మూలతత్వము. మన కందరకును సామ్రాజ్యతత్వవిముఖత్వమే సమలక్షణము. ఇప్పుడు వెంటనే మనము కోరునది అఖిలభారతజాతీయ ప్రతినిధిసమావేశము. ఈ జాతీయ సమావేశములో ప్రజలుకోరెడి రాజ్యాంగవిధానము నిర్ణయింపబడవలెను. ఈ స్వపరిపాలనము ప్రజాస్వామ్య సంకలితమై, జనసామాన్యమునకే అధికారము హస్తగతము కావలెను. ఇది సిద్ధించినతోడనే దేశమును పరాక్రాంతమొనర్చిన పరసైన్యనికాయము లన్నియును ఈ రాజ్యమును వీడి వెడలిపోవలెను.

## దేశదారిద్ర్యము - నిర్వ్యాపారత్వము

పైన జెప్పినవన్నియు మన సంకల్పలక్ష్యములై యున్నవి. కాని, వానినిగూర్చియే తలపోయుచు నిత్యకృత్యములైన అనుదిన కష్టనిష్ఠురములను సరకుగొనకయుండలేము. మన కిప్పుడును ప్రత్యక్షబాధకములుగా నున్న ప్రజాదారిద్ర్యమును, లక్షలకొలది జనుల నిర్వ్యాపారత్వమును కండ్లకు గట్టినట్లున్నవి. పేదసాదకపు జనులేగాక సాధారణ మధ్యతరగతి కుటుంబములవారు కూడ నిరుద్యోగులై దుర్భరదారిద్ర్యబాధ ననుభవించుచున్నారు. ఈ నిరుద్యోగజాడ్యము సంఘశరీరమున పక్షవాతమువలె ప్రవేశించి మెల్లగా విస్తరించుచున్నది. ప్రపంచమంతటను పరస్పరవిరుద్ధములైన ద్వంద్వ లక్షణములయొక్క విషాదకర వ్యత్యాస వైపరీత్యములు కన్పించుచున్నవి. భారతదేశములో నున్న వ్యత్యాసవైపరీత్యములు మరెక్కడను లేవు. సమ్రాట్పీఠమైన ఢిల్లీనగరము బ్రిటిష్ ప్రభుత్వాధికారమునకు మూర్తిచిహ్నమై సకల సౌధాలంకార పటాటోప పరివేష్టితమై, మూఢజనాభరణాడంబరమువలె అమిత వ్యర్థ దుర్వ్యయభరితమై వెలయుచున్నది. ఆ మహానగరమున కనతిదూరములోనే, భారతదేశ కృషీవలులు మట్టిగోడల పూరికొంపలలో ఆకలితో కడుపుకాలి కృశించుచున్నారు. వారు కాయకష్టముచేసి గడించిన స్వల్పసంపాదనలనుండియే ఆరమ్యహర్మ్యములు నిర్మింపబడినవి. అధికారులకు పెద్దపెద్ద జీతబత్తెము లీయబడుచున్నవి. స్వదేశసంస్థానాధీశుడును, తన

మహోన్నతరాజమందిరములలో రమ్యవిలాసభోగములతో దుర్భర దారిద్ర్యనిమగ్నులైన తన ప్రజలను మత్తుగ విస్మరించుచు, పాత పూర్వ సంధిపత్రములను గూర్చియు తదాధారముగా తన కేర్పడియున్న నిరంకుశాధికారస్వాతంత్ర్యమును గూర్చియు ప్రస్తావించుచుండెను. మనదేశములో నిటువంటి విపరీత వ్యత్యాసములను చిరస్థాయిగా నుంచుటకును, నిరంకుశాధిపులను సామ్రాజ్యాహంకారులను దేశమును నిరాటంకముగా పీల్చి పిప్పిజేయగల్గుటకును, క్రొత్తచట్టము క్రొత్త రాజ్యాంగవిధానమును నేడు మనకు సంప్రాప్తమైనవి.

## బెంగాలు నాగపూరు రైల్వే సమ్మె

నేనిది వ్రాయుచున్న సమయమననే గొప్ప రైల్వే సమ్మె యొకటి జరుగుచున్నది. రైల్వే కార్మికులను చాలమందిని ఖర్చు తగ్గింపుకై పనిలోనుండి తొలగించి యుండుటవల్లను, వేతనములను తగ్గించియుండుటవల్లను రైల్వే కార్మికమండలి చాలదినములనుండి సంక్షోభించుచునేయుండెను. వానినణచివేయుటకై ప్రభుత్వాధికార ప్రభావమంతయును సదా సంసిద్ధమైయున్నది. వెనుక నొకమారు బొంబాయిచేరువలో నున్న అంబరునాథు నిప్పుపెట్టెల ఫ్యాక్టరీలోని పనివాండ్లు మంచి మనస్థైర్యముతో సమ్మెచేసిరి. అది యొక విదేశకంపెనీ తాలూకు ఫ్యాక్టరీ. కాని, ఆ వ్యాపారపు కంపెనీకి అండగానుండి ప్రభుత్వమువారి సాధనసంపత్తియును, సిబ్బందియును అత్యద్భుతముగా పనిచేయుట ప్రత్యక్షముగా చూచితిమి. మనదేశములోని కార్మికులకు ప్రాతిపదికములయిన హక్కులింకను ఏర్పడవలసియున్నవి. దినమున కెనిమిదిగంటల పనిని నిర్ణయించు కాలప్రమాణమింకను వారి కేర్పడవలెను. నిరుద్యోగావస్థకు అభయహస్తమైన భీమాలును, జీవనోపాధికి తగిన వేతన ప్రమాణమును కభయహస్తములను వారికింకను లభింపవలసినవై యున్నవి.

## కార్మికులకంటె కర్షకుల కగ్రస్థానము

భారతదేశము వ్యవసాయదారుల కాలవాలమై వెలయుచున్నది. అందువల్ల కార్మికసమస్యలకంటె ఈ రైతుజన సమస్య లెక్కువ పెద్దవై ప్రబలమై బాధించుచున్నవి. ఈ విషయమును గుర్తించి, కర్షకజన సామాన్యమున కీకాంగ్రెసుమహాసభ సన్నిహితమై సమీపస్థమై యుండవలెనని యెంచి వెనకటివలె మహానగరములందు గాక, ఫైజుపూరను గ్రామములో నేడు మనము సమావేశమైతిమి. కర్షకజనోద్ధరణకై రాష్ట్రీయకాంగ్రెసు కమిటీలు కార్యవిధానములను నిర్ణయించవలసినదిగా లక్నో కాంగ్రెసుసభయందు నొక్కి వక్కాణింపబడెను. ఈ వ్యవహార మపారమై, క్లిష్టమై, సమగ్రపరిశీలన మావశ్యకమై యుండుటచేత వ్యవహారము సాంతముకాలేదు. కాని, విషయము జరూరుగా జరుగవలసినదగుటచేత వెంటనే పరిష్కరింపబడవలసి యున్నది. సర్కారు శిస్తునిర్ణయముల విషయములోను, మక్తాశేట్ల నిర్ణయముల విషయములోను, సామంతాధిపతులు విధించెడి రుసుములను రద్దుచేయు విషయములోను సమూలమైన సంస్కరణములు జరుగవలెనని పెక్కు రాష్ట్రములవారు తెలియజేసిరి. రైతుల ఋణభారము దుర్భరమై వారిని క్రుంగదీయుచున్నది. వారి ఋణవిమోచనకు కొంత కాలావధినొసంగి, బాకీ మొత్తములో కొంత రద్దుచేయుట అత్యంతావశ్యకమని సర్వత్ర మొఱపెట్టుచున్నారు.

పంజాబు రాష్ట్రములో ఋణపరిష్కార-పంచాయతీలు రైతుజనరక్షణార్థమై వెలసినవి. పై జెప్పిన మొఱలేగాక, తరతరముల కర్షకజన వాంఛితములను కలవు. రైతులు కష్టముల కోర్వలేక తపించుచున్నారనుటకు వారి సభాసమావేశములే తార్కాణములు. అయినప్పటికిని, భూస్వామ్యపద్ధతిని సాకల్యముగా సంస్కరింపక యీ రైతు జనబాధల నొక్కటొక్కటిగ తొలగింపగలమనుట చాల సంశయాస్పదము. అమలులోనున్న భూస్వామ్యపద్ధతి చిరకాలము వర్తింపజాలదు. నేడ్యాగానికిని, సర్కారుకును మధ్యనుండు నడుమంతరపు ఆసాములను తొలగించుటయే కర్తవ్యమై కన్పించుచున్నది. వారిని తొలగించిన పిమ్మట సమిష్టి సహకారవ్యవసాయము అమలులోనికి రావలెను.

## పారిశ్రామికాభివృద్ధి

పెద్దపెద్దయంత్రాగార పరిశ్రమలును, చిన్నచిన్న గృహపరిశ్రమలును కూడ పెంపొంది పనిపాటులులేని లక్షలకొలది జనులకు చేతినిండ పనికల్పించి, దీనులైన పేదజనులకు మంచి మనుగడ చూపిననే తప్ప భూస్వామ్య పద్ధతిని సవ్యముగా సంస్కరింపజాలము. ఈ పారిశ్రామికాభివృద్ధి తదితర వ్యవహార రంగములతో సంబంధించినదైయున్నది. విద్యాభివృద్ధి, జనావాస సౌకర్యాభివృద్ధి, రస్తాలు, రవాణాలు, శుచి పారిశుద్ధ్యము, వైద్యసహాయము, ప్రజాసౌకర్య విషయములు మున్నగువాని వికాసమునుబట్టి పారిశ్రామికాభివృద్ధి కలుగుచుండును. ప్రభుత్వమువారి ఖజానానిర్వహణ పద్ధతివల్లను, ఆర్థికవిధానమువల్లను దేశములో పరిశ్రమలు కృశించుచున్నవి. బ్రిటిష్ సరకులకు ప్రత్యేకశుల్కసౌకర్యముల గల్పించి యీదేశములో బ్రిటిష్ సరకులను ప్రభుత్వమువారు ప్రోత్సహించుచున్నారు. ఈవిధముగా లండనులోని పెద్ద సాహుకార్ల వ్యాపార లాభములను వృద్ధిచేయుచున్నారు. భారతీయు లెంత గొంతెత్తి యధిక్షేపించినను, రూపాయి మారకపు రేటు యథాపూర్వముగానే యున్నది ఏటేట అపారపారావారముగా సువర్ణవాహిని పరసీమలకు ప్రవహించుచునేయున్నది. యావద్భారతదేశ మీ సువర్ణస్రవంతి నరికట్టవలెనని గగ్గోలొనర్చినను ఫలితము లేకున్నది. బ్రిటిష్ వర్తకమునకు గాని, బ్రిటిష్‌వ్యాపార సంఘములకుగాని, హానికరమైన అక్రమ భేదభావ సంకలిత వ్యవహారచర్యయని వైస్రాయికైనను గవర్నరుకైనను తోచినయెడల అట్టి

వ్యవహార చర్యను జేసిని మనము జరుపుటకు వీలులేదని క్రొత్త రాజ్యాంగచట్టము చెప్పుచున్నది.

## యావద్భారత మహాసంకల్పవిధానము

కనుక, ఒకసమస్య యింకొకసమస్యాయం గంతర్లీనమగు చున్నది. ఈ విధముగా బహువిధబ్రహ్మాండజటిలసమస్యాసంకీర్ణమైన దేశ మీనాటి భారతభూమి. అయితే, యీ సమస్యల నన్నింటిని దేనికది పరిష్కరించుచు, చిల్లర మరమ్మతులను చేయుచు, అతుకుల బొంత నొకటి తయారుచేయబోవుచున్నామా? సుస్థిర హక్కుభుక్తములు కలవారంపిరును అడుగడుగునకును మన కడ్డుతగులుచుండగా ఈ చిల్లర మరమ్మతులను జేయ దలపెట్టుచున్నామా? అది నిష్ప్రయోజనకరము. జాతీయ వ్యవహారకాండ కంతకును సంబంధ మేర్పరచి, వివిధవ్యవహారవిషయముల కొక సమాశ్రయసూత్రమును కల్పించి, జనబాహుళ్య శ్రేయస్కరమారీతి సమష్టి ప్రయోజనమునకై వివిధ వ్యవహార విషయములన్నియు నుపకరించున ట్లొనర్చి, యావద్భారత భూమికి వర్తింపగల మహాసంకల్పవిధానము నొకటి నిర్ణయింపవలెను. దూరాలోచనతో ధైర్యవిశ్వాసములతో అట్టిమహాసంకల్పవిధానమును ప్రవర్తింపజేయుటవల్లనే సర్వసమస్యా పరిష్కారమార్గ మేర్పడును. అయితే, సామ్రాజ్యాధికార పీఠనమునకు పాల్పడి, సుస్థిరస్వామ్యాధికారములుగలవారిచే పీడింపబడి, నిరాశీవ్యాపార స్వాతంత్ర్యములచే దేశ మావరింపబడియున్నప్పుడు అటువంటి మహాసంకల్పవిధానములు సాగనేరవు. రాజకీయ సాంఘిక స్వేచ్ఛాస్వాతంత్ర్యము లనెడి భూసారమును వాతావరణమును గల దేశములోనే అట్టి మహాసంకల్ప విధాన బీజములు వికసించి విస్తరింపగల్గును.

ఇవన్నియును నేడు మనకు దూరస్థమైన గమ్యస్థానములు. కాని, కాలచక్రము గిఱ్ఱున తిరిగినయెడల, దవ్వుగాకన్పించు గమ్యస్థానములు దాపునకే వచ్చును. అవి మన కండ్లకెదురుగా ప్రత్యక్షము కాగలవు. స్వాతంత్ర్య సంసిద్ధియను గమ్యస్థానముమాత్రము తదితరములకంటె స్పష్టముగా చేరువలోనున్నది. అందువల్లనే, యూరోపు ఖండవాసులలో కలుగుచున్న విషాదకర విస్మయావస్థలును, నిరాశయును చాలవరకు మనల నావరించుట లేదు.

మనము దుర్బలులమువలె కన్పించుచున్నాము. కాని దుర్బలులము కాము. మనబలము వృద్ధిజెందు కొలది, బ్రిటిషు సామ్రాజ్యము తేజోవిహీన మగుచుండును. రాజకీయముగా ఆర్థికముగా మనము త్రొక్కివేయబడుచున్నాము. మనకు పౌరస్వత్వములుకూడ తొలగింపబడినవి. వందలాదిగానున్న మనసంఘములు అక్రమసంఘములుగా నిషేధింపబడినవి. వేలకొలది మనస్త్రీలును, పురుషులును చెరసాలలోగాని, నిర్బంధప్రవాసములలోగాని సదాబంధితులైయున్నారు. మనరాకపోకల ననుక్షణ మనేకరహస్యభటులును, గూఢచారులును పొంచి గమనించుచున్నారు. మనము పల్కిన మాటలలో రాజద్రోహ ముండునని యెంచి నోటవచ్చినమాట నెల్ల శ్రద్ధగా వ్రాయుచున్నారు. ఇదంతయును, ఇతోధికమును జరుగుచుండుటచేతనే మన బలము క్షీణింపక తేజరిల్లుచున్నది. నిర్బంధ ప్రజాపీడన మెంత ఎక్కువగునో మన జాతీయోత్తేజ మంతగా విజృంభించును. యుద్ధము, విప్లవము ప్రపంచము నావరించుచున్నవి. ప్రతిజాతియును దారితెన్నుగానక అయోమయములను ఆయత్తము చేసికొనుచున్నది. ఈ మారు యుద్ధమే సంభవించినను, లేదా మరొక క్లిష్టావస్థ సంభవించినను భారతదేశముయొక్క ధోరణి వేరొకరీతిగా నుండును.

మన విజయకీలకము మన చేతులలోనే యున్నది. సరిగా గ్రహించి కీలకమును త్రిప్పవలెను. ఈధైర్యవిశ్వాసము కలుగుచుండుటవల్లనే మన దేశీయుల నిష్ప్రహనిరాశలు చాలవరకు తొలగిపోయినవి.

ప్రస్తుతము రానున్న ఎన్నికల యాందోళనమునందే మన మనస్సులు లగ్నమై మన శక్తి లీనమగును. ఈ ఎన్నికల విషయములో కూడ అధికారులు అక్కరమాలిన జోక్యము కల్పించుకొనుచున్నారు. జోక్యము కల్పించుకొనుటలేదని వాదించుచు జోక్యము కలుగజేసికొనుచున్నారు. నిరక్షరులైన వోటరులు సుప్తముగా తమ వోట్లనిచ్చుటకు వీలులేకుండ తంత్రము పన్నుచున్నారు. వేర్వేరు రాజకీయపక్షముల యభ్యర్థుల వోట్లకాగితముల పెట్టెలను చదువురానివారు గ్రహింపగల్గుటకై వేర్వేరు రంగులను వేర్వేరుపెట్టెలకు ఆయారాష్ట్రములలో నిర్ణయించియుండిరి. కాని సంయుక్తపరగణాలలో ఇట్టి రంగుల పెట్టెల పద్ధతిని అవలంబింపలేదు. చదువురానివారు తమ వోట్లను పెట్టెలో గుప్తముగావేయుట కవకాశములేకుండ ఈ రాష్ట్రమునందే ప్రత్యేకించి ఈ తంత్రాంగమును పన్నుచున్నారు. ప్రభుత్వప్రతిబంధకములును, సుస్థిరసామంతుల ప్రాబల్యమును ద్రవ్యబలమును, ఎన్నియడ్డమైన నెదురొడ్డి మన మీ ఎన్నికలలో జయించెదము గాక!

కాని మనదీర్ఘయాత్రలో నిదియొక చిన్నియంగ. అష్టకష్టములును, అపాయములును మనచెంతజేరి చెలికాండ్రువోలె కలసినడువ మన మిక ముందడుగువేయుచు మహాయాత్ర సాగించెదము గాక! మనల నెడబాయకుండు నీ చెలికాండ్లు మనకు చిరకాలపరిచితులు. వారితో చెలిమి మన కభ్యాసమైనది. అసఖులు మనకు వశులైనచో జయలక్ష్మినే చేపట్టగలము.

వందేమాతరం.

## కాంగ్రెసు అధ్యక్షుని ఆంధ్రదేశసంచారము



మద్రాసు
గోఖలే హాలులో
సివిల్ లిబర్టీస్
యూనియను ప్రా
రంభోత్సవము



చెన్నపురి
పురపాలకసంఘ
మువారి స్వాగత
స్వీకరణము



మద్రాసు
యూనివర్సిటీ
స్టూడెంట్సు
యూనియన్
సభలో

# శ్రీనాథుని జన్మస్థానము

ఎ. వి. ఆర్. సోమయాజులు

●

బహుళాంధ్రోక్తిమయప్రపంచమును వాగనుశాసనుడు సృజియింప, కుండలీంద్రుడు దానియునికి కాధారమై నిలువగా ప్రోచిన వాడు శ్రీనాథుడు. ఈతడు బహుదేశముల దిరిగి బహుశాస్త్రముల నెఱిగి, రసవత్కవిత రచించి, రాజాధిరాజుల పూజలు గొని, విద్వద్గోష్ఠులయందారితేఱి, పూర్ణపురుషాయుష జీవియై దిగ్గజ కవివరుల గుండియలు దిగ్గురనునట్లుగా స్వర్లోక ప్రస్థానము సల్పిన కవిసార్వభౌముడు. అట్టి మహాకవివరుని జన్మస్థానమును గూర్చి పండితులు భేదాభిప్రాయులుగా నున్నారు. కొందఱు కర్ణాటుడనియు, కొందఱు తెలుగువాడనియు, అందునుకొందఱు కృష్ణాజిల్లా వాడనియు, కొందఱు నెల్లూరుజిల్లా వాడనియు, మఱికొందఱు కేవలము నెల్లూరునివాసియే యనియు తలపోయుచున్నారు ప్రస్తుత మీతని జన్మస్థానమును గూర్చి నాయభిప్రాయమును సారస్వతలోకమున కీచిన్ని వ్యాసరూపమున విన్నవింపదలచి పత్రికాముఖమునకు గొనివచ్చితిని. ముందు శ్రీనాథుని జన్మస్థానమును గూర్చి యున్న భిన్నాభిప్రాయములను, వాటి సారాంశములను పొందుపరచినతరువాత వాటిని విమర్శించి చివరకు నాయభిప్రాయమును విన్నవింతును.

శ్రీనాథుని జన్మస్థానము కర్ణాటదేశమని యుద్దేశించినవారిలో ప్రథములు శ్రీఅక్కిరాజు ఉమాకాంతము గారు. వీరు శ్రీనాథుని జన్మస్థానమును, బాల్యమునుగూర్చి యీక్రింది విధముగా వ్రాసియున్నారు. "జన్మస్థలము కొండవీటి సీమయని కొందఱు వ్రాసిరిగాని యావిషయమైకొంత సందేహముగ నున్నది. కర్ణాటదేశమితని జన్మభూమి యైనట్లు పడును. సుప్రసిద్ధాంధ్రకవి కర్ణాటదేశీయుడనుట పలువురికి రుచింపకపోయినను, మీఁదుమిక్కిలి నాకు రుచింపకపోయినను యథార్థముగ గనబడుచున్నది. నమ్మకపోవుట సంభవింపనేరదు గాన నాయభిప్రాయమును తెలుపుచున్నాను.... శ్రీనాథుడు కాశీఖండమున 'చిన్నారి పొన్నారి'యను పద్యమున 'కర్ణాటదేశ కటక పద్మవనహేళి' అనువిశేషణమును తనకుజేర్చుకొనినాడు. మఱియు భీమేశ్వర పురాణమున 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' యని చెప్పకొని యున్నాడు. 'తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి' యని వీథినాటకమున కర్ణాటకరాజ్యమును 'తల్లీ' యని సంబోధించినాడు. తల్లిదండ్రులతో నింటనప్పుడప్పుడు మిశ్రకర్ణాటకము మాటలాడు చుండినను నివసించునది కొండవీడు సీమగావున తెలుగువారితో గలసిమెలసి, తెలుగువారితో సహవాసముచేసి ప్రాతఃకాలము మొదలు సాయంత్రము వఱకు తెనుగులోనే మునిగితేలుచుండుటవలన చివరకు తెనుగుదేశస్థుడుగా మాఱియుండును. తనతాతయగు కమలనాభామాత్యుడు సముద్రతీరమందలి 'కాల్' అను పట్టణమున కధిపతియని చెప్పియున్నాడు. ఇది పశ్చిమ సముద్రతీర పట్టణమై కర్ణాటక దేశములో జేరియుండును. శ్రీనాథుని కవితయందు కన్నడపదములు లెక్కువగ గాన్పించుచున్నవి." ౧

కె.వి. లక్ష్మణరావుపంతులుగారు, చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు శ్రీనాథుని జన్మదేశము తెలుగుదేశమనుటలో నేకీభవించినను 'కాల్'పట్టణముయొక్క యునికిని నిర్ణయించుటలో భిన్నాభిప్రాయులుగా నున్నారు.

కె. వి. లక్ష్మణరావు పంతులుగారు క్రీ. శ. 9 వ శతాబ్దినాటి శాసన మొకదానియందు 'కలుపట్టణము' అను పేరును జూచి శ్రీనాథుని కాల్పట్టణ మిదియే యని నిర్ణయించిరి. ప్రస్తుత మీపట్టణము కలుపటము అను పేర మచిలీపట్టణమునకు తూర్పున సముద్రతీరమున కాళీపట్టణమునకు దరిదాపున నున్నది.

చరిత్ర చతురానన బిరుదాంకితులగు చిలుకూరి వీరభద్రరావు పంతులుగారును, రావుబహద్దర్ కందుకూరు వీరేశలింగం పంతులుగారును, భాషాతత్త్వ శాస్త్ర సంబంధమగు నాధారముల (Philological Grounds) పై తమ సిద్ధాంతములను నెల

౧. పల్నాటివీరచరిత్ర పీఠిక (పేజీలు ౫౨-౫౩)

కొల్పుజూచిరి. శ్రీ వీరభద్రరావు పంతులుగారు 'కాల్‌పట్టణ మనగా కాల [కాల=నల్లని] పట్టణము. కాల పట్టణమే కృష్ణపట్టణము. ఇది నెల్లూరు చేరువ నున్న' దని వ్రాసియున్నారు. కాని యీ యూహ వారికే సంతృప్తి గూర్పనటుల గూడ వ్రాసియున్నారు. కృష్ణపట్టణమని చెప్ప గుదురక శ్రీనాథుడు కాల్పట్టణముగా మార్చుకొని యటులను కుదురక కాల్‌పట్టణముగా మార్చుకొనినాడని చెప్పజూచుట వారికే యసంభవముగా దోచినట్లు కూడ అగుపడుచున్నది. కాని యేలనో వారు శ్రీనాథుడు నెల్లూరుజిల్లావాడనియే వ్రాసియున్నారు. శ్రీవీరేశలింగం పంతులుగారు కాల్పట్టణము కాదు- క్రాల్పట్టణమని వుండవలయుననియు, క్రాల్పట్టణమనగా ప్రకాశించు పట్టణమనియు, కొత్తపట్టణ మేదైనను ప్రకాశించును గావున క్రాల్పట్టణ మేదో కొత్తపట్టణము కావచ్చుననియు వ్రాసియున్నారు.[౨]

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మచిలీపట్టణమునకు తూర్పున సముద్రతీరమున నిప్పుడు కాలీపట్టణ మను గ్రామ మున్నదనియు, అది ప్రాచీన పట్టణమనియు, ఇప్పుడు మిక్కిలి రూపుచెడి ప్రాచీన ప్రాభవ వైభవములను సూచించుచున్నదనియు, కాలీపట్టణ, కాలపట్టణ, కాళీపట్టణముల కంతగా భేదము లేదనియు, 'వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్' అని భీమఖండ పద్యపాదమున శ్రీనాథుడు తన తాతగారగు కమలనాభామాత్యుని నివాస భూమిగా పేర్కొనిన కాల్‌పట్టణ మిప్పుడు కాలీపట్టణమని వ్యవహరింపబడుచున్న పై గ్రామము కాదగుననియు, శ్రీనాథుని బావమఱది యగు దగ్గుబల్లిదుగ్గన యింటిపేరిటి గ్రామమగు దగ్గుబల్లి పదిమైళ్ల దూరమున నున్నదనియు, శ్రీనాథుని బంధువగు బెండపూడి అన్నయ మంత్రి ప్రభృతుల గ్రామములుగూడ దానికి జేరువగా నున్నవనియు వ్రాసియున్నారు.

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు శ్రీనాథుని జన్మస్థానమునుగూర్చి వ్రాయుచు హరవిలాసమునందలి 'బాలసఖుడవు శైవప్రబంధ మొకటి, యవధరింపుము నాపేర సంకితముగ' అని తిప్పయసెట్టి శ్రీనాథు నడిగియుండుటవలన వారలిరువురకును బాల్యసఖిత్వము కుదురవలయునన్నచో వారిరువురు విక్రమసింహపుర(నెల్లూరు)నివాసులైయుండవలయుననియు, కావున శ్రీనాథుడు విక్రమసింహపురప్రాంతమున శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు చూపిన యేకృష్ణపట్టణమువంటి గ్రామము వాడు కూడ కాకుండ కేవలము విక్రమసింహపురనివాసియే యనియు వ్రాసియున్నారు.[3]

పైన పొందుపరచిన సిద్ధాంతములన్నిటిలో శ్రీనాథుని జన్మస్థానము కర్ణాటదేశ మనువారివాదము వింత గూర్చుటవలన వారి వాదమును గూర్చి యించుక విచారింపవలసియున్నది. పైవారి వాగమున కాంధ్రులచరిత్రకారులు తమ యాంధ్రులచరిత్ర మూడవ భాగమున సమాధాన మిచ్చియున్నారు. 'కర్ణాట కటక పద్మవనహేళి' అను విశేషణము కర్ణాటాధీశుని (ప్రౌఢదేవరాయలు) ముత్యాలశాలలో డిండిమభట్టారకుని వాగ్వివాదమున నోడించి కనకాభిషేకమును గొనిన సందర్భమున ప్రభు పండిత సమ్మాన పూర్వకముగ కవిసార్వభౌమ బిరుదమును బడయుటయేకాక యక్కవి కర్ణాట రాజధాని యను కమలమునకు సూర్యుడై యుండెనను నభిప్రాయము తనకు గూర్చుకొనినవాడుగాని స్వదేశమని చూపించిన యభిమానము కాదనియు, 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' అను పద్యభాగమును గూర్చి శ్రీనాథుడు కొండవీటివాడగుటవలన రాజమహేంద్రకవు లీతని కవిత్వమును కొందఱు సంస్కృతమనియు, కొందఱు కన్నడమనియు నెగతాళిచేయు సందర్భమున 'నెవ్వరేమన్న నాకేమి కొదువ, నాకవిత్వంబు నిజము కర్ణాట భాష'యని యుత్తర మిచ్చినాడనియు వ్రాసిరి. పాకనాటి బ్రాహ్మణుడగు శ్రీనాథుడు తన కవిత్వ మెందుకు గర్ణాటభాషయని చెప్పుకొనినాడని నచో రెడ్ల సామ్రాజ్య మంతరించిన వెనుక కొండవీడు కర్ణాట సామ్రాజ్యమున కలియుటవలన కొండవీ డప్పటి కర్ణాటదేశములో నుండుటవలన శ్రీనాథుని పైవిధముగా వంకలుపెట్టుటయు, దాని కాతడు పై వాక్యముల జెప్పెననియు చరిత్రకారుని యభిప్రాయమైయున్నట్లు తోచుచున్నది, 'తల్లి!

౨. కం. వీ. లిం. కవులచరిత్ర, ప్రథమ భాగము, పేజీ ౪౧౬.

3. భారతి సం. ౫; ఆంగీరస మాఘము; 'శ్రీనాథుని జన్మస్థానము'

కన్నడ రాజ్యలక్ష్మి'యను కర్ణాటదేశ మాతృసంబోధనము తన కాశ్రయములంకటు స్వర్లోకయాత్ర కేగినవెనుక శ్రీనాథుడు కన్నడదేశమున కేగినపుడు, ఆదరములేని కారణముననో మరి యేసందర్భముననో 'తల్లీ! దయలేదా! నేను డిండిమభట్టారకు నోడించిన శ్రీనాథుడ'నని మొఱపెట్టుకొని తన్నెఱుకపఱచుకొనినదనియు 'కాల్పట్టణాధీశ్వరుకొ' అని తనయొక్క తాతగారి నివాసస్థలమును జెప్పుకొనిన శ్రీనాథుని వాక్యమును సమన్వయించుటలో పల్నాటివీరచరిత్ర పీఠికాకారులు వ్రాసిన 'పశ్చిమతీరపు రేవుపట్టణమై కర్ణాటదేశమున జేరియుండవచ్చు' నను వాదము నిరాధారమని త్రోసివేసి శ్రీనాథుడు పాకనాటివాడేయని నిర్ణయించియున్నారు. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును కర్ణాటదేశస్థుడనువారి వాద ఖండమున కుపోద్బలకముగ 'పాకనాటివాడగు దగ్గుబలిదుగ్గనార్యుడు తన్నుగూర్చి 'శ్రీనాథకవి కూరిమినేయుమఱది' యని వ్రాసికొనిన వ్రాతలుగూడ చూపించి పైవాద మసంగతమని చూపించియున్నారు.

కర్ణాటదేశస్థుడనువాద మీరీతిగా ప్రధ్వంసకరుపబడినవెనుక తెలుగుదేశస్థుడనియు, కృష్ణా జిల్లాయందు మచిలీపట్టణమునకు తూర్పు సముద్రతీరమున నిప్పుడు కలుపట్టణమనిపించుకొను గ్రామమువాడనియు, దానికి దరిదాపుగాగల కాళీపట్టణమువాడనియు చెప్పబడిన వాదములు మిగులుచున్నవి. ఈ వాదమొనరించువారందరును శ్రీనాథుని జన్మదేశము తెలుగుదేశమే యనియు, పాకనాటివాడే యనియు నేకీభవించుచున్నారు.

పాకనాడునందలి వారిధితటమున నున్న కాల్పట్టణము శ్రీనాథుని తాతగారగు కమలనాభుని, తద్వారా శ్రీనాథుని బాల్యదశయందు నివాసస్థానము. కావున మొదట పాకనాడేదో నిర్ణయింపవలసియున్నది. పాకనాడు పూర్వ మేకవింశతిసహస్ర (౨౧౦౦౦) గ్రామసంఖ్యాకమగు దేశమని మంచన కేయూరబాహుచరిత్రమువలన దెలియుచున్నది.[౪] బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిగారు పూంగి, పూంగి, పోక, పాకపదములకు శబ్దార్థసంగతి కలదని చెప్పియున్నారు.[౫] సంస్కృతమున పూంగి, పూగి యనగా పోకచెక్కయనియర్థము. 'పాక్' అనగా తమిళమున 'వక్క' యనియర్థము. 'పోక' నాడు నెమ్మదిగా పాకనాడై యుండవచ్చును. కావున పూంగినాడు పాకనాడగుచున్నది. పూంగినాటివిస్తీర్ణము ప్రోలయ వేమారెడ్డి యొక్క మదరాసువస్తుప్రదర్శనశాలయందలి తామ్రశాసనమం దొకదానిలో నీ క్రిందివిధముగా జెప్పబడినది: 'శ్రీశైలము తూర్పుటంచు నంటుకొని గుండ్లకమ్మనదికి నుత్తర దక్షిణపార్శ్వములందు సముద్రమువరకు వ్యాపించియున్న దేశము పూంగినాడు.[౬] బ్రహ్మశ్రీ ప్రభాకర శాస్త్రిగారు పై శాసనమునందలి సరిహద్దులను ప్రస్తుతదేశచిహ్నములతో సమన్వయించుటలో కొంచెము పొరబడియున్నట్లగపడుచున్నారు. వీరు 'పైన పూగినాడుకు జెప్పబడిన స్థలభాగమును ప్రస్తుత కర్నూలు, గుంటూరు, నెల్లూరు, కృష్ణామండలములలో సంక్రమించిన దనదగును' అని వ్రాసియున్నారు. కాని పై శాసనములో చెప్పబడిన స్థలములలో కృష్ణాజిల్లావచ్చుట యసంభవము. కారణమేమన, పాకనాటిలోని భాగముగా కృష్ణాజిల్లాలోని యే భాగమును ఏ శాసనమందును వ్యవహరింపబడియుండలేదు. కావుననే జయంతి రామయ్య పంతులుగారు పై పూంగిదేశమునకు దక్షిణోత్తరపు సరిహద్దులను స్థిరపరుచుటలో నెల్లూరి జిల్లాయందలి కందుకూరును, గుంటూరు జిల్లాయందలి కొండవీడును సరిహద్దులుగా నిర్ణయించి యున్నారు.[౭] కాబట్టి పూంగినాడు (పాకనాడు) నందు కృష్ణాజిల్లా కలియుట కవకాశములేదు. కె. వి. లక్ష్మణరావు పంతులుగారేకారణమున నీ విషయమాలోచింపక పోయినదియు తెలియకున్నది. కాబట్టి శ్రీనాథుడు తన తాతగారగు కమలనాభామాత్యుని నివాసస్థలముగా పేర్కొనినటువంటి కాల్పట్టణము కృష్ణాజిల్లాయందు

---

౪. "అరుదందన్ వెలనాటి నోడమున జేం ద్రాజ్ఞాపనంబూని దుస్తరసక్తిన్ జని యేకవింశతిసహస్ర గ్రామసంఖ్యాకమై ధరణింబేర్చిన పాకనాడు." (కేయూరబాహుచరిత్రము)

౫. శృంగార శ్రీనాథము, పేజీ ౫.

౬. 'ఆ స్తే శ్రీగిరి పూర్వపాట నికటా దా పూర్వపాథోనిధే ర్దేశః కుండితరంగిణీముభయతః శ్రీ పూంగినామాంకితమ్'

Ep. Ind. Vol. VIII Page 9.

౭. Ep. Ind. Vol. V Page 59 No 9.

సముద్రతీరమునగల 'కాలీపట్టణము' 'కలుపట్టణములు' కానేరవు.

ఇక శ్రీనాథుని జన్మస్థానమును గూర్చి మిగిలిన వాదములు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారి కృష్ణపట్టణ మనువాదము, డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య గారి విక్రమసింహాపుర మను వాదము. శ్రీ వీరభద్రరావుగారి వాదము వారికే నచ్చలేదనియు, అదియును గాక కృష్ణపట్టణమని పద్యపాదమున జెప్పగుదురక కాల్పట్టణముగ మార్చుకొనెననియు, అటులను గుదురక కాల్ పట్టణముగా మార్చుకొని శ్రీ నాథకవి చెప్పినాడనుట యుచితము కానేరదనియు పై వాదమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిరాకరించియున్నారు. పోగా మిగిలినది డాక్టరు వెంకటరమణయ్యగారి 'విక్రమసింహపురమే శ్రీనాథునిజన్మస్థానము, అతడు బాల్యమును గడపినచోటను వాద' మొక్కటియే మిగులుచున్నది. వీరివాదన కాధారములే మన నెల్లూరుజిల్లా యంతయు పాకనాడున జేరుటయు, రెండవది హరవిలాసమున అవచిదేవసెట్టి కుమారుడగు తిప్పయసెట్టి (హరవిలాస కృతిపతి) శ్రీనాథునిజూచి 'బాలసఖుడవు శైవప్రబంధ మొకటి, యవధరింపుము నాపేర నంకితముగ' యనుటలు. దానిని వీరీక్రిందివిధముగా సమన్వయించియున్నారు. అవచి తిప్పయసెట్టి మూలపురుషుడగు పావాణిసెట్టి మొదలు తిప్పయసెట్టి వరకును వారు విక్రమసింహపురమున నుండి వర్తకము చేయుచున్నట్లు తెలియుట వల్ల[౮] శ్రీనాథునకును తిప్పయసెట్టికిని బాల్యసఖిత్వ మేర్పడవలయు నన్నచో శ్రీనాథుడు బాల్యమున విక్రమసింహపురనివాసియై యుండవలయునని స్థిరపరచిరి. అదియును గాక శ్రీనాథునకును తిప్పయకును గురువొక్కడే యనియును, అతడు పిల్లలమఱ్ఱిపెద్దన (పిల్లలమఱ్ఱిపినవీరభద్రుని తాత) యనియును చెప్పుచు నాతని గ్రామముగూడ విక్రమసింహపురప్రాంతమేయని చెప్పియున్నారు. 'పిల్లలమఱ్ఱి' వారు చూపిన చోటకాక నైజాము డొమినియన్సులో ఉన్నది. మరియు నీసందర్భమున వ్రాయుచు వెంకటరమణయ్యగారు శ్రీనాథుడు మరుత్తరాట్చరిత్రము, శాలివాహనసప్తశతి మొదలగు చిన్నగ్రంథముల నిచ్చటనే వ్రాసి ప్రాపకము సంపాదించుకొనినవాడై కొండవీడు జేరెననియు, నటుపిమ్మట ప్రాభవము సంపాదించుకొని గాని విద్యాధికారి (Director of Public Instruction) పదవి నధిష్ఠింపలేదనియు వ్రాసియున్నారు. వీరిదృక్పథమున బహువాదములకు మూలమగు కమలనాభామాత్యుని కాల్పట్టణము సంగతి మటుమాయ మగుటవలనను, శ్రీనాథునికి తిప్పయకు పిల్లలమఱ్ఱి పెద్దన గురువగుటవలనను, శ్రీనాథుని తిప్పయసెట్టి బాలసఖుడ వన్న వాక్యమునే యాధారముగా గొని శ్రీనాథుడు బాల్యమున నివసించినది విక్రమసింహపురమని నిర్ణయించుట వలన వాదనలోని శక్తి గట్టిదికాకపోవుటవలనను శ్రీనాథుని జన్మస్థానము విక్రమసింహపురము కానేరదు.

ప్రస్తుతము శ్రీనాథుని జన్మస్థానమును గూర్చి నాయభిప్రాయమును తెలియపరచవలసి యున్నది. శ్రీనాథుడు కొండవీడున విద్యాధికారిపదవిని లేతవయస్సునబడయుటవలనను, పెదకోమటి వేమారెడ్డి మంత్రిదండనాయకుల కృతిపతులుగా నొనరించుకొనుటవలనను స్థూలదృష్టితో చూచినను, అన్యుడు పరదేశమునకు వచ్చి లేబ్రాయమున విద్యాధికారిత్వము బడయుట దుర్లభముగావున శ్రీనాథుని జన్మదేశము కొండవీడు సీమయే యని తోచకమానదు. లోకమెఱిగినంతలో సీతనికి మొదటి కృతిపతి పెదకోమటి వేమారెడ్డి మంత్రియగు మామిడిసింగామాత్యునియన్న పెద్దనామాత్యుడు ఈతనిప్రాపుబాల్యమునందే పడసినవాడగుటవలన శ్రీనాథుని వంశజులను పెద్దడదండనాథు డెఱిగియుండవలయును గదా! పెద్దనామాత్యు డేప్రాంత నివాసియో తెలిసినచో శ్రీనాథుని వంశమువారును ఆప్రాంతమువారే యగుదురు.

పెద్దనామాత్య, సింగామాత్యుల పూర్వులలో చిటి పెద్ద ప్రభుడు నెల్లూరుపాలకుడుగా నున్నట్లు తెలియ నగుచున్నాడు. తరువాత మామిడి సింగామాత్యుని తాతయగు తూర్కరాజు 'నెల్లూరు తూర్కరాజ'ని చెప్పబడి

౮. హరవిలాసము ఆ. ౧- పద్యములు ౧౪-౩౦.

౯. శృం. నైషధము ఆ. ౧—పద్యము ౨౦౨.



మద్రాసు కాంగ్రెసుభవనమున విద్యార్థులు సమర్పించు కానుకలను స్వీకరింప బోవుట



మద్రాసు తిలకు ఘాటులో బ్రహ్మాండమగు బహిరంగసభ



మద్రాసులో గోకులమునందు హరిజన వాటికలను వీక్షింప బోయినప్పుడు

# కాంగ్రెసు అధ్యక్షుని ఆంధ్రదేశసంచారము



మదరాసు పత్రికా రచయితలతో సల్లాప గోష్ఠి



కోడంబాకము (మదరాసు) పారిశ్రామిక పాఠశాలసభలో నుపన్యసించుట



పెరంబూరు (మద్రాసు)లో యం. యస్. యం. రైల్వే లేబర్ యూనియను సభలో నుపన్యసించుట

యున్నాడు. కాని మామిడి ప్రెగ్గడ సింగామాత్యుల తండ్రియగు పెద్దన ‘అనవేమాధిపు రాజ్యభారకలనా దక్షుండు’గను[౧౦౨a] అతని పినతండ్రియగు నామన ‘వేమక్ష్మాపతి రాజ్యభారకలనా విఖ్యాతధీశక్తి’[౧౦౨b] యనియు పేర్కొనబడి యున్నారు. కావున మామిడన్న (సింగామాత్య, ప్రగడామాత్యుల తండ్రి) కాలమున వీరు కొండవీటికివచ్చి మంత్రిసామంత పదవుల నధిష్ఠించిరని తోచుచున్నది. కాబట్టి శ్రీనాథుని బాల్యమునుండియు కొండవీడుసీమనే వారి పూర్వుల నుండి తాత తండ్రులవరకు జన్మస్థానముగా గలిగియున్నారు. ఇక శ్రీనాథుని తాతయగు కమలనాభామాత్యుని కాల్పట్టణముకొఱకీప్రాంతమున, అనగా గుంటూరుజిల్లాయొక్క వారిధి తటమున వెదుకగా ప్రస్తుతము గుంటూరుజిల్లాకు జేరిన ఒంగోలు తాలూకాయందు సముద్రపు టొడ్డున ‘కాల్ స్తన కోట’ యను గ్రామ మొకటి కనుపించినది. అందు ఎత్తయిన భాగమున కోటయొకటి శిథిలముగా కనబడుటవలన దానికి దిగువభాగమున పట్టణ శిథిలముల వలె కన్పించు దిబ్బలుగల భాగమే పూర్వము కాల్పట్టణమని పిలువబడి యుండును. పట్టణము కాలగర్భమున నశించియుండుటవలన నందలి యున్నతమైన కోటయొక్క చిహ్నముగా ప్రస్తుత గ్రామము ‘కాల్త్సనకోట’ యని పిలువబడుచుండినట్లు కన్పడుచున్నది. ఈ ‘కాల్త్సనకోట’ యను పదము ప్రాచీనత్వమేచుకొనిన దగుటయేకాక కవితాగుంఫనము గల్గి కమలనాభామాత్యుని జ్ఞప్తికి దెచ్చుచున్నది. శ్రీనాథుని తాతయగు కమలనాభామాత్యుని కాల్పట్టణము సర్వవిధముల నిది యగునుగాని, కృష్ణాజిల్లాయందలి కలుపట్టణమును, కాళీపట్టణమును కానేరవు.

శ్రీనాథుడు తన తాతనుగూర్చి ‘వినమత్కాకతిసార్వభౌము’ డని వచించుకొనియున్నాడు. ‘కాల్త్సన కోట’ ప్రాంతమువాడగు కమలనాభామాత్యుడు ఓరుగల్లు రాజధానిగా పరిపాలించు కాకతీయసార్వభౌముని వందన మెట్లు గైకొనుట కవకాశ మున్నదను శంక కలుగవచ్చును. పూర్వ మాంధ్రదేశమున మోటుపల్లి గొప్ప రేవుపట్టణమై యాంధ్రవర్తకస్థానమై ప్రఖ్యాతి వహించినట్లు తెలియుచున్నది గదా! అందు కాకతీయ ప్రతాపరుద్రుని శాసనము లున్నవి. కాకతీయ ప్రతాపరుద్రు డెప్పుడో మోటుపల్లికి వచ్చిన సందర్భమున కమలనాభామాత్యునకు నమస్కరించియుండును. దానికి శ్రీనాథుడు తన తాత ‘వినమత్కాకతిసార్వభౌము’ డని సగర్వముగా జెప్పికొనియుండును గాని యన్యము కానేరదు. కమలనాభామాత్యునకును ప్రతాపరుద్రునకును గల సంబంధ మీపాటిదే. ప్రతాపరుద్రుని యాస్థానకవుల ననేకులను విరివిగా జెప్పు స్థానికచరిత్రలలో నీతనినామము లేదు. కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానమున గల కవులనందరిని పొగడిన గంగాంబచే పద్మపురాణ సంగ్రహకర్త యగు కమలనాభామాత్యుడు నిజముగా కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నుండినచో పొగడబడి యుండెడువాడే.

హారవిలాసకృతిపతి యగు అవచి తిప్పయసెట్టికిని శ్రీనాథునకును గల బాల్యసఖిత్వమును గూర్చి, కొంచెము ముచ్చటింప వలసియున్నది. విక్రమసింహపురవరాధీశ్వరు లగు అవచివంశజు లగు సెట్టి ప్రోలయ వేమారెడ్డి కాలమునుండియు సుగంధద్రవ్యముల ద్వీపాంతరముల నుండి గొనివచ్చి యిచ్చుచున్నట్లు హారవిలాసమునుండి తెలియవచ్చుచున్నదిగదా. అవచితిప్పయసెట్టి తనతండ్రితోపాటు కొండవీడున కనేకమార్లు వచ్చిన సందర్భమున బ్రాహ్మీదత్తవరప్రసాదు డగు శ్రీనాథుని కవితామహత్త్వమునకు లొంగిపోయినవాడయియాతనితో సఖ్యము నెఱపియుండును. వీరిరువురకును గల బాల్యస్నేహమిదియే గాని శ్రీనాథుడు నెల్లూరుగ్రామనివాసి యని చెప్పదగినట్టిది కాదు.

నాసికేతోపాఖ్యానకర్త యగు దగ్గుపల్లి దుగ్గనార్యుడు ‘తాను శ్రీనాథు కూరిమి జేయుమరది’ యని చెప్పుకొనుటవలన శ్రీనాథుని వంశముతో నాతనికి గల సంబంధమునే తెలియపరుపక యాతని గ్రామమున కీతని గ్రామ మనతిదూరమైయుండునని తలపోయుట కవకాశ ముండుట వలన బ్రహ్మశ్రీ ప్రభాకర శాస్త్రి గారు ‘కాళీ’ పట్టణము దరిదాపులో దగ్గుబల్లి, బెండపూడులు జూపియున్నారు. దుగ్గనార్యున కింటిపేరు దగ్గు

౧౦౨a & b శృంగారనైషధము, ఆ ౧—౨౯, ౩౦ పద్యములు.

బలి యనుమాట నివాసగ్రామము ననుసరించి వచ్చియుండును. అట్టిపగ్గబలి గుంటూరుజిల్లాలోని దగ్గుమల్లి గ్రామ మని చేకుమళ్లి అచ్యుతరావు పంతులుగారు చెప్పియున్నారు.[౧౧] అది యునుగాక గుంటూరు జిల్లాలోని తెనాలి తాలూకాయందు దగ్గుమల్లిపాడను గ్రామ మొకటున్నది. ఇది యైనను దుగ్గనార్యుని దగ్గుబల్లి కావచ్చును.

బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'కాలీ' పట్టణ మను గ్రామమునకు జేరువగనే బెండపూడి అన్నయ మంత్రిగ్రామ మున్నటులు చెల్పియున్నారు. కావున అన్నామాత్యుని బెండపూడిగ్రామమును గూర్చి యించుక విచారింపవలసియున్నది. కొమరగిరిరెడ్డిబావమఱదియును, సేనాధిపతియు, రాజమండ్రి రాజ్యస్థాపనాచార్యుడు నగు కాటయ వేమారెడ్డి జయించినటువంటి తూర్పుదేశగ్రామములలో బెండపూడి యొకటిగా

౧౧. భారతి సం. ౨ 'నాసికేతోపాఖ్యానము' చేకుమళ్ల అచ్యుతరావుగారు.

Foot note on the very first page

నాతనికుమారగిరిరాజీయమను కాళిదాసకృత నాటకత్రయవ్యాఖ్యానము నందలి క్రింది శ్లోకమువలన దెలియుచున్నది.

> ధాటీఘోటీఖురాగ్రత్రుటితగిరి టే
> యత్ర మాల్లేతిదుర్గం
> దుర్గం కిమ్మూరుసంజ్ఞం దళితరిపుబలే
> దుర్గవం బెండపూణ్డిమ్,
> దుర్భేదం వజ్రకూటం జితవతి రభసా
> రామగిర్యాఖ్యదుర్గం
> విఖ్యాతం వీరఘోట్టం గళిత మనుహ్యాదాం
> దుర్గసన్నాహ ధార్ష్ణ్యమ్.

పై శ్లోకమున జెప్పబడిన గ్రామములన్నియు రాజమహేంద్ర ప్రాంతమునందలివిగా చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. అట్టియెడ రాజమహేంద్రవరము రాజధానిగా పాలించిన కాటయ వేమారెడ్డి జామాతయగు వీరభద్రారెడ్డి 'రాజ్యకలనావ్యాపారదక్షు' డగు అన్నామాత్యుని బెండపూడి పైశ్లోకమునందలి బెండపూడి యగునుగాని మచిలీపట్టణమునకు దూర్పున సముద్రతీరమున నిప్పుడు కాలీపట్టణ మనుగ్రామమునకు దరిదాపున గల బెండపూడి కానేరదు.

శ్రీనాధుడు చిన్ననాటనుండియు సాహిత్యచక్రవర్తి యగు కమలనాభామాత్యుడు సేకరించిన తాళపత్ర గ్రంథములజదివి సంస్కృతప్రాకృత శూరసేని ముఖ్యభాషాపరిజ్ఞానపాటవ మార్జించి, కొండవీడు ప్రాంతముల వేవసించి 'చిన్నారిపొన్నారి చిఱుత కూకటినాడు' మరుత్తరాట్చరిత్రము ను,నూనూగుమీసాలకాలమున శాలివాహనసప్తశతిని రచించి తగుభర్తల కంకిత మిచ్చి తద్ద్వారా ప్రగడయ దండనాధునిజేరు పలుకుబడి సంపాదించియుండును. తదుపరి నాతనిపేర పండితారాధ్యచరిత్ర మొదలుగా గల కృతుల నంకిత మిచ్చి యాతని ద్వారా మామిడి సింగామాత్యుని పజ్జజేరి తననైషధము గృతియిచ్చి విద్యాధికారిత్వము బడసియుండును. అట్లుగాక శ్రీనాధుడే నిజముగా కొండవీడుప్రాంతమువాడే కాక యే నెల్లూరుప్రాంతమువాడో యగుచో విజయనగరరాజాస్థానము జేరియుండెడివాడు గాని కొండవీటి రాజుల పజ్జ జేరుట కవకాశము లేదు.

# పొత్తు చదువు

ముడియం సీతారామరావు

ఈ యిరువదవ శతాబ్దమున స్త్రీలకు విద్య యక్కఱలేదని చెప్పువారలసంఖ్య యత్యల్పముగ నుండుననుట కేసందియము నుండదు. ప్రపంచమున నన్ని దేశములందును స్త్రీలకు విద్య యత్యావశ్యక మనువారల సంఖ్యయే యత్యధికము. కాని స్త్రీవిద్యావిధాన విషయమున భేదాభిప్రాయము లనేకములుకాంచనగు. బాలికల విద్యావిధానము ప్రత్యేకముగ నుండవలయునని కొందఱనుచున్నారు. కొందఱది తగదని దృఢముగ బల్కుచున్నారు. కొందఱు పొత్తువిద్య (Co-education) మంచి దనుచున్నారు మఱికొందఱది పొత్తిగా దగదనుచున్నారు. బాలికాబాలకులు వేర్వేఱుగ విద్యనభ్యసింపవలయునా, లేక కలిసిమెలసి యేకముగ జదువవలయునా యనునది వీరిలో మిగుల క్లిష్టమైన సమస్యయైయున్నది. దీనిం గూర్చి వాదోపవాదములు చిరకాలమునుండియు జరుగుచునే యున్నవి. అయిన నిప్పటికిని సర్వజనాదరణీయ మైన తీర్మానము చేకూరినట్లు కానరాదు.

అన్ని విషయముల వ్యయము తగ్గింపవలయునని ప్రయత్నము లంతట జరుగుచుండు నీ యార్థికవిషమదశయందు పొత్తువిద్యావిధానము నాచరణములో నుంచినయెడల ఉన్నతవిద్యా విషయమున వ్యయ మెంతయైన దగ్గుననియు, అందుచేత నీపొత్తువిద్యావిధానమే ఆచరణీయమనియు అర్థికశాస్త్రవేత్త లేకగ్రీవముగ బల్కుచున్నారు. ఇట్లుండినను పాశ్చాత్య దేశముల పయితము జను లీవిషయమున నేకాభిప్రాయమున కేతెంచినవారలు కారు. సాంఘిక విషయముల ముందంజ వేయుచుండు పశ్చిమఖండవాసులే యిట్లుండ మనదేశమున నీసమస్య నంతసులువుగ బరిష్కరింపగలమా యను సంశయము మనవారలకు గల్గుట వింత కాదు. కావున మన మావిషయమున గర్తవ్యమాలోచింపవలసినసమయ మాసన్నమైనదనుట నిక్కువము.

మొదట మనదేశపు పూర్వచరిత్రను గమనింపవలయును అనాదినుండి వచ్చుచుండు మన సాంఘికాచార వ్యవహారముల బాటింపవలయును. మన జాతీయవ్యక్తిత్వము గాని, మన పూర్వసదాచారములుగాని వీడక, మన జాతీయాదర్శముల మఱవక, పూర్వపు దస్పును విరళచేయక, నూతన సాంఘికపరిస్థితుల కానుగుణ్యముగ క్రొత్త పునాదులపై మన విద్యావిధానసౌధమును నిర్మింపగల్గితిమేని, మన జాతీయవిద్యాలయములు నూతనజాతీయాదర్శములకు నాశ్రయభూములైయుండును. అప్పుడవి కేవలము పూర్వసాంఘిక విధానములను ప్రతిబింబితము చేయుటతో తృప్తినొందక ఉత్తమోత్తములగు నాదర్శముల జూపుచు ప్రఖ్యాతి గాంచుచుండు దేశములలో మన దేశమునగూడ నొక్కదానిగ జేయగల్గును

## బాధకములు

పొత్తుచదు వుచితమా, కాదా యను విషయము నాలోచించుటకుముందు స్త్రీ పురుషుల భౌతిక మానసిక విషయములనుండు సహజమైన భేదము నొకింత యోజించి వానిం బట్టి పాఠశాలలందును, కళాశాలలందును స్త్రీ పురుషు లొక్కటిగ విద్యనభ్యసించుట తగునా యను నంశము ను జర్చింతము. బాల్యదశయందు బాలికాబాలకుల కంత భేదము కన్పట్టదు కాని బాలికలయెడ యౌవనము రెండుమూడు సంవత్సరములకుముందుగా సంస్కరించుట సత్యము. ఈకాలమున వారమిత వేగముగ నెదుగుదురు. అట్టిసందిగ్ధ సమయమున బాలికలకు కాయకష్టముగాని, మానసికశ్రమముగాని యధికమయ్యెనేని, వారు దేహారోగ్యమును గోలుపోయి మానసిక బలహీనులై చిత్తవిభ్రమాది జాడ్యములకు గుఱియయ్యెదరు. బాలురవిషయ మట్లుకాదు వారీ దశయందు కాయకష్టమును, మనఃపరిశ్రమను నెంతయైన సహింపగల్గియుందురు. కావున నీ దశయందు పొత్తుచదువు తగదని విశద మగుచున్నది.

ఇంతియకాక స్త్రీపురుషుల మానసశక్తుల విషయమున పయితము కొన్ని భేదము లున్నవట. బాల్యదశయం దవి యంతగా కన్పింపకపోయినను వారెదిగినతరువాత నవి స్పష్టక బయల్పడుచుండును. బాలురు సాధారణముగ నూతన నిర్మాణశక్తి కలిగి తమ వ్యక్తిత్వమును జూప కుతూహలులై యుందురు. స్త్రీ లట్లుకాదు. వారికి శ్రద్ధ యెక్కువ. చెప్పినపని నెక్కువ యోపికతో జేయుచుందురు బాలికలు దృశ్యవిషయములయెడ నెక్కువయభిరుచి చూపగలరు. అదృశ్యవిషయములు వారికి సామాన్యముగ దలకెక్కవు. కావుననే బాలికలు భాషాప్రశంసలయందును, సారస్వత చర్చలందును అభినివేశము నెక్కువ గనబఱచుచుందురు. కాని గణితశాస్త్రమునిన వారికి సాధారణముగా దలనొప్పి వచ్చుచుండును. ఇట్లగుటచేత వీరి విద్యావిధానమున గొంత భేద ముండుట యుక్తమని తలంచుట కవకాశము కల్గుచున్నది.

## సాధకములు

అయిన నీవిషయమున నమెరికా ఖండములోని మానసిక శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయులై యున్నారు. మానసశక్తి విషయమున స్త్రీ పురుషుల కంత భేదము లేదనియు, పొత్తుచదువు సర్వవిధముల దగినదనియు వా రభిప్రాయపడుటచేత అమెరికాఖండమున పొత్తువిద్య కనువగు పాఠశాల లంతట సామాన్యములై యున్నవి.

పొత్తువిద్య కూడు ననుటకు మఱికొన్ని కారణముల జెప్పవచ్చును. సంపూర్ణపౌరజీవనమునకు విద్యయే ముఖ్యసాధనమగుటచేత బాలికాబాలకు లొకచోట గలిసిమెలిసి సమానపరిస్థితులలో జీవయాత్ర నడపుటకు దరిబీతగుట వారి భావిజీవనమున కెంతయో మేలుగ నుండునుకదా. ఇట్టి సమిష్టిజీవనము వలన బాలుర కుచితప్రవర్తన యలవడుననియు, బాలికల కనావశ్యకమగు నెక్కువ సిగ్గుబిడియముల వదలుకొని ధైర్యోత్సాహములతో బనిచేయ నేర్చికొందురనియు, అట్టి పాఠశాలలలో నేర్పడు మైత్రి కొందఱియెడ ప్రేమగా బరిణమించి యది శుభావహ వివాహములతో నంత్యమగుచుండు ననియు, వేఱు వేఱు విద్యాశాలల సాగించుటకు చేయవలసిన వ్యయము తగ్గుటచేత ఉన్నత విద్యాశాలల బలపఱచి యేకొఱంతయు లేకుండ జరుప వచ్చుననియు జెప్పుచున్నారు. పొత్తువిద్య నభ్యసించినవారలు పెద్దవారయినపు డొండొరుల సుగుణముల సంఘజీవనమున గొసంగి

జానియున్నతికి దోహదీయుందురనియు భావించు చున్నారు.

### అనుభవము

వాదములు వేఱు, క్రియలు వేఱు. వాదరూపమున పాశ్చాత్యబుధులని మంచిచెడుగుల గొంత యోజించితిమి. క్రియారూపమున నది యెట్లుండునదియు ఈ విధాన మాచరణలో నుండు దేశముల విద్యాప్రవీణుల యభిప్రాయములవలన మనకు గొంత తెలియగలదు. అమెరికా ఖండమున సుప్రసిద్ధుడగు లిండ్సే న్యాయమూర్తి (Judge Lindsay) పాశ్చాత్యవిషయమున జేసిన తీవ్రఖండన మందఱకును దెలిసినదే. డెన్వరు జూవెనైల్ కోర్టు (Denver Juvenile Court) నందు జరిగిన విచారణలలో బహిరంగపడిన విషయముల నాలోచించిన యెడల నెట్టివారలైనను భయకంపితులగుట తప్పదు. న్యూయార్కునగరమున సాల్వేషన్ ఆర్మీ (Salvation Army) కి సంబంధించిన మాతృగృహము (Maternity Home)న కధ్యక్షురాలగు ఎమిలీ నేర్డు దొరసాని "ఇక్కాలమున నవివాహితలగు తల్లులలో (Unmarried Mothers) ౧౩-౧౪ సంవత్సరములలోపుగనుండు పాఠశాలల బాలికలు నూటికి నలుబదియిద్దఱున్న వారని వక్కాణించియున్నది దీనికిక వ్యాఖ్యాన మెందులకు? పొత్తు విద్యాలయములలో గలుగుచుండు కష్టము లచటి విద్యార్థుల బుద్ధిభేదములవలన గాక సాంఘికవిషయముల చేతను, పరిపాలనావిషయమునను గలుగుచున్నవని యొకరనిరి. "పొత్తువిద్యాశాలలలోని బాలికల పనికంటె కేవల బాలికల విద్యాశాలలలోని బాలికల పనియే యెక్కువ తృప్తికరముగ నుండును" అని ఇంగ్లాండులో నొక పెద్ద బోధనాభ్యసన కళాశాలాధ్యక్షురాలు వచించెను. "స్త్రీపురుషులకు ప్రత్యేక పాఠశాలలు తప్పక యుండవలయు" నని మరియొకరు చెప్పిరి. పొత్తువిద్యాశాలలో పనిచేసినవారలలో నొకరు "బాలురకును బాలికలకును వేఱువేఱుగ బోధించుటయే సుకర"మని నుడివిరి. ఈ విషయమున హిందూబాలికల నడుమ బరోడాలోని బాలికలును, కాశీ అలహాబాదు విశ్వవిద్యాలయ విద్యార్థినులును పొత్తువిద్య నంగీకరింపదనిరి.

### మన పూర్వస్థితి

విద్యాభిజ్ఞుల యనుభవ మితర దేశముల నిట్లుండ మన దేశమున కర్తవ్యమెద్దియా యని యిక విచారింతము.

మొదట మనదేశపు చరిత్ర నొకమారు జ్ఞప్తికి దెచ్చుకొని పూర్వకాలమున మనదేశమున విద్యావిధాన మెట్లుండెనో తెలిసికొందము. వేదకాలము నాటి విషయముల నాలోచింతము. ఆకాలమున కళలు, శాస్త్రములు మిక్కిలి యభివృద్ధి పొందియుండెను. విద్యావిషయమున కార్యము చురుకుగ జరుగుచుండెను. అప్పటి సంఘమున విద్య కేయభ్యంతరము లుండినవి కావు. స్త్రీలకు రాణివాస పద్ధతి లేదు. వేదములను బట్టి చూచినను, మంత్రములను బట్టి యోజించినను స్త్రీ లన్నిదశలయందును బురుషులతో సమానముగ వేదముల జదువుచు, మంత్రపఠనము గావించుచు నుండెడివార లని తెలియవచ్చుచున్నది. ఇంతియ కాక స్త్రీలు బహిరంగ చర్చలలో గూడ బాల్గొనుచుండిరట! తత్త్వ విచారమున యాజ్ఞవల్క్యునితో గార్గీదేవి బహిరంగ సభలో వివాదము సల్పెను. మైత్రేయి, లీలావతి మొదలయిన నారీమణులు తమ బుద్ధికుశలతచేతను, పాండిత్య వైభవముచేతను నాకాలమున వాసిగాంచియుండిరి. ఆ యున్నతదశ కప్పటికాలమున నే దేశీయులుకూడ వచ్చియుండలేదు. అట్లగుటచేత వేదయుగమున స్త్రీలు జ్ఞానవతు లయి, విజ్ఞులగు తమభర్తలతో సమానముగ మెలగుచు దమవ్యక్తిత్వమును బోగొట్టుకొనక స్వేచ్ఛతో దమ యభిప్రాయముల దెలియబలుకుచుండిరనుట సత్యము.

బుద్ధునికాలమున స్త్రీలస్థితి దాదాపుగ నట్లేయుండినది దేశమున నెన్నియో మఠములు ప్రబలి యవి విద్యాపీఠములై యుండినవి. దూరదేశములనుండి సయితము బాలికాబాలకులేతెంచి ఆకాలపు కళలయందును, శాస్త్రములయందును జ్ఞానము నార్జించికొనుచుండిరి. మిథిలాదేశమునందలి గౌతమమఠమునందును, విక్రమశిలామఠమునందును నాఱు కళాశాల లుండెనయు, అప్పటికే స్త్రీపురుషుల విద్యాప్రణాళికలయందు గొంత భేద మేర్పడియుండెననియు దెలియవచ్చుటయే కాక, ఈమఠములంగు స్త్రీపురుషులు కలిసి యొకటిగా విద్య నభ్యసించుచుండిరనియు విదితమగుచున్నది.

ఈ పరిస్థితులు మధ్యయుగమున మాఱుట తప్పదయ్యెను. స్త్రీవిద్యయందు ముఖ్యముగా నీమార్పులు కలిగెను మహమ్మదీయులు మన దేశము నాక్రమించికొని దానిని బరిపాలింప సాగిరి. వారివెంబడి రాణివాసపద్ధతియు నేతెంచెను. అందుచేత మహమ్మదీయ రాజుల పరిపాలనముననుండిన యుత్తర హిందూస్థానమున రాణివాసపద్ధతి ప్రబలెను. కాని వారికి వశముకాని దక్షిణాపథంబునను, మహారాష్ట్ర దేశంబునను అది యంతగా వ్యాపింప గల్గినది కాదు. ఇక్కారణమున స్త్రీవిద్య సన్నగిల నారంభించెను. ఇందులకు దోడుపడిన కారణములు బాల్యవివాహములు, కులభేదములు, విధవావివాహ నిరసనములునని చెప్పవచ్చును. ఇట్లగుటచేత స్త్రీవిద్య పసితనమునందే నిలిచిపోవుటవలన బాలికలకు వివాహానంతరము భర్తలయింట వృద్ధస్త్రీలేర్పాటు చేయు వ్రతాదులు, పూజాపురస్కారములు మొదలగువానివలన గల్గు నాధ్యాత్మిక శిక్షయే విద్య యగుచుండినది. కావున నవీనప్రకృతిశాస్త్రవిజ్ఞానముకాని, నూతన సారస్వతకళాపరిచయముగాని వారికి లభ్యమగుట దుస్తరమయ్యెను.

ఈ స్థితి మనదేశమున రమారమి ౧౯౧౯-వ సంవత్సరమువరకు జరుగుచుండిన దనియే చెప్పవచ్చును. ఆసంవత్సరమున రాజకీయ సంస్కరణములు మన దేశమున ప్రవేశించె. దేశమునందంతట రాజకీయసంచలన మేర్పడె దానిఫలితముగ సంఘవిషయముల బురుషుల దృష్టిపథము మారజొచ్చె. రాజకీయపరిస్థితులు మారినపుడు ప్రజలకు, ముఖ్యముగా నూతనవిద్యనెఱుంగని స్త్రీలకు ఓటు (Vote) నిచ్చు స్వాతంత్ర్యము చేకూరినపుడు స్త్రీలు విద్యావతులై పురుషులకు దోడుపడిన గాని నూతన పరిస్థితులవలన గలుగవలసిన లాభము చేకూరదని విశాలదృష్టిగల పురుషులు స్త్రీవిద్యకొఱకు క్రియారూపమున దమ సానుభూతిని జూపుటచేత, గడచిన శతాబ్దమున స్త్రీవిద్య గంటుతో నభివృద్ధి గాంచినది. దాన నున్నతవిద్యకు గిరాకి హెచ్చినది. స్త్రీల కున్నతవిద్యాశాల లంతట స్థాపింప

బడవలయు నను సాంప్రదాయ మారంభమయినది. ఈ నూతనసమస్య నెట్లు పరిష్కరింపవలెనా యని కొందఱు విజ్ఞు లాలోచించుచున్నారు. పొత్తువిద్యావిధానమే నూతన పరిస్థితులకు దగిన దని కొందఱు భావించుచున్నారు. "అది సరికాదు. అట్లొనర్చితిమేని భారతీయసంఘమున నింతవఱకెన్నడును లేని స్త్రీస్వాతంత్ర్యము, స్త్రీ పురుష సమాగమ సఖ్యముల కాస్పదమగు తరుణములను అధికముగ గల్పించినవార మగుదుము. అట్టిస్థితులు మనసంఘమున లేవుకదా, వాని నిపుడు నూతనముగ జొప్పించుటచేత సంఘశ్రేయమునకు మంచిదా" అను సందియము విజ్ఞులలో గొందఱకు గల్గుటచేత వారీపొత్తు విద్యయెడ సానుభూతిని జూపకున్నారు.

## ప్రస్తుత కర్తవ్యము

స్త్రీలయం దిపు డధికసంచలనము కన్పడుచున్నది ప్రాతపద్ధతులు, ప్రాతయాచారములు మూసలో బడి ప్రకృతిశాస్త్రజ్ఞానము పాశ్చాత్యనాగరకత లనువన్నలచే దప్తమగుచున్నవి. కులభేదబంధనములు సడలుచున్నవి. శారదాచట్టము బాలికల వివాహ వయఃకాలము నెక్కువ జేసియున్నది. స్త్రీలు స్వచ్ఛంద జీవనము నభిలషించుచున్నారు. కావున జీవనాధారమునకైన ప్రాకులాటలు పురుషుల బాధించునట్లు స్త్రీలగూడ బాధించుచున్నవి. ఇట్టిస్థితిలో మనము కర్తవ్య మాలోచింపవలయును. ఈసమస్యను బరిష్కరింపవలసినవారు స్త్రీలా, పురుషులా యను వంశయ మిపు డంతగా బాధింప బనిలేదు. కాలక్రమమున స్త్రీలే దీనిని బరిష్కరింతురు ప్రకృతపరిస్థితిలో బురుషులే దీనికి దగిన సమాధానము చెప్పవలసియున్నది.

ఆలోచించిచూడ బాల్యదశయందు దేహనిర్మాణమున గాని, మానసతత్వమున గాని బాలికాబాలకుల కంత భేదము లేకుండుటచేత పొత్తువిద్య యే యుక్తమని చెప్పవచ్చును. ఈ కాలమున బాలికాబాలకు లొకచోట విద్యనభ్యసించుచు నొండొరులు గలసి మెలసి యుండవచ్చును. ఇట్లగుటచేత విద్యాశాలలకగువ్యయము తగ్గును. ఈవిషయమున భేదాభిప్రాయము లేదుగాన నిది యనుసరణీయమగు విధానమగును. రెండవదశయె యౌవనదశ. ఈ దశయందు బాలికలు త్వరగా నెదుగుదురు. దేహనిర్మాణభేదములు మాత్రమేకాక మానసభేదములు కూడ గన్పట్టుచుండును. కావున నీదశయందు విద్య వేఱువేఱుగ నిచ్చుటయే తగియుండును. ఇంతియకాక స్త్రీ లెక్కువ స్వాతంత్ర్యములతో మెలగుచుండు పశ్చిమఖండములలోనే పొత్తువిద్య యనుభవముచే బనికిరాదని తలంపబడుచుండ మనదేశమున నిపు డట్టి పద్ధతిని ప్రవేశపెట్టు టెంతయు ననర్థదాయక మగునను టకే సందియము నుండదు. మఱియు మనవారలలో స్వచ్ఛందజీవను లైయుండువారల సంఖ్య యింకను నత్యల్పము. అధికసంఖ్యాకులకు వివాహమే ప్రధానముగ నుండును గాన గృహిణులకు దగిన విద్య గావలసియుండును. గృహకృత్యనిర్వహణమున కనుకూలమగు సంగీతము, పాకశాస్త్రము, కుట్టుపని, ఆరోగ్యశాస్త్రము, చిత్రకళలు ప్రాయికముగ నేర్పి, వారల మంచిగృహిణులుగను, సన్మాతలుగను చేయవలసియుండును. కావున నీదశయందు ప్రత్యేక విద్యావిధానము, ప్రత్యేక విద్యాశాలలు ఉత్తమములు. స్వచ్ఛంద జీవనము నభిలషించు యువతుల విద్యావిషయమున నే బాధయు నుండజాలదు. అట్టివారు యువకులతో గలిసి, వారివలె విద్య నభ్యసించి, పాశ్చాత్యదేశముల నుండునట్లు స్వతంత్రజీవను లయి యుండవచ్చును. అట్టివారలకు ప్రత్యేకవిద్యాశాలల యావశ్యక ముండదు. కళాశాలావిద్యావిషయమున నంత బాధ యుండదు. యువతీ యువకులు యుక్తవయస్కులై మంచిచెడ్డల నెఱిగినవారయి యుందురుగాన వీ రేకముగ గళాశాలలో జదువవచ్చును. వీరిసంఖ్య యింకను జాలకాలము తక్కువగానుండక తప్పదు గనుక ప్రత్యేక కళాశాలల సాగించు వ్యయము చాల వఱకు తగ్గును.

కావున బాల్యదశయందు పొత్తువిద్యయు, యౌవనదశయందు ప్రత్యేకవిద్యయు, కళాశాలలందు మరల బొత్తువిద్యయు నిప్పుడు మన దేశమునకు దగిన పద్ధతులని నిరూఢిగ జెప్పవచ్చును.



S. S. S.

# నూతన రాజ్యాంగ విధానము

భావరాజు సత్యనారాయణ

బ్రిటిషుప్రభుత్వము మనకు విధించిన నూతన భారతరాజ్యాంగ విధానము ఒక అపూర్వనాటకమునుబోలి యున్నది. ఇందు కథానాయకుడు రాజప్రతినిధి, గవర్నరు జనరలు అను నామధేయములతో వర్ధిల్లును. ప్రతి రంగమునందును పలువిధములగు వేషములతో నతడు ప్రకాశించుచుండును. భక్తులను రక్షించుకొరకును, దుష్టులను శిక్షించుకొరకును, బ్రిటిషు భూభార బాధ్యతలను నిర్వహించుటకును ఇతడు ప్రతిరంగమునందును ప్రత్యక్ష మగుచుండును. ఇట్టి యీ కథానాయకుని పాత్రను కడు శ్రద్ధతో గమనించుట మన కెల్లరకును ఆవశ్యకము.

నూతన రాజ్యాంగశాసనము భారతదేశమున ఫెడరేషనును స్థాపింపబోవుచున్నది. ఈ ఫెడరేషనుకు గవర్నరు జనరలును ప్రధాన రాజకీయాధికారి(Head of the Government)గా నియమింతురు. ఫెడరలు ప్రభుత్వవిధానము ప్రస్తుతమురాష్ట్రములలో వ్యవహరింపబడుచున్న ప్రభుత్వమును బోలియుండును. దీనినే ద్వంద్వప్రభుత్వము (Diarchy) అందురు. మినహాయింపు అంశములను(Reserved Subjects) గవర్నరు జనరలు మంత్రులతో నిమిత్తము లేకుండ తానే పరిపాలించును. ఈ అంశములకు సంబంధించిన విధి కృత్యములను (Duties and Functions) నిర్వహించుటకుగాను గవర్నరు జనరలుకు సలహాదారులు (Counsellors) ఉందురు. స్వాధీనము చేయబడిన అంశములను (Transferred Subjects) గవర్నరు జనరలు మంత్రుల యనుమతిచొప్పున పరిపాలించును. ఇవిగాక వైస్రాయిఅధికారములను - అనగా సార్వభౌమునికి సంస్థానాధిపతులమీద గల అధికారములను(Powers of Paramountcy) గవర్నరుజనరలే రాజప్రతినిధి అను పేరుతో నిర్వహింపవలసియున్నది. ఈ కారణములవలన భారతప్రభుత్వ విధానమునందు గవర్నరు జనరలు త్రిపాత్ర ధారి యగుచున్నాడు :

i గవర్నరుజనరలు ప్రత్యేకము-మినహాయింపు అంశములు (Governor General and Reserved Subjects)

ii గవర్నరు జనరలు, మంత్రులు - స్వాధీనపు అంశములు (Governor- General and Ministers-Transferred Subjects)

iii రాజప్రతినిధి- సార్వభౌముని అధికారములు (Viceroy-Powers of Paramountcy)

ఇట్టి విధానము ఏరీతిగా పరిణమించునో సావధానముగా పరిశీలించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

### రాజప్రతినిధి- సార్వభౌముని అధికారములు

ప్రస్తుతము అమలులో నున్న ఆచార సంప్రదాయము ప్రకారము స్వదేశసంస్థానములపైన (Indian States) సార్వభౌముడు (Emperor) చెలాయించు అధికారముల నన్నిటిని గవర్నరుజనరలు - కార్యనిర్వాహకవర్గము కలిసి (Governor General in Council) నిర్వహించుచున్నారు. ఫెడరేషను ప్రారంభమయిన తరువాత గవర్నరుజనరలు-మంత్రుల సంయుక్తాధికారమునకు లోబడియుండవలసివచ్చు ననియు, అట్టిచో తమ సంస్థానముల కెక్కుడైన ముప్పువాటిల్లు నను భయము

చేతను, వైస్రాయి అధికారములను గవర్నరు జనరలు నిత్యకృత్యములను స్పష్టముగా విడదీసి వేరుచేయవలసినదని సంస్థానాధీశ్వరులు కోరిరి. బట్లరుకమిటీ వారు తమనివేదికయందు సంస్థానాధిపతులు కోరినట్లు 'గవర్నరు జనరలు కౌన్సిలు గాక వైస్రాయిగారే యికముందు సార్వభౌముని అధికారములను చెలాయింపవలసిన' దని తీర్మానించిరి. నూతన-ఇండియాచట్టమందు ఈతీర్మానమునకనుగుణముగా వైస్రాయినే సార్వభౌముని ప్రతినిధిగ నియమించిరి.

ఫెడరేషనుకు సంస్థానాధిపతులు తమ ఒడంబడికపత్రములమూలముగా (Instruments of Accession) వశముచేసిన అంశములందుగాక మిగిలిన అంశములందు సార్వభౌమునికి సంస్థానములపైన గల అధికారములను సార్వభౌముని ప్రతినిధిగా వైస్రాయి నిర్వహించును

వైస్రాయిపనులను, అధికారములను ఇవి యని నిర్ధారణచేయుట కష్టము. సంస్థానాధిపతులు సార్వభౌముని అధికారమును స్పష్టముగా నిర్ధారణచేయవలసిన దని కోరగ, బట్లరుకమిటీవారు అది వీలులేదని తెలిపిరి.

"Paramountcy must remain paramount; it must fulfil its obligations defining or adopting itself according to the shifting necessities of the time and the progressive development of the States"

(Butler Committee Report.)

ఏ పత్రమునందును స్పష్టీకరింపబడని యీసార్వభౌముని అధికారములను వైస్రాయి తన విచక్షణా వివేకముతో (Discretion) చెలాయించును. ఏఅంశమునందుగాని సార్వభౌమునకు అధికారము గలదని సూచించుటయందు వైస్రాయిబుద్ధిచాతుర్యములు వెల్లడియగును. వైస్రాయి తనంతటతానే సార్వభౌముని ప్రతినిధియై, ఆయనతరఫున ఆ అధికారములను నిరూపించును. సాధారణముగా వైస్రాయికృత్యములు మూడుఅంశములందు విభివిగా నుండును:

1 సంస్థానాధిపతులకు ఒకరితో నొకరికి గల ఉత్తర ప్రత్యుత్తరములందును, వాటికి సంబంధించిన విషయములందును గల పరిశోధనాధికారము.

2 సంస్థానాధిపతులకు అభయమొసంగుట, వారి సంస్థానములను రక్షించుట మొదలగు వ్యవహారములు

3 అక్రమ పరిపాలన, దుష్ప్రవర్తన సందర్భమున జోక్యము కలుగజేసికొనుటకు అధికారము.

ఈ సందర్భములందు వైస్రాయిఅధికారము చాలఅధికముగా నుండును.

వైస్రాయి అను పదము ఏచట్టమునందును కనబడదు. ఆచార సంప్రదాయములనుబట్టి యీ పేరు భారత రాజ్యాంగసంస్థలలో వ్యవహరింపబడుచున్నది; సార్వభౌముని ప్రాతినిధ్యమును తెలియజేయుచుండుట వలన వాడుకలోనికి వచ్చినది.

గవర్నరు జనరలే యింతవరకు ఈ నామముతో గూడ పిలువబడుచున్నాడు. కాని యికముందు గవర్నరు జనరలుకు కార్యభారము అధికమగునని తోచినయెడల వైస్రాయిగా మరియొక అధికారిని నియమించుటకు అవకాశము కలదు. సాధ్యమైనంతవరకు గవర్నరు జనరలు వైస్రాయి నిత్యకృత్యములను ఒక్కడే నిర్వహించునని తోచుచున్నది.

**గవర్నరుజనరలు — మినహాయింపు అంశములు**

ఫెడరేషనులో మినహాయింపు అంశములను గవర్నరు జనరలు తన ఇంగితజ్ఞానముతో పరిపాలించునని పైన చెప్పబడెను. ఆ మినహాయింపు అంశము లేవనగా

(1) దేశరక్షణశాఖ (Department of Defence)

(2) విదేశ రాజ్యాంగ శాఖ (Department of External Affairs)

(3) మతాచార శాఖ (Department of Ecclesiastical Affairs)

ఇవిగాక గవర్నరుజనరలు ప్రత్యేకపు తనిఖీక్రింద (1) బ్రిటిషుబెలూచిస్తాను; (2) కమీషనరురాష్ట్రములు; (3) చట్టమునందు గవర్నరు జనరలు బాధ్యతకు లోబడిన విషయములును పరిపాలింపబడును. ఈ అంశముల పరిపాలనాబాధ్యత గవర్నరు జనరలు వహించి, భారత రాజ్యాంగ కార్యదర్శి (Secretary of State for India) మూలముగా బ్రిటిషు పార్లమెంటుకు సమాధానము చెప్పవలసి యున్నది. ఈ కార్యములను చక్కబెట్టుటయందు గవర్నరు జనరలుకు సహాయము కావలసియున్నది. అందుచేత అతనికి ముగ్గురు సలహాదారులను నియమించుటకుఅధికారము నొసంగబడెను. ఆ సలహా

దారుల జీతములు, ఉద్యోగపు షరతులు బ్రిటిషు మంత్రివర్గముయొక్క ఆర్డర్లమూలముగా నిర్ణయింపబడును. ప్రతికౌన్సిల్లరు ఉద్యోగరీత్యా (Ex-officio) ఫెడరలు శాసనసభలకు (Federal Chambers of Legislature) అదనపు ప్రతినిధిగా నియమింపబడును. వోటింగుహక్కుతప్ప తదితరహక్కులన్నియు వీరికి ఉండును. అన్నిచర్చలందును, వాదములందును వీరు పాల్గొనవచ్చును గవర్నరుజనరలుకు తప్ప వీరు మరియెవరికిని జవాబుదారీ కాదు. రిజర్వుడు డిపార్టుమెంటుల పరిపాలనా విషయములందు శాసనసభలలో వీరు గవర్నరు జనరలు ప్రతినిధులుగా (Spokesmen) పనిచేయుదురు.

ఈ రిజర్వుడు డిపార్టుమెంటుల పైన ప్రస్తుత రాజ్యాంగ విధానము ప్రకారము గవర్నరు జనరలు కౌన్సిలుకు గల అధికారమంతయు నూతన చట్టము ప్రకారము గవర్నరు జనరలుకు ప్రత్యేకము ఒసగబడెను. దేశరక్షణ బాధ్యత అంతయు గవర్నరు జనరలుమీద ఆధారపడి యున్నది. ఇప్పటివలెనే సార్వభౌమునిచే ప్రధాన సేనాధిపతియొకడు నియమింపబడును. నూతనచట్టము ప్రకారము ఇతనికి శాసనసభలలో ప్రతినిధిగానుండుటకు గాని, చర్చలందు పాల్గొనుటకుగాని అధికారము లేదు. గవర్నరు జనరలు ఆజ్ఞకు లోబడి ఇతడు దేశరక్షణ కార్యములను చక్కబెట్టవలెను. దేశరక్షణయందు ప్రస్తుతము పార్లమెంటుకు గల అధికారము నూతన రాజ్యాంగవిధానమందు గవర్నరు జనరలుకు స్వాధీనము చేయబడెను. అనగా భారతదేశరక్షణనిమిత్తమని రూఢిచేసి, విదేశములలో యుద్ధములకు ఇండియాసైన్యమును పార్లమెంటుఆజ్ఞ అక్కరలేకనే పంపుటకు గవర్నరుజనరలుకు అధికారమొసగబడెను. కాని తుదిని గవర్నరుజనరలు తాను నిర్వహించు అన్ని కార్యములకు పార్లమెంటుకు జవాబుదారీగా ఉండవలెను.

విదేశ రాజ్యాంగ శాఖ చాల ముఖ్యమైనది. ఇందు గవర్నరుజనరలుకు విశేషమైన అధికారము కలదు. ఇతర దేశములతో వర్తకవాణిజ్యపు టొడంబడికలను నిర్ణయించుటకును, విదేశములందు వాణిజ్యప్రతినిధులను (Commercial Agents), రాజ్యప్రతినిధులను (Consuls)నియమించుటకును గవర్నరుజనరలుకు ప్రత్యేకము అధికారము కలదు. ఈశాఖ రిజర్వుడు అయియుండుటవలన గవర్నరు జనరలు భారతదేశని దేశవ్యవహారములన్నింటెనితనయిష్టమువచ్చినట్లు చక్కబెట్టవచ్చును. కాని భారతరాజ్యాంగ కార్యదర్శి ఆదుపాజ్ఞలకు లోబడి, పార్లమెంటు అభిమతమును నెరవేర్చుటకు గవర్నరుజనరలు బాధ్యుడై యున్నాడు.

మతాచారశాఖ అంత ప్రముఖమైనది కాదు. ఈడిపార్టుమెంటు భారతీయుల మతాచారములను సంరక్షించుటకు నియమింపబడలేదు. ఉద్యోగరీత్యా భారతదేశమునకు దయచేసిన బ్రిటిషువారియొక్క (సైనికులు,సివిలుఉద్యోగులు) మతములు, ఆచారములు సరిగా వ్యవహరింపబడునట్లు చూచుట యీశాఖయొక్క ప్రధానోద్దేశ్యము. ఈ డిపార్టుమెంటు ఖర్చులు ౮౦ లక్షల రూపాయలకు మించకూడదని చట్టమునందు నిర్ణయించిరి.

ఇవిగాక గవర్నరుజనరలుయొక్క విచక్షణావివేకమునకు అనేకాధికారములను వశముచేసిరి.

### గవర్నరు జనరలు - మంత్రులు

మంత్రులకు స్వాధీనము చేయబడిన శాఖలను గవర్నరు జనరలు మంత్రుల సహాయముతో పరిపాలించవలెను. మినహాయింపు అంశములు కానివి అన్నియును మంత్రులస్వాధీనమయిన విషయములుగా పరిగణింపవచ్చును — రివెన్యూ, ఆర్థికము, వాణిజ్యము, రైల్వేలు, విమానములు, దేశాభివృద్ధి (విద్య, ఆరోగ్యము మున్నగునవి). ఈ శాఖల పరిపాలనా బాధ్యతను వహించు మంత్రివర్గము పదిమందికంటె మించకూడదు.

తన ప్రత్యేక బాధ్యతలకు (Special Responsibilities) మంత్రుల సలహా వ్యతిరేకముగా తోచినయెడల గవర్నరుజనరలు మంత్రుల సలహాను 'త్రోసిరాజ'ని తన విచక్షణాజ్ఞానమును ఉపయోగించి కార్యములను చక్కబెట్టవచ్చును.

మంత్రులు గవర్నరు జనరలుచే నియమింపబడి వారి ఉద్యోగములకు గవర్నరు జనరలు దయకుపాత్రులై యుందురు. నియమింపబడిన మంత్రులు ఆరునెలలలోపున ఫెడరలు శాసనసభలకు ప్రతినిధులుగా ఎన్నుకొనబడవలెను; లేనిచో మంత్రిపదవిని గోల్పోవుదురు. గవర్నరు జనరలు నియమించుట అనగా శాసన



కాకినాడలో జమీందారు పైడా వెంకట నారాయణగారి ఆతిథ్యమును స్వీకరించు నవసరమున



రాజమహేంద్రవరమున పెద్దలతో ఇష్టాగోష్ఠి.



తమ జన్మదినోత్సవము నాడు శుభాశంసనల నందుకొనుట

ఒంగోలు జిల్లాబోర్డువారి సన్మానపత్రము పరిగ్రహించుట



శ్రీ కాశీశ్వరరావుగారి యింటిలో విందుసందర్భమున



బెజవాడ ఆంధ్ర జింఖానా క్లబ్బు ఆవరణలో బ్రహ్మాండ బహిరంగసభ



బెజవాడ స్టేషనువద్ద దర్శనాకాంక్షతో సమావేశమయిన జనసమూహమున నొకభాగము



విజయనగరములో బహిరంగగోష్ఠి



నాయుడుపేటలో స్వాగతస్వీకరణము



నాయుడుపేటలో బహిరంగసభ



నాయుడుపేటలో నుపన్యాసము

వెంకటగిరిలో సమ్మానము

సభలయందు ఘనత, ప్రాముఖ్యత వహించిన ప్రతినిధిని పిలిచి అతనిని మిగిలిన మంత్రులను ఎన్నుకొనమని చెప్పుట. దీనినే కేబినెటును స్థాపించుట యందురు. మొదటి మంత్రుల జీతములు గవర్నరు జనరలుచే నిర్ణయింప బడును. మంత్రులు గవర్నరు జనరలుకు ఇచ్చు సలహాలను విచారణచేయుటకు న్యాయస్థానములకు అధికారము లేదు.

రాజనిర్దేశపత్రము (Instrument of Instructions) గవర్నరు జనరలు తనమంత్రులతో నేరీతిగా ప్రవర్తింపవలెనో ప్రకటించును. అట్లు ప్రవర్తింపలేదను పక్షమున గవర్నరు జనరలు అధికారము అధర్మముగాను, అక్రమముగాను ప్రవర్తింపబడదు. ముసాయిదా రాజనిర్దేశపత్రమునందు (Draft Instrument of Instructions) గవర్నరు జనరలు తన మంత్రులను ఎన్నుకొను విధానము వివరింపబడెను. "శాసనసభయందు బలాధిక్యము, తమతీర్మానములను జయప్రదముగా కొనసాగించు శక్తి కలిగి మంత్రిత్వబాధ్యత వహింపగల వారిని మాత్రమే గవర్నరుజనరలు తనమంత్రులుగా నియమింపవలెను; సాధ్యమైనంతవరకు ఫెడరేషనులో జేరిన సంస్థానములకు (Federated States) ప్రధానమైన అల్పసంఖ్యాకులకు (Important Minorities) ప్రాతినిధ్యము నొసగవలెను. ఈ మంత్రులను నియమించుటలో గవర్నరుజనరలు ముఖ్యముగా సమిష్టి బాధ్యతాభావమును (Joint Responsibility) పెంపొందించుటకు అనువగు వాతావరణమును కలుగజేయవలెను."

మంత్రులు, కౌన్సిల్లర్లు ఏరీతిగా మెలగవలెనో, అందు గవర్నరు జనరలు ధర్మములెట్టివో రాజాజ్ఞపత్రమునందు ఇట్లు వివరింప బడెను: "గవర్నరుజనరలు, సలహాదారులు, మంత్రులు- వీరు ఐకమత్యము కలిగి, ఒకరితో నొకరు స్వేచ్ఛగా పరిపాలన కార్యములను గురించి సంప్రతించుటకు ప్రయత్నించవలెను. ఈ అన్యోన్యతను గవర్నరుజనరలు పెంపొందింపవలెను." "దేశరక్షణ శాఖయందు భారతీయులను ఉన్నతోద్యోగములందు నియమించుట, ఇండియా సైన్యమును పరదేశములకు పంపుట మున్నగు విషయములలో గవర్నరు జనరలుకు మంత్రుల సలహాను తీసికొను బాధ్యత కలదు." ఈ ఉద్దేశము లన్నింటికి గవర్నరు జనరలు బాధ్యుడై పరిపాలించవలెను.

మంత్రివర్గము కార్యనిర్వాహణమును త్వరితముగాను, జయప్రదముగాను జరుపుటకు కొన్ని నిబంధనలు, కట్టుబాట్లు అవసరము. అట్టినిబంధనలను చేయుటకును, డిపార్టుమెంటు లన్నిటిని మంత్రివర్గమునందు విభజించు విధానమును (Port-folio system) నిర్ణయించుటకును గవర్నరు జనరలుకు అధికార మొసగబడెను. ఫెడరలుప్రభుత్వమునకుగాని, గవర్నరు జనరలు ప్రత్యేకబాధ్యతలకుగాని సంబంధించిన విషయములందు గవర్నరుజనరలుకు కావలసిన భోగట్టా యావత్తును తెలియపరచుటకు ప్రభుత్వకార్యదర్శులు (Secretaries of various departments) బాధ్యులై యుందురు. తనకు కావలసిన సెక్రటరీలను, గుమాస్తాలను నియమించుటకు గవర్నరుజనరలుకు అధికారము కలదు.

### ప్రత్యేక బాధ్యతలు

గవర్నరుజనరలు ఫెడరలు ప్రభుత్వపరిపాలనలో కొన్ని ప్రత్యేక బాధ్యతలను వహింపవలెను. వీనినే సామాన్యముగా సేఫ్ గార్డ్సు (Safe-guards) అని అందురు. అవి:

(1) దేశమునందు శాంతి క్రమపద్ధతికి భంగము కలుగకుండ కాపాడుట.

(2) ఫెడరలు ప్రభుత్వముయొక్క ఆర్థిక ప్రతిష్ఠా స్థానమును నిలబెట్టుట.

(3) అల్ప సంఖ్యాకుల సవ్యమైన హక్కులను కాపాడుట.

(4) ఇండియా సివిలు సర్విసు ఉద్యోగీయులయొక్క న్యాయమైన హక్కులను కాపాడుట.

(5) వాణిజ్యవిచక్షణకు సంబంధించిన చట్టములమీద కార్యనిర్వాహకవర్గమునకు గల హక్కులను చేకూర్చుట.

(6) గ్రేటుబ్రిటను నుండిగాని, బర్మానుండిగాని ఇండియాకు దిగుమతియగు వస్తువులపైన శిక్షారూపమైన విచక్షణతో సుంకములను విధింపకుండ నివారించుట.

(7) సంస్థానములకును, తదధిపతులకును గల హక్కులను, గౌరవములను కాపాడుట.

(8) గవర్నరుజనరలుకు ప్రత్యేకము - అనగా అతని విచక్షణజ్ఞానముచే పరిపాలింపబడుటకు- మినహాయించిన అంశముల ప్రభుత్వనిర్వహణమునకు తగిన సాధనములను చేకూర్చుట.

ఈ బాధ్యతలవలన గవర్నరుజనరలు మంత్రుల సలహాలను పెడచెవినిబెట్టి, తన కుశాగ్రబుద్ధితో సరాఘాటముగా నిరంకుశాధికారమును చెలాయింపవలసియున్నది.

గవర్నరు జనరలు-శాసనసభలు

గవర్నరు జనరలుకు శాసనసభలందు గల అధికారములను గూడ గుర్తించుట అవసరము. శాసనసభలు సమ్మతించిన ప్రతి చట్టమునకు గవర్నరు జనరలు తన సమ్మతిని తెలుపుటకుగాని, అసమ్మతిని తెలుపుటకుగాని, సార్వభౌమునిఅనుజ్ఞకు ప్రత్యేకించుటకుగాని అధికారము కలదు. గవర్నరు జనరలు అనుమతి లేనిదే కొన్ని విషయములకు సంబంధించిన చట్టములను శాసనసభలయందు ఉపపాదించుటకు వీలులేదు. ఏ విషయములను గురించి కాని శాసనసభలందు జరిగెడి చర్చలు, వాదములు తన ప్రత్యేక బాధ్యతలకు వ్యతిరేకముగా నున్నట్లు తోచినయెడల అట్టి చర్చలను, తీర్మానములను, చట్టములను నిలిపివేసి, వాదములనుచాలించి వాటిని రద్దుచేయుటకు గవర్నరు జనరలుకు అధికార మొసగబడెను.

అనిర్దిష్టాధికారములు (Residuary powers) గవర్నరుజనరలు వశముచేయబడెను.

ఆర్థికవ్యవహారములందు గవర్నరుజనరలుకు ఆఖరు అధికారము గలదు. గవర్నరు జనరలుయొక్క, మినహాయింపు అంశములకు సంబంధించిన ఉద్యోగీయులయొక్క జీతములను శాసనసభలు తగ్గించుటకు గాని, ఇవ్వకపోవుటకు గాని అధికారములేదు. అంచనా లెక్కలను తగ్గించిన యెడల గవర్నరుజనరలు తిరిగి ఆ యావత్తు సొమ్మును చేకూర్చును. గవర్నరుజనరలు రాజకీయాధికారములకన్న ఈ ఆర్థిక సామ్రాజ్యాధికారమే బహుభీకరమైన దని చెప్పవలెను.

మంత్రుల సలహాతోను, అనుమతితోను చట్టతుల్యమగు ఉత్తరువులను (Ordinances) శాసించుటకును, మంత్రులతో నిమిత్తము లేకుండ తన విచక్షణజ్ఞానముతో కూడ చట్టతుల్యమగు శాసనములను శాసించుటకును, మంత్రులను, శాసనసభలను లెక్కచేయకుండ 'గవర్నరు జనరలు చట్టములను' ప్రకటన చేయుటకును, నిర్ణీతమైన రాజ్యాంగవిధానము నిష్ఫలమై కార్యభారములు కొనసాగనియెడల రాజ్యాంగవిధానమును మూడు సంవత్సరముల వరకును నిలిపివేసి తన నిరంకుశాధికారము చెలాయించుటకును గవర్నరు జనరలుకు సంపూర్ణాధికారమొసగబడెను. ప్రధానోద్యోగీయులను నియమించుటకు కూడ గవర్నరు జనరలుకు అధికారము కలదు. మంత్రుల యనుమతిచొప్పన ఒక ఆర్థిక సలహాదారుని (Financial Adviser) గవర్నరు జనరలు నియమించును. ఈ ఆర్థిక సలహాదారు తన ఉద్యోగపరిమితికి గవర్నరు జనరలుదయకు పాత్రుడై యుండును. ఆర్థిక వ్యవహారములందు గవర్నరు జనరలుకు గల ప్రత్యేకబాధ్యతను నిర్వహించుటకు ఇతడు తోడ్పడును.

ఒక ప్రధాన న్యాయవాది (Advocate General) కూడ గవర్నరుజనరలుచే నియమింపబడును. గవర్నరు జనరలు తన యిష్టమువచ్చినపుడు ఇతనిని ఉద్యోగమునుండి తొలగింపవచ్చును. ఫెడరలు ప్రభుత్వమునకు చెందిన చట్టనిర్మాణకార్యములందు గవర్నరు జనరలుకు సవ్యమైన సలహాల నిచ్చుటకు నితడు బాధ్యుడగును.

ఫెడరలు రైల్వేబోర్డు అధికారులను, రిజర్వుబ్యాంకు అధికారులను నియమించుటయందు కూడ గవర్నరు జనరలుకు కావలసిన అధికారమొసగబడెను.

గవర్నరు జనరలుయొక్క ప్రాముఖ్యమును ఇంతస్వల్పమైనవ్యాసమున వర్ణించుట కష్టతరము. అతని అధికారములను ఒక పుస్తకమునందు ఇముడ్చుట కూడ దుర్లభమగు నేమో! ఫెడరలుప్రభుత్వమునకు గవర్నరుజనరలుఒక అంకుశమువంటివాడు. అతని యభీష్టముచొప్పన శాసనసభలు సమావేశమగును; ఆగిపోవును; పరిసమాప్తి నొందును. అతని యిష్టము వచ్చినపుడు శాసనసభలందుపన్యసించును; తనకు తోచినప్పుడెల్ల శాసనసభలకు సందేశములు పంపును. మంత్రివర్గముయొక్క సభలయందు గవర్నరు జనరలు అగ్రాసనాధిపత్యమును (తనకు నచ్చిన సమయములందు) వహించును.

ఇంతవరకు కేంద్రప్రభుత్వమునందు గవర్నరుజనరలుకు గల అధికారములను గ్రహించితిమి. ఇంక రాష్ట్రములందును, ఫెడరేషనులో చేరిన సంస్థానములందును అతనికి గల గూఢాధికారమును కూడ తెలిసికొనవలెను. రాష్ట్రాధికారులైన గవర్నర్లు, వారి నిత్యకృత్యముల కెల్ల గవర్నరుజనరలుకు జవాబుదారీగా నుండవలెను. గవర్నర్లందరును గవర్నరుజనరలు ప్రత్యక్ష-తనిఖీక్రింద పనిచేయుదురు. గవర్నరుజనరలు తలచిన ప్రతి కార్యమునకును వీరు చేదోడైయుండవలెను. దీనినే - అనగా నీ అనైక్యమునే కాబోలు ప్రొవిన్షియల్ అటానమీయందురు. ఫెడరలుఅధికారము సంస్థానములలో వర్తింపజేయుటకు గవర్నరుజనరలుకు ప్రత్యేకము అధికారము మొసగబడెను. ఏ సంస్థానమైనను ఫెడరలుఅధికారమును ధిక్కరించినపుడును, ఫెడరలుకార్యములను ఆచరింపని సమయములందును గవర్నరు జనరలు తన విచక్షణ జ్ఞానమున కేమి తోచిన ఆ విధముగా ప్రవర్తింపవచ్చును. నూతన భారత రాజ్యాంగవిధానమున భారతదేశమును మూడు లోకములుగా భాగింతురు: బ్రిటిషురాష్ట్రములు, ఫెడరేషనులో చేరిన సంస్థానములు, ఫెడరలుప్రభుత్వము. ఈ మూడు లోకములలోను గల అధికారములనుబట్టి గవర్నరుజనరలుకు 'త్రిలోకసంచారి' అను నామ మిడిన ఆశ్చర్యము కలుగదు.

భారతీయులకు జవాబుదారీ కానట్టియు, పరదేశమునకు జెందినట్టియు వానికి గవర్నరుజనరలు పదవి నొసగి, తత్సంబంధమైన అధికారముల నొసగుటవలన అతడు భారతదేశాభ్యుదయమునకు తోడ్పడునని రూఢిగా చెప్పజాలము. గవర్నరు జనరలు ప్రత్యేకబాధ్యతయని మంత్రుల కొసగిన అధికారములను నిరర్థకము చేయును. వారు శాసనసభలకు జవాబుదారీ కానేరరు. ఫెడరలు శాసనసభలలో సంస్థానముల ప్రతినిధులు గవర్నరు జనరలుకు పరిపాలనావిషయములలో సహాయముగ నుందురు. బ్రిటిషు ఇండియాయందు ప్రజాపరిపాలనాసంస్థను పెంపొందించుటకు గాని, దేశాభివృద్ధికి సంబంధించిన మార్పులను చేయుటయందుగాని, సంస్థానప్రతినిధులు బ్రిటిషు ఇండియాప్రతినిధులకు సహాయము చేయరు. సంఘబలములేని యీ శాసనసభలను గవర్నరుజనరలు లెక్కచేయక తన పరిపాలనమును కొనసాగించును. ఇట్టి భారతరాజ్యాంగవిధాన మనెడి రథమునకు గవర్నరుజనరలు ఆరితేరిన సారథి యగుచున్నాడు.

పైన వర్ణింపబడిన నూతనభారత రాజ్యాంగవిధానము భారతీయుల ఆశాలతలను పుష్పించి ఫలింపజేయునా యని సందేహము కలుగుచున్నది. భారతీయుని కెవ్వనికైనను గవర్నరుజనరలుపదవి నొసగినచో మనకు రాజ్యాంగవిధానముతో నిమిత్తము లేకయుండును; ప్రత్యేకబాధ్యతలు మనల నేమియు బాధింపవు. గాంధిమహాత్మునిగాని, మాలవ్యాజీనిగాని, జిన్నానుగాని, సప్రూనుగాని, మరి యేభారతీయునైనను గవర్నరు జనరలుగానియమించిననాడు మనము నూతనభారతరాజ్యాంగవిధాన చట్టమును జూచి భయపడ నక్కరలేదు. పరదేశీయుడు మనకు గవర్నరుజనరలుగా నున్నంతకాలము ప్రత్యేకబాధ్యత లేవిధముగా వ్యాఖ్యానము చేయబడునో, వాటివలన గవర్నరు జనరలు (బ్రిటిషు) అధికారము లేరీతిగా ప్రజ్వరిల్లునో, అతని నిత్యకృత్యము లెట్టిరీతిగా పరిణమించునో ఊహింపవచ్చును. బ్రిటిషుగవర్నరు జనరలు భారతదేశాభివృద్ధి కొరకు శ్రమపడుభావము కల్గి, వ్యక్తిస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యమునుపాటించుచు భారతదేశమున అధినివేశస్వరాజ్యము (Dominion Status) సాపించుటకు పాటుపడి ధర్మబద్ధుడగు ఆంగ్లరాజువలె ఉండినయెడల నూతన చట్టము కొంతవరకు రాణించును. కాని బ్రిటిషుప్రభుత్వమును ఆచంద్రార్కము, ఆ సేతుహిమాచల పర్యంతము భారతదేశమున నడిపించుటకు బ్రిటిషుగవర్నరుజనరలు ప్రయత్నించినయెడల ఈ రాజ్యాంగవిధానము గతి యేమగునో సూచించుట అనవసరము. కాబట్టి నూతనభారత రాజ్యాంగ విధానము ఫలించునా అను విషయము బ్రిటిషు గవర్నరు జనరలుయొక్క బుద్ధిచాతుర్యములు, విచక్షణాజ్ఞానము, సాహసౌదార్యములు, ఉదాత్తత, విశాలభావము మున్నగు సద్గుణములమీద నాధారపడియున్నది.



అంకితం

కొత్తపోకడలు అంటే
భయంలేనివాళ్లకు

***

అప్సర

శ్రీ మేనాకమనా
సుమనోదయ కోమల రమణా
కోరకహీరమణీరదనా
భారవికర పులకితకుముదా
ధారా జయ వసంత మాధవ—
విజయీభవ.

[ఓయ్యాలమంచి విలాసంతో, రెండో ప్రక్కకు నడిచిపోతుంది. తెర ఎత్తగా]

* ఒకటోరంగం *

[ఆశ్రమ ప్రాంత పుణ్యభూమి: విశాలమైన మఱ్ఱిచెట్టుమొదట వేదికమీద పలచని లేడి చర్మపు రజాయి జాగుగా పరచిఉంటుంది: ఒక చివరగా, అజంతా బొమ్మల్లో చూసే మధుకలశము, పానపాత్రమూ ఉంటవి: వాటి ప్రక్కన హుక్కా :

కొంచెందూరంలో, జాలువారుతూన్న సెలయేటి అంచున, అప్పుడప్పుడే అంకురిస్తూన్న బాలతృణాల్ని మునిపంట నొక్కుతూ, తిరుగుతూన్న ఆడలేడిని అనుసరించి, బాలకురంగం చెంగున గెంతుతూంది. విశ్వామిత్రుడు వేదికకు మరో అంచున ఠీవిగా కూర్చుని, ఆవంక చూస్తూంటాడు.

శిష్యుడు ప్రవేశిస్తాడు: కొంచెం బెదురుతూ దూరంగా నిలవబడి, ముందుకు రెండడుగులు వేసి, మళ్లా తటపటాయిస్తూ]

శిష్యుడు

జయము, జయము గురుపాదులకు!

విశ్వామిత్రుడు

[ఒక నిమిషం ఊరకుండి, తరువాత రవంత శిష్యుడి వైపుకు తిరిగి, చూసీచూడ

నట్లుగా కొంచెం తల ఊపుతాడు రాజు దర్జాతో.]

శిష్యుడు

తమకోసం దూర్వాసమునీంద్రులు—

విశ్వామిత్రుడు

(పరధ్యానంగానే, చికాకుతో)

ఇప్పుడు వీలు లేదు : మరోమారు రమ్మను.

శిష్యుడు

మరి, వారు ఇప్పుడే—

విశ్వామిత్రుడు

పో.

[శిష్యుడు జంకుతూ వెనక్కి వెళ్లిపోతాడు. లోపల గలభా వినపడుతుంది—దూర్వాసుడు ముందుకు రాబోతూంటే, శిష్యుడు అడ్డుపడి వారిస్తున్నట్లు: క్రమంగా కేకలు దూరమౌతవి: తరువాత నిశ్శబ్దం.]

ఆఁ, చింతచచ్చినా పులుసు చావనంటూన్నదే? దేవతలందరూ నాకు జడిసి బ్రాహ్మణున్ని చేశారా? కాని, మళ్లా ఎంతలో మారిపోయినానూ? (లేచి, అటూ ఇటూ పచారు చేసివచ్చి మధువును సేవిస్తాడు; నిలుచునే హుక్కా గొట్టం అందుకుంటాడు.)

అవును, మారిపోయాను : మారిపోగలను. నాయక్షేచ్ఛావిహారం...లీల...(నవ్వి) నన్ను నేనే దిద్దుకుంటాను - మేనకకోసం -

[మేనక ప్రవేశిస్తుంది పదహారేళ్ల బాలెంతరాలు. మిసమిస లాడుతూంది. కొంచెం వెనుకగా ఒక అప్సర పొత్తిళ్లలో పిల్లను ఉంచుకువస్తుంది.

మేనకను చూసి అమితావేశంతో]

వచ్చావూ?

మేనక

[చిరునవ్వుతో సమీపించి, అతని భుజాల మీద చేతులువేసి, కళ్లల్లోకిచూస్తూ] ఆహాఁ.

విశ్వామిత్రుడు

ఐతే—తెచ్చావా?

మేనక

(అర్థంకానట్టుగా) ఏమిటీ?

విశ్వామిత్రుడు

ఏమిటా? అంత వళ్ళుమరచిపోయినావేం? చూశావా, ఎలా పెరిగిందో? (అని వాసంరో జుల మాపు కనబడుతున్న గడ్డం నిమురుకుంటాడు.)

మేనక

(తలవంచుకుని, నెమ్మదిగా) లేదు.

విశ్వామిత్రుడు

(ఉరుముతూ) ఎందుచేత?

మేనక

మరే—

విశ్వామిత్రుడు

మరీలేదు, గిరీలేదు, ఆమాటలు కట్టిపెట్టు. నేను పనివేళా, నారదుడిచేత కబురు పంపానుకూడా కాదూ? ఆవేధవ చెప్పలా? ఇంత మైమరపా?

మేనక

(మోకరించి) కోప్పడవద్దు: నేను మరచిపోలేదు. లేక-పట్టుకురాలేదు.

విశ్వామిత్రుడు

ఏం?

మేనక

అబ్బ! అలా, కసరకుండా వినండి: మొన్ననే సోమయాజులుగార్లందరూ, అప్సరలను వరించవచ్చని 'లా' అమలులో పెట్టార: మీకు తెలియదూ?

విశ్వామిత్రుడు

అలాగేం: నేను సనాతనసభాసభ్యుణ్ణి కానులే: అందుచేత నాకు సర్క్యులర్ రాలేదు: ఐతే?

మేనక

ఏమీలేదు: వచ్చేవారందరికీ ఇచ్చేటప్పటికి అన్ని బ్లేడ్‌లూ అయిపోయినవి. తిరిగీ చేయడానికి- విశ్వకర్మకు ఒంట్లో బాగుండక ఆతడు పనిలోకి రావడంలేదు.

విశ్వామిత్రుడు

పోనీ, ఇంద్రుణ్ణి అడిగి ఆతనిదగ్గర ఏమైనా ఉన్నవేమో అడిగితీసుకురాలేకపోయినావా?

మేనక

బాగుంటుందా చెప్పండి, మీరే: ఆయనకు అక్కర్లేదూ?

విశ్వామిత్రుడు

అవును — 'అఖిలాప్సరోంగనావిటుడు' కనుక ఆతనికి గడ్డం మాయకూడదు: నాలాటి ఏకపత్నీ...

మేనక

(అపవారించి) అది కాదండీ.

విశ్వామిత్రుడు

అవును: ఆలాటివాడు నాకు రేజర్ ఎందుకు ఇచ్చాడు మొదలు: నీవు నన్ను గెడ్డం తీసేసుకోమని ఎందుకు బ్రతిమాలావు? ఇది వరకు నాకు దానిప్రసక్తి ఏమైనా ఉన్నదా? నీవు వచ్చేటప్పటికి గెడ్డం పెంచుకు కూచోనా? కబురు అందగానే పంపిస్తావనుకున్నాను: పోనీ, ఆలస్యమైనా, నీవువచ్చేటప్పుడైనా తీసుకువస్తావనుకున్నాను. అవును, నీకేం?

మేనక

ఎందుకూ—ఎదబపడగానే ఆలా కసురుతారు? (సమీపించి, సవిలాసంగా) మీరు, ఏలా ఉన్నా నాకు బాగానే ఉంటారు.

విశ్వామిత్రుడు

చాల్లే: నీమాయవేసాలు కట్టిపెట్టు.

మేనక

(మారు మాటాడకుండా, దూరంగాపోయి నిలుచుంటుంది.)

విశ్వామిత్రుడు

ఏం? మాట్లాడవేం?

మేనక

(క్రిందికిచూస్తూ, ఆలాగే ఉండిపోతుంది.)

విశ్వామిత్రుడు

ఈలా రా: కదలవేం? ఊc, రా ఇక్కడికి.

మేనక

(సమీపిస్తుంది.)

విశ్వామిత్రుడు

కనుక, నీవూ వాడూ ఆలోచించుకుని చేసినపని అన్నమాటా, ఇది?

మేనక

......

విశ్వామిత్రుడు

నా తపస్సు విఘ్నం చేయడానికి, నా బవిరిగడ్డం, నా దీర్ఘజటాజూటం పోయేందుకు, నీవూ ఇంద్రుడూ పన్నిన పన్నాగమా ఇది? మీ అక్కర తీరింది కనుక—నేనిక ఏలా పోతే మీకేం? నా గెడ్డం మాసి, చేసుకునేందుకు బ్లేడు లేక, నేను ఎంత అవస్థపడుతూంటే మాత్రం నీకేం? అమ్మా, ఎంతవాళ్లూ అప్సరలు! మానవాంగనలకుండే కుత్సితాలన్నీ మీకూ ఉన్నాయే! (ఏమన్నా మేనక కిక్కురుమనక పోవడం చూసి) కానీ, మీపని చెప్తాను....శిష్యా!

శిష్యుడు

(వింగ్‌లోంచి తొంగిచూసి, తల ఊగిస్తాడు.)

విశ్వామిత్రుడు

ఓరి, శంభయ్యా! ఆలా దిక్కులు చూస్తావేం: మందుకురా: (శిష్యుడు సమీపిస్తాడు.) ఆశ్రమంలోకి వెళ్లి, తైత్తిరీయం రెండోకట్టచాటున రేజరున్నూ, సామసంహితలో పాతబ్లేడ్లున్నూ ఉన్నాయి, పట్టుకురా. (శిష్యుడు వెడతాడు)

ఎంతో అనుకున్నా: నీవు అమ్మాయిని, చిట్టితల్లిని ఎత్తుకువచ్చేటప్పటికి, చక్కగా షేవ్ చేసుకుని అందంగా ఉండాలని: కానీ, ఇంతచేసిన తరువాత - నీవు నాకు అక్కరలేదు. నామీద మనసు తీరగానే నన్ను ఇలా పరాభవిస్తావేం? సరేలే: నీరేజరు నీవు పట్టుకెళ్లు: ఇంద్రుడి మొఖానకొట్టానని చెప్పు: ఎవడికొక్కవాలి: మళ్లా ఏ ఋషినన్నా చెరపడానికి బయలుదేరేటప్పుడు ఉపకరిస్తాయి.

మేనక

(కంగారుపడుతూ లోపలికి సైగ చేస్తుంది. దాది పసిపాపతో ప్రవేశించగా, తాను అందుకుని, అతన్ని సమీపించి)నన్నుమన్నించండి. నేను చేయాలని చేయలేదు. మీకు గెడ్డం పెరగడం నాకుమట్టుకు ముచ్చటా? పోనీ, నామీద కోపమైతే, ఈ పసికందును, మన ప్రేమాంకురాన్ని చూసివినా ఊరుకోండి. చూడండి, ఏలా చేతులు జాస్తూ, ఎత్తుకోమంటూందో, బంగారుతల్లి. తీసుకోరూ?—ఆనున్ననిపాలబుగ్గలమీద, నవ్వితే, ఏలా సొట్టపడుతూందో! చూడమ్మా! మరే,

నాన్నకే, కోపంవచ్చింది కాని...(పసిపాపను ఆతనికి అందీయబోతుంది.)

విశ్వామిత్రుడు

(రవివర్మబొమ్మలోపోజుతో ఓ చేయి నెత్తిమీదకు ఎగజాపి వారిస్తాడు.)

మేనక

(కొంచెం వెనుకకు తగ్గి) ఎంత కఠిను లండి.

విశ్వామిత్రుడు

కఠినుణ్ణా?

మేనక

ఆఁ. తపస్సు కఠినం: ఆచరణ కఠినం: చివరకు...మనస్సుకూడా.

విశ్వామిత్రుడు

అవును: కఠినమైతే—నీమెర మెచ్చులకు కరగిపోకుండా ఉండేదే. (శిష్యుడు వచ్చి, రేజరూ, బ్లేడ్లూ అందిస్తాడు భయపడుతూ) దౌర్భాగ్యుడా, ఎక్కడకు వెళితే అక్కడే పాతుకునిపోతావేం? (మేనకవైపు రేజరు విసిరివేసి) తీసుకుపో,—వెళ్లు.

మేనక

ఇది తగునా?

విశ్వామిత్రుడు

భేషుగ్గా.

మేనక

అవును: మనసు మారిపోయినప్పుడు... నెపం నామీదనే వేసి తప్పించుకోవాలని మీ పన్నాగం: నాకు తెలుసులెండి: వెళ్లిపోతాను.

విశ్వామిత్రుడు

శీఘ్రంగా.

మేనక

ఉండనులెండి. మీపాపను మీరు తీసుకోండి.

విశ్వామిత్రుడు

మీపాప- మాపాప! ఇష్టంలేకపోతే పారవెయ్యి.

మేనక

అలాగే. లేకపోతే, మనకు పిల్లలు ఎందుకూ!

విశ్వామిత్రుడు

ఎందుకూ! నీవుచేసిన పనే, పెద్దదై అదీ చేయడానికి. కానీ, ఇది వృథాగా పోదులే, రేజర్ వల్ల నీకూనాకూ ఎడబాప్పలైనవి కదా. నీసంతానానికి అదేశాపం! రేజరే!

ఛీ! మాయలోపడి ఎంతతప ఫలం వ్యర్థం చేసుకున్నానూ!

(వెళ్లిపోతాడు. మేనక, అప్సర అలానిలవబడి, కదలకఉంటారు )

***

* రెండో రంగం *

[కులపతి కణ్వుని తపోవనం.

అవతలగా ఆశ్రమ కుటీరములు కనబడుతూ ఉన్నవి.

మాధవీనికుంజముదగ్గర శకుంతల నిలుచుని ఉంటుంది.]

శకుంతల

(చేతిలోఉన్న రేజర్ కనబడేటట్టు పట్టుకుని చూస్తూ)

బేజరూరు వగలేనా

మోజుతీరిపోయెనా

రేజరా

గడ్డమంటి చెప్పి వలపు

కాని పిలువనంప మనవే.

బ్లేడుకరుకు పూసులుకుల

వాడి అబ్బ! సైపలేనే!

ఎన్నిమాయలూ, ఎన్నినమ్మికలూ, అన్నీమరచిపోయినాడా! అంతఃపురాంగనల వలలోపడి, నన్ను అన్యాయంచేయడం—

(అనసూయ వచ్చి సమీపించి)

అనసూయ

ఏమి...చేయడం ?

శకుంతల

.......................

అనసూయ

కదులు. ముహూర్తం దాటిపోతుంది: కులపతి బ్రహ్మలోకానికి వెళుతూన్నారు: నిన్ను శార్ఙ్గరవుని తోడు తీసుకోమన్నారు.

శకుంతల

(కోపంగా) నేను వెళ్లను. నగరుచేరకోగానే పిలిపించుకుంటానని చెప్పి ఇలావంచన చేస్తాడా? పోనీ, తనపేరే తలుచుకుంటూ బ్రహ్మచారిణిగా ఆశ్రమంలోనే ఉండిపోతాను. ఆయనకు అంతజెట్టా?

అనసూయ

కాదమ్మా! రాచకార్యాలు—

శకుంతల

రాచకార్యాలు!! అవే నాకన్న ఎక్కువైతే నేనెందుకేం? తేరగా కోరికానని.ఏమీ తెలియనిదానవని అంకితములకనగా చూస్తాడా? (వేలితో బెదరిస్తూ) ఆమాట నావద్ద ఎత్తావంటే—

అనసూయ

వినవూ?...నీమాటలకేమిలే, నేనుచూడటం లేదూ, ఎప్పుడెప్పుడని కాచుకొని కూర్చోడం? కొంచెం అలికిడి అయితే సైన్యం వస్తూన్నదని ఎదురుచూసి కులికిపోవడం (రేజరును చూపించి)- అదిగో, వెళ్లేటప్పుడు నీదగ్గర వదిలేసుకేమా జ్ఞాపకానికి? దాన్ని ఒక్కక్షణమైనా ఎడబాస్తున్నావా? ముసుపటిలాగా తీవలను కన్నతల్లిలాగా పెంచుకుంటున్నావా ? హరిణబాలలకు నవతృణాంకూర ప్రాశనము చేస్తున్నావా ? నిదురలేచినది మొదలు రేజరును మెరుగుపెట్టడం, తలచుకుని మురియడం, ఎన్ని నేర్చుకున్నావమ్మా!

శకుంతల

(రేజరును దూరంగావిసిరి) నన్ను మోసం చేసినవాళ్లు-ఇంతే!

అనసూయ

(తీసి, అందీయబోతుంది.)

శకుంతల

అక్కర్లేదు: నీవు నాతోమాటాడవద్దు.

అనసూయ

మాటాడనులే: ఇక, మీ ఊరికిపోయి మహారాణివైనతరువాత సరే, ఇప్పటినుంచే ఇంత అధికారగర్వమా? కానీలే—

శకుంతల

నాతో మాటాడవద్దు. ఇక్కడనుంచి వెళ్లిపోతావా, నేను వెళ్లనా?

అనసూయ

మెదలకుండా ఉంటానులే. నాకెందుకు, అయినా, మీదంపతుల సంగతి? మీలో మీకు ఏమేముందన్నాయో, ఏం?

శకుంతల

.......................

అనసూయ

కూర్చో.

శకుంతల

ఊహుఁ.

అనసూయ

పోనీ, నవ్వు.

శకుంతల

ఊహుఁ, కూర్చోను, నవ్వను.— నీతో-

అనసూయ

మాటాడవు. అయితే ఏం చేస్తావు?

[దూర్వాసుడు వస్తాడు. శకుంతల, అనసూయఎడ మెడగా తిరిగి నిలుచుని ఉంటారు.]

దూర్వాసుడు

ఓం. శన్నో అస్తు...ద్విపదే

(ఎవరూ కదలరు.)

శం చతుష్పదే.

(విని, అటుచూడకుండా నవ్వుతారు.)
(దూర్వాసుడు కొంచెం పకిలిస్తాడు: ప్రయోజనంలేక, రాచుకునేట్టుగా సమీపించి)

నేను వచ్చానర్రా: (కొంచెం తటపటాయించి, వెళ్లి, మావిగున్న మొదల వేదిక మీద కూర్చుని,)

దూర్వాసుడు

అతిథిపూజ—

(శకుంతల, అనసూయ వినరు)

అర్ఘ్యం, పాద్యం—

(వాళ్లు వెనుకటిలాగానే ఉంటారు: ఆయన ధూకుడుగా వాళ్లమీదకువెళ్లి)

తెస్తారాలేదా పూజాద్రవ్యాలు? (వాళ్లు చలించరు.) శపించనా ఇక తిరుగకుండా! —కాచుకోండి(కొంచెం తమాయించి) చిత్రప్రతిమలలాగా కదలరేం? మీకు మతిపోయిందా? దివ్యఋషిని—దర్శనం అనుగ్రహించాను. పూజించండి—తరించండి! ఇప్పటికీ చెప్తున్నాను. చెడిపోకుండా-(ఊరుకుని నిదానంగా) ఏమిటీవింత? (దివ్యదృష్టి సారించి) హుఁ. పడుచుదనం పొగరు! శకుంతలా ఈ అవజ్ఞకు ఫలం అనుభవించు. రాజును తలచుకునే కళ్లతో నన్నుచూడలేవేం? ఆతనిమీదకోపం నామీద చలాయిద్దామనుకున్నావేం? చూసుకో—(శాపోదకం, అభిమంత్రితం, విడస్తూ)నిన్ను దుష్యంతుడు మరచిపోతాడు. (అంగలో దాటిపోతాడు.)

అనసూయ

చండకోపి—శాపం—అమోఘం.

శకుంతల

కానీ, ఎన్నికష్టాలు కస్తామో రానీ. నా విధి వ్రాత! (దుఃఖిస్తుంది.)

అనసూయ

రా. పోయి బతిమాలుకుని ప్రసన్నుని చేసుకుందాం.

(శకుంతలను బలవంతంగా లాక్కొని వెళుతుంది. స్టేజి ఒక నిమిషం ఖాళీ: అంతలో ఇద్దరూ తిరిగివస్తారు.)

శకుంతల

మాయమైనాడు.

అనసూయ

(తల ఊగిస్తుంది.)

శకుంతల

ఏంచేయను? ఎవరిని వేడుకోను? ప్రభూ! నీవు కనికరించనందున కదా ఈ దాసికి ఇన్ని అగచాట్లు! ఏలాబ్రతుకను? ఎందుకు—
(కూలబడుతుంది)

అనసూయ

సఖీ! ధైర్యం తెచ్చుకో. ఆలావిచారించకూడదమ్మా! అన్నిటికీ గౌరీమహాదేవి ఉన్నది. ఆమెకు దయరాదా! (కళ్లనీళ్లు పెట్టుకుంటుంది)

(నారదుడు ప్రవేశం. వెంట గానం)

నారదుడు

లోకైకసుందరాననా-దురా
లోకశక్రశరహితా
నాకవామలోచనా మ
నాకమలాసహితా.

(శకుంతలస్థితి చూస్తాడు: మహతిని తీసి) ఎప్పుడూ ఒక పేచీ(మోతా!(కిందపెట్టి)కిక్కురుమనకుండా ఊరుకో, వేళాపాళాలేదూ (బిగ్గరగా) నారాయణ, నారాయణ!

శకుంతల

(లేచి నిలుచుని) నమస్కారం. దయ చేయండి.

నారదుడు

కల్యాణి! భర్తృసహవాససిద్ధిరస్తు!

అనసూయ

(నవ్వుతూ) అయితే పెద్దపేచీ వస్తుంది!

నారదుడు

(ఉలికిపడి) ఏం?

అనసూయ

ఇప్పుడే—దూర్వాసమౌని శాపం ఇచ్చి వెళ్లారు!

నారదుడు

ఎందుకూ?

అనసూయ

ఎందుకేమిటి—శాపానికి? ఆయనకు అలవాటేకదూ? ఇవాళ మేం కనబడ్డాం!

నారదుడు

అయితే మాత్రం?

అనసూయ

కాలితొక్కిన పాము కరవక మానుతుందా? ఊరికే వచ్చి, ఒక్కశాపమైనా ఇయ్యకుండా వెళితే పరువుతక్కువకాదూ? అయినా, తెలియక అడుగుతాను, మీలో మీరు కూడబలుక్కోరా ఏం, కర్మం? ఒకరు శాపం, వారి వెనుక మరొకరు వరం! పేచీలు ఎందుకు పెంచుకుంటారు? పోనీ, పెద్దవాడు, ఆయన మాట గౌరవిద్దాం, మీ ఆశీర్వచనం ఉపసంహరించుకోండి!

నారదుడు

ఏమిటీ!—ఉపసంహరించుకోవడమే!—బ్రహ్మవాక్కు!

అనసూయ

మరి, దూర్వాస మౌనీంద్రునిది?

నారదుడు

ఆసంగతి తరువాత ఆలోచించుకోవచ్చును. అసలు, జరిగినకథ ఏమిటో.

అనసూయ

ఆఁ. పాడిందేపాట! నేను చెప్పలేను. మీరు యోగదృష్టితో—

నారదుడు

ఊహుఁ—తెలిసింది. మహామంచి పట్టులో చిక్కాడులే ముసలాడు: మరచిపోతాడన్నాడు కదూ. అవును బ్రహ్మచారి కేం తెలుసును? కమండలు, జలం-ఉన్నాయికదా అని అవకతవకలు చేయడమే! కానీ, తెలిసివస్తుంది. నేనే గెలుస్తాను.

అమ్మాయీ! తిరిగీ ఆశీర్వదిస్తున్నాను. భర్తృ సమాగమ...




"అమర్ జ్యోతి"

ప్రతిరోజు అప్రతిమానముగా
ప్రదర్శింపబడుచున్నది.

"తుకారాం"

మనోహరమైన గానమాధుర్యముచే
మానవహృదయములను వశీకరించుకొను ఫిలిం.

మరియు —

## "బియాండ్ ది హొరైజన్"

ఇందు పాల్గొన్నది
శాంతా ఆప్టె
మిమ్ములను విస్మయానంద డోలికల నూపుటకు వచ్చుచున్నది.

తరువాత —

## "ది అన్ యెక్సుపెక్టెడ్"

అనుకొనని క్రొత్తక్రొత్త విషయములతో గగుర్పాటొందవించు ఫిలిం రాజము.

అనంతరము —

## "గోపాలకృష్ణ"

*Distributors*
**FAMOUS PICTURES,**
**Bangalore City.**

ఎల్లప్పుడు ప్రభాత్ చిత్రములనే
తెప్పించుకొనుడు.

# REO TRUCKS

# రియో ట్రక్కులు



రియో 1937 మాడల్సు లోగడ రియో ప్లూకు నాటినన్నిటిని మించును. స్పీడు లోను, శక్తిలోను, చాలకాలము మన్నుటలోను పనిచేయుటలోను ఉత్తమమైనవి. ట్రక్కుల నిర్మాణములో గత 30 సంవత్సరములనుండి గడించిన రియో పేరు ప్రఖ్యాతులకు ఫలముగా ఈ క్రొత్త మాడల్సులో అభివృద్ధి గోచరించుచున్నది.

## అమెరికాయొక్క అతి కఠినమైన ట్రక్కులు.

ప్రాతినిధ్యము లేని జిల్లాలయందు గౌరవముగల యేజెంట్లు కావలెను

వెంటనే పూర్తి వివరములకు వ్రాసి కనుగొనుడు.

TELEGRAM :
" Autoworks "

TELEPHONE:
3595.

**DISTRIBUTORS:**

## RANE (MADRAS) LTD.

**MOUNT ROAD MADRAS.**

డిస్ట్రిబ్యూటరులు :

## రాణె (మదరాసు) లిమిటెడ్.

మౌంటురోడ్ మదరాసు.

# తిరువాంకూరులో గాంధీమహాత్ముని పర్యటనము

౧. తిరువాంకూరులో మహాత్ముడు ఎజావా తెగవారికి హితబోధచేయుచుండుట యిందు కానవగును.



తిరువాంకూరు మహిళాసమావేశమువారు మహాత్మునికి స్వాగతపత్రము సమర్పించుట. శారదాదేవిగారు స్వాగతపత్రము చదువుచున్నారు

తమ సంస్థానమున హరిజన దేవాలయ ప్రవేశమునకు అనుజ్ఞయిచ్చిన శ్రీ తిరువాంకూరు మహారాజు గారికి
శ్రీ రాజగోపాలాచార్యులుగారు ధన్యవాదములర్పించుట



శ్రీ తిరువాంకూరు మహారాజాగారికి చెన్నపురి పురపాలకసంఘమువారు స్వాగతపత్రమును సమర్పించుట
(మహారాజాగారి ప్రక్కన మహారాణి శ్రీ సేతూబాయిగారుగలరు)

TRADE  MARK

# గ్యారంటీగల రంగూన్ కెమికల్ కమలములు

ధర తక్కువ! సరకు నాణ్యము!!

మావద్ద పలురకములగు రంగూన్‌కమలములు సరసమైన ధరలకు అమ్మబడును. అనేకులు మా కమలములను కొని యెంతయు సంతృప్తిచెందియున్నారు.

ఒకతూరి మావద్ద కమలములను ఖరీదుచేసినచో నిజానిజములు మీకే తెలియగలవు.



## ఇంగ్లీషు ఫ్యాన్సీ ఉంగరపు రాళ్లు

మావద్ద చెయిన్‌మాలలకు కావలసిన గాజురాళ్లు, చదరం, బియ్యము, చింత గింజ, గోధుమ మొదలగు ఆకారములలోను, యింకా ఉంగరపురాళ్లు, తొంగటం లోలకురాళ్లు బంగారు రేకు తొంగటం రాళ్లు, ఇంగ్లీషుకలర్లు, ఉంగరపురాళ్లు పలువిధములైన వర్ణములలోను, అన్నిపరిమాణములలోను దొరకును. ధరలు సరసము. ఒకతూరి వాడినచో నిజము తెలియగలదు.

## చెయినుమాలలు

స్త్రీలు, బాలికలు యిప్పటి నాగరికతను అనుసరించి కోరునట్టి అన్నిరకములైన చైనుమాలలు, మావద్ద తయారుచేయబడును. నాణ్యమైన గాజురాళ్లతో తయారు చేయబడినట్టి బంగారుగిల్టు చైనుమాలలు సరసమైన ధరలకు మావద్ద దొరకును.

విదేశమునుండి నేరుగ సరకును దిగుమతిచేయుచున్నాము.

వలయువారు:—

## యస్. పి. హబీబియా జెమ్స్ కంపెనీ,

222, అంగప్పనాయకన్ వీథి,

పోస్టుబాక్సు నెం 222, మద్రాసు.

బ్రాంచీలు:

నెం 94 రు టంకసాలవీథి, జి. టి. మద్రాసు. నెం 2 రు గోవిందప్పనాయకవీథి, జి. టి. మద్రాసు.

శకుంతల

అనసూయా! చూడు, ఆ లేడిపిల్ల తుంటరితనం. తల్లిదగ్గరనుంచి పారిపోతూన్నది. పట్టుకుంటాను (తొందరగా వెళుతుంది.)

అనసూయ

అప్పుడే ఎందుకమ్మా అంతతొందర! (నారదునితో) పిచ్చితల్లి! సంబరం దాచేసుకోవాలని వెళ్లిపోయింది. రేజరు (వెతుకుతూ) ఇక్కడే పడవేసింది—ఈపొదలో.- అరె! ఏమైందీ?—కాస్త, మీరుకూడా వెదకండి.

నారదుడు

ఏం రేజరు?

అనసూయ

ముందు వెదకండి.

నారదుడు

కాదు, చెప్పాలి! ఆఁ...అక్కర్లేదులే—నాదివ్యదృష్టిఉన్నదిగా!(తెలుసుకుని)ఓహోఁ ఇంకేం? సాధించాను! శకుంతలను మరచిపోయినా, రేజరు చూడగానే, దుష్యంతుడు యిల్లాలిని ఏలుకుంటాడు!- చూడు జాగ్రత్తగా (ఇద్దరూ వెదుకుతారు.)

అనసూయ

పోయింది

నారదుడు

ఊఁ. ఇంతలో ఏమవుతుంది?—శకుంతల పట్టుకువెళ్లిందేమో?

అనసూయ

లేదు. మనం చూస్తూనే ఉన్నాంకాదూ? ఇదంతా శాపమే! మళ్లా మహాసముద్రంలో—

నారదుడు

ఫరవాలేదు, నేను ఉన్నానుకదూ.

అనసూయ

ఏమైపోయిందంటారు?

నారదుడు

అదే చెప్పడానికి వీలులేకుండా ఉన్నది: విచారిస్తాను: దివ్యదృష్టి - ఒక విషయంలో రెండుసార్లకన్న పనిచేయదు. లేకపోతేనా—

అనసూయ

మీరే రక్షించాలి: ఇప్పుడు పెద్దదిక్కు ఎవరూ లేరు.

నారదుడు

మరేం భయంలేదు. శకుంతలను అత్తవారింటికి పంపించివేయవచ్చును. తరవాత భారం నాది.

అనసూయ

అలాగే.

నారదుడు

వెళ్లివస్తాను. (నిష్క్రమిస్తాడు.)

అనసూయ

ఇదిగో,—ఏమండోయ్ (పిలుస్తూ వింగ్ దాకా వెళుతుంది: నారదుడు వస్తాడు.)

నారదుడు

ఇప్పుడు వేళలేదు,... తిరిగి మళ్లా....

అనసూయ

అందుకు కాదు, పిలిచింది! మీ-మహతిని వదలివేసి వెళుతున్నారేం?— ఇదండి.

నారదుడు

(అందుకుంటూ, ఆలస్యంచేసి, అవతలికిస్తూ) మహతిని కాదు, మనసే మరచిపోయినాను. (ఇంకా కొంచెం దగ్గరకు జరుగుతాడు)

అనసూయ

కొంటెతనం - (నారదుని చెక్కిలిమీద చేయి అలా అని) శకుంతలను ప్రయాణం చేయాలి. (కన్ను ఎగురవేసి నవ్వుతూ పారిపోతుంది.)

(గానం)
మాలతీలలామదామ
భరణా, సురమోహనా
లోకైకసుందరాననా

నారదుడు

ఊరుకో: సంగీతం పాడినట్టుగానే ఉన్నది మనపని! (గానం ఆగిపోతుంది.)

(నడచి పోతాడు)

***

* మూడో రంగం *

[రాచనగరిలో. విహారమందిరం. సన్నజాజుల దండను పదిలముగా పుచ్చుకొని చేటి]

చేటి

(పరిక్రమించి) ఏదీ, ఇక్కడ ఎవరూ లేరేం? ప్రభువు ఈవైపు వచ్చినారని కంచుకి చెప్పాడే! ముసలితాతకు దృష్టి దోషం వచ్చిపోతూన్నది. కంటికి కనబడ్డవారందరూ మహారాజులే.

(ప్రతీహారి ప్రవేశించి, చేటినిచూసి)

ప్రతీహారి

మహారాజులే! నీ స్వయంవరానికి నేను చాలనూ!

చేటి

(తిరిగిచూసి) నీవు ఉన్నావు బాబూ, ఇక్కడ—

ప్రతీహారి

నీతోడునీడను. నిన్ను చూడకుండా నిమిషం ఉండగలనా? సుదినం! పూలమాలకూడా ఉన్నది కదా - అన్నీ కలిసివచ్చినాయని స్వయంవరమన్నాను.— హైఁ (సమీపించి) ఎంత అందంగా ఉన్నావు!—నిన్ను... ఇహ... వదలిపెట్టనే! జాజులు... రేకలు విచ్చినట్టుగా నీచిన్నారి పెదవులతో-ఏదీ ... చిరునవ్వు

చేటి

(నవ్వుతూ)
జాజులందా-నవల
గాజులందమా-బావా

ప్రతీహారి

చందమామ వెలుగునీవె
సరసమందమా

చేటి

ఒరుల
కందరాని మోవితేనె
విందులందమా...

ప్రతీహారి

అందాలరాశివి— నీ అందమైనాసరే! స్వయంవరందాకా ఆగలేను!—గాంధర్వం—(పట్టుకోబోతాడు)

చేటి

(చిక్కకుండా తప్పించుకుని) ఉండు, ఎవరన్నా చూస్తారు!—అమ్మోయ్!—మహారాజు! (దూరంగావెళ్లి నిలుచుంటుంది.)

(దుష్యంతుడు వస్తాడు: కుడిపక్కగా ఉన్న ఆసనంమీద కూర్చుని ఆలోచనతో)

దుష్యంతుడు

కుడి ఎడమ కన్నులు వంతులువేసుకొని అదురుతూన్నవి: ధర్మనిర్వహణంలో ఏమైనా లోపం చేశానా? మనసుకూడా కలవరపడుతూన్నదే! (ప్రతీహారిని చూసి) పురోహితులు సోమరాతులవారిని పిలుచుకునిరా.

(ప్రతీహారి వంగి, నమస్కరించి వెళతాడు.)

చేటి

(ముందుకువచ్చి) దేవా! మహారాణి వసుమతీదేవి పంపిన ప్రేమోపహారము,

దుష్యంతుడు

(దండను మెడలో వేయించుకుంటూ) దేవితో, కానుకను కనులకు అద్దుకొన్నానని చెప్పు.

చేటి

(చేతులుజోడించి, వినయంతో) తమ దర్శనభాగ్యాన్ని కలుగచేయ మని మనవిచేసి రమ్మన్నది దేవేరి.

దుష్యంతుడు

మంచిది, అలాగే.

(చేటి నిష్క్రమిస్తూండగా, సోమరాతుడు ఎదురు అవుతాడు : ఆయనకు నమస్కరించి, ప్రైదొలగిపోతుంది. పురోహితునికి కొంతవెనుక ఒక రిద్దరు మునికుమారులు, శార్ఙ్గరవుడు,—శకుంతల—మేలిముసుగుతో.

వీరినిచూసి దుష్యంతుడు లేచినిలుచుంటాడు. సోమరాతుడు ముందుకు రెండడుగులువేస్తాడు. మహారాజు నమస్కరిస్తాడు )

సోమరాతుడు

వత్స ! ఆయుష్మాన్ భవ! (వచ్చినవారిని చూపిస్తూ) వీరు కులపతి కణ్వుని దగ్గరనుంచి శుభసందేశము తీసుకుని వచ్చారు. శ్రౌతవిధి చేత, ఉచితసత్కారములు చేసి, వెంటబెట్టుకునివచ్చాను.

దుష్యంతుడు

కణ్వసందేశమా? తపోధనులకు నమస్కారములు. ఇలా దయచేయండి.

(మునికుమారులు కూర్చుంటారు. శార్ఙ్గరవుడు, ఆతనివెనుక శకుంతల నిలుచునే ఉండిపోతారు.)

పూజ్యులైన కణ్వులకు కుశలమా ? మీ తపస్సు నిర్విఘ్నముగా సాగుతూన్నదా?

శార్ఙ్గరవుడు

ధర్మరక్షకులైన మీరు ఉండగా మాకు కొఱత ఏమిటి? గురుపాదులు కుశలపూర్వకంగా ఇలా కబురుపంపినారు...

దుష్యంతుడు

ధన్యుడను. వారి ఆజ్ఞ ఏమిటి?

శార్ఙ్గరవుడు

"నాయనా ! గాంధర్వాన నాకూతురిని వరించడం తెలిసికొని, సంతోషించాను. నెల మసలిన ఈమెను నీచెంతనే ఉంచుకోడం మంచిది" అని చెప్పమన్నారు.

దుష్యంతుడు

ఇవి ఏంమాటలు? ... (చిరునవ్వుతో) సాత్త్వికమూర్తులు — పరిహాసకుశలు లేనని తెలియచెప్పడమా?

శార్ఙ్గరవుడు

పరిహాసమా?

దుష్యంతుడు

కాదా, మరి? అయినా, కానీయండి. మీరుపూజ్యులు!(శకుంతలను చూపించి) ఈగర్భవతి యేనా కణ్వులు నాకు పంపినభార్య?



శార్ఙ్గరవుడు

ఈమెనే నీవు వరించినది.

దుష్యంతుడు

అబద్ధము!

శార్ఙ్గరవుడు

ఆఁ. శాపాయుధుల మని మరచిపోతూన్నారు.

దుష్యంతుడు

లేదు: మహాప్రసాదము! కాని, కడుపుతూన్న పిల్లను భార్యగా వరించవలసిన దనే ఆదేశము—శిరసా వహించాలా, శాపానికి జడిసి?

శార్ఙ్గరవుడు

ఈలా, అమాయకురాలిని వంచనచేయడం కూడా రాజధర్మాలలోదేమో? అరణ్యాలలో ఉండే మాకు ఏం తెలుస్తుంది? మాపని మేము చేశాం: ఇక నీయిష్టం: ఏలుకున్నా సరే, లేక-

(శకుంతలతో) ఏమమ్మా! చూశావా, ఈయనవాలకం! పోనీ, చూసిఅయినా పోల్చుకుంటాడేమో, ముసుగుతీయి: ఇప్పుడు సిగ్గుపడితే ఏలా? (ముఖం చూపిస్తుంది.)

(మహారాజుతో) చూడండి, ఈమె ఎవరో...

దుష్యంతుడు

ఈమె ఎవరు?

శకుంతల

నాథా!

దుష్యంతుడు

నాథా!—ఇంత విపరీతమా? అమ్మాయీ, నీవు పసిదానవులాగా వున్నావు: అప్పుడే ఇన్నిమాయలు ఏలా నేర్చుకున్నావమ్మా?

శకుంతల

మాయలా! ఎవరివి?

దుష్యంతుడు

తెలియడం లేదూ?

శకుంతల

మళ్లా అనండి, ఆమాట.

దుష్యంతుడు

అంటాను, నాకేమిభయం?

శకుంతల

అవును: ఇంత దుర్మార్గానికి, మోసానికి ఒడిగట్టినమీకు(దగ్గరకువెళ్లి)కోపమానామీద? మీరు ఎప్పుడు వస్తారంటారా అని కాచుకుని ఉండి ఉండి, స్వతంత్రించి వచ్చేసినందుకు, మన్నించండి.

దుష్యంతుడు

నాకేమీ అర్థంకావడంలేదు.

శకుంతల

అల్లాగా? ఏమీ తెలియనివారు, నన్ను మాయచేసి ఏలావరించి, నమ్మికలిచ్చి...

దుష్యంతుడు

ఊఁ. కథ అల్లు—

శకుంతల

పౌరవా! ఇది మీకుతగదు!—అప్పుడే మరచిపోయినారా? మనచెలిమికి సాక్షిగా సేఫ్టీ రేజరును, మాతండ్రి మాఅమ్మకు యిచ్చిన దానిని, మీకు నేను సమర్పించలేదా? ఆశ్రమంలో ఉన్నంతకాలం మీకు అనుదినమూ నేను అమరించియిచ్చేదాన్ని కాదా? అప్పుడు మీనున్నని చెక్కిళ్లు ఎంతముద్దొచ్చేవి? తోటి చెలికత్తెలు నన్ను చూసి ఎంత అసూయపడేవారు! జ్ఞాపకంలేదూ, మొదటిసారి మీరు రేజరు పట్టుకోవడం చేతగాక, గంట్లుపడితే, నేను మందారరేకలు తీసుకువచ్చి అద్దలేదూ? ఏం, చూడండి, మీరు షేవ్ చేసుకుని అక్కడపడవేసిపోతే తీసిదాచేసి, అల్లరిచేస్తే, 'రేజర్ ఒకయెత్తూ, నేను ఒక ఎత్తూ' అని మీరు నన్ను ఎంతబ్రతిమాలుకుని, అనితరజనలభ్యమైనఆదేవప్రసాదాన్ని నేను నవ్వుతూ యివ్వగా, కళ్లనద్దుకుని, మీభాగ్యదేవతనని కౌగలించుకోలేదూ? ముద్దు పెట్టుకుందామని మీరు ఎంత ఉబలాటపడినా, మూడురోజులూ గెడ్డముపెరిగి గరుకుగా ఉన్నదని నేను తప్పించుకుంటే, నామీది మక్కువతో మీరు, సాయంకాలమైనప్పటికీ, ఎవరూచూడకుండా, అప్పుడప్పుడు గెడ్డం చేసుకుని, కలకలలాడుతూఉంటే, నిలువలేక నేనే మీ కౌగిలిలో వాలిపోయినాను కాదూ? చివరకు, మీరు ఇక్కడకు వచ్చేస్తూ, రేజరు వెంట పట్టుకువెళుతానంటే, మీనున్నని గడ్డం చూసి ఎవరైనా మాయచేసి వలలో వేసుకుంటారని, నేను ఇయ్యకుండా ఉట్టిచేతులతోనే పంపాను కాదూ? చూసుకోండి, ఎంత పెరిగిపోయిందో! అచ్చంగా, కిరీటం పెట్టుకుని, వేషం వేసుకున్న మునికుమారుడులాగా ఉన్నారు. (దుష్యంతుడు ఉలికిపడి గడ్డం తడుముకుంటా·) ఏం, గడ్డముంటేఅయినా నేను జ్ఞాపకం వచ్చానా? (మీసం చెయివేస్తుంది)

దుష్యంతుడు

(సంభ్రమంతో) రేజరు! ఏది రేజరు?

శకుంతల

(దీనంగా) లేగు, పోయింది!

దుష్యంతుడు

అవును, ఇలాగే పోయింది: ఎంత మోసం!

శకుంతల

నమ్మరూ, ఇంకా ఇప్పటికీ నమ్మరూ? —నిజంగానే పోయిందండీ.

దుష్యంతుడు

ఇక చాలించు—నీ వేషాలు. వచ్చిన త్రోవను నడు.

శకుంతల

ఎక్కడికి పోను?—మీ భార్యను.—

దుష్యంతుడు

ఆమాట అంటే ఊరుకోను. భార్యవా?

శకుంతల

కానా?

దుష్యంతుడు

నీవు ఎవరో నాకు తెలియదు. వెళతావా, లేదా?

శార్ఙ్గరవుడు

(ముందుకువచ్చి) ఏమిటయ్యా నీ ఆగడం? మీలోమీరు రాజీపడరా? ప్రణయకలహమేమోనని ఊరుకున్నాను, చూస్తా. పొగరుబోతుతనం మాని ఏలుకుంటావా సజావుగా, శపించనా? (చేయి జాస్తాడు.)

శకుంతల

వద్దు, వద్దు. నానాథుని ఏమీ చేయవద్దు. నన్ను చూసి అయినా—

శార్ఙ్గరవుడు

ఊహుఁ. వీల్లేదు. ఎత్తినచెయ్యి ఊరికే క్రిందకు దించకూడదు. శపించితీరాలి! ఏం, రాజా?

(నారదుడు, కణ్వుడు ప్రవేశిస్తారు.)

నారదుడు

(శార్ఙ్గరవునితో) ఏం, పిట్టకొంచెమైనా కూత ఘనంగానే ఉన్నదే? చదువంతా అయిపోయి, శాపప్రయోగాలదాకా వచ్చావూ?

(దుష్యంతునితో) ఏం, రాజా, క్షేమమా?

దుష్యంతుడు

(... ... ఉత్సాహంతో సమీపిస్తాడు.)

శకుంతల

నాన్నా! — (కణ్వుని కౌగిలించు కుంటుంది.)

నారదుడు

(దుష్యంతునితో) రాజా, ఊరుకుంటారేం? చేసిన మహకార్యం బయటపెట్టండి: పైగా, మా అల్లుణ్ని పలకరించండి.

కణ్వుడు

(శకుంతలతో) భయపడకు తల్లీ! నీకేం భయం లేదు: అంతా నా పొరబాటు.

దుష్యంతుడు

పెద్దలు—నిలుచునే ఉండటం భావ్యం కాదు: పీట వేసి ఇలా—

కణ్వుడు

నాయనా! పెద్దల అభిప్రాయం పనులే ఇంతవరకూ తెచ్చినవి. నాతప్పు ఒప్పుకుని మీరందరూ క్షమిస్తేనే కాని కూర్చోను.

దుష్యంతుడు

పైవనములు—మీరు తప్పుచేయడం—

కణ్వుడు

విధివిధానం, బాబూ! ఆకలములతో జీవనం చేస్తూ, అడవిలో పడిఉండటం మాకు తగింది కాని, తగుదుమని నాగరికవేషం వేస్తే ఊరికే పోతుందా?

దుష్యంతుడు

మీ మాటలు వింతగా ఉన్నవి.

నారదుడు

వినండి! ఇంకా ఉన్నవి విశేషాలు.

కణ్వుడు

మహాపరాధం—

సోమరాతుడు

మీరు మాటిమాటికీ అలా నిందించుకోవటం మహారాజుకు చిన్నతనంగా ఉన్నది.

కణ్వుడు

(శకుంతలతో) అమ్మా! నన్ను మన్నించవూ?

శకుంతల

(ఆశ్చర్యంతో) అదేమిటండీ?

కణ్వుడు

కామతల్లీ! నీకు యిన్ని కష్టాలు వచ్చింది నా తెలివితక్కువతనం వల్లనే

నారదుడు

ఉపోద్ఘాతం తెగపెరిగిపోతూంది: ఇక నైనా ఉపక్రమిస్తారా, లేదా, అసలు విషయం? పళ్ళామనం.. (సైగతో ఏదో జ్ఞాపకంచేసి) వెళ్లవద్దూ—

కణ్వుడు

(నవ్వుతూ) చాల్లేవోయ్,—ఇక...

నారదుడు

ఉండండి: (జనాంతికంగా) ముందు చూపించవద్దూ? శాపమైకంపోయి జ్ఞాపకం రానిదే మీ మాటలు ఏలా నమ్ముతాడు?

కణ్వుడు

అవును: (రేజరు తీసి సభఅందరికీ చూపించి, నిదానంగా, మహారాజు సమీపంలో బల్లమీద పెడుతాడు.)

శకుంతల

రేజరు!

దుష్యంతుడు

(నిద్రమేల్కొనినవాడిలాగా సంభ్రమంతో) రేజరు, రేజరు! (కలయజూసి) శకుంతల, నా శకుంతల!

(నారదుడు, కణ్వుడు ఒకరి నొకరు చూసి నవ్వుకుంటారు.)

శకుంతల

నాథా!

(కౌగలించుకుంటారు ఉభయులూ.)

నారదుడు

(కొంచెంసేపు ఊరుకుండి) ఇక, అందరం కూర్చుందామా?

(మహారాజు కూర్చుంటాడు. ఆయన సరసను శకుంతల—నిల్చుని. మిగిలినవారందరు ఎదురుగా కూర్చుంటారు. కణ్వుడు - కమండలం, దర్భాసనం శకుంతలకు అందిచ్చి, నిలుచునే-)

కణ్వుడు

రేజరు నేను తీశాను!

శకుంతల

మీరా?

కణ్వుడు

అవును!

నారదుడు

ఎందుకో అదెందుకేం ఎరగాను?

కణ్వుడు

నేనే చెపుతున్నాను కామా! బ్రహ్మలోకానికి యజ్ఞ సంభావన తీసుకునేందుకు వెళుతూ మా శకుంతలను చూద్దామని, ఇక ఇక్కడకు వచ్చేస్తున్నాగ కదా ఆమె, మునికుమారికలతో కలిసి పూలు కోసుకుంటూన్నదని ఆ పైపుకెళ్లి కనబడకపోతే, ఎటు వెళ్లిందో అని అటూ ఇటూ అక్కడే తిరుగుతూండగా, పచ్చికలో తళతళలాడుతూ ఈ రేజరు కనబడ్డది!

శకుంతల

నేను వి రివేశాను, కోపంలో. (దుష్యంతుడు ప్రశ్నిస్తూ చూస్తాడు. ఆమె అతని చెంపలు నిమురుతుంది లాలిస్తూ)

కణ్వుడు

చూడగానే, మరచిపోయిందేమో-తీసుకువెళ్లి యిద్దామని తీశాను. కాని, అంతలో ఒక పిచ్చి ఆలోచన పోయింది: వెళుతూన్నది బ్రహ్మలోకంలో సభకు అక్కడకు రంభాదిదేవగాయనులు అభినయ ప్రదర్శనానికి వస్తారు కదా, చక్కగా గెడ్డం తీసేసుకుంటే బాగుంటుందని—

నారదుడు

ఓహో! ...మీ రూపం తలచుకుంటే టికే నవ్వువస్తూన్నది.

కణ్వుడు

రేజరును తీసుకువెళ్లిపోయినాను, వెనుక నుంచి ఎవరిచేతనైనా పంపించవచ్చును కదా అని.

నారదుడు

ఇంకా నయం: నేను కనబడకపోతే అలా చేసేవారనుకుంటా? కోతిమూక, మీ శిష్యులు మిమ్మల్ని బ్రతకనిచ్చేవారేనా?

(శార్ఙ్గరవునితో) నిన్నుకాదు లేవోయ్! నీవు చాలా యోగ్యుడవు, నెమ్మదైనవాడవు! నేను ఎరుగనా ఏమిటి?

కణ్వుడు

తీరా, అక్కడ ఏవో ఆటపాటలని వాణీధవుడు కదులనిచ్చాడు కాదు. ఏలాగూ ఆలస్యమైందికదా, శకుంతలనుచూసిపోదామని వస్తూండగా నారదుడు సంగతి అంతా చెప్పేటప్పటికి—

నారదుడు

మా యింటిదగ్గర మిమ్మల్ని చూసేటప్పటికే అర్థమయింది నాకు: మా అమ్మ అడిగింది కూడాను, మీరు ఆలాతయారైనారేమని. నేను, తరువాత చెప్తానని తప్పించుకున్నాను.

కణ్వుడు

నాయనా, నీఋణం ఎలా తీర్చుకోగలను?

నారదుడు

తిరిగి గడ్డం పెరగనీయండి: తాపసులకు అందులో ఉన్నంత అందం (అందరూ నవ్వుతారు.) పోనీ, భార్య గర్భవతి గనుక, ఈ నవమాసాలూ మీ అల్లుడికి దానితో అవసరం లేదు గనుక, వాడిచూస్తాడంటారా? ఊహుఁ. అమ్మో! వద్దులెండి. అది కనబడక పోతే, అమ్మాయిని మళ్లా మరచిపోతాడేమో? సరే, సమస్తసన్మంగళానిభవంతు! నేనువెళ్లి ఈ పట్టున దూర్వాసుడికి చెవులు ఎక్కూదీయాలి. ఎవరు గెలిచారో!

దుష్యంతుడు

నా ప్రాణాలు అంటుకుని—

నారదుడు

ఇకను వీల్లేదు. భారసాలకు ఎలాగూ వస్తాను కదా—? ఊర్వశి నాట్యం చూడటానికి వెళ్లాలి. మా మామగారు ఉంటారుగా, నావంతుకూడా తినడానికే. మంచిది, వెళ్లి వస్తాను.

[అందరూ లేచి నిలుచుంటారు, నారదుడు వెళ్లిపోతూండగా—జవనిక]



S. S. S.



# భావము

జొన్నలగడ్డ
సత్యనారాయణమూర్తి

కొమ్మపై చేరిన రెండు శకుంతములుకదా ఉపనిషత్తుల దృష్టి నాకర్షించినవి! ఎదుటి ప్రకృతిని విలోకించున దొకటి; తలవాంచి మెక్కునది వేఱొకటి. అది జ్ఞానపిపాసువు, ఆనందకామి. ఇది? భోక్త, భోగప్రియ. మానవులం దీ రెండురీతులవారును గలరు. తొలుతటి తెఱగువారే భావాంబరవీథి విశ్రుత విహారులు; ప్రతిభాసమన్వితులు; విజ్ఞానధనులు.

విజ్ఞానమునెడ దోడ్కొనిపోవు వివిధపంథలను తర్కశాస్త్రము చూపుచున్నది. ఇవి పరిశీలనము, పరిమాణము, అనుభవము మున్నగునవి. తార్కికదృష్టిలోని వీనికిని, కళాదృష్టిలోనివానికిని ఎంతో వ్యత్యాస మున్నది. మన ప్రస్తుతసమాలోచనమున విశేషస్థానము నందునవి కళాంశములే!

విషయమెఱిగించు వ్యక్తిశక్తిని, గ్రంథశక్తిని అనుసరించియే ప్రమాణమునకు (Authority) సంబంధించిన భావమును గైకొందుము. ఇట్టి భావము నిచ్చువానిలో మేటి- పెద్ద చరిత్ర... విజ్ఞానక్షేత్రమున ననుభవము విశాలాంగణము కలది. బహుళానుభవములు ప్రతిమానసమును మాఱ్కొనితీఱును. కొన్ని మనసులు ముత్తెపుచిప్పలబోలునవి; మఱికొన్ని మట్టిచిప్పల కెనయైనవి. వివిధానుభవములు వానియందు స్వాతివర్షబిందువులట్లు రాలి ముత్తెములు పోలు భావముల నీనును; అద్భుతసృష్టిని గనును! మట్టిచిప్పలందు నీటితుంపురులట్లు పడి అవి వానియం దదృశ్యమగును. వీనియందు సృష్టి కానుపించదు సరి కదా, మృత్యువు సిద్ధమైయుండును! ముత్తెపుచిప్పలు జిజ్ఞాసువులు కావున సౌందర్యమగని, సృష్టికర్తలు కాజాలుచున్నవి.

నిష్ఠురానుభవములు గురుపరంపరలు. వీనిసందేశములు ప్రేమసందేశములట్లు విజ్ఞానగర్భితములు. తీవ్రవేదననుండే కదా ముద్దుబిడ్డపుట్టును! గొడ్రాలునకు ప్రసవవేదనమే లేదు. కావున పండువంటి బిడ్డ నామె కనలేదు. కష్టభూయిష్ఠమైన అనుభవములన వలసినంతయాతనమునందువారే సుందర భావడింభకముల గనెదరు. ఆయనుభవముల నంతగా గణింపనివారును గలరు. కొందఱు వీరికి మానులని పేరులువెట్టి వీరిచుట్టు భజనచేతురు. భావచలన మెఱుగక, అనుభవమునందక బండరాళ్లకు మాఱుపేరులైన వీరు మృత్యువునకు పీఠస్థానములందును. కఠినానుభవములను శత్రువులట్లు విలోకించి, భీరువులట్లు వారికి తలలొగ్గువారు తమ మనుష్యత్వమును చంపుకొందురు. మొండికట్టలపై బడిన పూలవానవలె మనుష్యత్వమును మటుమాయ మొనరించుకొనిన మనసులపై బడు భావవృష్టి వ్యర్థమగును. ఆయనుభవములను నెచ్చెలులట్లు పరికించి, ఆత్మహృదయ కవాటములను తెఱచి వానికి స్వాగత మనువారు తమ మానసమంజూషములను భావమణులచే నింపుకొందురు. కఠినానుభవము లీశ్వరప్రేరితములని నానిశ్చితాభిప్రాయము. జగదీశుని నమ్మినవానికే ఇట్టి యనుభవములు లభించును. వేడిసెగలో తయారైన పాయసమువలె తీవ్రయాతనమున గ్రాగిన మనసు మనుష్యజీవనమునకు మధురపాకములను ప్రసాదించును.

తీవ్రానుభవములు చిత్తములను సోకినపుడంచుక సంచలనము నంది, సంచలనమున కొంత పరిజ్ఞానము పడసి గడియలు కడచు కొలది సంచలనమును చావనిచ్చువారు తాత్కాలికముగ తామందిన జ్ఞానమును విస్మృతియందు జారవిడిచి తొంటి తెన్నులందే నడతురు. పైబడిన వానదెబ్బకు ఒకమాఱు కదలి మరల పడియుండు బల్లలకును వీరికిని దగ్గఱిచుట్టఱిక ముండును. ఈ మహనీయులు చిరవైధ్యమునకు మంగళసూత్రము గట్టి, మానవులై పుట్టియు మృగములై చత్తురు. కష్టములను మఱచుట ఉచితమని పలుకువారు కొందఱున్నారు. ఇవి ప్రతికూలశక్తులని యెంచువారిట్టి ప్రబోధములకు కడంగవచ్చును. ఇష్టించువారును వీనికి మనసులొగ్గవచ్చును. ఈ యపోహవలన వీరు నెగలు నెఱుగరు: విజ్ఞానమును ఎఱుగరు. ప్రపంచ సారస్వతమును విప్పిచూడుడు. ఇష్టదేవత సాక్షాత్కరించినంతన నాతని చరణముల నంటి అక్కరైన వరము నందునంతదనుక

వానిని విడువకుండు భక్తులవలె, దుర్దాంతానుభవమును ఆత్మహృదయములందు నిలుపుకొని దానికరుణకతన చక్కని పాకముల నంది, వాని నాత్మజీవనములందు చిరాంకితములు గావించుకొనిన జిజ్ఞాసువులు, దివినుండి వ్రేలు దీపికలు తిమిరసంకులలోకము నాలోకిత మొనరించి గమ్యస్థానముదెస జను తెరువరి గమనమునకు తోడగులీల నా పాకములు కోటి వత్తులట్లు కాంతిలి తమ జీవనములపై మినుకులు రాల్చుచు, దృష్టిగల భాస్వదాశయము దెస జనుశక్తి తమకు తోడుపడుట గ్రహించి ప్రాప్తలాభముగ్ధహృదయులైరని యెఱుగ జాలుదురు.

జిజ్ఞాసువు అవ్వలి యవనినుండియు, నంతరంగవిశ్వమునుండియు భావవిభవము నందును. ఇంద్రియద్వారములనుండి దీనికితడు స్వాగతమును. వీనినిగుఱించి ఎన్నెన్నియో అపోహలు తలసూపినవి. ఆత్మాభ్యుదయమున కింద్రియములు చెఱుపుదెచ్చునవనియు, వీనిని త్రొక్కియుంచుట గుణవంతుని ప్రధానకర్తవ్యమనియు పెద్ద లనుచుందురు. గురుపరంపరనుండి దిగివచ్చు భావము నిలువేఱుపుజేసికొనునలవాటు మనయది. ఎన్నడో పుట్టిన సంప్రదాయము నేను ముత్తవ్వగాక జగన్మోహినివలె జవ్వనియైనిలిచెనేని ఆమెనిండుచక్కదనమునకు చేతులుజోడించుటకు మనముసంశయింపరాదు. చిరనూతనమైన సంప్రదాయమును గొలుచుట మంచిదే. కాని ఒకడు మొక్కుమని శాసించెనని గాని, మఱొకడు దానిపై పూలుచల్లుచుండెనిగాని ఈ యారాధనమునకు కడంగితిమేని నిక్కింపప్రవృద్ధిని కనులజూడము. ఏదో పుంత ఏర్పడినదని కండ్లుమూసికొని నడచువాడు తన బుద్ధిపై, సహజశక్తిపై, స్వతంత్రభావముపై అడుగులువేసి త్రొక్కును.* బాలిశ బంగారును బడసినను దానిచే ముకుటమును నిర్మించుకొనజాలడు. నిర్మించినను దాని నాతడు మనుష్యత్వమున కిచ్చి నక్కనిలువవలెను.

భావగ్రహణమునకు అక్కరైనచేత ఇంద్రియకవాటములను తెఱచియుంచవలెకాను. ఇట్లెల్లరు చేయుచునేయుందురు, రమాపతివలె వాణి అవలీలగ ప్రసన్న గాదు. తెఱువబడిన ద్వారములన్నిట నామె ప్రవేశించుట కిచ్చగింపదు. తపించు కుముద్వతి హృదయమందే నగుమోముజాబిలి చొచ్చి నందనము నందు సృష్టించులీల ధ్యానమగ్నమైయున్న మానసమునే జగదీశుడు విశ్రాంతిగృహము గావించుకొనునట్లు తపించుహృత్తామరసమును సత్యలోక మొనరించుకొని వీణాపాణియైన దివ్యభావ మందు సౌందర్యమాధుర్యసౌరభసమన్వితయై వసించును.

పూవులందుగాక ముండ్లయందే తపసు పండునుగావున తాపసులైన వీరులును, కళోపాసకులును కంటకాసనములపై నుండియే కృతకృత్యులగుదురు. మానవరక్షణార్థము మనుష్యులందు జన్మింప జగదీశుడే తపించెనని కృష్ణజీవనమును పరిశీలించినపుడు గ్రహింతుము. తపసునందలి తత్త్వమును, కష్టమందలి మహత్త్వమును ప్రకటించినది కావుననే కృష్ణావతార మవతారములందు మిన్నయైనది. కైదులోని ఘోరారిష్టములు పసిబిడ్డయైన శ్రీకృష్ణునకు పాటులైనవి. ఆతని జీవనమునకు ముకుటమైనదియు మహాకష్టమే. "జగదీశునంతటి వానికే ఇక్కట్టులు తప్పనితఱి, నిక సామాన్యుల మాటేమి?" అని ఒక హిందీమహాకవి వాకొనినాడు. కృష్ణజీవనమును గాంచి నిట్టూరుపు వీడునాతడు దానియందలి భావామృతమును గ్రోలజాలినవాడు కాడు. ఈకవి పలుకున Pessimism నిండుకుండవలె నున్నది. జగదీశునంతటివానికిని, ఈశ్వరునిపై కన్నున్నవానికిని, పరిపూర్ణత్వముదెస కాలు సాగించునాతనికిని నెచ్చెలు లగుటకై యెఱుకు లెత్తుచు నరిష్టము లరుదెంచును.

జగదీశుడు సారథియై వల్గములను జట్టియుండ దశతేజులు క్రమపంథయందే చరించును. ఈశ్వరదృష్టియందు నిలిచి వృద్ధిగనిన ఇంద్రియములు ధర్మక్షేత్రమందును, కురుక్షేత్రమందును † విశేషప్రయోజనీయము లనుట నిస్సంశయము. ఇంద్రియరహితునకు సన్న్యాసాశ్రమమున ప్రవేశించుటకు హక్కులేదు. ఇంద్రియవృద్ధి నందియే శ్రీకృష్ణుడు జితేంద్రియుడైనాడు. తజ్జ్ఞులీతని నిత్యబ్రహ్మచారి యందురు. ఇతడు పుట్టి పెరిగినది "గోకుల"లో కదా! ఇంద్రియవృద్ధి ఇందే కలిగెననునర్థ మీ పదమందు లేదా? ఇందుండియే కర్మవీరుడై ఆతడు కదలిపోయినాడు; కురుక్షేత్రమున గీతాచార్యుడైనాడు; గోవర్ధనమున జిటికెనవ్రేలిపై ఘోరారిష్టమును నిలిపినాడు; బృందావనమున మంజులగీతికాకళలను, మధురలలితకళలను వెలయించినాడు. తపసున

---

* 'మనుష్యాత్మ ముక్తిని కాంక్షించునది' యనికదా పలుకుచుందుము. ఇట్లని యభిలషించుటకు కారణము స్వేచ్ఛదానికి సహజమగుటచేతనే! కర్మబంధమునుండి విడివడి తనకు సహజమైనదానిని, తన స్వంతమైనదానిని—స్వాతంత్ర్యమును— పడయుటకై ముముక్షువు తపించును. రక్కసియొండు గుండియను నొక్కిపట్టినపుడు దానిస్పందన మాగిపోవును; గుండెగొనము ఆత్మప్రకాశ మొనరించుకొనజాలదు; గుండెలోని ప్రాణశక్తియంతయే ఎగసిపోవును. బంధము ప్రజ్ఞను ధ్వంసముచేయునని, జీవనవినాశము గావించునని పెక్కు మాటల దెలుపనేల?

సచ్చిదానందములును, "సత్యం, శివం, సుందరం" అని మనము పేర్కొను పరమాశయములును ఆత్మగుణములని యెఱుగుదుము. ఆత్మస్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లినపు డీగొనములు స్వీయప్రకాశము గనజాలవు. ముక్తినందినవాడే పరమాశయములను ముంజేతికంకణములు గావించుకొనును. మునియేకాక, కళోపాసకుడును ముముక్షువని నా దృఢాభిప్రాయము. ఆదర్శకళోపాసకుల రచనలను పరికించినపుడు మనకీయంశము దినమణివలె స్పష్టమై తోచును. స్వాతంత్ర్యకాములయ్యే వీరు సత్యవ్రతులై, ఆనందోపాసకులై, సౌందర్యవ్రతులై అమృతజీవులైరి. ఈశ్వరదత్తమైన వీరిప్రతిభ అద్భుతముగ నాత్మప్రకాశము గావించుకొనినది. ప్రతిభాప్రకాశమునకై తపించిన మిల్టన్ (Vide: Milton's Sonnet to Syrak Skinner) స్వాతంత్ర్యకాముకుడు కాడా? ఒరులశక్తిని తమగొడుగు జేసికొని, ఒరులరచనలకు దివిటీలు కొట్టుటందు సంతృప్తి నంది, ఒరులకు పదాతులై మనుగడగడపి, ఒరులబంగారుతో భుజకీర్తులు నిర్మించుకొని, ప్రపంచమున్రోల నాటకమాడి కొంతకాలము కీర్తివంతులై కొందఱు కులికినను, వీ రెంగిలికూడు దినువారని, నీచులని, దొంగలని, బానిసలని కాలక్రమమున వీరిరచనలే జగతికి తెలిపివేయును.

జరించి, క్రమజీవనమున వృద్ధినందిన జ్ఞానము, భక్తి, కర్మ వేర్వేరైయుండక కలసిమెలసి యున్నప్పుడే మానవుడు పరిపూర్ణత్వము (Perfection) నందగలడని, నరుడు (Man) నరనారాయణుడు(Man-God) కాగలడని భారతమును, భగవద్గీతను విమర్శకదృష్టితో విలోకించినపుడు గ్రహింతుము. అధునాతన వసుంధరను పరికింపుడు. జితేంద్రియులు కాక, నీతిని నీటిలోగలిపిన 'జ్ఞానులను' కర్మక్షేత్రమునుండి పరుగిడిపోవు 'భక్తులను' గంభీరభావములను గుటించియు, సత్తమాశయములను గుటించియు గురుగంభీరోపన్యాసము లొనరించి క్రియారంగణమున చతికిలపడు జ్ఞానులను భక్తులను గుర్తింతురు. అధునాతన విద్యావిధానమున నాదర్శభావ ప్రబోధమునకు అవంతచోటయిన లేకుండుటచే అవర్శనిష్ఠానమేమో, ఆదర్శజీవనమేమో ఎఱిగినవారిసంఖ్య ఇంచుమించుగ నిండు సున్నయైయున్నది.

కళోపాసనమునకు కావలసిన ఊహాసామగ్రిని మనసున నిండించుకొని, దాని నూతగా బంచుకొని నూతన భావసృష్టికి గడంగుటకు నింద్రియశక్తి ఎంతేని అవసరము. ఒరలకంటె తీక్ష్ణముగ చూచియు, ఎక్కువ మక్కువమెయి వినియు, ఆతురపాటున వివిధానుభవముల నందియు హృదయమును భావోద్వేగముచే నింపుకొని భావనావేశము నంది ఖగనాథునివలె దైవబలమును పడసి, బహుభువనముల నెగసియెగసికదా, ఆంతరంగికమైన తన మజిలీల సంపూర్ణోదంతము ప్రజానీకమునకు తెలుపుమని తనకలమును, తనకుంచెను ఈతడు నియోగించును. బహుళానుభవముల నందిన కవిహృదియే కవిలేఖినియై అందుండి తన భావశైవలిని జగతిపై జాలువారించును. పాఠకవితాన మందు గ్రుంకులిడి కవియందిన అనుభవములను దామును అందెదరు. గుడిగుమ్మమున ప్రవేశించినఅనంతరమున గర్భాలయమున దాదలపని అద్భుత దృశ్యములను విలోకించి భక్తుడు పట్టరాని ఆనందమున తన్మయనృత్యము సలుపును. వియత్తలమందలి రమ్యదృశ్యములను వీక్షించి, ఆవేశభరితహృదయుడై కవియు అవిరళ కవితాధారలను భారతి సాహితీక్షేత్రమున వెడలింపగలిగినాడు. బ్రహ్మాండమునంతటను నిండియున్న సృష్టికర్త అద్భుత రచనలను గాంచియేకదా ఆదర్శకవులు వానిని మేలుబంతులు గావించుకొని, నక్షత్రమాలవోలు భావమాల్యమును సృష్టించి "దివ్య-మాంగల్యసూత్ర మిదిగో!" అని పలికి సాహితీసీమంతిని గళమునకు దానిని గట్టుచుందురు! ఇంద్రియ ద్వారములను బంధించివేసినవో నీ కల్యాణమండపములోనికి దోకొనిపోవు దారులు కట్టుబడిపోయిన వని తెలుపనక్కర లేదు.

మిల్టన్ కవీంద్రుడు అంధుడగుట నిక్కమే. కాని అతడు పుట్టుగ్రుడ్డికాడు. కేంబ్రిడ్జిలో విద్యార్థియై యున్నపుడును, పదపడి ఇటలీశృంగాటకములందు మసలినపుడును. రెప్పవాల్పక రమ్యప్రకృతిపై కన్నుంచి ఆమె మోమునందలి సింగారమును తనయెడంద నిడికొనినాడు. ఆంతరంగిక ప్రోత్సాహమంది మహోత్సాహముతో నేదేని యుద్గ్రంథమును రచింప నిశ్చయించుకొనినాడు. తొలుత Arthur and the Knights of the Round Tableదెస తనదృష్టిని సారించినాడు.* ప్రాణాధికముగ బైబిలును ప్రేమించి, దైవప్రేరితుడై దివ్యభావములు సేకరించుకొని, యోచనామగ్నుడై బైబిలు పత్రములపై నిద్దురనొంది అపూర్వ స్వప్నముల గని, ప్రపంచసాహితికి వన్నెదెచ్చు మహోత్కృష్ట గ్రంథమును రచించినాడు.

అవ్వలనే గాక అంతరంగమందును జ్ఞానేంద్రియములు కలవు బాహ్యేంద్రియ మొక్కమాఱుచూచిన దృశ్యమును లోగల కన్ను మక్కువగల యన్నివేళలందు విలోకింపగలుగును. అవ్వల వినిన తీయనిపాటను ఇచ్చవచ్చిన ముహూర్తములందు అంతరంగ గర్భాలయమున వినగల వీను లంతరంగమున గలవు. శిల్పమందును, కల్పనమందును సిద్ధహస్తులైనవారి రచనలను విలోకించినంతన నంతరంగేంద్రియములు చాకచక్యముతో కదలును; అపూర్వ దృశ్యములను మానసయవనికపై చిత్రించును; ఆత్మ నవిరళానందముతో తనుపును. జిజ్ఞాసవలని ప్రేరణము నందిన ఇంద్రియములు పరిశీలన భావనములకు దారులు నిర్మించును. మనుష్యమానసము డపూర్వశక్తినంది, నూతనదృశ్య కల్పనమున నాటితేలును. మిల్టన్ మహాకవి అంధుడు కాకమున్న హోమరు డాంటే ప్రభృతుల రచనలను పుంఖానుపుంఖముగ పఠించినాడు. బియాట్రిస్‌కై పొగిలిన డాంటే కరుణాపెంపున తానంతకుమున్న గనని లోకమున కాలిడినాడు. నవశక్తి నిజాంతరంగమున మేలుకాంచుట గనినాడు. పరంజ్యోతిని ప్రస్తుతించినాడు (Vide: Milton's "Invocation to Light"). అంధుడయ్యునంతరంగ మాలోకప్లావితమై యుంట గని మిగుల మురిసినాడు. కల్పాంకూరముల కెనయైన కల్పన లాత్మహృదిపై మేలిబిసుళ్లయి యుంట విలోకించి,తొంటియావేదనను నుండి (Vide: Milton's Sonnet "On his arriving at the age of twenty-three") కదలి ఆనందార్ణవమున లంఘించి అందు మునకవేసినాడు. విశాల నిరయమును, Pandemonium ను కట్టెదుటజూచినట్లు వర్ణించి (Vide. "Paradise Lost") నాకవిభవమున కెగసిపోయి (Vide: "Paradise Regained") పతితుడైన మానవు డీశ్వరకరుణకతన పునరుద్ధరణమునంది, ఈశ్వరసామ్రాజ్యమున ("Kingdom of God") స్వాగతమందుట గాంచి, నారాయణునిమ్రోల నృత్యమొనరించిన దేవమునివలె తన్మయహృదయుడైనాడు. సృష్టిచిత్రములందలి శక్తియనుడు, ప్రతిభాప్రదీప్తరచనలందలి శక్తియనుడు ఈ ఋషికవీంద్రుని హృదయమును తాకినంతన, గోటిచే మీటినతోడన సప్తరాగములు వీణాహృదినుండి యున్వత్తుగ లేచులీల, నందుండి భావవినోదనాదలహరి తెరలుతెరలై ప్రసరించినది.

దశహయములకు సంధింపబడిన వల్గముకృష్ణకరములకు లొంగులీల, నాత్మశక్తికి లొంగిన మనసునంటిన దశేంద్రియములు క్రమగతి జరించి విజయధ్వజమును గాంచుననియు, అపుడే సౌందర్యభాసురమైన జీవనమును, సాహితియును గోచరించు ననియు సూచించియుంటిని గదా! భావములుటులు పాంచజన్యమును, దేవదత్తమును పూరించిరనియు, వారితేరుపై కపిధ్వజము వెలసె

* ఈతనియనంతరము టెన్నిసన్ మహాకవి వీరిపై చూడ్కులు నిగిడించి వీరి ప్రజ్ఞ నతికౌశలముగా గీర్తించినాడు (Vide: T...son's Idylls of the King).

షూటింగు పూర్తి కావచ్చినది

# విడుదలకై ఎదురుచూడుడు

(శ్రీరామా ఫిలిమ్సు లిమిటెడు, నెల్లూరు)
వారిచే కలకత్తా ఈస్టుఇండియా ఫిల్ము కంపెనీవారి స్టుడియోలో
తయారగుచున్న బ్రహ్మాండమైన రెండవ తెలుగుటాకీ

మేనులు గగుర్పాటొందించు దృశ్యములతోను
సెట్టింగులతోను, సాహస కార్యములతోను
విరాజిల్లుచున్నది.



ఇందు పాల్గొన్న
నటీనటవర్గము

మాధవపెద్ది వెంకట్రామయ్య, అద్దంకి శ్రీరామమూర్తి, వేలనాటి రామకృష్ణయ్య, ఆర్. నటేశయ్య ఊడల సుబ్రహ్మణ్యం, మిస్. శ్రీరంజని, లక్ష్మీరాజ్యం, శకుంతలాదేవి ప్రశాంతమ్మ, అరుణాచలం వగైరా.

బుకింగునకు సిద్ధముగాయున్నది

## సతీ — తులసి

*For booking apply to:—*

**Sree Rama Films Ltd, Nellore.**

## 'బృందావన' చిత్రములు. కృష్ణరాజసాగరము, మైసూరు.

—శంకర సుబ్రహ్మణ్యం

౧ కృష్ణరాజసాగరముకట్టక్రింది దక్షిణబృందావనము. బృందావనము దక్షిణపుచివరనున్న మంటపమునుండి కాన్పించు దృశ్యము.





౨ దక్షిణబృందావనము దక్షిణపుచివరనున్న మంటపముఖదృశ్యము. సాగరమునందలి నీరు గొట్టములగుండా దీని క్రిందనుండి బృందావనమునందలి కృతకసరస్సులలోనికి ప్రవహించుచుండును.



3 మీద పేర్కొనిన మంటపమునకు పడమటివైపునగల దక్షిణబృందావన దృశ్యము. ఎదుట సాగరము కట్ట, కుడియంచున కృతకజలాశయమున నీరెగజిమ్ముచున్న జలయంత్రములు కానవచ్చును.



౪ దక్షిణ - ఉత్తర బృందావనములనడుమ సాగరమధ్యముననుండి తూములగుండ ప్రవహించు కావేరి నది. కట్ట నానుకొని నదిమీద వంతెనయున్నది.



౫ సాగరముకట్ట దక్షిణపుటంచున గల ద్వారము. దీనిగుండ కట్టమీదికి పోవలెను. ఎదుట ఎడమప్రక్క సాగరము. కుడిప్రక్క బృందావనము.



౬. దక్షిణపు వైపుననున్న సాగరము తూములు.



౭ దక్షిణ బృందావనము ఉత్తరపు చివర పడమటి పగ మున నిరంతరము నీరు ఎగజిమ్ముచున్న జల యంత్రములు.



౮ ఉత్తరబృందావనము: ఉత్తరపు చివరనుండు మంటపమునుండి- కాన్పించు దృశ్యము. ఎట్టఎదుటనుండి కుడివైపునకు సాగియున్నది సాగరముకట్ట.

యనియు నెఱిగి, శంఖములుపూరించుటవ వీర్యశక్తినిపూరించుటనియు, కపిధ్వజమును పూనుటన జిజ్ఞాసన (Spirit of Inquiry) హృద్వీథిని నిలుపుటనియు గ్రహించితిమేని, ఉత్తమ జీవననిర్వహణమునకును, ఆదర్శభావ సృష్టికిని ఓజస్సును, అనిర్వాచ్య తేజస్సును, జిజ్ఞాసయును అనివార్యములని గుర్తింపజాలుదుము. ఈవిశ్వాసమునకు ఛాయలనదగు నంశములు తొలుత గ్రీకుసారస్వతమున గోచరించినవి (Vide: The works of Plato and Socrates). పదపడి తోచిన పాశ్చాత్యతాత్త్వికుల హృదయములందును, కవుల యంతరంగములందును ఇట్టివిశ్వాసము కలదనుట కాధారములు కలవు. వీరు వివిధపదప్రయోగములను గావించిరంతియే! మెదడు చెంతమర్దించినను రవికిరణములు పోలు భావము లందుండి ప్రసరింపవని వీ రెఱుగుదురు. యోచనకుగాని, Ratiocination కు గాని, షెల్లీకవీంద్రుడనిన Owl-winged calculation కు గాని చేకుఱనిభావము Intuition కు లభించునని ఈతాత్త్వికు లనిరి. కొంద ఱీభావవిభూతి Instinct వలన చేకుఱునందురు బెర్ట్రాండ్ రస్సెల్ Instinct, Spirit, Mind ల Harmonious development ఉండవలెననివాడు (Vide: "Ideals of social Reconstructon" By Pertrand Russel.)

మాటలకందని ఈశక్తికై పాకులనివాడు రత్నదీపికవోలు రచనమును సృష్టింపజాలడు. పండువెన్నెలపగిది భావము, గులాబితోటకీడగుపుట, తేనెతెరటమున కెనయైనమాట, జాతిరతినమును గేలిచేయు జాతీయము యోచించి, యోచించి, తలమొట్టికొని, అంతరంగమున నెంతో బాధపడి ఏ సీమయందును, ఏకాలమందును, ఏకవియును సృష్టింపలేదు. కలముచేబూని రతఃపురచనమును చెక్కుదననిచెప్పి నెగ్గినవా డెవ్వడును లేడని నా యభిప్రాయము. పరీక్షకై నెడలు విద్యార్థివలె ఎంతో చెమటనోడ్చి సాహితీ క్షేత్రమున ననంతవిజయమును పూరింపజాలినవా డెవ్వడును లేడు. చదివి చదివి వ్రాయువాడును, ఇంటికడ నిండుగ వయార్యై యుపన్యసించువాడును సామాన్యులే యని నా భావము. కంఠస్థమొనరించిన పలుకులు, బడులందు నేర్చుకొనిన యూసులు, పెద్దలు దిగవిడిచిపోయిన మెతుకులు, నిఘంటువులు ప్రసాదించిన పిండములు స్వంతవస్తువు లెట్లు కను? బహుకష్టముల కోపకుచే నాత్మశక్తిని వృద్ధిగావించుకొనిన రచయితయు, కర్తయును ముమ్మాటికిని కర్షకులు. కవికిని వానిని, ఒకలకొకసు చెప్పి పోతెక్కట్టి "ఇది నా వ్రాలి" అనువానిని సర్వహితులును, సత్యవ్రతులు కానేరరు, మోసకులును, కనులున్నవారు మెచ్చరు; వారినుడుపులు మెఱపులని ప్రశంసింతురు! కన్నుగల విమర్శకులును, సాహితీ సృష్టి నెఱిగిన జిజ్ఞాసువులును ఇట్టి [illegible] పులని గ్రహించి వారికి జోహారు లొసంగరు. స్వార్థపరుల పొగడ్తనంది పెద్ద పటమునందు రంగురూపులతో గోచరించు ఈ బద్ధప్ర రచయితలకు చిలుకలకుం బుట్టిన [illegible] కీర్తి లభించును గాని చిరంజీవులైన కళోపాసకులందు కాదు అమృతకలశముకై పొగిలిన అమరనివహముకైవడి భావామృతమునకై ఆతురపడి, హృదయావేగము నీశ్వర చరణోపాంతమున సుస్మరించి, ఆత్మజీవనములందు కళలనీను పసిడిపంటల దొర్కొత్తింపుమని వేల్పుకాపును వేశకొనను, పూవులందును, చుక్కవెలుగులందును, చిరుతరగలందును, కమ్మతెమ్మెర గుసగుసలందును నెలయు శక్తి ప్రసన్నతకై తపనుచేయువారే తాపహింపజాలని మంగళమహార్ణవమున సుస్వాగ పూరితస్వాదయులై దేవత్వము నంది, మయూఖ మండితాంతరంగులై, జ్యోతిర్మయ జీవులై, తమరచనలందు దీపావళీ మహోత్సవమును ప్రదర్శింతురు; ఈ యద్భుతసృష్టికి తమ్ములను నిమిత్తములు గావించిన దివ్యశక్తి ఎట్టిదో కదాయని వీ రబ్బురపడుచుందురు.

భక్తుడు కానివాడు, నిర్మలహృదయము లేనివాడు, సచ్చరిత్రుడు కానివాడు, ఆత్మశక్తిని వృద్ధిగావించుకొననివాడు కలముబట్టినచో తన గ్రంథములను చెత్తతోను, చెదారముతోను నింపివేయునని ఒకమాఱు కాదు వేయిమాఱులు కంఠమెత్తి వచింతును. సాహిత్యము జీవనసముద్భవమని యెఱిగినవారు కంపుగొట్టు బ్రతుకు కంపుగొట్టు సాహితినే కనునని గ్రహింపకపోరు. మురికిగుంటలో పుట్టునది మశకముగాని మరాళమా? విషాక్తమైన మనసున నుదయించునది రాబందుపగిది దుర్భావముగాని కలకంఠబోలు సద్భావమా? కమలాకరమే కదా కలహంసను కనును! గొడ్డు తామరయే కదా నాల్గుమోముల భృంగమును గనినది! ప్రణయబంధుర వ్రజధామమే కదా బహుళ కృష్ణసేవికలను గనినది! పుణ్యదక్షిణేశ్వరక్షేత్రమే కదా పరమహంసను గనినది!

భాగవతమును రచింపుచున్న పోతరాజు శక్తికిరణకై తపించినాడు. ఈతడెనిన "పలుకరమ్మల మూలపుటమ్మ" శక్తి కాదా? "దుర్గమాయమ్మ, యిచ్చుతమహత్త్వకవిత్వపటుత్వసంపదల్" అని ప్రస్తుతించి, కృతకృత్యుడై ఈతడు తనరచనయందు దివ్యదీపకళికలు వెలిగింప జేయలేదా? పోతనయొకనికవి నక్షణము నంగవేసెని, ఆతనివ్రాతలందు వ్యాకరణస్ఖాలిత్యము లున్నవని మన విమర్శకు లనిరి. శిలాశాసనములు పోలు వ్యాకరణసూత్రములను చేబట్టి సారస్వతతత్త్వమేమో ఎఱుగని ఈయయ్యలు పోతనఅక్కరములమీదనే కన్నుంచిరికాని, ఆయక్షరహృదయములను ఛేదించుకొనిపోయి, వానియందుగల కురవుగాని మహితభావమణిమంజరిని గుఱుతించిరి కారు. వ్యాసుడిచ్చిన సరుకునకు తెలుగురూపిచ్చి తృప్తినందక, తన సహజరచనమున నీరు దుడు రాశిపోలు స్వతంత్రభావరాజిని నిలిపెనని వీరు గ్రహింపరైరి. తత్త్వచింతయం దాఱితేరిన భారతీయులలో నిట్టి విమర్శకులు తలసూపుట దురదృష్ట మందును. గంపెడుగులాబు లెదుటనుండ నిందందు దోచిన ముండ్లను చూచి వెక్కివెక్కి యేడ్చువాడును, "ఛసీ!" యనువాడును నెట్టివారు? విజ్ఞానదృష్టి గలవారును, విశాలహృదయులును ఆంగ్లవిమర్శకులందు తోచుటచే ప్రతిభాసమన్వితులైన ఆంగ్లకవులు సాహితీ వియత్తలమున నేడు నక్షత్రపుంజమట్లు కాంతిలుచున్నారు. కవులు గానివారు తమడొంకలలో తము దూఱి అదృశ్యులైరి. షేక్స్పియరులో గల కొలదిమాత్రపు నెరసులను వారంతగా లెక్కింపక ఆతనియందు తేజరిల్లిన దివ్యజ్యోతికి చేతులుమొగిచిరి. ఇట్లని ఋజువు చేయుటకై నేనెన్ని దృష్టాంతములను పేర్కొనగలను. షేక్స్పియరు రచనలందలి అత్యద్భుతమైన భాగము Hamlet నాటకమందలి "To be or not to be" మొదలుగల యంశమందును. కాని దీనిలో వ్యాకరణస్ఖాలిత్యమున్నది; అలంకారశాస్త్రము సమ్మతింపని వచనరచన మున్నది. "Take up arms against a sea of troubles" అనుట కూడునా? ఆంగ్లవిమర్శకు లీయంశమునే గణించిరికారు. సూర్యుని గాంచి, వానినొసలున

కన్న వెల్లువను నా యంత్రము వల్లనో, తంత్రము వల్లనో కవులొచ్చి "ఇతడు నా బ కష్ట పెద్దలకు ఎక్కువైన అభాసు ఎవరి ఏమ ర్శించిరికాదు. సత్యము సామ్యమును, పక్షపాతము నమూనా మన నేలలో తలపోపవంతదనుక ...కాంపుకవులు కోళ్ళబుట్టలో నడగియున్న మణులట్లు గాలబడియుందురు; చీటికి మాటికి చిందులు త్రొక్కుచు మాంగల్యను వచ్చినా రనుచు, జీతము భిక్షమును ఇచ్చి భట్రాజులను నియోగించువారును ఒకపరి తామె మొగులకు పదాతులై చెట్టొకమాటు కొండనొగులకు పదాతులను గావించుకొని , పయొసగి మంచి మాటలు కొనువారను శిలశిత్తుదురు; organised advertisement ఆవిర్భవింపును; ఆశ్రయించు పుణేపవన మిల్లుగట్టుకొనుచు. సహజమైన కవనకుంభలములకై తపింపక బిచ్చమెత్తి కుంభలములను దెచ్చుకొనువారు అవతరింతురు; ముద్రలను, గద్దలను, గంటలను బూని కొమ్ములు పెంచుకొనువారు ఉద్భవింతురు. దుగ్ధధారలవోలె కవితాధారలను వలారించు వారిని కామధేనువులని వారి ప్రోల సాగిల పడెదము; అట్టి ధారల సృష్టింపలేక సొంత కార్ఖానాలో తయారైన బిరుదులు దాల్చి, సొంతమగ్గములందలి రంగుగుడ్డలు పైగొని, సేవకుల బూరాపాటలను, డోలువాయింపులను సరిపదులీల తలలూపుచు నూరూర దిరుగు వెంకన్నలు తోచునెడల నవ్వకొనమా?

కాళిదాసువలె పోతనామాత్యుడే శక్తిని "దుర్గ" యని సంబోధించి ప్రస్తుతించినాడో ఆ శక్తినే మఱికొందఱు "వాణి" యని కీర్తించిరి. "వాణి నా రాణి" యని వచించిన వ్యక్తి భక్తప్రవరుడై, భవ్యగుణభాసురుడై, దివ్యశక్తిని హృదీశ్వరి గావించుకొని, దాని వాత్సల్యము పెంపున కవిత్వమహత్త్వము నందినాడు.

"మురళీరవ తరళీకృతమునిమానసనలినం మమ ఖేలతి మదచేతసి మధురాధర మమృతమ్"

అని సంస్తుతించిన మహాకవియు దివ్యకళోపాసకు నాత్మహృది నిడికొనియే మధుర రచనకు సృష్టికర్తయైనాడు.

ఈశ్వరోపాసనము లేని కళోపాసనము ప్రాచీన భారతావనియందు లేనే లేదు; మహాత్ములు గాని కవులును, తాత్త్వికులును మన నేలలో జనింపనేలేదు. వసుంధర ఇపుడు తలక్రిందులైనది. పరిస్థితులు తాఱుమాఱైనవి.

అసనాతననాగరికత దొంగ యని ఈశ్వరుని తఱిమికొట్టినది; కండలు, మెదడును ఇలువేల్పులు గావించుకొనినది; ఆత్మశక్తిమీది విశ్వాసమును గోల్పోయినది. కావున నేటి ప్రపంచజీవనమందుగాని, సాహిత్యమందుగాని జ్యోతిర్లీల దృగ్గోచరము గుటలేదు. కొండమాత్రపు ఆధ్యాత్మికశక్తులు భారతభూమియందు తోచి కుడిసుండమున బుడుంగుమను భూగోళమును గట్టిగ బట్టియుంచినవి.

ఇట్టిశక్తి తొలుదొలుత రవీంద్రుని రచనలం గుత్తికమైనది. రవికవి భారతీయులలో భారతీయుడు. ఉపనిషచ్ఛిఖరములపై శైశవక్రీడలు సలిపి, దేవమునివలె గంభీరభావవిభూతి నీతడు నిజాంతరంగమున నింపుకొనినాడు. ఋషిసంప్రదాయ మీతనియందు పునర్జన్మ మందినది* రేపకడ లేచి, జగదీశు నుపాసించియే రవితాకూరు కలమును చేబూనును. అధునాతన విజ్ఞానవసుంధరనయనములకు మిఱుమిట్లు గొలిపిన "గీతాంజలి" రవీంద్రుడీశ్వరునకు భక్తిపూర్వకముగా సమర్పించిన కావ్యకాదా? ఈ సుమాంజలి నర్పించుటకై దివ్యశక్తి నుద్దేశించి, అంజలి ఘటించి ఈతడేమనెనో కనుగొనుడు :

"At the immortal touch of thy hands my little heart loses its limits in joy and gives birth to utterance ineffable."

కారణకార్యములకు అవినాభావసంబంధమున్నదని కదా తర్కశాస్త్రము తెలుపుచున్నది. ఈశ్వరశక్తిసముద్భవమైన భావము ఈశ్వరుడుండునంతకాలము (అనంతకాలము) నిలుచును. కాలము కదచుకొలది ఇది కొంగ్రొత్తరూపులం దవతరించును. కళకు కావలసినది నవీనత్వము. జగదీశుడుకూడ వేర్వేఱు వేళలందు వేర్వేఱురూపుల, వేర్వేఱు తెఱగుల నవతరింపలేదా? నవయుగమున నవీనరూపున తేజరిల్లు సాహితి గోచరించుటొప్పు. ఇవి దివ్యభావముల నాత్మహృదయములం దిడికొనిన వసువో, నీభావములు వెనుకటివని వీనిపై కారములను మిరియములను నూఱిపోయరాదు. "ప్రతిపదలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యామ్", "క్షణేక్షణే యన్నవతాముపైతి తదేవ రూపం రమణీయతాయాః" అను వాక్యములు కళోపాసకులకు విదితమేకదా! నిత్యనవీనములైన భావములను, అనవరతము విలాసరసభాసురమై యుండు దృశ్యములను ఆదరదృష్టితో పరికించుటొప్పు. వెనుకటివని ఇట్టివానిని త్రోసివేయువారనేకులు నేటి విద్యాధికులందు గలరు. సృష్టిచిత్రములు వెనుకటివని వానిని చూచి వెక్కిరించువారు ఎట్టివారు? ఈ చిత్రములు సనాతనములే! ఇవి నిత్యనూతనములుకూడ గావా? వీనికి బూజుపట్టునా, త్రుప్పుపట్టునా? ఈశ్వరుడున్నాడని ప్రాచీనుల దృఢ నమ్మిక. ఇది ప్రాక్భావమని, ఈ విశ్వాసమును బూడ్చిపెట్టవలెననుట ధర్మమా?

నవయుగాచార్యుడైన రామమోహనుని బోధామృతమును గ్రోలి, ఆతని యనంతరము తన కవితకతన నవయుగాచార్యుడైన రవీంద్రుడు నిత్యసంజీవములైన భావములను, సంప్రదాయములను గుఱుతించి వానిని తన పూజాపీఠమందు సాలభంజికల గావించుకొనినాడు.† ఏ యుగమున జనించినను మహావిజ్ఞానులందఱు నిట్లే కావించిరి. నిన్న తయారై నేడు పులియునది తరవాణి. ఎన్నడో ఉదయించిన అమృతమునకు పాటు వాటిల్లదు. ఈశ్వరారాధకులై, ఈశ్వరకారుణ్యముకతన నాత్మహృదయముల నమృతకలశములు కొ

---

* "In his insistence on the supremacy of spiritual values is central to good life and social order, Rabindranath is at one with the long tradition of Indian thinkers." (Vide: Page 131 "East and West in Religion" By Sir S. Radhakrishnan).

† "When I look back upon those days, it seems to me that unconsciously I followed the path of my Vedic ancestors, and was inspired by the tropical sky with its suggestion of an uttermost Beyond" (Vide: Rabindranath Tagore's Hibbert Lectures for 1930 or "The Religion of Man", Chapter on "The Vision" page 92).

వించుకొనిన కళోపాసకులు అమృతజీవులై సుధాబంధురరచనలను సృష్టించిరి.

మహిమోపేతమైన జీవనమును, మహత్తరమైన సాహితీసృష్టియును మిక్కిలి యరుదైన నేడీయంశము నెల్లలు గుర్తించుట పాడి. కాని ఇట్లుగుణుతించిన మహనీయుల సంఖ్యను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. రవీంద్రు డొక్కండని తెలుపనే తెలిపితిని. ఈతని గనిన మహర్షి మఱొక్కండు. రామకృష్ణ వివేకానందులును, గాంధి మాలవ్యాలును, రాధాకృష్ణ భగవాన్‌దాసులును, వాస్వానీ అరవిందులును, విద్యాసాగర అషుతోషులును తక్కుంగలవారు. స్వర్గీయుడైన ఈశ్వరచంద్ర విద్యాసాగరు డీవర్గమున కాది చెప్పదగినవారు. పాశ్చాత్యులయ్యు భారతాంబకు పెంపుడుబిడ్డలైన బెసెంట్, ఏండ్రూస్, కజిన్సు లీ విజ్ఞాన యాత్రీకులందు జేరుకొనిరి. వీరి జీవనములను, రచనలను విలోకించితిమేని, వీరు సత్యము నారాధించువారని, సౌందర్యోపాసకులని, ఆనందవ్రతులని, నిత్య సంజీవములైన భావములపై పూలచెండులు విసరువారని, అమరజ్యోతి బోలు కొంతొక సంప్రదాయముచుట్టు భక్తిపూర్ణ హృదయులై భజన చేయువారని గుర్తింతుము. ప్రపంచకవులు కీర్తించు Love and Harmony ఈ భజనలందున్నవందును. రవీంద్రుడు తెలిపిన "Designers of Paradise" ఈ భాగవతులే యని రూఢిచేతును. రవీంద్రు దృష్టి నాకర్షించిన వేఱొక కవీంద్రుడు పలికిన "Music-makers", "Dreamers"* వీరే యని ఋజువు గావింతును.

మంచుకొండలలోని లోతులోయలలో నల్లనల్లన ప్రవించు గంగానది రొమ్ముమీది పిల్లకెరటాలు దివ్యశింభకములగుడు సచ్చిదానందముల జొక్కియుండి, మలయ హిల్లోల స్పర్శచే కదలికదలి, జనయిత్రీబోధకు వీనులొగ్గి, తారకమును గుసగుస జపించుచు మంత్రోదకమునకు నిభృతానందమును సహకరించి భావపిపాసువులదెస నాపూత పూరమును ప్రత్తెంచు లీల, రామకృష్ణుని జీవనమును ప్రాపానరించుకొనిన దుర్గ, తొల్లింటి రామకృష్ణ లీమా ఒక్క పరమహంసయై యవతరించుట గుర్తించి, రాముని దహప దారకమును జపించి, కృష్ణ

* "We are the music - makers, we are the dreamers of dreams."

పరమాత్మ నలరింప దొకసద్భక్తు పతించి, పునీతమైన జీవనమును మహంత పని తకంపము గావించి, అందలి భావహారంబుల జిజ్ఞాసువుల మానసవీథులలోనికి బుత్తెంచిరి.

ఈశ్వరిచే రామకృష్ణున మహాత్మ్యాయిని యైనది. దివ్యశక్తి కటాక్షముకలనసే అనిరుపేద మహావిజ్ఞాని యైనాడు. అతడు గ్రంథపఠన మెఱుంగడు. ఎల్ల అనుకొను చదువుసంధ్య లెఱుగడు. కాళిదాసుగూడ నిట్టివాడే! ఏవన్ నదీకూల స్థిత ప్రకృతియందు విరజిల్లిన దివ్యశక్తికరుణ నందియే షేక్స్పియరు ప్రావ్లేని కవిసమ్రాట్టయినాడు. గ్రంథములను గ్రంథములనుండి కదలిపోయినగాని నైసర్గిక ప్రతిభాసమన్వితునకు గతిమోక్షములు లేవు.

గ్రంథపఠనము నెవారుగ నిషేధింపను గాని విజ్ఞానార్జనమున నది ప్రధానాంగము కాదని వాదింతును. మానసిక దార్ఢ్య మున్నచో, ఎన్ని వేలపుటలనో కంఠస్థ మొనరించుకొన జాలుదుము; ఎంతలెంతటి భావములనో మనసున జేర్చుకొనగలుగుదుము. సహజశక్తి సమన్వితుడు పాండితితో తనపని చాలించుకొనడు. వాడియైన ప్రజ్ఞాగోళయై, లోగల బంగారును వెలువఱుచునంతదనుక పాండితి యాదరింపదగినది. పైనుండి దిగుమతియగు పరాకున కంతకుమించిన తావుండరాదు. కసవు మేసవు ఆవు కసవునేగాక సహజమై, స్వంతమై, శుచ్యమైన దుగ్ధధారల నిచ్చులీల, పాండితినందిన వ్యక్తి పాండితినే గ్రక్కివేయక, దానిని జీర్ణించుకొని, మానసికశక్తిని వృద్ధిగావించుకొని స్వంతమై, సహజమై, రుచ్యమైన భావధారలను వెడలింపవలెను. కొందఱీపాండితిని గూడ నందక తొలిభవమందే ఆంతరంగికమైన పరిపాక మందియుండుటచే, నావేశ భరిత మంగళముహూర్తమున నాచంద్రతారార్కము నిలుచు భావములను వ్యక్తీకరింపగలరు. ఇట్టివారిలో రామకృష్ణు డొక్కడు. ఈతని "కథామృతము"న నిట్టిభావములు కొల్లలై యున్నవి.† ఏదేని రమ్యదృశ్యమునో, సుందర సంఘటనమునో పరిశీలించినంతన నీతని మనసున నపూర్వసంచలన ముదయించెడిది. మానససరోవరమందలి మానసౌకము మాడ్కి ఈతని హృదయ కల్హారమందలి

† "సంపూర్ణ భక్త, జయ" మను నా గ్రంథమున పరమహంస జీవనమునుగుఱించి వ్రాయుటచే ఇందలి సుధాబిందువులనందు కొన్ని జల్లియుంటిని.

[illegible]త్మ శిరమెత్తి సృష్టినెనరించి అనంతానందమున గొప్పనాడెడిది. కృష్ణస్పర్శచే చలించుచుండ కవళికలే హృదయము కదలువప్పుడే అందు భావోద్వేగ ముదయించుచు; అప్పుడే అందుండి మధురగీతికాపంక్తులు వెడలును. ప్రణయస్పర్శ మంజులభావప్రసవిని యగుట తప్పుకాదు. ప్రేమబంధుర రవికర స్పర్శకతన [illegible]లికిరై, పరవశయై కదా కవిస్వాతి సరోజిని దివ్యభావ వ్యక్తుల నిమను! సుందరదృశ్యమందలి ఈశ్వరత పరమహంస హృదయమును స్పృశించి, అగణితస్పృష్టికి నిమిత్తమయ్యెడిది. రామకృష్ణుడొకప్పుడు కొంగలు కొన్ని నీలాకాశమున వెడలెగయుట జూచి తన్మయభావమున బుగుంపన మునింగినాడట! నీలంపు మిన్నునెన్నుపై తెల్లని విరిపంక్తులు వ్రాలినవి! ఆహా! ఎట్టి సుందరదృశ్యము!

సౌందర్య సృష్టికి వ్యతిరేక గుణములాలుమగలై యుండవలెను కాబోలు! పురాణ దంపతులను విలోకింపుడు. నల్లని దేవదేవుని యెడందపై కనకలతవలెనే కమల శోభిల్లెడి! దేవతలందు చొరబడిన దొరవతె తెల్లనైన శివునకు నల్లచెల్వ అర్ధాంగియైనది! రంగువ్యత్యాసమునే నే నుల్లేఖించుట లేదు. రెండు తీరుల శక్తులు కలిసినవి కావుననే అద్భుతమైన విశ్వసృష్టి సాధ్యమైనది. వానకారున మిన్నుదెస కన్నువేసిన నీయంశము మఱింత స్పష్టముగ హృదయంగమ మగును. విహాయసపాత్రమున సౌదామిని నల్లని మొయిలుమగని కవుంగిలించుకొనుట పొంచి పొంచి చూడుడు. ఆసంశ్లేషమున నెంతో సౌందర్యము సృష్టియగుటగాంచి పులకితాంగులు కారా? అపరిమ్లానము మధుర భావ ధారలకు సృష్టికర్తయగుట గమనించి, ఆధారలకు వానచినుకులను ముద్దుపెట్టిడరా? సంతప్తమైన విశాలభూదేవి హృదయముపై వోయినుకిరిపించునది చినుకులోని కడలేని చల్లదనమే కదా! చినుకులోని శక్తి సమాగమమువలనగదా వసుమతి సుందరమై సస్యశ్యామలమగును.

ఆవేశభరితమనస్కులై వ్రజనారీమణులు భుజమృణాళముల జాచి శ్యామసుందరు నాలింగన మాచరించుకొన జర్విడునట్లు నీల విహాయసముదెస కొంగ లెగయుచు, రామకృష్ణుని కనుల బడినప్పుడు అద్భుతభావ స్పర్శచే నాతనిహృదయము చలించినది. నీలాకాశ మనంతమైనది. ఈశ్వరశక్తియు నట్టిదియే! తెల్లకొంగలు? అనంతశక్తి నందజూచు

...జ్ఞాస ప్రలంగను. తాదాత్మ్యము నాస్వాదము జేసికొని యుండెనో పసందైన పరమహంస తెలిసియుండలేను. కొండలందు ముముక్షువులను, గగనమందు జగదీశ్వరుని అతడు విలోకించియుండును. జీవాత్మ పరమాత్మల సంగమము గాంచి, తన్మయభావమున నాతడు మునిగియుండును. సృష్టికర్తవలె గంభీరభావమొందు ఆపవిత్రముహూర్తమున సంచలిత హృత్సరసీజంబున నవతరించినది. రామకృష్ణుడు పరమహంస యందురు, మహాభక్తుడందురు, అతడు మహాకవియని నే బలికిన నెదురాడువారెవరు?

సుందర దృశ్యములను చూచి రవీంద్రుడెన్నిమారులో తన్మయచిత్తుడై అద్భుత భావసృష్టి గావించినాడు. ఆకవీంద్రుని పలుకుల నాలింపుడు:

"When I was eighteen, a sudden spring breeze of religious experience for the first time came to my life and passed away leaving in my memory a direct message of spiritual reality. One day while I stood watching at early dawn the Sun sending out its rays from behind the trees, I suddenly felt as if some ancient mist had in a moment lifted from my sight, and the morning light on the face of the world revealed an inner radiance of joy. The invisible screen of the commonplace was removed from all things and all men, and their ultimate significance was intensified in my mind; and this is the definition of beauty. That which was memorable in this experience was its human message, the sudden expansion of my consciousness in the Super-personal world of man." (Vide: Tagore's Hibbert Lectures on "The Religion of Man" page 94).

భావమును తెలిసికొనుటకంటె భావానుభవము నందుట మహత్తరమైన విషయము. తెలిసికొనువాడు భౌతిక శాస్త్రవేత్త; అనుభవించువాడు కళోపాసకుడు. నేర్పుమెయి ఈతడు సుందరభావమును హృదయానందనములో నిక్షేపించికొని పోయి, కల్పకమునీడ జేరి, దానితో నానందక్రీడలు సలిపిసలిపి, మధుర కల్పనా సూనముల తలబ్రాలు చేసికొని, పోతన తెలిపిన కల్యాణాత్మకమైన కథలను సృష్టించి ఆత్మప్రకాశమున సృష్టిగాంచును. మిన్ను గాంచి వింతవింత మ్రుగ్గులను చూచి భౌతిక శాస్త్రజ్ఞుడెన్నో విషయములను తెలిసికొని, తేటతెల్లమైన శైలిలో ఉపన్యాస మీయగలడు. ఈతనిది మెదడుపని; ఈతనిమాటలు మెదడునే తట్టును. సుందరదృశ్యమును పరమహంసయు, కవియు చూచు తెఱగెట్టిదో చదువరు లెఱుగుదురుకదా! వీరు కనునది Vision. బహుళకాంతి గర్భితమైన సూర్యకిరణమువలె Vision మినుకులీను పెక్కు తలపులతో నిండియుండును. కవియొక్క దివ్యసామగ్రి ఈకళుకే! ఈతనిసృష్టి ఈసామగ్రినుండియే నిర్మాణమగును! కావుననే బహుయుగములు దీనికి జోహారులిడును. మిన్నుమీది పెంగుంగుసల మ్రుగ్గులందు రతనపు గీతలను, ముత్తెపు జేరులను, వైడూర్యములీను చాలును, గోమేధిక పాళిని, మరకతద్యుతుల కోవను వాల్గంటితళుక్కుల కెనయైన దివ్యచ్ఛాయను తనివార చూచిచూచి వీని నంతరంగ వియత్తలమున జేర్చుకొని, ఆత్మానుభవమున జొక్కి తాను భావపరవశుడైయున్న మంగళముహూర్తమందే తనసృష్టి గడించును కన్నన్న విమర్శకుడీ సృష్టిని గాంచి, అది బహురత్నద్యుతి ఖచిత చిత్రవిహాయసమునకు ప్రతిబింబమని గుర్తించి, గుండెగలవాడు కావున అనంతానందమున నృత్యము సలిపి, "చూడరండి! చూడరండి!!" అని జిజ్ఞాసగల భువనములను చెంతకు పిలుచుకొనును.

కవిహృదయగలవాడే ఆదర్శ విమర్శకుడగును. ఆతని యనుభవమునకును ఈతని యనుభవమునకును వ్యత్యాసమే యుండదు. కవివిమర్శకుడే విమర్శకులందు తలమిన్న యందును. భావతత్త్వమును విజ్ఞానలోకమున కెఱుకపఱచు మహత్తరమున కవి విమర్శకుడగును; మహత్తరమైన ఈతని యనుభవము దివ్యప్రాదమును పోలునది యందును. ఇందు గ్రుంకులిడినపుడే ఈతని యాత్మ సౌందర్య తిలకమై, దివ్యమంగళవిగ్రహ యగును.

సౌందర్యమును నేను దివ్యమంగళవిగ్రహ యనుటకు కారణము లేకపోలేదు. సౌందర్యము జగదీశుని బాహ్యావ్యక్తీకరణమందును. ఈశ్వరగుణములన్నియు సౌందర్యమున గలవు. అది యనంతము; అద్వైతము; ఆనందమయము; అనురాగపూరితము. సృష్టిగల ప్రతిదృశ్యమందును ఈ దివ్యగుణములు దృగ్గోచరమగును. ఉజ్జ్వల శారద రాత్రులందు గభీరసింధువును విలోకింపుడు. ప్రతితరంగమందును చంద్రకళ తొణికిసలు గాంతురు చందురుడొక్కడే! అట్లయ్యు చిన్నిచిన్ని తరగమీదను, అందుండి రాలు నొక్కొక్క నీటితుంపురునందును సొగసుకత్తె చిలుకవ్వవలెనెనలేని హాళి తొణికిసలు చంద్రిక ముక్కవేయుచు నుఱ్ఱూతలూగుచు నసంఖ్యాకములై చూపట్టును! కదలిచుట్టుగల కడళ్లను తెగగొట్టి దాని ననంతము చేయుము. అనంతవీచికలం దనంతద్యుతులు కాంతులు చిమ్ముచుంట కాంతురు, ఈ యనంతకళలు సౌందర్యముయొక్క అనంతగుణములే! కెరటములు చిన్నవియే! ఒక్కొక్క అల పరిమితి గలదే! కాని తరగలందు విరాజిల్లు సౌందర్యమనంతమైనది అందలి పొంకు మాధుర్యమయమై (Full of harmony), అద్వైతమై, అనిర్వచనీయమై, అనురాగపూరితమై, ఆనందమయమై, అనంతమైనది! ప్రతి ప్రకృతిచిత్రమును ఇట్లే పరికింపుడు. గిన్నెనుండి దిగజారు పాలపొంగువలె కన్నెఱుపుదంకి యుప్పొంగు కరణి, గగనాంతరంగమునుండి పొంగి పొరలు నీలిమను చూచ్చిన, నిర్మలాత్మ స్ఫురింపు సద్భావభంగి, హృదీశ్వరి హృదయమునుండి స్రవించు ప్రేమతరంగిణి పొలుపున, గంగాభవాని యుచ్చరించు నాశీస్సు చందమున ననంతసౌందర్య మురళీధ్వాన నాత్మప్రకాశము గావించుకొనుట గ్రహింతురు. అది భౌతికశాస్త్రవేత్త యూహామునకు జొరబడదు. ఈతని మహోన్నత మేధస్సు దివినిమంబించునది కాదు కావున దాని నంటజాలదు. ఈతడు చేబూను కొలబద్దకు గాని, యంత్రమునకుగాని అది లొంగదు. ఈశ్వర మహిమ, ఈశ్వరమహత్త్వము, ఈశ్వరశక్తి మూరలకును, బారలకును తలయొగ్గునని తలచువా రెవరు?

ప్రఫుల్లపద్మినీహృదిని జొచ్చు సూర్యభగవానునివలె, పిట్టబిడ్డపై మేఘభిత్తికనుండి చివాలున వ్రాలు విహంగమాత మాడ్కి, భక్తిభరిత మధురహృదయవశముగా దవతరించు దేవదేవునికైవడి, చక్కని మోముపై వ్రాలు రాగరంజితదృష్టివలె, పరమహంస మాళిపై జలజలరాలు నక్షత్రాక్షతలట్లు

అనంత సౌందర్యము పైన నుల్లేఖింపబడిన హృదయానుభవమునకే వశనుగును!

సృష్టి చిత్రములలో స్త్రీ మిన్న. సౌందర్యమును, అనురాగమును భట్టుమూర్తి యనిన "లతాంతము తావియు" వలె కలసి మెలసి వర్తించు ననుసంశము స్త్రీసృష్టియందు ప్రధానముగ ప్రస్ఫుటించుచున్నది. కావుననే దాంపత్యజీవనమున నీయద్భుత కుసుమము చేరినగాని అది గంధబంధురము కాజాలదు.

సౌందర్యమున కాపురమండునది సౌరభమేకాదు; నెచ్చెలియైనకాంతి దానికూడియే యుండును. వన్నెచిన్నెల చిన్నె గిన్నెవలె నుండు అమల కమల హృదయమును విలోకింపుడు. సౌందర్య సౌరభముతో నందు ప్రరిషెడు కాంతి తొలుకాడుచుండదా? పాలు, చక్కెర, శికాక్షణ కలిసినపుడే [illegible] తయారగును. సౌరభ సౌందర్య కాంతుల సమ్మేళనమున నపూర్వపానీయము తయారగును. అర్ధాంగీభుజ మృణాలమునుండి విశివడి పూలపానపునుండి దిగకమున్న కళోపాసకుడు ప్రేయసీవదన వనరుహముననుండు నీదివ్యపానీయమును తనివార నేత్రాంజలి గ్రోలియే, భావభరిత చుంబనమున నప్పుదీర్చుకొను మని చెప్పియే, కాళ్యకృత్యములు నెఱపుకొని తన టీకప్పు నాశ్రయించును.

ఈ దివ్యపానీయ మంతరంగమును జేరినంతన నం చనంతమైన యానందవీచికలుప్పొంగును. ఇవియే నాటి యాతని రచనయందు తెరలు తెరలై ప్రవహించును. కావున నాదర్శ కళోపాసకుడు పతియై తీఱవలెను. పతికాని వాడు కళ యెట్టిదో యెఱుగనే యెఱుగడు. బ్రహ్మచారికి సాధ్యమైనది శాస్త్రఘోషగాని కళోపాసనము కాదని నానిశ్చితాభిప్రాయము.

దివ్యప్రదీప మీశ్వరాలోకమునకు పర్యాయపదమే! ఇట్లని యెఱిగియే పూతదాంపత్య ద్యుతిచే నాత్మజీవనములను ప్రభాకలితములు గావించుకొన గాంక్షించు యువతులు నోములందును, పూజలందును అఖండమును వృష్టిసమ్ముఖమున నిడికొందురు దివ్యప్రదీపకళికను తనువు తైలము ప్రణయము. వైకుంఠధామమున వెలుగు నీ 'యఖండము'నుండి ప్రసరించు కొండొక మరీచిక వసుప్రభవలె వసుమతిపై తళ్కొత్తుచుండును. సూర్యకాంతి నాత్మహృది గొనునరవిందము పూర్వభవమున నెన్నో బొమ్మలనోముల నోచియుండును. కావుననే

[illegible] నిజే గాఁ బడెకి దివ్య [illegible] లోకము ప్రేమాలోకమంచి, [illegible] ము దయ శ్రీంగా [illegible] మన [illegible] మంకరు [illegible]

నోముల నోచుటన భావ [illegible] రించుటని నే నర్థము చెప్పినన [illegible] జన్మలనుండియో స్త్రీ [illegible] యానంద ప్రతి [illegible] సా [illegible] ప్రాయము.

ఉపాసకుడు [illegible] జీవిత [illegible] ప్రమ [illegible] మున గ్రహింతురు. [illegible] ంగిక పరివర్తనమునకు, [illegible] జ్యమునకు ప్రధానద్వార మిట్టిదృష్టియే! సృష్టియం దెట్టిమహాత్త్వ మున్నదో వర్తించిరా? "ఏదానిని భావింతునో అదియే యగుదు." కావున బ్రహ్మ [illegible] భావింపుము అనికదా ఈశోపనిషత్తు వాకొనుచున్నది. భావోపాసన మొనరించు యువతి భావనామయగుటయం దక్కజమేమున్నది? భావమయి సదా సౌందర్యతిలకయే! తమోన్మాదయ మవ్యుతికలశము కావున నామెపలుకులందు గానఝురి తొలుకాడుచుండును.

కళోపాసకుడు సౌందర్య [illegible] కావున సంపూర్ణ స్వాతంత్ర్యముతో తన యర్ధాంగి వదనమునుండియు, హృదయమునుండియు, నెన్నో భావములు గ్రహించి మధురకల్పనలకు కన్నతండ్రియగును. మస్తాబై నీరెండలో నుద్యానమున నిలిచి, ఈశ్వరోచ్చరిత శబ్దములైన పూవులను, కిరణములను విలోకించుచు పిపాసార్తహృదయములనుండి వానిలోని దివ్యభావముల గైకొనుచు, ఆవేశభరిత హృదయయై శారదవలె తన్మయసి గీతిక నాలాపించుచుండ, మ [illegible] కాంతను కనిన ట్లేత డలగును. ఆమెమోము మీది బంగారు నెచ్చెలియైన సంధ్యా స్వర్ణ మరీచికతో మేలమాడుచుండ, దివినుండి అమృతంపు జిను

[illegible] జారిపడి [illegible] నామెపై [illegible] నామె [illegible] మంజు [illegible] మొగ్గలో కవితను [illegible] కాంతులను [illegible] సౌందర్యకావ్య సృష్టి గావించుచుండ, [illegible] కాలు [illegible] లందు లజ్జావనత [illegible] మెఱపు [illegible] కవిత (Suggestive Poetry) మిమ్ముఁ [illegible] సంజీవముండె [illegible] మెడ్డవగా, [illegible] కవితను [illegible] వడియుండునా? "కలహంసకు కలకంఠకంఠ మొసగి కలకంఠికొసగిన [illegible] కౌశల్యమునకు మేలుబంతిగా [illegible] కమలభవు [illegible] నా కప్పన మిడినాడు! ఈకల్యాణి నా భాగ్యలక్ష్మి" యని ఈ [illegible] నంద ప్రారితాంత [illegible] కాదా? "నీవు నా స్వర్గం బన్నితి" వని ఆమెను హృత్పీఠి కేర్చుకొని, భావగ్రహణమున చొక్కియుండరా?

దాంపత్య జీవనమంపలి ప్రణయశక్తిని, ఆధ్యాత్మికమహాత్త్వమును గుర్తించియే శ్రీ చైతన్యుడు శ్రీకృష్ణుని హృదయేశ్వరి గావించుకొనినాడు. అర్ధనిమీలిత నేత్రుడై దివ్యదృశ్యమున గోపీనాథు నవలోకించి, తన్మయచిత్తుడై "నాథా! నాథా!!" యని నృత్యముచేయువాడు. గౌరాంగ దృష్టాంతము, గౌరాంగ జీవన మెంపి తెలుగుల హృదయముల నానందానురాగములతో నింపివేయలేదు? ఎందఱో కవుల హృద్వీణల మీటి మధుర కవితా నినదములను వెడలింపలేదు? నదియానవద్వీపములం దెట్టి యద్భుత సాహితిని సృష్టింపలేదు? ప్రణయతత్త్వ మహత్వ మునేకదా జయదేవ చండీదాసులు కీర్తించిరి!

---

* ప్రేమ దివ్యాలోకమువ్యవమైన దను భావము భారతీయులది ప్రపంచ మహాకవులు భారత విజ్ఞానమును ఎట్లో చవిచూచిరని తెలుపుమందును ఒక దృష్టాంతమును గమనింపుడు: "The light eternal, which to view alone
Ne'er fails to kindle love."

(Vide: Dante's "The Vision" Chapter on "Paradise", Canto V lines 8 and 9).

దీనిని వీక్షింపుడు: "And yet the light that led astray was light from heaven." —Robert Burns.

సౌందర్యమునకై మనుష్యాత్మ తపించునట్లే మనుష్యాత్మలని మనుగోఘభవమునకై (భక్తుని సఖ్యమునకై భగవంతు డాతురంపడునట్లు) సౌందర్యము- సౌందర్యమున వ్యక్తమగు దివ్యశక్తి ఎంతో తపించును. దాంపత్యజీవనమున నచుకూలమైన యొజ్జ లభించెనని మరియు నెచ్చెలివలె, తన పాత్రుని గాంచి ఈశక్తి ఎంతో యుప్పొంగును. అంతియగాదు; ఈ వ్యక్తి జీవనమును, ౼నమును లీల యద్భుత సృష్టికి నిమిత్తమొనరించుకొనును. రామకృష్ణ రవీంద్రప్రభృతుల పొందుకతన నీశక్తి ధన్యమైతినని యుప్పొంగినదని నొక్కివచింతును. హృదయమునకు విందొనరించు వనమాలిపొందునకై వ్రజవనావు పొగిలినట్లే, వల్లవసుందరిపొందుకై వంశీధరుడును పొగులువాడు. నీటుగ గొల్లమిటారి యొత్తు తెరవునుండి చూచుచుండె జూచి, ఆ గొల్లచెలువ చెలువమున కరిగి, పరుగుపరుగున బోయి, హాసన్ముఖుడై, గోరశిఖామణి వ్రజవీధియందా పైదలిజడను చివాలున బట్టుకొనినాడట! సుందరియైన జీవాత్మ నందుటకై పరమాత్మ పరుగులెత్తుకొనివచ్చునుగదా!

పరమహంసహృదయమునకు వివేకానందుని యెడంద దగ్గతీచుట్టము. ఆతనివలెనే ఈతడును సౌందర్యోపాసకుడు; సత్యవ్రతుడు; శివాత్మక జీవనమూపై కన్నిడిన మహాత్ముడు, పరమాశయములందలి సృష్టిపటుత్వమును సత్తెఱిగిన మనీషి; ఆనందపిపాసువు; భావోద్వేగ పూరితహృదయుడు. ఈతని ప్రతిభకు, నీతని యద్భుతభావసృష్టికి వైదుఖండములు జోహారనలేదా ?

ఆధునిక సౌందర్యోపాసకులందును, సత్యవ్రతులందును గాంధీజీకి గల మహోన్నత స్థానమును టాల్‌స్టాయినాటగోలె సభ్యజగతి గుర్తించినది. పూర్ణచంద్రులట్లు చుక్కలు, వేలుచుండె వియత్తలమును విలోకించుచు నీతడు పర్వించును; మధురగీతికకు వీనులొగ్గియే, ఆత్మసంతనిపియే మహాత్ముడాహారమును గొనును. గాంధీజీ కావ్యకర్త కాడు; రతనపురచనలను సృష్టించువాడు కాడు. కాని ఈతని జీవనమే యొక మహాకావ్యము. అది యమరదీప్తికి పర్యాయపదము. రాజకీయ సాంఘిక రంగములం దీతనికతన నవజీవనదీప్తులు కేవరత్నములట్లు తళుక్కుత్తుచున్నవి. ముందంజవేయు మహాత్ముడు భారతగతమునకు చేతులు మొగిచినాడు కాని "తూ!" యని దానిని త్రిప్పలేదు; కొట్టలేదు. ఋషిసంప్రదాయము, ప్రాచీనమహత్త్వము నీ సంయమీంద్రునియందు మూర్తీభవించినవి. హిందూమత మాహాత్మ్యమును, ప్రాతిభారత సభ్యతాతత్త్వమును మాలవ్యాపండితుని జీవనమందు మహోన్నత మందిరముల మాడ్కి గోచరించుచున్నవి. తన గంభీరాశయములు పూర్ణమగుట కింకను పదేండ్లు పట్టుననియు, అంతదనుక తనిజీవించుననియు, మరణించుట కిపుడు తనకు సమయములేదనియుగదా ఇటీవల దన డెబ్బదియారవ జన్మదినోత్సవమునాడు వారణాసియం దీతడు వాకొనినాడు!

భారత దిగ్వలయమున దోచిన మహావిజ్ఞాని రాధాకృష్ణుడని కదా సర్ ఫిలియమ్ యంగ్‌హజ్‌బెండ్ అనినాడు. ఈ మహామనీషి సజీవులైన భారత తాత్త్వికులందు తలమానికమని నిన్నగాక మొన్ననే కదా గ్రీవ్స్ మహాశయుడు లండనులో తెలిపినాడు. ఈతడు గద్యవ్రాయు రవీంద్రుడని నేను ఋజువుచేయగలను; సౌందర్య పిపాసువైన కళోపాసకుడని రూఢిగావింపజాలుదును. ప్రాచీ ప్రతీచీ విజ్ఞాన మహోదధుల దన గుండియలం దింకించుకొని, ప్రతీచీసభ్యతయందు ప్రత్యక్షమగుచున్న జుగుప్సా గర్హితస్పర్ధ్యములను పలుమారు గట్టిమాటలతో గర్హించి, * మనుష్య హృదంతరాళమున తేజరిల్లు పరంజ్యోతిపై కన్నువేసి, మహిత భావోపాసనమునకు గడంగినగాని, దుర్గతియందు క్రుంగికూలుచున్న జగతి సత్వర సముద్ధరణమును కనజాలదని బహుళరంగస్థలములనుండి జలద గంభీరస్వరమున నీయాంధ్ర మహాపురుషుడు వచించుచున్నాడు. పాశ్చాత్యవిజ్ఞాన కేంద్రస్థలమున నాచార్యపీఠము నధిష్ఠించి భారత వేదాంతమందలి బ్రహ్మం బెట్టిదో దశదిశలకు చూపుచున్నాడు. "East is east and west is west and ne'er the twain shall meet" అనుకొన్నమనకు కీట్సుకవి ప్రాంగణమున దహనసంస్కారము నెఱపి, కాలక్రమమున ప్రాక్పశ్చిమ కలయోద్వాహ మహోత్సవ మాంగళిక ముహూర్తమున పురోహితుడు కాగలుగుచో నీతనికే, ఈతనిపాలమున జరితార్థయగు భాసమాన భారత భావలక్ష్మికిని భావియుగములు జేజేలుపాడును. భగవాన్ దాస్ ప్రజ్ఞాధురీణుడైన తాత్త్వికుడై, నిజరచనలందు చక్కని భావశబలత జూపుచు నేను ప్రజాభ్యుదయమునకై నడుముగట్టినాడు. వాస్వాని కవియు, నాచార్యుడును, తాత్త్వికుడును నై వరలుమహర్షి. సాహిత్యమును, తత్త్వశాస్త్రమును దిగభ్రమింగిన అద్భుతభోక్త అరవిందుడు. ప్రాచీన ఋషితల్లజుల దృష్టాంతములను సృష్టిరం దడికొని, చాలకాలమునుండి

* "The nations plead for peace and prepare for war. They are not ready to give up the cast of mind that leads to strife......Each nation in the late war claimed to be the only one engaged in the defence of civiliztion. In its name each nation justified everything, excused everything, massacres and destruction. ......By a judicious circulation of half-truths and untruths and apersistent misrepresentation of other nations and their cultures, the people are roused to the temper of the jungle......When the trumpet of war blows, the pretences of civilization disappear and man helplessly reels back into the beast.........So long as this devil-dance does not disgust us, we cannot pretend to be civilized......To approve of warfare but criticize its methods, it has been well said, is like approving of the wolf eating the lamb but criticizing the table-manners. War is war and not a game of sport to be played according to rules..... It is true that we have the League of Nations, but it is only a mechanical frame and the soul has still to grow into its body. The spirit of ill-will and distrust is widespread."

(Vide: Sir Radhakrishnan's "Kalki" or "The Future of Civilization." Pages 32 to 36).

ఈ మహావిజ్ఞాని పరమాశయముల నారాధించుచున్నాడు. యోగాగ్నినుండి వెడలు జ్ఞానశిఖలందు భారత పునరుద్ధరణమును గాంచునని ఈతడు గట్టిగ నమ్ముచున్నాడు. ఈశ్వరచంద్రుడు విద్యాసాగరుడై, మూర్తీభవించిన పురాతన భారతసంప్రదాయమై, సంఘసంస్కర్తయై, వంగసారస్వత ప్రధానాచార్యుడై, నిజహృదయమును దీనుల ధర్మసత్రముగా నెంచి, స్వాతంత్ర్యాభిలాషియై, కీర్తి విరోధియై, మహాత్ములలో మొదటివాడై వరలినాడు. కలకత్తా మహానగరమున నొక కళాశాలను (Metropolitan college, now named as Vidyasagar college) స్థాపించి, హిందూసంప్రదాయము ననుసరించి, అందు సరస్వతిని ప్రతిష్ఠించి, ఉత్తమాశయముల నందు కోటివస్తువులు చేసినాడు. ఆనర్సు పట్టమునందు వఱకు ఇంటరుమీడియట్‌గతి మొదలు నాలుగేండ్లు మందిరమున విద్యార్థినై, ఇందలి ప్రతిమను పాల్గొను భాగ్యము నాకొదవెను. పూర్వపశ్చిమార్ధభూగోళములను జోడుఉండ్రాళ్ల భాగముల నట్లు మ్రింగినవానివలె ప్రాచీప్రతీచీ మహావిజ్ఞానములను గుటుక్కున నొక్కమారు నిజమానసమున గబళించిన ఆశుతోషముఖోపాధ్యాయుని ఆశయము లెవ్వియో సభ్యజగతి ఎఱుగ నేరకున్నను. ద్వాదశాదిత్యులబోలు నీ విజ్ఞానులు భారతదిగ్వలయమున నుదయింపకున్న, భారతావని యేకాదు - సమస్త వసుంధరయును తమోసంఛమున దొరలియుండెడిది.

పాశ్చాత్యులయ్యు భారతమాతయనుంగు బిడ్డలందు జేరి భావానందీప్తమైన భారత సంప్రదాయమును మేక్సుముల్లరు గాదులవలె నారాధించి, తనుయున్న తోద్దేశసిద్ధికై ఆత్మార్పణ మొనరింపకొనదలపడిన మువ్వురు మహావ్యక్తులున్నారు. వీరిలో నగ్రగణ్యులు బెసంటుసతి. హిందూమత మననీమెకెంతో ప్రీతి *ఈపర్యాయము హిందూదేశమందే జన్మింతునని తెలిపినామె ఈమె దివంగతయైనది. దీనబంధు ఏండ్రూస్ గాంధీ నీయుల యడుగుజాడల నంటి నడచుచు, ప్రపంచమున నిండియున్న దాస్యమెచ్చవకొనిన భారతభాగములకు సేవసలుపుచున్నాడు. డాక్టర్ కజిన్స్ పెక్కేండ్లనుండి భారతాశయములను తన పూజాపీఠమండలి దీపికలుగా వెలిగించుకొని, భావోపాసన మొనరించుచున్నాడు. భారత సంప్రదాయమును తనదిగావించుకొనుటకై ఇటీవల నీతడు హిందూమతమును స్వీకరించి జయరాముడైనాడు. †ఈతడు సౌందర్యోపాసకుడని, ఆనందప్రభుడని, మహాకవియని చదువరు లెఱిగియేయుందురు. ఉత్తమసారస్వతసృష్టికిని, ఆదర్శజీవన నిర్మాణమునకును గభీరతాత్త్విక పరిజ్ఞానమును, మతవిజ్ఞానమును అనివార్యమూలబంధములనికదా నే దెలుపుచుందును. కజిన్సు ప్రభృతుల జీవనవిధానములు నావాక్కులోని నిక్కమును రూఢిగావించుటలేదా?

మోహనాపరులైన భారత మహాపురుషులలో (Great Indian Thinkers) జిడ్డు కృష్ణమూర్తి యొకడు. ఇతడు అద్భుతమైన మేధాశక్తి నలవఱచుకొనినాడు. తనకున్న గల మేధావంతుల కొకరీతి, ఈతని కొకరీతి. భావస్వాతంత్ర్యమును పెక్కు బడసెనీతడా గొంపడుట మతశాస్త్రముంగాని, తత్త్వశాస్త్రముంగుగాని తన కభినివేశము లేదని ఈతడు తెలుపుకొనుచుండును. ప్రాచీ విజ్ఞాన విభవమునకీతడు తెలుమిగిచె ననుట కట్టి దృష్టాంతములు కానరావు. ఏమి వ్రాసినను, ఏమి వాగ్దానినుసొంతకీతకుంటి ఇతడు తప్పుజారడు. ‡ ఇది మున్నుత్తరమైన గుణమనుట నిస్సంశయము.

భావదాస్యమును గర్హించువారిలో నేనొక్కండను. ఉత్తమాశయముల నారాధించువారిలో నొక్కండను. కృష్ణమూర్తి ఆంధ్రమాత కనినబిడ్డయని గర్వించువారిలో నొక్కండను. ఈతని క్రమశపసునై, ప్రజ్ఞపై పూలుచల్లువారిలో నొక్కండను. కాని, కృష్ణమూర్తి చెప్పినదానిని తూచాతప్పక గ్రహించుటకు నేనంగీకరింపను. అతని నుడువులను ఛేదింపక, అందలి భావములను తీక్ష్ణదృష్టికి గురిగావింపక ఆతనికి ధనమును శిరసావహించుటకు నేను సమ్మతింపను.

భావదాస్యముయొక్క నెత్తిని మొత్తి మొత్తి వదలుదును. ఇట్లని భక్తియనున దొక్కండు లేదని నే దెలుపను. భక్తిపూరిత హృదయుడును, దాస్యము నిలువేలుపు జేసికొనినవాడును రూపులందును, చూపులందును ఒకేరీతిగ నగపడవచ్చును. అంతరంగికముగ వీరియందు వంగియు లను 'నాకాశ

---

* "Hinduism is my natural mode of aspiration."

—Dr. Annie Besant.

† భారతవిజ్ఞానమును, భారతసంప్రదాయమును చూచి వెక్కిరించువారికి కజిన్సుమహాశయు డిటీవల ఉచ్చరించిన ఈ వచనములు చక్కని గుణపాఠమును జెప్పును: "The Upanishadic vision of unity has been the inspiration and guide of my own thought and action for forty years......I have long made the philosophy, and modes of worship of Hindu India my own......It has long been my conviction that there can be no drastic movement towards the attainment of a true world civilisation, until the spiritual evaluation of life which is the basis of Hinduism becomes universal and spontaneous the world over......My own long studies of Indian philosophy, my familiarity for twenty-one years with intimate Hindu life, my frequent participation in Hindu ceremonies, exposition of Hindu culture abroad, my intense interest in Hindu arts, my long practice of Yoga, my forty years of vegetarian living, my efforts to fulfil my *dharma* and attain *moksha* in Vedic sense seemed to indicate that I was qualified to claim the right of temple-entry in Travancore."

‡ "I am not going to be bound by anyone. I am going on my way, because that is the only way. I have found what I wanted." (Vide: Page 18 "Who Brings The Truth?" By J. Krishnamurti) "Life is not meant to be traditional" (Vide: Page 6 "The Purpose Of Education" By the same author).

పాతోక ప్రభేదమున్నది. ఈతడు తనలోని శకుంతల గడ్డిపరకలబ్లెంచి, తన మనుష్యత్వమును మంటగలిపి పశువులందు పెద్దగద్దియ నధిష్ఠించునా అతడు? భాస్వదాశయముపై చూడ్కినిలిపి, స్వాత్మసరోజమును తెరచి, ఆయాశయము నాపమోజగృహములోని కాహ్వానించి, దాని నంగు భృంగిగావించి, నిరంతర మధుర భావపుష్పములల కాత్మకర్ణముల నొగ్గి, నిజజీవనము సానందమయము నొనరించి అమృతజీవి యగును. ప్రపంచ మతగ్రంథములను, భక్తపరేణ్యుల జీవనచారిత్రములను పరికింపుడు. అరుణతరణికి నాముకరణి ఈయంశము మానసగోచరమగును. భక్తినిర్దాస్యము ఒకేముడుపున మార్చి బడితిబాజాకు గపనట్లు తెగదు. ఖైదీని బందిఖానాలో పెట్టునట్లు భక్తునిపెట్టుట కూడునా? పెట్టినను భక్తుని బంధింపగల సంకెల లేవి? భక్తున కడ్డునిలువ జాలు భిత్తికలెవ్వి? భక్తిప్రణయములకు భగవంతుడే లొంగియుండ నికసన్యశక్తులబండార మెంత పెచ్చిల్లగలదు? కారాగారాంధకారమున, — అంతేకాదు బంధితభక్తుని స్వప్నద్వారమున జగదీశుడే ప్రవేశించి, దివ్యరత్నప్రభలనందు వెదచల్లి అందలి ముక్తిజపమును స్పృశించును. ఈశ్వరస్పర్శ నందిన తపను కిరణస్పర్శనందిన మొగ్గవలె సహస్రదళములనాత్మప్రకాశ మొనరించుకొనును. ఆ మంగళ ముహూర్తమున దీనిశక్తి సౌరభవీచికవలె ననంతవిశ్వమును విహారభూమి గావించుకొనును. ఏయంకిలి నెఱుగక తపస్వి బ్రహ్మోంశమున పూలరంగడై వెలయును గావున ముక్తినందిన మహావ్యక్తి ఈతడని వచింతును.

భక్తినెఱుగనివా డాత్మప్రకాశమునెఱుగక తనలోదాను ఖైదీయై పడియుండును. చదలు నాధారము జేసికొనియే రవిసుధాంశులు తమ దివ్యదీప్తులను భువిపై నరిపింతురు. భక్తినాధారముగా గొనియే ఆదర్శపురుషుడు తన మహత్త్వమును ప్రకటింపగలడు.

భక్తిప్రేమలు సామాన్యములుకావు. అవి దివ్యములు. భావమున కాలోకమును, అమరత్వమును ఇచ్చున విరియే! ఇవి ప్రపంచము నుండి నిష్క్రమించుచో, అది దుర్గుణములను కనిపెంచు క్రుళ్లుగోయి యగును. ఇవి సాహిత్య క్షేత్రమునుండి తరలుచో, అందు విమ భావములు విడిది నేర్పఱచుకొనును.

మహితసంప్రదాయమునకు మనుష్య హృదయమును లగించు నాధ్యాత్మిక సూత్రము భక్తి. ఈ సూత్రము తెగుచో, చేతినుండి యెగసిన గాలిపడగవలె నా సంప్రదాయ మెందో ఎగసిపోవును.

శమంతసహితుడైన అవతారపూరుషుని వలె భాస్వదాశయ సహితమైన సంప్రదాయ మొంగు కాలశిఖరమున చిరప్రదీప్తమైయుండ, ప్రేమమెయి దీనికి చేతులు మొగుచుట భావో పాసకుని కర్తవ్యమని తెలిపెదను. రాత్రిప్రతిమ వలె బిట్టబిగిసిన సంప్రదాయమును వెనుకటి రాళ్ళగుట్టయందు ద్రోసి ఆదిబ్బను డిమ్మంగుల కులుకుడని తోడి జిజ్ఞాసువులను పురికొలుపుదును. పిడుగనకును, బియ్యమనకును నొక మంత్రమను వానివాదమును తునియలు చేతును. భావస్వాతంత్ర్య మన చేసెడు నిప్పులు కాదు పూవులందు చేరిన పురుగులను తొలగింపుదు; అందు జొరబడిన మలినమును తటిమి కొట్టుదు. ఇవి వెనుకటినుండి ఉదయించుచునే యున్నవని నీనిపై నిప్పులు గుమ్మరించుట తగునా? నిన్నటినుండి ఇపెలుచున్నదని సుగంధమును కారుపోగకడుపున బెట్టుట న్యాయమా? సీతమ్మతల్లివంటి పువ్వును దహింపగల కట్టెకిశక్తి యేది? కుసుమము నిర్యజీవియందును. ఈ పూవును ఆ పూవును హంతకుడు నలిపినను నలుపుగాక, పుష్పజాతికి ప్రతినిధినగు పూవును చెండాడగలవా డెవడు? సృష్టి చచ్చిననాడే ప్రసవజాతి మడియును. సృష్టిబీజమును గర్భమందడికొనిన సంప్రదాయమును సమయింపగలముగవా డేడి? ప్రళయకాలమున సమస్తము ధ్వంసమగునని విందుము. తదుపరి సృష్టికివలసిన బీజములను జాగ్రత బెట్టుకొనియే దేవదేవుడు డింభకరూపుదాల్చి పాలవెల్లిపై తేలియాడు వటపత్రముపై విశ్రమింప వెడలునను నంశమును మఱువరాగుజుడీ!

భారతగతముకంటె భారత భావికాలము ఘనతరమై యుండవలెనని ఆపేక్షింతునుగాని, భారతగతముపై గోరికట్టవలెనను మనిసిని నేను క్షమింపను. తలిదండ్రులు దివంగతులైరని తాను స్వయంభువునని మిట్టిపడువా డెట్టివాడు? దివము చచ్చిననాడే దివంగతులును చచ్చెదరు. దివమునకు మాఱుపేరు అమరభూమి కదా! అందున్నవా రమరులుకారా? అందు జేరినవారికి చావెందుండివచ్చును? రూపుమాసి, అనంతవిశ్వమందలి వేఱొక యగారమున ప్రవేశించిన రూపఱుటని అర్థము జెప్పువాడు హైందవ తత్త్వార్థమును గ్రహింపలేదని వచింతును. గతమునకు చావులేదనియు, అది భవ్యమైనదనియు బుజువొనరించుచు, దాని ప్రస్తుత భావవృద్ధి కుపకారమైనబలమును చేకూర్చు బాధ్యత మనయందు గలదని తోడియువకుల కెఱిగింతును.

మహిమోపేతుడైన ఆచార్యుని జీవనమందును, ప్రబోధమందును సుధాధారలు జాలువారుట గాంచియు, అతడు పుట్టిపెరిగిన తేదీలను పరికించి అతడినాటివాడు కాడని అతని స్వప్రాంతముపై గీతిపేర్చుట కుద్యమించువా డెట్టివాడు? ఉద్యమించినను, సుధాసంసిక్తమైన దగుడు, అది యంటుకొనునా? మనస్స్వాత్మకు చావులేనిన మనుష్యాత్మ సముచ్ఛనమైన భావమునకు మృత్యు వెట్లు దాపురించును? నూతన జీవనసృష్టికి, నూతనకళాసృష్టికి ఇది కన్నతల్లి కాదా?* ఇదెట్లు బూదెయగును? అపూర్వ సమవర్తి యొకండావిర్భవించి దానిని బూదయు గలిగినను, బూడిదనుండి లేచిన ఫీనిక్సు అను పక్షివలె నది సజీవయై లేచును.

బుద్ధప్రబోధమిపుడు Out of date అనువా డెట్టివాడు? బుద్ధుడుశ్లాఘించిన "బ్రహ్మవిహారము" అనంతభావవిహారమే సుమీ యని నే నెఱిగ త్తివచింతును. కృష్ణప్రబోధము కృతయుగమునుండి దాటిరాకూడదని వచించెదవా? కురుక్షేత్రమున తెలసూపిన భగవద్గీతను పాతపాత్తమని పెంటపాలు చేయువాడు మనుష్యుడనిపించుకొనునా? 'ధమ్మపదము'ను దునుమాడనుంకించువా రెవరు? ఏసుప్రబోధము నేడేలనని బైబిలును బుట్టదాఖలాచేయువా రెవరు? శిలువ కెక్కింపబడిన ఏసు మూడుదినాలలో లేచెనని క్రయిస్తవులేయందురు ఈ యంశము నున్నదానినున్నట్లుగపరిగ్రహింపము గాని ఏసు మునివరుని బోధనలకు, తక్కుంగల గూఢాచార్యుల ప్రబోధములకువలె, మృత్యువు లేదని గ్రహింతుము. క్రయిస్తవప్రపంచమున నేడేను బోధనలకు చోటులేనందున, నది మృత్యుదేవతకు విహారాంగణ మగుచున్నది. బౌద్ధప్రబోధమునకు బలాదూరనువారు, అహింసా వ్రతమునెడల నవిశ్వాసము జూపువారు, మతమునకుతుకపై కత్తివేయువారు నే డెచ్చటిలో నున్నారు? వీరు మౌఢ్యమునకు మంగళ సూత్రముకట్టి బహుళారిష్టములకు కన్నతండ్రు

* The new in art is always formed out of the old" (Vide: Emerson's Works: Page 77).



౯ సాగరముకట్ట మీదినుండి కాననగు ఒకానొక సుందరబృందావనదృశ్యము.



౧౦ దక్షిణ బృందావనమున కావేరి ఒడ్డుననుండు ఒకానొక జలయంత్రము.



౧౧ సాగరముక్తయందు వెలుపలి వైపున గల మంటపమునందలి 'కావేరి' దేవతాప్రతిమ. చేతనున్న పాత్రికనుండి నిరంతరము నీరుబికి పారుచుండునట్లు కల్పింపబడినది. ఈ ప్రతిమ దక్షిణబృందావనమున కొనవ నున్నది.



౧౨ దక్షిణ బృందావనమున కృతకజలాశయ మధ్యమున ఛత్త్రాకారమునుండు జలయంత్రము.

# చిత్రములు



౧౩ ఉత్తర బృందావనము మధ్యభాగమునగల కృతక జలాశయము; అందలి జలయంత్రములు.



౧౪ దక్షిణబృందావనము మధ్యభాగమునకు సరిగా సాగరము ఒడ్డునానుకొనియుండు మేనకా విశ్వామిత్రుల శిలాప్రతిమలు. మేనక తపము చేయుచున్న విశ్వామిత్రుని ప్రలోభింపచేయు రంగము.



౧౫ ఉత్తర బృందావనము ఉత్తరపుదివరనుండు మంటపము యొక్క పశ్చాద్భాగ దృశ్యము. సాగరమునుండి గొట్టముల ద్వారా మంటపము క్రిందనుండి వచ్చెడి జలము జలపాతము వలె నడిమిభాగమున పడుచున్నది.



౧౬. శ్రీబృందావనమునందలి కృతకజలాశయము; అందలిజలయంత్రములు.

లగుటలేదా? కృష్ణబోధామృతమును చవి జూడనొల్లనివారిని జూచి వెక్కివెక్కి యేడ్చుచు "అభాగులారా! భగవద్గీతను చేకొనుడు! మురళీ సంజాతగీతామృతమునకు మనసులొడ్డుడు. నడుముగట్టి కురుక్షేత్రమున లంఘించి విజయులై నా దుస్థితిని బాపు"డని భారతాంబ వేడుకొనుచుంటలేదా?

ఆత్మసంజాతముగాక, గుండెయందు యమలోకము నిముడ్చుకొని, రంగారువన్నె గలిగి, బంగారు అక్కరములం దొయారముగ దోచి, దృష్టిదోషముగలవారి నవలీలగ మాయావాగురమునగూల్చి విధ్వంసహేతువగు సారస్వతమే కాలహరణము కాకమున్న శ్మశానవాటికను జేరుకొనవలయుననియు, మహామతి యొకండు పృథ్వీరంగమునుండి తరలుతఱి ఆతనిదృష్టాంతమును, ఆతనిరచనలును సహగమనము సేయ దొరకొనక మిత్తిగొంగలై యుండుననియు, ఈశ్వరప్రతినిధియై యవతరించిన భావముగాని, వాణీవీణాబోలు సంప్రదాయముగాని స్థలకాలాంగణములందు పెంపొందు చీకుచింతలకును, రవులొక్కను చితికిని, చెలరేగు చిటచిటలకును తలయొగ్గదనియు గుర్తింపనివారు సృష్టికల్యాణమునకును, చిరమానవాభ్యుదయమునకును, ఉత్తమాశయసిద్ధికిని, అమృతజీవనమునకును తోడుపడరు. స్వాతంత్ర్యము మహత్తరమైనదే! రెప్పవాల్చక మానవుడు దానిని గుర్తింపవలెను. స్వతంత్రయోచనమని చెప్పి, భావగ్రహణమొనరించుపట్ల పరిత్యజింపవలసినదానిని పరిత్యజించి, పరిగ్రహింపదగుదానిని పరిగ్రహించుటకై మాపవలయు స్వాతంత్ర్యముపై గట్టిదెబ్బవేయుట న్యాయమా?

భావసమాలోచనమున పాఠకులదృష్టి నాకర్షింపవలసిన ప్రధానాంశములు ఇందు నే నుల్లేఖించుచు వచ్చిన దర్శనానుభవములు (Spiritual insight and Ezperience), హృదయనైర్మల్య నైసర్గిక ప్రతిభలు (Purity of heart and Natural genius), ఆంతరంగికశక్తి భావనావేశములు (Intuition and Divine inspiration). ఇవి యమరజ్యోతులు పోలునవి. వీనినుండి యుదయించిన భావసంప్రదాయములు (వీనిజాతక మెప్పటిదైనను) చీకుగాని చీకటిగాని, జరగాని మరణముగాని యెఱుగక, నూతనశక్తి నంది, కాలమాకాంక్షించు రూపులుదాల్చి, నవ్యసృష్టిగని మనుష్యజీవనమును, సారస్వతమును ఎనలేని వెలుగులచే తళ్కొత్తించును. ఈ విషయమున కవగతులైనవారు గతముకతనను, సంప్రదాయముకలనను * స్వాతంత్ర్యమున కెగ్గుకలుగునని యడలరాదు.

"సంప్రదాయ" మనిన, "గత" మనిన, "నాచార్య"మనిన కృష్ణమూర్తికి గిట్టదు. ఏయాచార్యునివలన మేలు చేకూఱదని, సంప్రదాయగతములు బంధనకారణము లని, Conditioned life ను దెచ్చిపెట్టునవని పలుమాఱీతడు పల్కుచుండును. అసాధ్యములను సాధ్యము లొనరింపజాలు సంకల్పశక్తికి, మనుష్యహృదయమున కాపురముండు ఈశ్వరశక్తులలో నొక్కండైన ఈ యద్భుతశక్తికి స్వంత అర్థము జెప్పుచు కొరగా చేబూని దాని కెదురు నీతడు నిలుచును. ఈతనిమాటలందు Emotion కంటె Intellect అధికమైయుండును. గుండెను సోకు అంశములకంటె మెదడును తట్టు సామగ్రులందెక్కుడుగనుండును. కావున నవి పామరులకుగాక ఏ కొలదిమంది పండితులకో హృదయంగమము లగును. మానవహృదయములందు నవసంచలనమును జనింపజేయ నాత్మజీవనములను వినియోగించిన జగద్గురువులు తమ తలపులను

* సనాతనమైనదని ప్రతీతిపడసిన హిందూమతము క్రైస్తవమతమట్లు మానవసంఘము నుద్ధరింపజాలు ఇలువేలుపు తానే యని వాకొనక, బహుళమతములను మన్నించి, భిన్నయుగములందు వేర్వేఱుజాతులు తనయండ జేరినపుడును, పెక్కుసంపర్కములు తన యెక్కుకెక్కినపుడును తన ప్రధాన నియమములకును, ముఖ్యసిద్ధాంతములకును భంగము కలుగనీయక వానివాని కనుకూలించు సందేశము లొసగుచు, వానినుండి నూతనాంశములు గైకొనుచు, నిత్యనవ్యమై నిత్యజీవియై వరలుచున్నది. శతాబ్దులను, సహస్రాబ్దులను కడచినవి. ఎన్నో నాగరకతలు విన్నువఱకు పెరిగి భూమిపై డుల్లిపడినవి. కాలపురుషునిచే గలగద హైందవసభ్యతను తాకలేక వంగి వందన మొనరించినది. హిందూతత్త్వమహత్త్వమును పాశ్చాత్యజగతికి నుద్బోధించిన మహామనీషులు వివేకానంద రాధాకృష్ణుల వచనములను విలోకింపుడు: "The principles of religiou that are in the Vedanta are unchangeable Why? Because they are all built upon the eternal principles that are in man and nature; they can never change.........Not one jot of the principles of our religion will be changed: they will remain intact." (Vide: The complete works of Swamy Vivekananda, Part III, page 121)

"It is essential to every religion that its heritage should be treated as sacred A society which puts a halo of sanctity round its tradition gains an inestimable advantage of power and permanence The Vedic tradition became surrounded with sanctity, and so helped to transmit culture and ensure the continuity of civilisation. The sacred scriptures makes the life of the spirit real even to those who are incapable of insight."

(Vide: Sir Radhakrishnan's "The Hindu View of Life" page 18.)

"Hinduism is a movement; not a position; a process, not a result; a growing tradition, not a fixed revelation Its past history encourages us to believe that it will be found equal to any emergency that the future may throw up, whether on the field of thought or of history......Leaders of Hindu thought and practice are convinced that the times require, not a surrender of the basic principles of Hinduism, but a restatement of them with special reference to the needs of a more complex and mobile social order Such an attempt will only be the repetition of a process which has occured a number of times in the history of Hinduism." (Page 130, The Same Book.)

భావనమున జొనిపి చక్కనికథలను సృష్టించి, సామాన్యప్రజల మానసనేత్రములముందు చిరసందీప్తములై యుండు రూపములను నిలిపిరి. కావుననే పల్లెవాండ్రుకూడ ఏసుబోధనలకై పరుగిడివచ్చువారు. ఏసు సంయమీంద్రుని Parables, * బుద్ధుని జాతకకథలు, బహుళపురాణగాథలు, ఈనాటి రామకృష్ణపరమహంస కథలు భావనస్నాతములగుచు, గట్టిదైన తత్త్వఘోషకే చెందక ప్రపంచసారళ్యతమున కపూర్వ సౌందర్యము నొసగునవి యైనవి. గంభీరభావ వ్యక్తీకరణముగాని, ఈశ్వరచింతనముగాని హృదయోద్వేగమును, ఆధ్యాత్మికావేశమును, భావనాశక్తియును గలిసినపుడే సాధ్యమగునని నొక్కి వచింతును. వీని ప్రసన్నతనందని వ్యక్తికళోపాసకుడు కాలేడని, మహాత్ముడు కాజాలడని, ఆనందదాత కాలేడని, సౌందర్యసృష్టి గావింపలేడని, నిత్యజీవి కాజాలడని నా దృఢాభిప్రాయము.

కృష్ణమూర్తిభావములన్నిటికి జేజేలుపాడము. నిజమే! కాని ఏదుటిభావము శ్రీరాముని పోలినను పోలకపోయినను చివాలున అరసున్నలవలె వంగి వందనము కోతిమూకలు తండోపతండము లగుచుండుటచే, "తందానపాటలందు"ను, "భళాభళి" రాగములందు బ్రదుకుల నెగురగొట్టువారి సంఖ్య తెగబలిసిపోవుచుండుటచే, నైసర్గిక ప్రతిభ ప్రత్యేకప్రజ్ఞలు పరియెఱుగక అంతరంగమున త్రుప్పుబట్టియుండుటచే వ్యక్తిత్వము కుఱుచబడి, మనుష్యత్వము మటుమాయ మగుచుండుటచే, ఎందఱెందఱి యెడందలందో భయసంశయములు ఇండ్లుగట్టుకొను చుండుటచే, ధృతిసహితుడైన ఒకవ్యక్తి హెచ్చరిక నేడు మిక్కిలి యక్కఱైయున్నది. అభిప్రాయభేదము లగపడుట యనుచితముకాదు. ఇవి చేవగలవారిలో తలసూపును గాని గంగిరెద్దులందును, గొఱ్ఱెలందును గాదు. మేధావంతుని బోధనలోని బంగారును చేకొనుట పాడి. కృష్ణమూర్తివంటి వ్యక్తి నేడెంతయు ముఖ్యమైయున్నాడు. ఇతడు క్రమతపసుకావించుచున్నాడు. అంధకారమున దీపస్తంభము కాగలడేమో! †

ప్రత్యక్ష ప్రపంచమందును, సారస్వత వసుంధరయందును చాందస పీడితులైనవారి కీతని ప్రబోధమున అక్కఱైన కషాయము కొంత లభించితీఱును.

ఒకవైపున గతమున గన్నులెఱ్ఱజేయువారున్నట్లే వేఱొకతట్టున గతమే ఇష్టదైవమని ఎంచు చాందసు లున్నారు. గతము గగనచుంబి మహా[illegible]గ్రము మాడ్కి దేయైనను అది వర్తమాన [illegible]ములకు మెట్టుకావలసినదే కాని వాని [illegible]ముల గాంతిలు మణిమకుటములు [illegible]ను. మనదృష్టిని తనువున వీఘుకుటస్థ [illegible]కదా! "The heights attract us, not the steps there to" అను గెలే కవీంద్రునివాక్కు భావభరితమైనది కదా! పుష్టిగలదయ్యు మన కక్కఱైనశక్తినంతను గతమీయజాలదు తల్లిదండ్రు లిచ్చిన రక్తమాంసములకు క్రొత్తసత్తువను చేర్చుకొననివారు మనుష్యులెట్లయ్యెదరు? పురిటింటిలోనే పోరుపెట్టుచు తుదకు వీ రేయెన్నెమ్మపాట్లలోనో జారిపడిరా?

గత సంజాతమైన సంప్రదాయము విజ్ఞానగర్భితమైనదో, మాధుర్యబంధురమైనదో, దివ్యడింభకము బోలునదో, గర్భమందే మడిసిన బిడ్డవంటిదో పరిశీలింపక కన్నులుమూసికొని దానిని గొలుచుటందే యావజ్జీవమును వెచ్చబెట్టువారు గోరీనుండి ఒకపరి లేచి మరలనందు సర్దుకొనువారి బోలువారు. ఆరాధ్యవస్తు వెట్టిదో ఆరాధకుని మనసును అట్టిదే యగును. గంగగోవని చచ్చినగొడ్డును పూజించువారు చచ్చుపీనుగులుకారని ఎవ్వరందురు? కంపులోనే బ్రదుకీడ్చు రాబందుకు రుచించునది క్రుళ్లేకాదా? దుర్భావలకు మానసాంజలిని ఘటించువాడు ఉన్నత పిశాచపీఠమునకే అభ్యర్థియగునుగదా! నెత్తావికి మనసిచ్చు ఆనందవ్రతుని దివ్యసింహాసనమున కీపీఠ మెంతదూరమందో యుండునని ఎవ్వ రెఱుగరు? మట్టిదిబ్బ మహాదేవుడని యెంచి ఆత్మజీవనములను దానికి నిత్యనైవేద్యముల గావించువారు తుదకు దిబ్బలేయగుదురని చెప్పవలెనా?

యోగులుకాక ‡ ఆధ్యాత్మిక జీవనమున తొలితరగతి నున్నవారు విగ్రహారాధన మొనరించుకొనవచ్చునని హిందూమతమునుట నిక్కమే! విగ్రహారాధన మన రాతిబొమ్మ జగదీసుడని నమ్మి దానిని పూజించుట కాదు. ఏకాగ్రదృష్టి తన చరణవాళీకముల నంటినపుడే ఆచూడ్కిని రజ్జువుజేసికొని దివ్యభావ మంతరంగగర్భాలయమున నవతరించుననియు, ఈ రీతి చూడ్కి యలవడనితఱి మన సుదుండగుని వడువున నిందందు పరుగిడుట తథ్యమనియు, ఉత్తమాశయము దాకిలోంగక ఉడురాశిలో నెందో నక్కియుండునుగాని సూర్యమండలమునుండి యవతరించిన శమంతకమట్లు మదిజొచ్చి ప్రత్యహముగు భావస్వర్ణమును సంచితమొనరింపదనియు నెఱిగి దృష్టిసూత్రమును బలపఱుచుట కక్కఱైన శిక్షణమును తొలుదొలుత మనసునకిచ్చుటకై మనమతము విగ్రహారాధనము నిర్ణయించినది. ప్రాణప్రతిష్ఠయనిన భావప్రతిష్ఠయనియు, శంకుస్థాపనమనిన భావస్థాపనమనియు నాయభిప్రాయము. భావప్రతిష్ఠ నెఱుగని విగ్రహము బండరాయి. పరిమళసందేశమంపి ఆధ్యాత్మికశక్తి నాంతరంగిక దృష్టిలోని కాహ్వానించుటకే ఉపాసకుడు పూలను చేగొనును. ఈ సృష్టిలో దివ్యశక్తి ప్రవేశించినపుడే ప్రసన్నభావము ధ్యానమున జొచ్చెనందును. సూర్యోదయమునుండి స్రవించు కనకరశ్మి గవాక్షమార్గమునుండి ధారధారలై యగారమున ప్రవేశించి ఆనందసృష్టి గావించునట్లు, ఈశ్వరహృదినుండి జాలువారు ప్రసన్నభావము ధ్యానపథమునుండి ధారాళముగ నంతరంగమున పొంగిపొరలి అందు సౌందర్యప్రపంచమును సృష్టించును. ప్రత్యక్షావనిదోచు పూతకావ్యము లోకస్పృష్టి సరస్సులో పుట్టిపెరిగి, పెంపొందిన దివ్యమానసౌకములే సుడీ! ప్రత్యక్షజీవనమును సోకు ఆనంద సమీరాంకురము లీకాసార వీచికల ప్రేమ సందేశముల వహించిన నెచ్చెలులే జూడీ! ఈ యారాధనలోని యాధ్యాత్మికార్థమున కవగతులు కాకుండుటచే భారతదేవమందిరములందలి పూజారులనేకులు వికృతశీలురై, జగదీశునందుండి తఱిమికొట్టుచున్నారు.

భావము జీవము; జీవము భావము. భావరహితమైన రాతికి సాగిలపడు టెట్టిదో, జీవరహితమైన భావమును "జే జే!" యనుటయు నట్టిదే! దానిని గొలుచువారివలన హిందూమతమున కెంతో ఎగ్గు వాటిల్లునట్లే, దీనికి ప్రణమిల్లువారికతన సారస్వతమున కెనలేని చెఱుపు కలుగుచున్నది.

---

* "Without a parable spake he not unto them."

† "ఆంధ్రమహాపురుషు" లందు కృష్ణమూర్తికి నిస్సంశయముగా నున్నతస్థాన ముండును. కావున నీతని ప్రబోధములను పదంపడి విపులముగా విమర్శింతును.

‡ "శివం ఆత్మని పశ్యంతి ప్రతిమాసు నయోగినః."

ఈ యంశమునకు వంగీయులు సకాలమున నవగతులైరి. నవయుగ భాస్కరుడై రామమోహనుడు పూర్వ దిగ్వలయమున నుదయించినాడు. భారత భావస్రవంతి కడ్డుగ నిలిచిన గట్టుల నీతడు తెగగొట్టినాడు బహుమతములను, బహు సారస్వతములను మథించి వానిలోని మీగడతఱకను మనసున కెక్కించుకొనినాడు. సారస్వతమునకును, మతమునకును, తత్త్వశాస్త్రమునకును, మనుష్య జీవనమునకును అవినాభావసంబంధమున్నదని తొలుత గుర్తించిన ఆధునికమహాపురుషు డీతడే!

ఉత్తమ సారస్వతము ఆదర్శమతబోధకుని నాభికమలమునందే యుదయించును. ఇట్లు ఉద్భవింపని సాహిత్యమున బ్రహ్మబోలు భావముండనే యుండదు. ప్రపంచ చరిత్రలను పరికింపుడు. ఈ యంశము దినేశరశ్మివలె దృగ్గోచరమగును. శంకరరామానుజ చైతన్య కబీరాదుల యడుగుజాడలందు ప్రఫుల్ల శారదాంభోజమట్లు భారత సాహితి ప్రస్ఫుటించినది. లూథర్, జ్వింగ్లో, కేల్విన్, జాన్ నాక్స్ మున్నగు ఆచార్యుల పదాంకములందే కదా Western Renaissance కుసుమించినది. భావము సహస్రపత్ర సమన్విత సరోజము పోలునది. Renaissance లో గంధబంధురములైన ఉద్యమము లెన్నో తలసూపినవి కావుననే పాశ్చాత్య జగతి నవజీవన సౌరభస్నాతయైనది. ఈ యద్భుత దృశ్యము రామమోహనుని కన్నులకు మిఱుమిట్లుగొలిపినది. కావుననే ఈతడు Indian Renaissance కు Luther కాగలిగినాడు.

ప్రాచీ ప్రతీచీ సాహిత్యములను దిగ్రమింగిన ఈ యపూర్వభోక్త, బాలకుడై యుండగ నుపనిషచ్ఛిఖరములపై చెండ్లాడిన ఈ మహావిజ్ఞాని డేవిడ్ హేర్ మున్నగువారి గూడి నూతన విద్యావిధానమునకు శంకుస్థాపన మొనరించి సంస్కృతమును ప్రక్కను నిలుపుట వింతగ తోపవచ్చును. భారతీయులందు భారతీయుడు, భాషాసేవకులందు తలమిన్న సంస్కృత విరోధియని తలపజెల్లదు. East is east, west is west అను కొందఱు భారత కిప్లింగుల దృక్పథమును మార్చుటకై తొలుత నీతడు ప్రతీచీభావోద్యమ దృష్టాంతమును భారతవాసులకు జూపినాడు. కావున సంస్కృతప్రబోధము నీతడు కొంత కాలము స్థగిత మొనరించినాడు. ఇంటబుట్టి, ఒంటబట్టిన విజ్ఞానమునకు ఈ యల్పకాలమున చెఱుపురాదనియే ఈత డూహించినాడు. ఈతనిపురోభాగమం దున్నది బ్రహ్మాండము బోలు నుద్యమము. ఒకతరగతినుండి వేఱొక తరగతిలోనికి నడచువిద్యార్థివలె సంస్కరణకర్త ఒకశ్రేణినుండి వేఱొకశ్రేణికరుగుచు, దన యుద్దేశసిద్ధికై నూతనప్రణాళిక నవలంబించును. మానవు డనంతజీవి కాడు కావున కొంతదూర మరిగి దురదృష్టవశాత్తు ఏ బ్రిస్టలులోనో తన మజిలీ చాలించుకొనవచ్చును. ఈతని యడుగుజాడలందు నడచిన కర్మఠులు ఈతడు వీడిచనిన చోటునుండి నూతనాంగణములలోనికి ఉద్యమస్యందనమును నడపుదురు. దేవేంద్రనాథ శివనాథశాస్త్రి ప్రభృతు లిట్లొనరించిరి. తాత్కాలికముగ ప్రక్కను నిలుపబడిన సంస్కృతమును మరల పురోభాగమున కాహ్వానించిరి.

రామమోహనుని ఉద్దేశములను మెకాలే ప్రభృతు లిట్లు గ్రహించిరికారు. నూతన విద్యావిధానమనిన, సంపూర్ణప్రతీచీ విద్యావిధానమని వీ రర్థము జేసికొనిరి. సంస్కృతమును ప్రక్కనిలుపుటకాదు, దానిమచ్చు మాపితీఱవలెనని ఈ యోధాగ్రేసరు లుద్దేశించిరి. ప్రాచీ విజ్ఞానవిభవమును తనబొజ్జయం దిముడ్చుకొనిన సంస్కృతమును మన్నుపా[illegible]పె ఆమన్నుపై మిన్నుముట్టు పాశ్చాత్య [illegible] భవనమును నిర్మింపవలెనని వీరు నిశ్చం[illegible] వీరును వీరిసంతతివారును భౌతిక ప్రపంచమున బలము సంపాదించుకొనుటచే జెబ్బగొట్టి తమ పనియందు నెగ్గుదల నందిరి. మెకాలే మహాశయుని జోస్యము పండినది!

ప్రతికూలశక్తు లెట్లున్నను, దేవేంద్రనాథ ప్రభృతులు కూలనొల్లని జోదులు. వీరువిశాల దృష్టిగల మహర్షులుకూడ నగుడు, ప్రతీచీ విజ్ఞానమును దఱిమికొట్టక, నిలుపదగు తావలమున అతిథిని నిలిపి, ప్రాచీవిజ్ఞానమును పూజాపీఠమం దుంచి సారస్వత వ్రతమునకుగడంగిరి; జిజ్ఞాసగల డింభకుల నెందఱినో ఈయుపాసనమున దీక్షితుల గావించిరి. వీరిలో నగ్రగణ్యుడు నేటి పృథుకవీంద్రుడు రవీంద్రుడు.

ఒకే నొసలున దోచిన శివకేశవులట్లు * ప్రాచీప్రతీచీ విజ్ఞానము లీ మహాపురుషుని రచనలందు నొకేముఖమున గోచరించుచున్నవి.

రామమోహనుని గంభీరవాక్కులు వీరేశలింగం హృదయమున ప్రతిధ్వనులు లేపినవి. కావున నవభావోద్యమ కేతనము నీతడు కేల బూనినాడు. వంగీయులకువలె ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లేకుండుటచేతను, ప్రతినిమిషము ప్రపంచముతో గాఢసంబంధముగల కలకత్తావోలు మహానగర మాంధ్రావనిలో లేకుండుటచేతను, నిరుపేదయై ప్రపంచయాత్ర సలుపజాలు సత్తువను దానందజాలకపోవుటచేతను, ప్రపంచ మహావిద్వాంసుడుగాని ప్రపంచ ప్రవక్తగాని కాజాలు తరుణములు వీరేశలింగమునకు లభింపలేదు. ఈతడు ప్లీడరు గుమాస్తాయై యుండవవాడు. కాని మహావీరున కుండవలసిన సరకు పుట్టువులోనే ఈతని యంతరంగమం దుండెను. రామమోహనుని దృష్టాంత మీసరకును కదలించినది. ఈతని హృదయమున నద్భుతమైన సంచలన ముదయించినది. అగ్నికుండమువలె జిజ్ఞాస ఈతనిగుండెలందు రవుల్కొనినది. ప్రతికూలపరిస్థితులు కాల్లుకుక్కలవలె పైబడుచున్నను, తన దుస్థితిలోనున్న మఱొక మానవమాత్రుని గడగడ వణకింపజాలు దొడ్డపనిని సాధించుటకై ఈతడు నడుముగట్టినాడు.

ప్రాత పుంతయందే ప్రాకులాడుట కలవడినవారు క్రొత్త తెన్నుజూచి ఉలికిపడుదురు. ముండ్లను, మేకులను, దుమ్మును వమ్మునుదెచ్చి నూతన పాఠమును ప్రబోధించునాచార్యుని ఉత్తమాంగమున కప్పనమందురు. అత్యాచారమునకు గుఱికానివారి సంఖ్య మహాపురుషులందు సకృత్తు. తొలుత మహాత్ములను పాపాత్ములని యెంచినవారి సంఖ్య వివిధయుగములందు ప్రపంచమందంతటను మిక్కుటమై యుండెను. పరార్థజీవులకు విషపాత్ర మిచ్చినవారును, నూతనసందేశ మొసగినవారిని శిలువమునకు సమర్పించినవారును, భేదాభిప్రాయములను వ్యక్తీకరించిన వ్యక్తుల దుమ్ములను

* కడుంగడు ముఖ్యమైన ఈ హిందూమతాంశమును దృష్టాంతీకరించు నొక చక్కని కథ కలదు. శైవుని జూచి కను లెఱ్ఱజేసిన వైష్ణవు డొకడు విష్ణువిగ్రహమునకు సాగిలపడినంతన, విగ్రహముఖము రెండుభాగములైన ట్లయ్యెను. ఒకభాగమున శివముఖమును, వేఱొకభాగమున విష్ణువదనమును గోచరించెను. ఒక్కండైయున్న రెండుమోములు చిఱునవ్వు నగి ఎదుటిభక్తు నుద్దేశించి "మే మిరువురము వేఱుగాము సుధీ" అని పలికెను.

దుమ్ముజేసినవారును, ఉత్తమాశయముల నుద్బోధించినవారిని చింతనిప్పులందు చొప్పించినవారును ప్రపంచచరిత్రలకు ఎన్నెన్నో రక్తాక్షరములు సప్లయిచేసిరి. ఉన్నతోద్దేశములకై శ్రమించినవారి తలపైబడిన ధూళి కాలక్రమమున రవీంద్రుడనిన స్వర్ణభస్మమౌ (Vide: Tagore's famous Essay on Nationalism) పుప్పొడియో యగుట తథ్యము.

ప్రతికూలశక్తులు వీరేశలింగమును మార్కొనినవి. కాని, ఈ వీరవతంసము తనగుండెలను చలింప నిచ్చినాడు కాడు. దక్షిణభారతావనిలో నూతన భావోద్యమమున కాచార్యుడైనాడు. ఆంగ్లమున గూడ ప్రవేశమందిన ప్రథమాంధ్రపండితు డీతడే! ఆంధ్రసారస్వతక్షేత్రమున క్రొత్త పద్ధతులకు తెరవుజూపిన వా డీతడే! భాషాసేవయందు (ముఖ్యముగ నవలారచనమున) ఈతని సమీపమున నిలిచిన మనీషి చిలకమర్తి పంతులు. ఈతడును ఆతడును తమ పత్రికలవలనను, ఉపన్యాసములవలనను తెలుగుగుండెలందు నూతన సంచలనము నుదయింపజేసిరి నవ్యభావోద్యమమును దృష్టియందిడికొని సారస్వతాంగణమున వీరికి చేదోడైనవా రెవ్వరును లేకపోయిరి. ఆధునికవిద్యావిధానమందలి లోపముల నెదుర్కొని, దేవేంద్రనాథాదులవలె సంస్కృతవిద్యాసముద్ధరణమునకై, ప్రాక్పశ్చిమవిజ్ఞాన వివాహ మహోత్సవమునకై కంకణము గట్టుకొనిన వా రెవ్వరును ఆంధ్రావనిలో నవతరింపలేదు. ఫలము ప్రత్యక్షమైనది. మన నేలలో నొక రవీంద్రు డుదయింపలేదు. సంస్కృతమందును, ఆంధ్రమందును, ఆంగ్లమందును (తక్కిన భాషలమాట దేవుడెఱుగును) ఘనపాండితినంది, వీనిలో పరిశోధన మొనరించి, వీనికి సంబంధించిన బహుళ విజ్ఞానశాఖలను విమర్శకదృష్టితో పరికించి, భాషాంగణమున నవజీవన దుందుభులను మారుమ్రోగించిన రచయితగాని వక్తగాని ఆంధ్రవసుంధరలో పొడసూపలేదు. బంకించంద్ర, ఈశ్వరచంద్ర, నవీనచంద్ర, రమేశచంద్ర, శరశ్చంద్ర, గిరీశచంద్ర, ద్విజేంద్ర, హేమేంద్ర జలధర ప్రభృతులు ప్రాచీప్రతీచీవిజ్ఞానములనందరియే వంగసాహిత్యవధూటిని సేవించి, ఆమెకీర్తి చంద్రికలనుదిగంతములకు పుత్తెంచిరి. నూతన భావోద్యమ ముదయింపక మున్ను వంగావనిలో (మైమెన్సింగుపాట మాట తక్క) సాహిత్యమే లేదనవచ్చును. నేడు వంగసాహితి విదేశ విశ్వవిద్యాలయములలో పఠనీయమై యున్నది. Italian of the East అని పేరందిన మనభాష ఉన్నతి నందకుండుటకును, మొన్న మొన్నటివఱకు "పుట్టుపూర్వోత్తరము"ల నెఱుగని భాష మహోన్నతి నందుటకును కారణములను చదువరు లూహించియేయుందురు.

దిగ్గజములవంటి బ్రహ్మసమాజికులు మనలో తోచుట నిక్కమే! కాని వీరు మఱికొందఱు విద్యాధికులకే సంబంధించినదే గాని జనసామాన్యమునకు గాదని ఊహించిరేమో యని భావించుట కనవసు లీల నింగ్లీషులో అద్భుతపాండితి నంది, ఇంగ్లీషులో గ్రంథములు రచించి, ఇంగ్లీషులో గంభీరోపన్యాసములొసగి మాతృభాషను మంగునకైన ముట్టరైరి. కావున వీరి భావోద్యమము రాజమండ్రి కాకినాడల బ్రహ్మసమాజసభాంగణములనుంకి దాటిపోలేదు. వీరి యుద్దేశములు మహత్తరములని యెఱిగి వీరిహృదయములకు ప్రణమిల్లుదుముగాని తమగంభీరాశయములు అసంఖ్యాకులైన ప్రజల మనసులందు ప్రవేశించుట కక్కఱైన విధానమును వీ రవలంబించిరికా రని విషాదపూర్వకముగ దెలుపుచు నీ సింహావలోకనమును వీరు విశాలదృష్టితో పరికింతు రని విశ్వసించుచున్నాను. బహుముఖములగు బ్రహ్మమతమందలి సంపూర్ణాభిప్రాయములను తేట తెలుగున పల్లెపల్లెయందును, వీథివీథిలోను వీరు ప్రచార మొనరించినయెడల నీమతమునుగుఱించిన దురభిప్రాయము లెన్నో తుత్తునియ లగుటయు, నవ్యభావోద్యమము జనసామాన్యమునకు హృదయంగమ మగుటయు, క్రొంగ్రొత్తకళల నీను సారస్వతము తెలుగుతోటలో వెలయుటయు సుసాధ్యములయ్యెడివి. ఇపుడు కాకినాడలో "సాధన" ఉదయించినది. కాని ఇది రెండేండ్ల పసిబిడ్డ. "Papa!" "Mamma!!" అనుచున్నది. ఆంధ్రావనిలో నూతన భావోద్యమ మెట్లు నడచుచున్నదో గురుగంభీర భావణంబులతో సభ్యజగతి కిది తెలుపగలదని నమ్మెదను. కాని "అమ్మా! అయ్యా!!" అను ముద్దుపలుకులతో నాంధ్రమాతనలరించు "సాధన" కూడ ఉదయించి, క్రమాభివృద్ధినంది ప్రతి తెలుగుగుమ్మముమీద దన సౌందర్యసందీప్తోద్దేశము లివియని తెల్లముచేయు పసుపు కుంకుమల నునిచి నవ్యభావగీతికల నాలాపింపవలెను. వంగావనిలో కొంతకాలముండి రామకృష్ణ, రామస్వామి, ప్రకాశరాయుడు ప్రభృతులు నవభావ వ్యక్తీకరణమునకు మాతృభాష అనివార్యమైనమార్గమని గుర్తించియే యుందురు. తెలుగున చక్కగ నుపన్యసింపగల శక్తి మిత్రుడు రామస్వామికి కలదు. తేటతెలుగున వ్రాయగలశక్తి ప్రకాశరాయునకు గలదు. ఆంధ్రమున మధుర గీతికల నాలాపించు కళాకౌశలము కృష్ణశాస్త్రికి కలదు. పల్లెవాసుల నుద్బోధింపగల సామర్థ్యము వేంకటనారాయణ వీరభద్రరావుల కున్నది. భావప్రకాశమున కక్కఱైన హృదయము కల్యాణస్వామి కున్నది. ఉత్సాహమును, ఉద్బోధమును, ఉదారభావములను చిత్తమువచ్చినరీతిని వీరికీయజాలు ప్రజ్ఞ వేంకటరత్న మనీషి కున్నది. తమ కురుక్షేత్రము పల్లెమ్ముత్తికలోను, కన్నతల్లి కట్టెదుటను, అభాగసలట్రిండ్లలోను, విశాల సారస్వతాంగణమందును ఉండుట గుర్తించి వీ రికనైన నందు తమ శంఖములను పూరింతురా?

ఉత్సాహమునకు పరిపక్వ విజ్ఞానము లేనివారు సాహితీపరిజ్ఞానమును, తాత్త్విక పరిశీలనమును, మతపరిశోధనమును, మనవ్యమానస రహస్యములను ఎఱుగనిలీల నూతనభావోద్యమము (భావము బ్రహ్మకావున, నూతన బ్రహ్మోద్యమ మనినను అనుడు) హిందూమతమునకు విరోధియని భావించి, కడుంగడు ముఖ్యమైన హిందూమత సిద్ధాంతములను దుర్విమర్శనలకు గుఱిచేసి హైందవ సంఘీభావముపై మఱొక దెబ్బగొట్టి ఇంకొక చీలికను తెచ్చిపెట్టిరి సారస్వత రాజకీయ సాంఘికారిష్టములకు కన్నతల్లులగునవి ఇట్టి చీలికలే కదా!

యుగములు పరమాశయముల దెస జనుయాత్రికులు కడచినయుగముకంటె ప్రస్తుతయుగము గమ్యస్థానముదెస మఱికొంత దూరము నడచుటను గమనించు టొప్పు. ఈ యభివృద్ధిపంథ (Path of Evolution) యందు నవ్యప్రబోధ మొనరించి, నూతనక్రియా ప్రణాళికను చూపు నూతనాచార్యు లుదయించుచుందురు. "సంభవామి యుగేయుగే" యని కదా గీతాచార్యు డనినాడు. దశావతారములను విమర్శకదృష్టితో వీక్షింపుడు. మత్స్యము, కూర్మము, వరాహము, నరుడు (రాముడు), నరనారాయణుడు (God-man, కృష్ణుడు) క్రమాభివృద్ధి నియమమును సూచించుట లేదా? జగదీసు డొకేయుగమున వివిధక్రియలు నెఱపుటకై వివిధవ్యక్తులై యవతరించినను

అవతరించు నని త్రేత ద్వాపరములు తెలుపుచునే యున్నవి. నవయుగమున నాల్గుచేతులతో నెవ్వడును ఇంకను ఆవిర్భవింపలేదని పల్వురు నింగిదెస జూచుచున్నారు కాని ఎప్పటివలె సర్వేశుడు భారతావనియందే నవయుగమందును అవతరించినాడు. బహురూపములం దాతడు వ్యక్తమగుట నెందఱో గుర్తించినారు. రామకృష్ణ వివేకానందులను, రామమోహనగాంధులును నల్వురం దవతరించిన జగదీశుడందును. ఇట్లని యెఱుగక కొందఱు రామమోహనుని వెలిచేసిరి. ఆతడుద్బోధించిన నవ్యభావోద్యమము హిందూమతముయొక్క అధునాతన సంపుటము గాని (Modern Edition) ఎందుండియో దండెత్తి వచ్చిన మతముకాదని గుర్తింపరైరి.

నెల్లువవలె ఖరవేగమున కాలము కడచుచుండ నెక్క నిలువగలవా రెవ్వరు? నిలుతుమను ఛాందసులు పెక్కండ్రుండుట నిక్కమే! కాని నిలువగలవాడొక్కండును ఉండడు. ఉన్నను, కడువృద్ధులు కావున "జవసత్త్వ"లను గోల్పడిరి గావున వెనుకటి యొడ్డున శిలావిగ్రహములట్లు వీరు పడియుందురు గాని గతకందరములలోని కెగురీతను వీరిదజాలరు. "Orthodoxy is the grave of Intelligence" అని కదా Bertrand Russel వచించినాడు "Mechanical orthodoxy as much asblank negation has no future" (Vide: Radhakrishnan's Kalki or "The future of civilization") అని కదా మన రాధాకృష్ణ డనినాడు. "ఊహూ! మేము కదలము. మేము సనేమిరా గాంగ్రడము. మామాటే మాకు వేదవాక్కు" అని కాళ్లకు తిమ్మెరలెక్కించుకొని, తిరుగటిరళ్లను పాదుకలు జేసికొని, బ్రదికినను చచ్చినట్లే యుండు అభాగులను జూచియే రస్పెల్ ఘాటైన మక్కను ప్రయోగించి యుండును.

కాలనియమమే తోడ్పడుచుండ నవతారపూరుషు డవలీలగ నగ్రసరుడు కాగలడుకదా! మన స్తత్త్వ పరిజ్ఞాన మంది, మెలకువమెయి ప్రజలగుండెలను నిమురుచు, తాబలుకు ప్రబోధవాక్కులను తన ప్రవర్తనమున ప్రవేశపెట్టి, ధైర్యత్యాగముల నాత్మజీవనమున నూతకాలలు గావించుకొనుచు నీతడు కృతకృత్యుడగును. క్రియాశూన్యులై కాక మాటకై పెనగులాడువారే మనుష్యలోకమున బహుసంఖ్యాకులై యున్నారు. ఈ మూర్ఖుల మనసులెఱిగి మాటలు నెచ్చింపక బుద్ధిమంతుడైన నాయకుడు వారిష్టమైన మాటను గైకొని, తనక్రియకు దానిని కట్టుపుట్టముజేసి, ఆ క్రియదెస వారి యాదరదృష్టి నాకర్షించి, ఉద్దేశసిద్ధి నందును. హరిజనులను దేవాలయమున ప్రవేశపెట్టుచ, శతాబ్దులనుండి పెరిగి పెంపొందుచుండిన అత్యాచారమును, మౌఢ్యమును అత్యల్ప సమయములో సమయించి నేటి సంఘసంస్కర్తల కెల్ల నగ్రగణ్యుడైన గాంధీజీ తాను హిందువునని తెలుపుకొనక, తన సంస్కరణోద్యమము హిందూమత తత్త్వము ననుసరించినదే యని పలుకక, తా నన్యమతావలంబి నని వచించి, ప్రజ లందఱట్లే పలికి ఈ యీ నియమములకు గడంగవలెనని పట్టుపట్టియున్నచో జయమును గాక అపజయమునే గాంచియుండును. ఈతని మతమునకును బ్రహ్మమతమునకును భేదమే లేదు. పక్కాకగడసరి కావున పనికే ప్రాముఖ్యమిచ్చి పెగ్గుదలనందుచున్నాడు. బ్రహ్మసమాజికులమని యనుకొనువారిలోకంటె బ్రహ్మసమాజమను పేరెత్తనివారిలో బ్రహ్మసమాజికు లధికసంఖ్యాకులై యున్నారు. కొందఱు పాశ్చాత్యులు గాంధి నేటిక్రయిస్తవులలో అగ్రగణ్యుడని నారు; కొందఱు బౌద్ధు లీతడు బౌద్ధప్రవరు డన్నారు. ఆగాఖాను ముసల్మానులలో నీతడు దొడ్డవాడన్నాడు. నేను హిందువులలో హిందువుడ నని గాంధి తెలుపుకొనుచున్నాడు. సత్య మొక్కటే, నామములనేకములు; మత మొక్కటే, పేళ్లు పెక్కులు; ఈ పేళ్లే పెనగులాటలకు తలిదండ్రులు.

భావసంచలనము కలిగినది కావుననే గాంధియుగమున సంఘసంచలన ముదయించినది. ఈ సంచలన మాంధ్రసారస్వతమందును గోచరించుచున్నది. తూరుపున కెంపుకాంతి కొంత తోచుచున్నను, చీకటులు తమ వెనుకటి గుహలలోనికి తా మింకను తరలిపోలేదు. బ్రహ్మోపాసకులనబడు భావోపాసకుల ఉపాసకీర్తనము వంగవిషయమున శ్రుతిగోచరమైన ట్లగళతాబ్దికి మున్నే ఆంధ్రావనియందును వీనులకు విందొనరించియుండినచో, మన సాహిత్యోద్యానమునగూడ నీవఱలోనే అపరంజిమరీచికలు తగ్గొత్తి యుండెడివి; ఉల్లమును పల్లవించు చారుపల్లవము లెన్నో అందు రాశిరాసులై నెలసెడివి.

భావోపాసనము నెఱుగక ప్రాణప్రతిష్ఠ నెఱుగని సరుకునకు ప్రాంజలులైనవారి సంఖ్య పలుచబడలేదు. భాషాంతరీకరణమును, అసభ్యశృంగారముతో తుందిలమైన ప్రబంధరచనావిధానమును, కేవలము గణబద్ధమై, క్లిష్టపదభూయిష్ఠమైన వ్రాతయును, అవధానవిధమును, ఆశుకవనమును ఆంధ్రావనిలో సాహిత్యసృష్టి యనిపించుకొనుచున్నవి. ఒకప్పుడు భాషాంతరీకరణ మక్కరైన యుగముండుట నిక్కమే! విలాసామోదములకు జొక్కి మధుపాత్రమును చేతికందించు రచయితలను, గతిలేక మతిలేక కడుపుకక్కుఱితికై రేబవళ్లు వందిమాగధులైయుండు వ్రాయసగాండ్రను మాత్ర మాదరించువా రున్నపుడు ఒకమాదిరి ప్రబంధసృష్టి అక్కరైన యుగముండుటయు నిక్కమే! ప్రత్యేకప్రతికూల చారిత్రక సాంఘిక కారణము లనివార్యమైయున్నప్పటి ఘోష రివ్వురివ్వున శతాబ్దులు కడచినపిదప గూడ శ్రుతిగోచరమైనచో, మనసు దురంత సంతాపముచే కుందదా? నాడువలె నేడును ఈఘోష అనుకరణీయ మగునెడల సహజశక్తికి తలవంపులు రావా? స్వతంత్రశక్తికి చెఱుపురాదా? ప్రాణసంచలనమునకు భంగము వాటిల్లదా? అభివృద్ధిమార్గమున నడ్డుగోడలు నిలువవా? జ్ఞానవదనము కృష్ణపక్షతిమిరమువలె ఘనీభవింపదా? అనుసరణమే శరణ్యమని ఎంచువారు తాతలందలి సిరినిగానక చీడనే కాంచి దానిని పట్టించుకొందురు. పెద్దన్న ప్రతిభగాని, రామరాజభూషణుని భావనాశక్తినిగాని, సూరకవి రచనాకౌశలముగాని, వెంకటకవి కవితానైపుణ్యము గాని ఎఱుగక మొదటివాని "శ్రీవక్షోజ" వర్ణనమును, రెండవవ్యక్తి శ్లేషోన్మాదమును మనసునకు బట్టించుకొని, చంద్రమతినిగుఱించి అడిదమువారును, అర్జుననిగుఱించి చామకూరవారును గావించిన అనుచిత వర్ణనాకథనములను హృదయంగమమొనరించుకొని, శ్రీనాథుని ధారాళవాగ్ధాటి నెఱుగకున్నను, అతని చరిత్రలోని లోపముల నొరవళ్లు గావించుకొని గ్రంథరచనకు గడంగినవా రెందఱో మననేలలో దోచిరి. లోకమాతను వర్ణించుపద్ధతికిని, "లోకతాతను" వర్ణించు పద్ధతికిని వ్యత్యాసము జూపని "కవివరేణ్యులు" మన నేలలో లెక్కకు మిక్కిలియై యుండిరి.

తొల్లింటివారు తొడిగి పాఱవైచిన గుడ్డలను దాల్చువారు కొంద ఱున్నారు. వారు విడిచిన తొడవులను తీసి భాషాయోషకు గట్టసమకట్టినవారును గలరు. ఎరువువలువలు దాల్చుట సిగ్గుచేటు. ఎరువునగలుబరువుచేటు.

అంతేకాదు. అవి సరిపోవుకదా! అందును భాషాలంకారము ఎరువునకును, దొంగతీకము నకును లొంగునదికాదు. నాలుగు బంగారు ముక్కల నతికించిన నొకనగ కావచ్చును. నాలుగుమాటలను కలిపికుట్టిన నొక భాషాలంకారము కాదు తల్లికడుపున తొమ్మిదినెలలుపెరిగి పెంపొందు బిడ్డవలె, కవిహృదయం దీశ్వరసంపర్కమున జనించి పెరిగి పెంపొందు దివ్యభావమే, దివ్యాంబరధారియై వెడలి భాషాలంకారమని పిలువబడుచున్నది. కాని, అలంకార మనునభిధేయమును తొలుత దీని కెవరిచ్చిరోకాని ఇది సరియైనదికాదు. పైన మెఱుగుదానిని నగ యనవచ్చునుగాని ప్రాణసృష్టిని, అందును దివ్యడింభకము నిట్లనరాదుకదా! చదువరులారా! సృష్టికర్తయైన రచయిత అలంకారమనకును, మ్రుచ్చిలి తెచ్చికొనిన నగకును ఎంతవ్యత్యాసమున్నదో చూచితిరా?

చోరశిఖామణులు కాముకులు కూడ నగుట విడ్డూరముకాదు. మోసగాండ్రగుటయు అబ్బురముకాదు. ఎల్లెట్లో వింతిరూపములను బనాయించి వీరు భాషారంగమున నిలువుటయు గలదు. తట్టెడు ఫేసుపవుడరులో మొగమును పదిమారులు దొరలించి, ఎఱువునగలనో, దొంగనగలనో, గిల్టుమెఱుగు నగలనో దాల్చి, చీర సింగారించుకొని నిలుచు పడుపుకత్తె అందకత్తె యనిపించుకొనునా? ఎన్నడైన పణ్యాంగన పతివ్రతకు ప్రతిచిత్రము కాజాలునా? బ్రహ్మకొల్వామీదిశయ్య త్యాగరాజనిన "చిత్రరత్నమయ శేషతల్ప" మగునా? సాహితీ జగతి లోనిశయ్య కాజాలునా? రంగురంగుల మేలిముసుగులో నడగియున్న కొరకంచు రమణీమణి యనిపించుకొనునా? బూడిదపూత నందిన మట్టిసిబ్బ మహాదేవుడు కాగలుగునా? త్యాగయ్యపల్కులు నాలింపుడు:

"కామినివేషధారికి సాధ్వీనడత
లేమైన దెలుసునా ?"

"తనసౌఖ్యము తా నెఱుగక
యొరులకు తగుబోధన సుఖమా ?"

"ఘనమగు పులి గోరూపమైన
త్యాగరాజనుత! శిశువు బాలు గల్గున ?"

"రామ! నీయెడ ప్రేమరహితులకు
నామరుచి దెలియునా ?"

పైమెఱుగు, మైపూత, ఎరువుతళుక్కు, వేసంపుబెళుక్కు సౌందర్య సామగ్రి యనిపించుకొనవు. స్వతంత్రభావసముద్భవ, సహజశక్తి సంజనిత, సజీవ సందీప్త, సత్యసంశోభిత, సదాశయసమన్విత, సచ్చిదానంద సంయుత, సదాత్మభవసృష్టియే సౌందర్యము. నవనవోన్మేషమైయుండు నిట్టిసృష్టి అనువాద, అనుకరణ, అనుసరణ, అపహరణములనుండి పుట్టగలుగునా? "In our fine arts, not imitation but creation, is the aim" అనికదా మహావిజ్ఞాని ఎమర్సను మహాశయుడు వాకొనినాడు (Vide: Emerson's Essays: Page 77).

సాహిత్యసృష్టి, కళాసృష్టి ఇట్టిదని ఎఱిగినవారిసంఖ్య మనదేశములో నత్యల్పమై యుండుటచే నెన్నియో కుత్సితంపు టూహాలు పరగంగలవలె నాంధ్రహృదిపై దాడిసెడలుచున్నవి దుర్భారగర్భితములైన పాత్రములు పెరిగి పెంపొందులందు పెంటపోసులతో పందెమగట్టుచున్నవి ఇందుండి వెడలు విషవాయువులు ఎన్నిమనసులందో మాపుగాని మరిడి జాడ్యమును దెచ్చి పెట్టును. ఈ యరిష్టమును నెట్టింపవలెనన నీచెత్తకు సత్వరమే నిప్పంటించి తీరవలెను.

ఇందులకు గడంగుటకు మాకు అనుభవజ్ఞులే, ఆదర్శపురుషులు కావలసినవారే మనస్సునకు దురంతసంతాపమును కలిగించుతీఱున ప్రవర్తించుచున్నారు. ఇది మనదురదృష్టము. కయ్యములకును, పరస్పర దూషణములకును ముందంజ వేయువారు, అమృతబిందువులతో గాక కూడని తుంపురులతో భాషాంగణమును నింపువారు, ఒండొరుల ఎగ్గును క్షమింపజాలనివారు, ఎదుటివాని యెగ్గునకు వేయిమడుంగులు చెఱుపుజూప నెంచువారు, కత్తులకే వేడిమాటలకే మనసిచ్చువారు, సదాశయముపై కన్ను నిలుపక క్షుద్రాంశమునకే బాసికము కట్టువారు పవిత్ర కళాసామ్రాజ్యమునుండి కదలిపోదురు గాని యందుండ దగుదురా? గభీర సింధువునందే రత్నము లుండునట్లు, గభీర నీల గగనమందే వజ్రపు తునకలట్లు నక్షత్రములు కాంతిలునట్లు గభీర హృదయములందే సుందర భావసృష్టి వెలయును. ఇట్టి సృష్టికి కర్తలగువారే ఈ సామ్రాజ్యమున సక్రాంత మారాధ్యదేవతలై యుందురని ఎవ్వ రెఱుగరు?

ఆంధ్రభాషాంగణమున కొంతమార్పు, కొంతసంచలనము అక్కరయై యున్నదని వీరేశలింగము కలెనే గుర్తించిన మహావ్యక్తి గిడుగు వేంకటరామమూర్తి. ఆంధ్రపండితులం దీత డగ్రగణ్యుడు. భారతమహాపండితులం దీతనికి నికరమైన తావున్నది. సంస్కృతాంధ్రములే కాక ప్రపంచమున నింకను ఎన్నో భాషలున్నవని తెలిసికొని శతాబ్దులనుండి అవి నడచు తెఱగు నెఱుగ నిశ్చయించి, అందులకై నిద్రాహారములకు బలామారనిన ఆంధ్రుడు డీత డొక్కండే! ధనాఢ్యుడు కాకపోయినను, తనకు మేలుబంతి కాజాలునాతం డింకొక్కరుండు తనమ్రోల దోపకున్నను, అన్యదేశీయులందలి పండితులతో సంపర్కము నందుటకై వలసిన తరుణముల నందకున్నను, తనచుట్టుప్రక్కల ననుకూలవాతావరణము లేకున్నను, బహుళగ్రంథముల చెలిమినిచ్చు మహానగరము వాసస్థానము కాకున్నను, కేవలము స్వయంకృషివలన, నిచ్చాశక్తివలన, దృఢనిశ్చయమువలన (భాషాసంచలనము గావలెనను నుద్దేశము నిండుపండువలె పూర్ణమగుట జూడనెంచి) నీతడు సర్వతోముఖమైన పాండిత్యమును సంపాదించినాడు. ఇతడు తపస్వి, మహావీరుడు చెదపుర్వుల పొట్టలందుగూడ ప్రవేశించి, ఒక్కొక్క తెలుగక్కరమునొక్క 'పుట్టుపూర్వోత్తరము'ల నెఱిగి ప్రత్యక్షరజీవనచరిత్రను గ్రహించిన మేటిదిట్ట ఇతడు. ఈక్రియయందే ఈతని ప్రజ్ఞయంతయు నిమిడియున్నది. భాషాకాయమందలి ధమనిస్నాయువులను పుంఖానుపుంఖముగ నీతడు పరిశీలించినాడుగాని, దాని యంతరంగములోనికి తొంగిచూచినాడు కాదు. సారస్వతశరీరము మనుష్యశరీరమును బోలునదే! దేహమే మనుష్యుడు కాదు. అక్షరసముదాయమే సారస్వతముకాదు. రెండింటిలోను మన సున్నది; ఆత్మ కలదు. మనశ్శాస్త్రము, ఆత్మపరిశీలనాపరిజ్ఞాన మెఱుగు తత్త్వశాస్త్రము, మతవిజ్ఞానము భాషాశరీరశాస్త్రముతోబాటు సారస్వతోపాసకునకు హృదయంగమము కావలెను. Doctor, Mesmerist, Philosopher, Prophet, Saint వేర్వేఱు వ్యక్తులుగాక ఒకేవ్యక్తియై యుండగలిగెనేని, అతడే ఆదర్శసారస్వతోపాసకుడు కాజాలును. రామమూర్తి వైయాకరణుడు, అభినవవాగనుశాసనుడు. కావ్యకన్య ఈతనిని వరించినదికాదు.

"శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ నవేద్యతే,
వేద్యతే సహి కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలం"

మున్న సువాక్కుల నానందవర్ధనాదులు వాకొనినారు. ఇవి సర్వత్ర సత్యములని నేను విశ్వసింపను. శ్రీ రామమూర్తిగారియెడల సత్యమై

గోచరించిన దేమో యని వగచుచున్నాను. వృద్ధుడయ్యు నీతడు తన యుత్సాహమును గోలుపడలేదు. వీరయువకునివలెనే ఇంకను తన కురుక్షేత్రమున ముందంజ వేయుచున్నాడు. ఇంతదనుక భాషను సృజించిన Physiology లో Analysis లో ఆంధ్రావనియం దజేయు డనిపించుకొనినాడు. ఇంకను Phraseology కథనమునుండి కదలిపోలేదు. Synthesis Psychology, Ideology, Metaphysics, Religi ous Idealism లీతని కీవఱలో నవగతములు కాకున్ననేమి, ఇకముం దీతనిసొమ్ములు కాగలవని నమ్మెదను

రచనావిధానమున గణింపదగినది కేవలము శబ్దసామగ్రిమాత్రమే కాదు. సౌందర్యతిలకయే కళాసామ్రాజ్యమున నాయకి కాగలదు. ముద్దుగొలుపు శైలికే సాహితీజగతియం దాదరానురాగములు లభించును. వాదుకలో లేని తిరుగటిరాళ్లకుగాని, వాదుకలో నున్న తాటియాకులకుగాని సాహిత్యవసుంధరలో స్థాన ముండదు. సహజ సౌందర్యసృష్టికి అక్కరైన ప్రతిభను పడయుటెట్లో, ఆంధ్రభాషాయోష కపూర్వరూపు నొసగుటెట్లో నవయుగ రచయితలకును, కళోపాసకులకును శ్రీరామమూర్తి ఇక దెలుపవలెను. స్వతంత్రరచనమున పాటింపవలసిన విధు లెవ్వియో, ఆధునిక భావశైవలిని వ్యక్తీకరింపజాలు శైలీసృష్టికై అవలంబింపవలయు లక్షణసూత్రము లెవ్వియో ఈతడును, అభివృద్ధిని గాంక్షించు తక్కుంగలమనీషులును నిర్ణయింపవలెను. కర్ణాటక సంగీతమున కళకు కావలసిన సామగ్రికంటె శాస్త్రమునకు వలసిన సామగ్రి అధికమైయున్నట్లే, ఆంధ్రపద్య రచనమున నీ రెండవరీతి సరుకు విశేష ప్రాముఖ్యము నందియున్నది. నన్నయ కాలమందలి ఛందస్సే నేడును పద్యరచనమున చక్రవర్తియై యున్నది. గజనీ మహమ్మదు సోమనాథ దేవాలయమును పగులగొట్టినపుడు పుట్టిన లక్షణశాస్త్రమే ఆంధ్రావనిలో నేడును జోహారందుచున్నది. ప్రపంచమందలి ఇతర సారస్వతములను పరికింపుడు. ఇంతకాలము ఛత్రపతియైన ఛందస్సు లేదు. ఇన్ని కట్టుబాట్లుగల ఛందస్సులేదు అరువదేండ్లనాటి వంగభాషా ఛందస్సునకే రవీంద్రుడు త్రోసిరాజని సహజభావసృష్టి కక్కరైన స్వీయ ఛందఃపద్ధతులను సృష్టించుకొన్నాడు. కటుకను నాంధ్రఛందస్సును లాంగదీసికొనుటందే మన కవులు తమ జీవనములను సంపూర్ణముగా వెచ్చిపెట్టుచున్నారు. కొంతకుకొంత ఈ కౌశలము నందినవారే మనలో కవులని పిలువబడుచు ఘనసమ్మానముల నందుచున్నారు. తిక్కనాదుల పద్యములందు గూడ పడికట్టురాళ్లగపడుచున్నవి. ఇవి భావపూరముపై బగు బండరాళ్లు. కాని పాదపూరణమున నివి పెద్దపెద్దలకే అనివార్యమగుచున్నవి. రాజనరేంద్రుడు చచ్చి స్వర్గము చేరిన నాటినుండి ఆరవ జార్జిసార్వభౌముడు సింహాసనము నధిష్ఠించినప్పటివఱకు దేశచరిత్ర, మనుష్యచరిత్ర, వివిధభాషాసంపర్కము మన ఆంధ్రభాష కెన్నెన్నియో నూతనశబ్దముల నిచ్చినవి; నూతన రచనాపద్ధతులను జూపినవి. వీనికి వలసిన రచనాసూత్రములే నేడు పనికివచ్చును గదా! వెనుకటిసూత్రములు నేడుసంకెలలే యగునుగదా! తాతలు తొడిగివిడిచిన లాగులు, అంగీలు మనకు నేడు సరిపడునా? ఛందస్సూత్రములు మధుర వ్యక్తీకరణమునకే ఉద్దేశింపబడినవి. Harmony, Rhythm, Symphony లను వ్యక్తపఱుచు పదసంయోగసృష్టికి అవలంబనీయములగు నూతన ఛందోనిబంధములను రామమూర్తి ప్రభృతులు నిర్మింపవలెను. నవరభావమునకే సూత్రము లేర్పఱుపగల మహామనీషి కీకర్జము కష్టభూయిష్ఠమైయుండదు. అప్పకవీయ సంస్కరణముతో నీతడు మిన్నకొనరాదు. గురజాడ అప్పారావు మొదలిడి వీడిన కర్తవ్యమును గూడ నీతడు కొనసాగింపవలెను. తన ప్రతిభ పండకమున్నె, ఆంధ్రయువకవులకు అక్కరైన ఆదర్శరచనలు దృగ్గోచరము కాకమున్నె ఆతడు దివంగతుడైనాడు కదా! భాషాంగణమందలి నేటి ఖారపాచ్చముల నంతరింపజేయుటకై ఇక శ్రీరామమూర్తి నడుముగట్టవలెను. నిండు కుండలకు భంగన మెందులకుండును? లోపమున్నపుడే ఇవి జీకొనును. ఆగ్రహభావ మీ లోపములను పెంచి పెంపొందజేయును. వీనిని మడియించునవి విశాలదృష్టియు, నౌదార్యబుద్ధియును. కలహ మెందైన కూడివచ్చునేమో కాని సరస్వతిసమ్ముఖమున గాదు. దేవి నారాధించు పవిత్రప్రదేశమున శాంతివీచికలే వలయవలెనుగదా! రాజమండ్రి ఆంధ్రభారతియొక్క పీఠస్థానము. నేడిది రామమూర్తి అచటిభక్తుల గలిసికొనినాడు. భక్తబృంద మాలాపించు ప్రేమగీతికను చెవులార వినవలెనని యావాణి ఆతురంపడుచున్నది.

హిందూమతమువలెనే ఆంధ్రభాషాసతి బిఱ్ఱబిగిసిన సంప్రదాయమందే ఖైదీయైయుండ నిచ్చగింపదు. ఆమె కాలానుసారమైన గతి నపేక్షించు తల్లి. ఈతల్లికక్కరైన గతిమోక్షములు చేకూర్ప నింకను దపించుచో రామమూర్తి కృతకృత్యుడు కాగలడని నాయాశ; అడ్డుగట్టులవలన బహుళయువక హృదయములనుండి పైకి నుబికి రాజాలకున్న కవితాస్రవంతులను వెలువరింపజేసె విశాలాంధ్ర సాహితీ కేదారమున నీతడు కొంగ్రొత్త పైడిపంటలను పండింపగలడని, తెలుగుతోటనందనమున కెన కాగలదని, ఎనలేని హాయలున శోభిలజాలునని ఎంతో ఆశపడుచున్నాను.

భాషోద్యానమున వసంతోత్సవము నెఱప, నూతన జయగీతిక నాలాపింప యువకులెందఱో పరుగుపరుగున వచ్చుచున్నారు. ఎంతోయుత్సాహము జూపుచున్నారు. యువకుడు యాత్రికుడుకదా! వట్టి యుత్సాహము బుడగవంటిదే! ఎంతో తపసు, ఎంతో మననము, ఎంతో నిదిధ్యాసనము, ఎంతో భావనము, ఎంతో అనుభవము, ఎంతో పరిజ్ఞానము, ఎంతో యోపిక, ఎంతో తితిక్ష, ఎంతో పట్టుదల, ఎంతోభక్తి ఈ యుత్సాహమునకు తోడుపడవలెను. అపుడు గుండెయం దడగియున్న సహజశక్తి సహస్రముఖముల నాత్మప్రకాశ మొనరించుకొనగలదు షెల్లీప్రభృతుల సామగ్రిని, వంగగాయకుల సరుకును పట్టిప్రాకులాడు టొప్పకాదు. సాహితీసృష్టి కనుకరణమే కూడదుకదా! ఈశ్వరుని ఎంగిలియైనను ఎంగిలియే!

ఆంధ్రభాషాంగణమున నచిరములో సంపూర్ణ సంస్కరణము గోచరించినగాని ఇపుడిపుడు మొలకలెత్తు ప్రతిఘాతకరము మడియును; పారితోషికములందు చెత్తయే వృద్ధియగును; పరిశీలనా శక్తి నెఱుగనివారికిదియే యొజ్జబంతి యగును; తన దుర్గంధము నిది భావియుగములకుగూడ బుత్తెంచును; సభ్యజగతియం దాంధ్రభారతికి నగుబాటు దెచ్చును. ఆధునిక విద్యావిధానమున పరివర్తనము కలిగినగాని ఈ సంస్కరణము తల సూపనేలేదు.

ప్రపంచమందలి దూరప్రదేశములకు నేడు సన్నపడసిన వృద్ధికతన దగ్గఱిచుట్టఱికము కలిగెను. Radio, Trunk telephone ల కతన నొకేయగారమందలి వ్యక్తులవలె భూగోళవాసులు ప్రసంగించుకొనుచున్నారు.

వాయువిమానములు దైనికజీవనమున రాయబారులైనవి. వార్తాపత్రికలు వృద్ధినందుచున్నవి. స్థలకాలములు మిగుల సంకుచితములగుటచే నేకకుటుంబస్థులవలె భువనభావములు కదలుచున్నవి. ఈ భావసంపర్కమునుండి ఏజాతిగాని, ఏసాహితిగాని తొలగిపోజాలదు. ప్రపంచవిద్యావిధానమున మార్పుతోచినగాని మన విద్యావిధానమందును ఇది గోచరింపదు.

నేడైరుఖండముల నేలుచున్నది సైన్సు నర్ధాంగి గావించుకొనిన యూరపుఖండమే! మనుష్యాభ్యుదయమునకై కాక, మానవకల్యాణమునకై కాక, మారణహోమమునకే నేడు సైన్సు వినియోగపడుచున్నది. ఐరోపాఖండమునుండి వెడలు విషవాయువులే నేడచటి విద్యావిధాన మెట్లున్నదో, భావసంచలన మెట్లున్నదో చెప్పకచెప్పుచున్నవి. ఆత్మశక్తి ఇంచుమించుగా నందుండి నేడంతర్ధానమైనది. ఆత్మశక్తి సముద్భవసారస్వతమునకుగాని, ఆత్మశక్తి సందీప్త జీవనమునకుగాని అందు స్థానమేది? అందివెట్లుగోచరించును? పరంజ్యోతిని భావమున నిలుపుకొని దాని వెలుగున కళ నుపాసించువారేరి? వెలుగురేకలను రచనాపంక్తుల గావించుకొని ఆలోకప్రదీప్త గ్రంథముల నవని కర్పించు నానందవ్రతు లేరి? సైన్సే అన్ని హక్కులను పడయుటచే, శరీర మానసములే వృద్ధినందుచుండ, Spirit ఆదరమందక ఆకలిబాధకు లోనై కృశించుచున్నది. జిజ్ఞాస అడుగంటినది. Spirit of Inquiry ఎందో అంతర్హితమైనది. మనుష్యత్వము గజగజలాడుచున్నది. విషము ముకుటధారియైనది. నైసర్గిక ప్రతిభ తలయెత్తకముందే అంతరంగమునుండియే ఎందో తరలిపోవుచున్నది. స్వతంత్రశక్తి ప్రయోగములేనిదై, ప్రయోజన రహితమై త్రుప్పుబట్టుచున్నది. సహజశక్తి అవివాహితయైన అందకత్తెవలె తన బ్రదుకును వ్యర్థము గావించుచున్నది; ఆ భాగినియైన వితంతువువలె తన సోయగమును మిత్తికి గోరుముద్ద గావించుచున్నది. హృదయసంపదను మేధాశక్తి కాలిక్రింద నొక్కిపట్టినది!

ఈ దోషములను కేవలము విశ్వవిద్యాలయముల తలలకే కట్టరాదు. కలుష వాతావరణమున మునిగి అవి కలుషితము లగుచున్నవి. విశ్వవిద్యాలయములందు జొరబడక, అందలి లోపములను గుటుక్కున మ్రింగక బాగుపడితినని బెర్నార్డ్ షా తెలుపుకొనుచుండును. ప్రపంచమహాపురుషులలో నీతడగ్రగణ్యుడని కొంతకాలమునకుమున్ను ఆంగ్లేయులు పాణింధమము మ్రోగించి పలికిరి. తాను షేక్స్పియరుకంటె ఘనుడనని బెర్నార్డ్ షా తెలుపుకొనుచుండును. తన పాదములకు వందనమునుకొనుటందే నేడీతడు విశేష సమయమును వ్యయమొనరించుచున్నాడు. ఈతనికి అద్భుతమైన మేధాశక్తి యుండుట నిక్కమే! కాని ఆనందవ్రతుని మ్రోల నుండవలయు దివ్యజ్యోతి యెట్టిదో ఈతడెఱుగడు. మనుష్యమహత్త్వముపై నీతనికంతగా విశ్వాసములేదు. ఈతనిరచన లాత్మసముద్భవములు కావు; అవి మేధశ్శిఖరమునుండి దొరలిపడిన శిలలు. మణికాంతిగాని, ఉడుగమిగాని, దివ్యదీపకళికగాని కన్నుపొడుచుకొనినను వానిలో కానరాదు. హెచ్. జి. వెల్స్ దృష్టి జ్యోతిపై గాక ఆటవస్తువులపై ప్రాలియున్నది. హార్డీయనుడు, జయున్ అనుడు, చెస్టర్టన్ అనుడు, కిప్లింగనుడు ఆత్మదీపికపై జిజ్ఞాసాపూరితమైన చూడ్కి నిలిపి సారస్వతోపాసనమునకు గడంగి రనుట కెట్టి నిదర్శనములును కానరావు.

తమసారస్వత మిట్టిస్థితిలోనున్నను, దీనితో నవినాభావ సంపర్కమున వరలుచున్న తమ నాగరకత నేడు వికృత నృత్యము సలుపుచున్నను, తమ విద్యావిధానమును గురించి, తమవిద్యా ప్రచార మహత్త్వమును గురించి పెద్దకబురు లుచ్చరించు ఆంగ్ల విద్వాంసులు లేకపోలేదు. మహారాజశ్రీ రస్సెల్ గారి మాటలు చిత్తగింపుడు. "Men trained under Dr. Keate and similar pedagogues made our England what it is and extended the blessings of our civilization to the benighted heathen in India and Africa. I do not want to belittle this achievement" (Vide pages 30 and 31 "Education and the Social Order" By Bertrand Russell.) "Benighted heathen" అను ముక్క అసలైన కారుకూత. తన జయభేరియందు లెక్కకుమించినచిల్లులున్నవని ఈతడు గుర్తించుట పాడి.

కాని ప్రాచీన సభ్యతకు, భారతమహత్త్వమునకు జోహారనుచుండు సత్యవ్రతులు నేడును కొలదిమంది ప్రతీచీ ప్రపంచమున లేకపోలేదు. వీరిలో ముఖ్యుడు రోమెయిన్ రోలండు. భారతావనినుండి రివ్వురివ్వున వీచు విజ్ఞానవాతూలమున కీతడు నిజహృదయము నొడ్డినాడు. కావున నందలి ప్రతిభావల్లి పులకితయై ఊగాడి, చక్కని ననలను ప్రేంచి సాహితిపై జలజల రాల్చినది కావున నది పరిమళప్లావిత మైనది. ప్రపంచశాంతికై, ప్రేమ సామ్రాజ్యస్థాపనమునకై ఈ మహాత్ముడు తపించుచున్నాడు ఆత్మనారాధించు మహాపురుషుడు కావుననే ఈతడు రామకృష్ణ రవీంద్రులకు, వివేకానంద గాంధిమహాత్ములకు భక్తి సమాంజలిని సమర్పించుచున్నాడు. విషవాయువులందును, కారుపొగలందును భావబంధురములైన ఈతని పలుకులు నేడు అగ్గిలోదుముకు పూలరేకులట్లు రాలుచున్నవి.

అనలమందు లంఘించినను సుందర భావము మాడునది కాదని కదా తెలుపుచుందును. పతివ్రతయైన సీమంతినీచూడామణి రజని నిది స్వీయమహత్త్వమును ప్రకటించుకొనగలదు.

సుందరభావము జగన్మోహినిబోలునది ఇదియుండు నెలవున (అది కళాజగతిలోనిదైనను, మనుష్యజీవనాంగణమందలిదైనను) నానందము గంగాభవానివలె పొంగి పొరలును. దీనికతన నెన్నో పూవులు పూయును; ఎన్నో పండ్లు పండును సూర్యకిరణము సోకినపుడు అంధకార మంతరించునట్లు, సుధాబిందువు రాలినపుడు దుర్గంధము చచ్చి నిరయమును చేరు లీల, సద్భావము (సుందరభావమే సద్భావముకాదా?) విరాజిల్లినపుడు కుత్సితంపు టూహలు మంటబడిన మిడుతలవడువున దగ్ధమగును. జగదీశుడును, పిశాచమును ఒకే తావలమున కాపురముండరు స్వర్గ నరకములు ద్విపదపంక్తులపగిది కలసి మెలసి చరింపవు. పాపపుణ్యములు సౌందర్య మాధుర్యములమాడ్కి, పవిత్రదంపతులపగిది నొకేశయ్యపై వెలయజాలవు. సద్భావమున్న స్థానమే బృందావనమని పిలువబడును. ఇది జగదీశున కాటపందిరి కాదా?

సద్భావముయొక్క కటాక్షమునందవలెననిన ముకుళితమైన హృత్సరోజము ఆత్మకవాటమును తెరచుకొని జగదీశుచరణములను నాహ్వానింపవలెను. ఊరక నీశ్వరనామము నుచ్చరించినంతన నాతడు కదలిరాడు. వేయియేండ్లు శ్రమించి, గజేంద్రుడు ఆవేశనాదగ్ధహృదయుడై అఱచినపుడే కదా "సిరికిం జెప్పక, శంఖచక్రయుగముం జేదోయి సంధింపక" పరుగు పరుగున బోయి, జగదీశు డాతని జేరుకొన్నినా

## శ్రీ లక్ష్మీనృసింహ ఆయుర్వేద వైద్యశాల

డాక్టర్ బృందావనం వెంకటనారాయణాచార్యులు, (కూచిపూడి - కృష్ణా)

### వంధ్యాకల్పతరువు రసము

సంతానముకొరకు చింతనొందు దంపతుల పాలిటి వరప్రసాదము. స్త్రీలకు సర్వసాధారణముగా నుండు శ్వేతకుసుమ ఋతుబద్ధము గర్భాశయమునందు నొప్పి, కాళ్లతీపు, నడుమునొప్పి, తలనొప్పి, దేహబలహీనత మొదలైన వ్యాధులను త్వరలో మాన్పి గర్భోత్పత్తి కలుగజేయును. అనేకులు వాడి మంచి ఫలితము బొందియున్నారు. వేయేల? ఒకపర్యాయము వాడిచూచిన మీకే దీని మహిమ తెలియగలదు. పోష్టు ఖర్చులు ప్రత్యేకము.

### రణశూలాంతకము

అనాది నుండియు వాడబడుచుండిన సుప్రసిద్ధ ఔషధరాజము. వేహ్రణములు, రాచకురుపులు, లూతలు, మచ్చలు, సవామేహ, శుక్రమేహములు, గనేరియా జిగ్గించుటవలన కలిగెడు వ్రణములు యిత్యాది వ్యాధులను హరింపజేయుటయందు దిది సంజీవి వంటిది. పోష్టు ఖర్చులు ప్రత్యేకము.

### మదనోల్లాసిని

దీని సేవచే గనేరియా సవామేహాములవల్లను, అధిక సంభోగమువల్లను, యింక యితర విషయములైన దురభ్యాసములవల్లను, కలిగిన శుక్రదోషములను బోకడచి అత్యల్పమువల్ల నీరైన శుక్లమును గట్టిపరచి శీఘ్రస్ఖలనమును తగ్గించి సంభోగశక్తిని వృద్ధిపరచును. పోష్టు ఖర్చులు ప్రత్యేకము.

కోరినవారికి మాచే తయారుకాబడిన ఆయుర్వేద ఔషధముల కేటలాగు పంపబడును.

---

## ది నార్తరన్ యిండియా యిన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్., లాహోరు.

హిందూదేశములో నిది యొక్కటే ప్రమాదముల భీమా కంపెనీ.



కల్నల్ సి. ఆర్. బఖలే, ఐ. ఎమ్. ఎస్ (రిటైర్డ్) చేర్మన్.

హెచ్. డి. మెహతా మేనేజింగు డైరెక్టరు.

ఆంధ్రరాష్ట్రమందంతటను ఏజెంట్లు కావలెను.

అభివృద్ధికి మంచి అవకాశములు గలవు.

**టి. హెచ్. రాఘవేంద్రరావు**

బ్రాంచి శెక్రటరి, ట్రిప్లికేన్, మదరాసు.

---




## మోటారు సైకిలు

# I. H. P.

గ్యాలనుకు 180 మైళ్లు.

పెద్దమూడల్సు గూడ గలవు.

**BYRAMSHAW & Co., MADRAS.**

గుంటూరు-యువజన-మహాసభ-అధ్యక్షులు : హెచ్. డి. రాజా



ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజెంట్ల తృతీయమహాసభ, గుంటూరు

పశ్చిమకృష్ణామండల రాజకీయమహాసభ, బెజవాడ అధ్యక్షురాలు : శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి



ఆంధ్రరాష్ట్ర సామ్యవాద మహాసభ-కార్యనిర్వాహకవర్గము, ప్రతినిధులు

డు. మనసులోని మొసలి అవలీలగ చచ్చునా? ఈనక్రము దురంతమైన క్రౌర్యము గలదికావునసే, మనుష్యహృదయముయొక్క సహజమహత్త్వము నంతగానుగ్గడింపక, క్రైస్తవమతము మానవుడు సహజముగ పాపియనిచెప్పి పొరపడినది. మనుష్యమానసము దివ్యప్రాపమైననేమి, అందు చేరుకొనిన మకరమును చంపుటకై నరుడు విశేషతపసు జేసినగాని, శంఖచక్రధారియైన భావముయొక్క కటాక్షము నందజాలడు. దీని నీతడందిన శుభముహూర్తమున దిక్కామినులు మంగళగీతిక నాలాపింతురు; జయభేరిని మ్రోగింతురు. అంతరిక్షము నుండి కుంభవృష్టిగ వెలుగువాన కురియును. తనివార నీదినుర్కులను గ్రోలు కువలయము ఎన్నెని పైపైపెరుల నీనును పిట్టలట్టు లెన్నో యుగములు వానిపైవ్రాలి కడుపార దివ్యాహారము గొనును. ఇష్టదేవతనుజూచి తన్మయనృత్యమొనరించు పరమహంసవలె, ప్రాణపతిని పరికించి పులకితాంగి యగు పతివ్రతపగిది, కమలాకరమును కాంచి అనంతప్రమోదమందు నంచపిండువడువున, అందకాడైన తపసిమ్రోల నాట్యమాడు దేవనర్తకిలీల, ఆవేశభరిత ముహూర్తమున కవిరసనమున దేలియాడు మధురోక్తులమాడ్కి, తేనెతుంపురులు గ్రోలి ఆత్మవిస్మృతినంది పూరేకులపై చిందులు త్రొక్కు తేటిగుంపులట్లు, ముద్దుమోముచూచి భావోద్వేగమున చెక్కిలిచేరు అధరోష్ఠముల చాడ్పున, హృద్వీణనుమీటుచు సంతససంచలన మందిన గిరికయంగుళుల కగణి, గిరికంపరములందు కడలేని హాయినింపు వరూధినీ కలస్వనముకైవడి, కాసారతల్పము మీది నగుమోము నాళీకముదెసకు కవినేత్రముల నుండి కడువడిగ పరతెంచు దృగిందిందిరముల చందమున సద్భావస్పర్శనందిన మనస్స్వాంతరంగము ప్రమోదసంభరిత మగును.

భావకరుణ నందుటకై ఆంధ్ర జిజ్ఞాసువునే డెంతో తపసు చేయవలెను. పాశ్చాత్య నాగరకత, దోషభూయిష్ఠ విద్యావిధానము, సముచిత సంచలనాభావము, చలనరహిత సంప్రదాయము, రాజకీయ సాంఘికార్థిక కష్టపరంపర సంఘీభావరాహిత్యము, ఛాందస నిరంకుశత్వము మున్నగు ప్రతికూలశక్తు లెన్నో ఈ యాత్రికుని మార్గ్కొనుచున్న నేమి, సజీవ సందీప్త సంప్రదాయారాధకులై, ఉత్కృష్టశేయ బోధకులై, ఆదర్శ కళోపాసకులై, బహుగుణమండిత జీవులైన రవీంద్రాదులు భావనాయకులై, సాంద్రతమసముంజలి దీపావళివలె నేడును కట్టెదుట దోచుచుండుటచే నాంధ్ర జిజ్ఞాసువుగాని, మఱే యాత్రికుడుగాని నిరాశజెందరాదు. ఈభావనాయకు లీశ్వరసందేశమును వసుంధరయందు ప్రచారమొనరింప నపుడపు డవతరించు రాయబారులు. వీరివాక్కు లీశ్వరవాక్కులు. కాలవియత్తలమున నివి సదా ప్రతిధ్వనించుచుండును. తొల్లింటివయ్యు, నిత్యము ప్రతిగోచరము లగుచు డుటచే, నివి నిత్యనూతనములు. వీనికి వీనులొడ్డిన సారస్వతములు సౌందర్య సంశోభితము లగుచుండును. వీనిని గ్రహించిన జీవనములు సత్య సందీప్తము లగుచుండును.

తఱచుగ నీ భావనేతలు భారతావనిలోనే యుదయించుట మన భాగ్యము. ఎల్లయుగములందును భారతవిజ్ఞానమే, భారతప్రబోధమే, భారతకళయే, భారతసభ్యతయే, భారత జీవనమే, భారతదృష్టాంతమే సమస్త భూవలయమున నిత్యశృంగార నిత్యసౌందర్య నిత్యతేజ నిత్యానందములచే నిండించి, ఈశ్వర సామ్రాజ్యమునందు నెలకొల్పును గదా!

“యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్.”



# పది ప్రశ్నలు

అలెగ్జాండరుకును ప్రాచీన హైందవ తార్కికులకును జరిగిన సంవాదము
గొబ్బూరు
వెంకటానంద రాఘవరావు

అలెగ్జాండరు మహా మహుడు దిగ్విజయము చేయుచు హిందూదేశముపై దండెత్తివచ్చి, పురుషోత్తమునితో జీలమ్‌నదీతీరమున పోరి, భరతవీరులధైర్యపరాక్రమముల చవి చూచినపిదప అతని సైన్యములు ముందునకు పోనొల్లకుండెను. అందు కాతడు వారితో విచారించి, తూర్పుగా మగధదేశముపై వెడలు ప్రయత్నము చాలించుకొని దక్షిణముగా సింధుసముద్రతీరమునకు వెడలుచుండెను. మార్గమున మహావీర్యవంతులగు మల్లనాయకులు అలెగ్జాండరు నెదుర్కొని మహాహవము చేసిరి. వారి కోట లగ్గలుపట్టుదమని అలెగ్జాండరు కొందరుసైనికులతో నిచ్చెనమెట్లెక్కి గోడమీదకు వచ్చెను. అంతలో నిచ్చెన విరిగి ముక్కలైపోయెను. మల్లనాయకులు శరవర్షము కురిపించిరి. గోడమీద నిలువనోపక అలెగ్జాండరతిసాహసముతో అటనుండి క్రిందకు దుమికెను. అతడు చూపిన నిరుపమ ధైర్యసాహసములకు మల్లనాయకులు మెచ్చి, నివ్వెరపడి ఒకక్షణ మట్లె స్తంభించి నిలిచి, పిమ్మట నాతనిపై బడి బాహాబాహి పెనగజొచ్చిరి. అలెగ్జాండరెంతనేర్పుగా పోరినను, మల్లశూరుల కత్తి నరుకులకును, ఈటెపోటులకును జంకెను. అతని కవచము తూట్లుపడెను; శరీరమునకు గట్టిగా దెబ్బలు తగులుచుండెను. దూరమునుండి ఒకవిలుకాడు ఆకర్ణాంతము దిగిచి అద్భుతలక్ష్యముతో ప్రయోగించిన దారుణశర మొకటి అతనికవచమును భేదించి, ప్రేగులదిగువ గర్భాశయమున లోతుగా చొచ్చి నిలిచెను. ఆదెబ్బ కతడు చలించి, మోకాలూది పడెను. అతనికి తోడ్పడవచ్చిన గ్రీకుయోధు లిరువురిలో నొకనిని మల్లనాయకులు చంపిరి. రెండవవానికి బలమైన గాయములు తగిలెను. అంతలో తెప్పిరి, అలెగ్జాండరొక మల్లయోధుని నేలగూల్చెను. ఆలోన నతనికి మరికొన్ని దెబ్బలుతగిలెను. అయినను తూలిపడిపోకుండ అతడు కోటగోడకు వీపుచేర్చి ఆనుకొని, మల్లయోధుల కెదురై నిలబడియేయుండెను. అప్పటి కాతని సైనికులు పరుగునవచ్చి, అతనిని పట్టుకొని క్షేమముగా శిబిరముచేర్చిరి.

అతనికి శరీరముమీద స్మృతి తప్పెను; చనిపోయినాడని సేనలో కింవదంతులుకూడ బయలుదేరెను. అతని గర్భాశయమున చొచ్చిన శరము దారునిర్మిత మగుటచేత వెలుపలనున్న భాగమును శస్త్రచికిత్సకులు రంపముతో మెల్లగా, నేర్పుగా కోసివైచిరి; అతి ప్రయాసముతో కవచమును దేహమునుండి వెడలించిరి; ఇక లోపల గ్రుచ్చుకొనియున్న అలుగుమొనను ఊడదీయవలసియున్నది; లోపలిమొన మూడు వ్రేళ్ల వెడల్పున, నాలుగువ్రేళ్లలోతున ఎముకలోనికి దిగబడియున్నందున దానిని పైకి తీయుట శస్త్రచికిత్సకులకు మిక్కిలి కష్టసాధ్యమయ్యెను. చికిత్సకు లామొన వెడలించునపుడు అలెగ్జాండరు గాఢమూర్ఛలో మునిగి చచ్చినంతయై, పులినోటిలోని కండవలె మృత్యుముఖము వెడలివచ్చి బ్రతికిబైటపడెను.

ప్రాణముల కపాయము తప్పినను అతడు బహుదినములు అతినీరసస్థితిలో నుండి, జాగ్రత్తగా పథ్యపానములు పుచ్చుకొనుచు, వ్రణము మాన్పుకొనుటకు ఏకాంతముగ నొక్కడును మంచముపై పడియుండెను. ఇంతకాలము ప్రభుని చూడకుండ సైనికులు ఎప్పుడును ఉండలేదు. రాజదర్శనార్థము యోధులందరును అతడున్న శిబిరమును చుట్టుముట్టి అల్లరిచేయసాగిరి. ఆసంగతి తెలుసుకొని, వారి యాతురత మాన్పువాడై అలెగ్జాండరు వదులుగా దుస్తులు ధరించి సేనలకు దర్శనమిచ్చి దేవపూజ చేసి, మరల ఏకాంతమునకు జనెను. సైనికులు తృప్తిపొందిరి.

మల్లయోధులను ఇట్లు తనపై యుద్ధమునకు పురికొల్పి ఇంతమట్టుకు తెచ్చినవారు తత్త్వవేత్తలైన బ్రాహ్మణవిద్వాంసు లని అలెగ్జాండరునకు తెలియవచ్చెను. ఆవిద్వద్బృందములో ఎన్నికగన్న తార్కికుల నొక పదిమందిని వెంటనే అలెగ్జాండరు తన సముఖమున కాహ్వానించెను. వారు వచ్చినపిమ్మట తాను వారిలో నొకొక్కరి నొకొక్క ప్రశ్న

చొప్పున పదిప్రశ్న లడిగెద ననియు, ఆ ప్రశ్నలకుఒక్కొక్కరే జవాబులీయ వలయుననియు, తనప్రశ్నలకు సరిగా జవాబులు చెప్పలేనివారిలో అధముని మొదట చంపించి, పిమ్మట తక్కిన వారిని చంపెంతుననియు నతడు సమయము చేసి, వారిలో వయోవృద్ధు నధ్యక్షుని చేసెను. పిమ్మట నతడు తన కఠినకఠినము లని తోచిన యీ క్రింది ప్రశ్నలను వరుసగా నడుగుచు రాగా విద్వాంసు లొక్కొక్కరే తగిన జవాబు లిచ్చుచువచ్చిరి.

1. చచ్చినవారా, బ్రతికియున్న వారా అధికసంఖ్యాకు లెవరైయున్నారు?

బ్రతికియున్న వారే అధికసంఖ్యాకులైయున్నారు. చచ్చినవారు లేనే లేరు కనుక వార లున్నవారు కాజాలరు.

2. జంతువులన్నిటిలో మిక్కిలి పెద్ద జంతువులు భూమిమీదివా, సముద్రములోనివా?

భూమిమీదివే. ఏమనగా సముద్రమునుదిగువ భూమి ఉన్నది. సముద్రము భూమిమీద ఒకభాగము. కనుక సముద్రపుజంతువులు కూడ భూమిమీదివే అగుచున్నవి.

3. జంతువులన్నిటిలో ఏజంతువు తాను వంచింపబడక ఇతరులను వంచింపగలతెలివి, కొంటెతనము, పెంకెతనము కలిగియున్నది?

దేనిస్వభావము మనుష్యుడింకను సరిగా తెలిసికోలేకున్నాడో, దేనినైసర్గికతత్త్వము మానవునికి దురవగాహముగా నున్నదో ఆజంతువే (అనగా మనుష్యుడు; ఆత్మవివేకము దురవగాహమని ధ్వని).

4. మామీద యుద్ధమునకు ఆయోధులను మీరేల పురికొల్పినారు?

వీరులైనవారు పగర గెల్చి గౌరవముగా జీవించుమని, లేక కీర్తికరమైన రణక్షేత్రమున చచ్చి, ఒక్కమారే భయముబారినుండి తప్పించుకుని సుఖపడుమని యుద్ధమునకు పురికొల్పినాము.

5. ఏది ముందు? పగలా, రాత్రియా?

పగలే-ఒక దినము ముందు; రాత్రే-ఒక రాత్రి ముందు.

"ఎందుచేత" అని అలెగ్జాండరు కారణమడుగగా "అగ్రాహ్యప్రశ్నకు దుర్గ్రాహ్యప్రత్యుత్తరమ" అని తార్కికుడు మారు పల్కెను.

6. జనానురాగము పొందుటకు మేలుమార్గ మేది?

నీవు బలవంతుడవై అధికారము కలిగిఉన్నప్పుడు నీవు జగద్భయంకరుడవు కాకూడదు. అట్టివేని నీవు మిక్కిలి ప్రజానురాగము పొందగలవు.

7. మనుష్యుడు ఏలాగు దేవుడు కాగలడు?

మనుష్యమాత్రునకు సాధ్యము కాని ఘనకార్యము చేయుటవలన.

8. దేనికి బల మెక్కువ? జీవమునకా, మృత్యువునకా?

నిస్సందేహముగా జీవమునకే; ముమ్మాటికి జీవమునకే బల మెక్కువ. ఏమనగా, ఇన్నికష్టముల కోర్చి నిత్యమును ఇంతమందితో ఇన్నివిధముల పోరిపోరి ధైర్యముతో నిలబడునది జీవమే గనుక.

9. మనుష్యుడు ఎంతకాలము జీవించియుండుట మంచిది?

"ఇక బ్రతుకకూడదు; చచ్చిపోతే చాలు-బాగుండును" అనిపించేవఱకు బ్రతుకుట మంచిది.

అప్పుడు అలెగ్జాండరు అధ్యక్షునివంక తిరిగి "ఏమండీ! వీరి జవాబులను గూర్చి మీ అభిప్రాయ మేమి?" అని అడిగెను.

అధ్య—ఛీ ఏమీ బాగులేవు. నన్నడిగితే వీరు ఒకరికంటె ఒకరు పాడుజవాబు లిచ్చినారని నేను చెప్పుచున్నాను.

అలె—అలాగైతే మిమ్మల్నే ముందు కడతేర్చవలసి ఉంటుంది.

అధ్య—అలాగు చేస్తే మీనిర్ణయమునకు స్వవచన వ్యాఘాతదోషం కలుగుతుంది. చూచుకోండి.

అలెగ్జాండరు మహామహుడు వారి ప్రజ్ఞకు మిక్కిలి ప్రీతుడై వారల నందరను తగువిధమున బహూకరించి వీడ్కొల్పెను.

ఈ ప్రశ్నోత్తరములు జరిగి ఇప్పటికి రెండువేలరెండువందల సంవత్సరములకు పైగా అయినది. ఈ నాటి తత్త్వవేత్తలును, వైజ్ఞానికులును ఈ ప్రశ్నల కింతకంటె మంచిజవాబులు చెప్పగలరా?

* * *

మిలేటస్‌లో నివసించుచుండిన మహాతత్త్వవేత్తయగు ఒక ఋషిసత్తమునకు కొందరు కొంటెతార్కికు లిచ్చిన ప్రశ్నలును, అతని జవాబులునుగూడ ఈ సందర్భమున మనము గమనింపతగియున్నది.

1. వయస్సున నన్నిటికంటె పెద్ద దని చెప్పదగిన దేది ?

భగవంతుడు. భూతభవిష్యద్వర్త మానములను త్రికాలములందును శాశ్వతముగా నుండువాడతడొక్కడే.

2. సమస్తవస్తువులలో మిక్కిలి సొగసైన దేది ?

విశ్వమే. విశ్వముకంటె సొగసైనది భగవంతుని సృష్టిలో మరొకటి లేదు.

3. సమస్తవస్తువులలో గొప్ప దేది ?

ఆకాశము. సృజింపబడిన సమస్తమును అందు ఇమిడియున్నది.

4. అన్నింటిలో చెడక నిలుచున దేది ?

ఆశ. మనుష్యునికి తక్కిన వన్నియు పోయినను ఆశమాత్రముపోదు.

5. అన్నింటిలో మంచిదని చెప్ప వలసిన దేది?

సత్ (Virtue) అది లేనిదేదియును మంచిది కాజాలదు.

6. అన్నింటిలో వేగవంతమైన దేది ?

యోచన. అది ఒక క్షణములో ఎంత దూరమైనను పోగలదు.

7. అన్నింటిలో బలవత్తరమైన దేది ?

అవసరము. అవసరమును బట్టియే మనుష్యుడెంతటి అపాయముల నైన నెదుర్కొని పోరుచున్నాడు.

8. అన్నింటిలో సులభమైనదేది?

ఒకరికి సలహా చెప్పుట.

9. అన్నింటిలో కష్టమైన దేది?

తన్ను తాను తెలిసికొనుట. ఆత్మ వివేకము.

# శ్రీ మేనక నృత్యము

కొమాండూరి వేంకటాచార్యులు

౧. మేలిమి బంగరుసొగసూ
మనసున కింపగు సొబగూ
మేళతాళములు
మేళవించగా
కాళ్ల గజ్జియలు
* కదలియాడగా
చేసింది
* * మేనక నృత్యముచేసింది.

౨. రాధికప్రణయము చూపింది
రసికుల హృదయము కరిగింది
ముఖకమలంబున
జిరున వ్వొలయగ
జంత్రగాత్రములు
* చెరగిబారగా
చేసింది
* * మేనక నృత్యము చేసింది.

3. రాగరాగిణుల రక్తిగ గొల్చింది
భక్తిభావముల *మీరను మించింది
మననాగరికత
తారలు మీటగ
* మీరాబాయి. ఖండాంతరముల
* ఖ్యాతిగడించీ
పోసింది
* * విద్యకు జీవము పోసింది.



సంతర్పణ

— మరింగంటి సీతారామాచార్యులు —

శ్రీషేణనరేంద్రుఁడు చాలకాలము
ప్రజారంజకముగఁ బరిపాలన మొనర్చి
యైహికభోగములపై విరక్తి గలిగి
పుత్రుని సింహాసనాసీను గావించుచు
నీయమూల్యోపదేశము నొసంగెను.

# ఉపదేశము

దివాకర్ల వేంకటావధాని

(వీరనంది సంస్కృతమునుండి)

వ్యయశీలుఁడవుగాక దుర్జనవచోవ్యాసంగము ల్మాని దు-
ర్ణయవృత్తిన్ దిగఁద్రావి యేలుకొనుమీ రాజ్యం బికన్ భాస్కరో
దయమున్ గాంచుచుఁ జక్రవాకములు మోదం బందునట్లే త్వదు-
చ్ఛ్రియమున్ గాంచుచు నుండఁగావలెఁ బ్రజాసామాన్య మెక్కాలమున్.

చారులవల్ల నీ వఖిలసంగతులన్ బరికించుచుండి దు-
ర్వారుల నెల్లశాత్రవుల బాహుబలంబున నుక్కడంచుచున్
గోరిన కోర్కె లన్ని సమకూర్చుకొనందగు నెల్లకాల మీ
చారులె భూమిపాలురకుఁ జక్షువు లంచు నెఱింగి పుత్రకా!

సంపదలు లేక రాజ్యమే సమసిపోవుఁ
గానఁ దత్సంగ్రహార్థమై కడఁగవలయు
నైన నీరాజ్యమం దున్నయట్టి ప్రజల
బాధపెట్టంగవలదు లవమ్ముగూడ.

నీతివిదు ల్వచింతు రది నిశ్చయ మెందుఁ బ్రజానురాగమే
హేతువు సర్వసంపదల కెమ్మెయి నద్ది నశించుపట్ల స-
ర్వాతిశయప్రతాపుఁ డగునట్టి నరేంద్రుని రాజ్యమైన వి
ఖ్యాతికిఁ దక్కి నాశనము నందు విపత్తుల కెల్ల నెల్లయై.

జనులు విధేయులై నెగడఁజాలుటయే సుఖ మిచ్చు భూమిపా-
లునకు భృశమ్ము, వారల విరోధమె దుఃఖపరాభవమ్ములన్
మునుకొనఁ జేయుచుండు, సుఖమున్ గనఁగోరి కృతజ్ఞుఁడేని భూ
జను లనురక్తులౌదురు విశాంపతియం దని నమ్ము మాత్మజా!

సర్వసుగుణంబులన్ గృతజ్ఞత నయంబు
రాజ్యసంపత్ప్రసక్తికి రాజునకును

ప్రజయె ప్రాణంబు గావునఁ బ్రజలయందు
మనుజవిభుఁడు కృతజ్ఞుఁడై మసలవలయు.
అవనిభర్త త్రివర్గమ్ము నర్థకామ-
ములకు ధర్మమ్మునకుఁ బోరు కలుగకుండ
నడుపుకొనఁజాలెనేని యేల్బడికి నేమి
యిహాపరంబుల రెండిటి నెనయఁగలఁడు.

గురువుల వాక్యసారమును గ్రోలుచు వారి యనుజ్ఞమీఁదనే
తిరిగెడు భూమిపాలునకు దేవవిభున్ బురుడించు సంపద
ల్వారలుఁ; బ్రమాద మబ్బ నలువంకలఁ దద్వ్యతిరేక మైనచో,
నలమట లేక నీవు వినయంబున వారలఁ గొల్వు మాత్మజా!

చేయుకార్యములు ఫలంబుచేతనే బ-
హిర్గతంబులు గావలె నింకఁ బరుల
యత్నములు ముందుగాఁ దెలియంగవలయు
నట్టిరాజు విరోధుల యగఁడు వడఁడు.

నీగతినే చరించెడు వినీతులు భృత్యులు లేనిచో భవ-
ద్యోగము తారుమారగు సుతుండ! ప్రజావనదీక్ష లేని యు-
ద్యోగుల సర్వదా తొలఁగఁ ద్రోయుటయందు నొకింతయేనియున్
జా గొనరింపఁగాఁ దగదు సర్వవిధమ్ముల వారె శాత్రవుల్.

నీ ప్రతాప మొకప్పుడు నీరజాప్తు
వేఁడిమి విధానఁ బ్రజలకు వెట్టగలుగఁ
జేయునది యైన వారల సేమమునకె
యుపకరించినచోఁ జాలు నోకుమార!



## ప్రజలకు సేవచేయుటయే మా ముఖ్యోద్దేశము

మేలు రకములు! న్యాయమైన ధరలు!!

### అందమైన సులోచనములు

కంటి అద్దములకు సంబంధించిన పరికరములు సుప్రసిద్ధమైన గికాణము వారిచే పూచీ నివ్వబడును.



మేలురకము సులోచనములు, కంటి అద్దములు ఇచ్చట దొరకును

కంటి అద్దములకు సంబంధించిన పరికరము లన్నిటికిని ముట్టుమొదట మా సలహాను పొందుడు. మావి న్యాయమైన ధరలు. ఒకసారి మావద్ద లావాదేవిచేసిన అన్నియు విశదమగును.

### మెసర్సు విక్సన్ అండ్ కో.,

కంటి అద్దముల వ్యాపారస్థులు, 173, బ్రాడ్వే, మద్రాసు.

---

## వర్ ముంజేతి గడియారము



రు 1-11-0 లు మాత్రమే

5 సంవత్సరములు గ్యారంటీ

స్ప్రింగుతో నెం 2 రు 2-15-0 నెం 1 రు 4-4-0 రేడియం రు 5-0-0 గోల్డుగోల్డు నెం 2 రు 4-8-0 నెం 1 రు 5-8-0 రెక్టాంగ్యులర్ రు 7-8-0 పాకెట్ వాచ్ రు 1-15-0 టైంపీస్ రు 1-11-0 పోస్టుఖర్చులు అణాలు 7 ప్రత్యేకం ఒకేసారి 3 గడియారములు కొన్నచో తపాలఖర్చు ఉచితము.

## దినము రూ 5 లు ఆదాయము



ఈ కెమెరా సాయముతో ఫోటో తీసికొనవచ్చును. పనిలేక కష్టపడుచున్న వారు దీనిమూలమున దినమునకు రు 5 లు సులభముగ సంపాదింపవచ్చును. ఒక ఫిలిం 12 కాగితములు, మందులు, పనిచేయు విధము మున్నగునవి గల పుస్తకము ఉచితము. ఫోల్డింగు కెమెరా రు 4-0-0 లు బాక్సు నెం 2 రు 2-12-0 లు నెం 1 రు 3-12-0 ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము.

TRADING CORPORATION, (A)
10-A, Jorabagan, CALCUTTA.

---

ప్రపంచ ఖ్యాతిగనిన

## బాద్‌షాహి సబ్బు

సువాసనతో కూడినది. ఎల్లపుడు నుపయోగింపుడు

## నవీన రోమనాశని

వెంట్రుకలను రాల్చివేయు రకములలో నీసబ్బు ఒక్కటియే మిక్కిలి శ్రేష్ఠమైనది

నిరుపయోగమైన నమూనాలను జూచి మోసపోకుడు

నాజూకైన టిన్ను పెట్టెలలోగల 3 బిళ్ళల వెల రు. 1-0-0 పోస్టేజి ప్రత్యేకము.

ప్రతిచోటను విక్రయింపబడును.

**C. C. MAHAJAN & Co., Bombay 2**

*Madras Agents:*—J. M. SHETH,
3 Bunder Street, Madras.

# ఈ జాబితానుండి మీ 1937 చిత్రముల నేరుకొని

# నూత్న వత్సర సుఖసంతోషముల బడయుడు

## ప్యారమౌంటు

ది క్రూసేడ్సు
(సెసిల్ బిడిమిల్ ప్రొడక్షన్)
లైవ్సు ఆఫ్ ఏ బెంగాల్ ల్యాన్సర్
(విలి.క డాలక్ ప్రొడక్షన్)
మిల్కీ వే హెరాల్డు లాయిడ్స కామెడీ
మగ్గల్సుయిన్ దిజా(ఆశ్చర్యము,విస్మయము,)
డెవిల్ అండ్ దిడీప్ (గేరీ కూపర్సు ఫిలిం)
డిజైన్ ఫర్ లివింగ్
(ఫ్రెడరిక్ మార్చి & గేరి కూపర్)
మర్డర్ ఎట్ ది వ్యానిటీస్ (మ్యూజికల్)
నన్ అవర్ విత్ యు
(మారిస్ చెవలీర్ & జెనెట్ మెక్డొనాల్డు)
యీగిల్ అండ్ దిహాక్ (ఫ్రెడరిక్ మార్చి)
కడపటి ఔట్పోస్టు (గారీ పిక్చర్)
వాగన్ వీల్సు (వెస్టరన్ త్రిల్లర్)
ఫేర్ వెల్టు ఆరమ్సు (వార్ పిక్చరు)

## వారనర్ బ్రదర్సు

కేప్టెన్ బ్లడు (ఎల్లియన్ డాలర్)
సెంట్రల్ ఎయిర్పోర్టు (ఏయిర్ త్రిల్లర్)
42 వ స్ట్రీట్ మ్యూజికల్
మాయాబజారు (తెలుగు)
పూర్వ పశ్చిమగోదావరి జిల్లాలు.
సావిత్రి (తమిళము)
మిస్ టి. పి. రాజ్యలక్ష్మి.
అహల్యా (తెలుగు)

## కొలంబియా

ఆఫ్రికా స్పీక్సు
జంగిల్ త్రిల్లర్-తిరిగి తీయుబడినది)
బ్లాక్ రూమ్ (బోరిస్-కార్లాఫ్)
డెవిల్సు క్రాస్ లేక రాబిన్ హుడు (ఏక్షన్)
క్రైమ్ అండు పనిష్మెంటు
(పీటరులారి ఏక్షను త్రిల్సు)

ఏ ష న్
త్రి ల్ల ర్స
ఎవెంజింగ్ వాటర్స
(కెన్ మేనార్డు)
ఫర్బిడెన్ ట్రయల్
(బక్ జోన్సు)
స్పీడు వింగ్సు
(టిమ్ మెక్కాయి)
రేంజర్సు రైజన్సు
(బక్ జోన్సు)

ఇవిగాక యింకను 6 సి జార్జిరాజు ప్రోక్లమేషను రీలుకూడ దొరకును.

ఇవన్నియు దొరకుస్థలము:

## జనరల్ ఫిలిం డిస్ట్రిబ్యూటింగు కంపెని,

టెలిఫోన్—4254. 48 ఆర్మీనియన్ వీధి, :: జి. టి. మద్రాసు టెలిగ్రామ్సు—GENFILMS



ప్రేమగీత

మా. గోపాలకృష్ణ గోఖేల్.



౧. దక్షిణభారత హిందీప్రచారసభలో ఆరవవార్షిక హిందీ పట్టప్రదానోత్సవము - స్నాతకోపన్యాసకులు : బాబూపురుషోత్తమదాసు టాండనుగారు. సభ కధ్యక్షతవహించిన గాంధీమహాత్ము డుపన్యసించుచుండుట యిందు కానవగును.



౨. అఖిలభారత హిందీసాహిత్య-సమ్మేళనము, మాంబళం - మదరాసు
(అధ్యక్షుడు : మహాత్మగాంధి—కాకా కలేల్కరు ఉపన్యసించుచుండుట యిందు కానవగును)



3. అఖిలభారత, హిందీసాహిత్యసమ్మేళనము, మాంబళము - మదరాసు
(ప్రతినిధులు, ఉపన్యాసకులు, కార్యనిర్వాహకవర్గము)

౪.- అఖిలభారత హిందీసాహిత్యసమ్మేళనమున పట్టములను బడసిన స్నాతకబృందము
(నడుమ టాండనుగారు కూర్చొనియున్నారు)





౫. హిందీప్రచారస్నాతకోత్సవమునకు అరుదెంచుచున్న మహాత్మునికి వి. భాష్యమయ్యంగారు ఎదురుకోలు పోవుట

౬. బాబూపురుషోత్తమదాసుటాండనుగారికి సెంట్రల్ స్టేషనువద్ద స్వాగతము

౭. శ్రీమతి లీలావతిమున్షీ (తెల్లచీరకట్టినవారు) హిందీప్రదర్శనమును తెరచుట



తెనాలితాలూకా ఈమని గ్రామ శైవసంఘ గణార్చనా సమావేశము

# మనోల్లాసమునకు ధనసంపాదనమునకు

| సుఖప్రదమైన ఉగాది కానుక | బుకింగు | సుఖప్రదమైన ఉగాది కానుక |
|---|---|---|

సినిమా ప్రదర్శకులు త్వరపడుడు.

| మీకు లాభకరమైన సంవత్సరము | ధన పేటిక | మీకు లాభకరమైన సంవత్సరము |
|---|---|---|

మీ టిక్కెట్ల గదులలో కుప్పం కొలది రూపాయలు మ్రోగుచుండును.




## ది న్యూ థియేటర్సు లిమిటెడ్., (కలకత్తా)

ఇప్పుడే బుకింగు చేసికొనుడు.

| | | | |
|---|---|---|---|
| రూపలేఖ లేక | ధూప్ చహాఁ లేక | దులారి బీబీ. | మాయ |
| మొహబత్ కి కసోటి | భాగ్యచక్ర. | నను క్షమింపుడు. Excuse me Sir | ప్రెసిడెంటు |
| డాకు మన్సూరు. | మిలియనీర్ లేక | భోజరాజ (అరవము) | ఇన్ సాంగ్ |
| దేవదాస్. | క్రోర్‌పతి. | దేవదాస్ (అరవము) | ఒక వెన్నెల రాత్రి |

## ది న్యూ థియేటర్సు న్యూ యిండియా ప్రొడక్షన్.
## (కలకత్తా)

కర్వాన్-యే-హయత్. — బ్లడ్ హ్యాండ్ లేక జోసి మై- ఇంటికం.

## కన్వాల్ మూవీటోన్ లిమిటెడ్, బొంబాయి.

క- న్స్-యే-హూర్ — వెయింటెడ్ సిన్ లేక స్త్రీ ధర్మ.

## సుధా పిక్చర్సు లిమిటెడ్, బొంబాయి.

కాల్ కూట్ (కిస్మత్ కి - భూల్)

## స్నేహి ఫిలిం కంపెనీ, బొంబాయి.

హ్యాంలెట్, ఖూన్ కా - ఖూన్.

## ప్రతిమా ఫోటోటోన్, బొంబాయి.

పతీతపావన్ లేక (అహల్యోద్ధర్)

## కొల్హాపూరు సినెటోన్ కంపెనీ, కొల్హాపూరు

జీవిత కీర్తనలు. సంఘు అనాథబిడ్డలు. కాళీయమర్దన్, పుర్మాసు చాలెంజి ఆకాశవాణి.

## ఆర్. కే. ఓ. రేడియో పిక్చర్సు, ది లాస్టు ఫ్రాంటియర్ (సీరియల్ 24 రీల్సు)

వ్యాన్ బ్యూరెన్ ప్రొడక్షన్

వివరములకు:— కలకత్తా ఫిలిం యెక్స్ఛేంజి, 50, ఆర్మీనియన్ వీధి, మద్రాసు.



ప్రతిబింబము S. S. S.

# 'తృణకంకణ' విమర్శనము

శిరోమణి సన్నిధానము
సూర్యనారాయణశాస్త్రి

పాశ్చాత్యసభ్యతాభూకంపము వచ్చి మన వేషభాషామతాచారములను వలెనే మన సారస్వతమును దాఁబుమాఁబు చేసినది. ఆభూకంపమునకుఁ గారణభూతమగు మహాశక్తి విరమింపక యువకులహృదయములందుఁ బ్రవహించుచు నిరంతరము క్రొత్త క్రొత్తమార్పులను గలిగించుచున్నది నిన్నటిమార్పు నేఁడు లేదు నేఁటిమార్పు రేపు లేదు.

అట్టిసమయమున రమారమి యిరువది లేక యిరువదియైదేండ్లకాలముక్రిందట నీ యభినవాంధ్రసారస్వతసౌధమునకు స్తంభప్రతిష్ఠ చేసిన మహనీయుఁడు శ్రీ. శే. గురుజాడ అప్పారావుపంతులుగారు. వారిపిమ్మట నా సౌధనిర్మాణకార్యమును గొనసాగింపఁబూని యుడుతభక్తితోఁ బెక్కండ్రు యువకులు రాళ్లు, సున్నము, కంకర మొదలగునవి తోలుచు శ్రమపడుచున్నారు కాని యింతదనుక నా సౌధరాజము నిర్మింపఁజాలిన సమర్థుఁడగు వాస్తుశాస్త్రజ్ఞుఁడు (Engineer) లభింపలేదనుట సత్యదూరముగాదు. ఈ యువకుల శ్రమను ఫలింపఁజేయుశిల్పి యెప్పుడు వచ్చునో? అనన్యసామాన్యముగా, అత్యుత్తమముగా, ఆదర్శప్రాయముగా, హృదయాకర్షకముగా నా సౌధము నెపుడు నిర్మించునో?

ఆ పైఁ బేర్కొనఁబడిన యువకులలో ఉస్మానియా యూనివర్సిటీ తెలుఁగుప్రొఫెసరు శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారొకరు. సారస్వతోపాసకులగు నాంధ్రుల కందఱకును వీరు సుపరిచితులు. వీరు భావకవులలో నంది వేసిన చేయియని చాలమంది చెప్పుదురు. పెక్కురు శ్రీ సుబ్బారావుగారొక్కరే యీ యాంధ్రసారస్వత సౌధరాజమును నిర్మింపఁజాలిన మహాశిల్పి యనియు, గ్రంథమూలమున వారికార్యమును నిర్వహించిరనియును జెప్పుదురు. మఱికొందఱు సుబ్బరావుగారే నవీనాంధ్రయువకులకుఁ గవితాభిక్ష పెట్టిరనియు, వారికావ్యము లాచార్యపీఠమనియు వచింతురు. ఈవిధముగాఁ బ్రకృతకాలపుయువకు లెల్లరును సుబ్బరావుగారిని భావకవుల యిలువేల్పుగా, మోడువడ్డ యీయాంధ్రసారస్వతోద్యానమునకు వసంతునిగా భావించి వారి ననుకరించుచున్నారు. వారికావ్యములను గానము సేయుచున్నారు. కవితాస్వారస్యములను దీయుచున్నారు. మొత్తముమీఁద నిప్పటియువకులకు భావకవిత్వజ్వరము తీవ్రమై ప్రలాపము (Delirium) లోనికి దింపినదని చెప్పుట సత్యేతరము గాదు.

శ్రీ సుబ్బరావుగారు రచించిన గ్రంథములు నాకుఁ దెలిసినంతవట్టు లలిత, కష్టకమల, తృణకంకణము, తెనుఁగుఁదోఁట, స్నేహలత, జడకుచ్చులు. ఇంకను గలవేమో తెలియదు. ఈగ్రంథములలో 'తృణకంకణము' మకుటాయ

మాన (master - piece) మని నామిత్రులు గొందఱుచెప్పఁగా వింటిని. దానిని మెచ్చుకొని పిఠాపురమహారాజాగారో, మఱి యెవరో వేయినూటపదాఱులో, అంతకన్న నధికమో బహుమాన మొసఁగిరనియుఁ జెప్పఁగావింటిని. కావచ్చును, మహారాజావారు ఉదారులుగదా.

నేను సుబ్బరావుగారి కావ్యములను బలుమారు చదివితిని. కాని కొంత యర్థమయికొంత యర్థముగాక యే యున్నవి. కావున నితరులవలె నీకావ్యములరసాస్వాదనము సేయ లేకున్నాను. నామిత్రులు గొందఱు 'తృణకంకణము' మనుటాయమానమనియు, దానిని జదివినచో సుబ్బరావుగారికవిత్వసంపద తెలియు ననియుఁ జెప్పి నా కాపొత్తము నిచ్చిరి. మొదట దాని నొకతూరి చదివితిని. మరలఁ జదివితిని. మరల మరలఁ జదివితిని రమారమి యిరువదిసారులు చదివితిని. పిమ్మటఁ గొంతమంది విద్వాంసులతోఁ జర్చించితిని. ఎన్నిమారులు చదివినను అర్థ మస్పష్టముగానే యుండెను. ఒక్క పద్యమున కైనను నిక్కమైనయర్థ మవగతము గాలేదు. సుబ్బరావుగారి కవిత్వమును గ్రహించుశక్తి నాకడ లేదని విశ్వసింతును. కాని యెల్లవిద్వాంసులును నావలె నశక్తులేనా అని సంశయింపవలసియున్నది. నేనా గ్రంథమును జదువఁగాఁ బొడకట్టిన శంకల నీవ్యాసమునఁ దెలుపుదును. శ్రీసుబ్బరావుగారుగాని వారి యనుయాయులుగాని వీనిని దీర్చినచోఁ గృతార్థుఁడ నయ్యెద. భావకవిత్వమునుగూర్చి వెలువడిన వ్యాసములలో సుబ్బరావుగారి కవితాప్రాశస్త్యమును దెలుపని వ్యాసములు లేవు. కనుక నావ్యాసకర్తలయిన వారీ శంకలను దీర్తురని నమ్ముచున్నాను.

'తృణకంకణము'న నిరూపింపఁబడినవిషయమొక "పడుచుజత" (young couple అను ఆంగ్లపదమున కాంధ్రానువాదము) యొక్క భగ్నప్రణయము. ఇందుఁ గవి వివరించిన ప్రేమతత్త్వము పరతత్త్వమువలె దురవగాహముగా నున్నది. కవిహృదయమునఁ బ్రవేశించుద్వారములు బంధింపఁబడియున్నవి. మార్గాంతరములు సూచింపఁబడలేదు.

"దైవనియతిం బ్రసక్తమైన నిర్గతప్రణయము విశుద్ధప్రేమముగాఁ బ్రతిఫలించు ప్రకృతి రహస్యమే యిందు వర్ణింపఁబడినది. ఇందు అభిప్రాయములు నిగూఢభావ జనితములు" అని గ్రంథప్రకాశకులు వ్రాసిరి. ఇదియు బ్రహ్మవిద్యవలె దుర్బోధముగా నున్నది.

భావగీతమునకు భావపీఠిక యుచితమే కదా.

ఈ గ్రంథమును సవిమర్శముగాఁ జదువఁగా నాకు గోచరించిన శంకలు—

౧. అపశబ్దములు, ౨. అన్వయదోషములు, ౩. అలంకారదోషములు, ౪. పునరుక్తులు, ౫. అర్థదోషములు, ౬. దుష్టసమాసములు, ౭. వ్యాకరణదోషములు, ౮. ప్రకృతివిరోధములు.

## అపశబ్దములు

కం....అని స్వగతవిలాపములక్...యొక్క
యౌవనుఁడు కం|చెనుదాటుట కాననయ్యె
సీమంతినికిన్.

యౌవనుఁడుగాదు యువలేక యువకుఁడు అని యుండవలెను.

చ. చిటికెనవ్రేల.........
......పాణిబంధమునఁ బూన్చిన పచ్చని
పట్టుతోరమున్.

పాణిబంధము గాదు మణిబంధము అనవలెను. పాణిబంధమనఁగాఁ బెండ్లి.

కం. ఆపుణ్యవతి సొబంగుల మొగమున్.

సొబగులో నఱసున్న లేదు.

గీ. తమి విదారించు నవచంద్రధవళరోచి
రుదయములు పోనిమాపులు...

తమిని విదారించునవి చంద్రకిరణములు గావు, సూర్యకిరణములు. తమమును విదారించునవి చంద్రకిరణములు. తమిగాదు, తమము అని యుండవలయును. తమి=రాత్రి, తమము=చీఁకటి ఒకవేళ భావకవులు తమమునకును దమికిని భేదమును బాటింప రనుకొందము. అట్లన్నను ఇంకను నీప్రకరణమునఁ జీఁకటిపస లేదు. చీఁకటిలేనపుడు చీఁకటిని హరించు చూపులనుటయు ననుచితము. ఔచిత్యము చక్కఁగాఁ బాటింపఁబడలేదు. మరియు నిచటఁ బ్రకృతివిరోధదోషము గలదు. దాని నాశీర్షిక క్రిందనే నివేదింతును.

కం. సఖుల మనఃప్రియబంధము
లఖండము లటంచు విందు...

ప్రియబంధ మనుటకన్నఁ బ్రణయబంధ మనుట లెస్స.

గీ. దైవికం బగుసుకృతినిఁ దక్క నవని
జతలప్రేమోదయంబు సంగతము గాదు.

సుకృతి యనఁగాఁ బుణ్యాత్ముఁడు. సుకృతము అనవలయును. శబ్దరత్నాకరము చూడుఁడు.

గీ. ఆత్మ తన్మయ మందవచ్చు.
తన్మయత్వ మనవలయును.
ఇట్టి వింకను గొన్ని గలవు

## అన్వయ దోషములు

కం. ఆమో, హానహరిణాంగుయ ముద్దికి
కొనియెను దృణపరిమళను గుబులొక్కన
మొగమున్.

ఇట 'ముద్దికుకొనియెను' అను క్రియాపదమునకుఁ గర్మయేమి? హరిణమా, మొగమా? రెండునా? హరిణమైనచో మొగమున కన్వయ మెక్కడ? మొగమైనచో హరిణమున కన్వయ మెక్కడ? ఉభయమైనచో హరిణమును ముద్దాడుట యన నేమి, దాని మొగమును ముద్దాడుట యన నేమి? మన్యపతితమైన "ముద్దికుకొనియెను" అనుపదము రెంటిలోని కెట్లన్వయించును? శాస్త్రపంక్తులలో దేహళీదత్తదీపన్యాయానుసారముగా నిట్టి యన్వయములు గల వని వాని ననుసరింతమన్న నీతృణకంకణము శాస్త్రము గాదుగదా, అన్వయ మిందుఁ జెల్లదు.

గీ. ఉదయలక్ష్మికి నలుత నొప్పెదము సెంపు
మందిముత్యాలదండ తో మంచుబొట్లు
సాంధ్యకాంతావియోగబాష్పములు గాఁగ
మాఱుటెఱుఁగవో! సృష్టిమర్మములసరణి.

సృష్టిమర్మములసరణి దేనితో నన్వయించును? 'ఎఱుఁగవో' అను క్రియ మాఱుటతో నన్వయించెను గదా.

## అలంకార దోషములు

గీ. భావభరమైనసుహృదయబింబంబునందు
రక్తి లిఖియించుకొంటి వే రమణిరూపు
అదియె ముదమిూఁక యలంత కాస్పదమయ్యె
గ్రహణగతమైన చంద్రుని కళవిధాన.

హృదయమును ఫలకముగా రూపించి యందుఁ బ్రియురాలిని జిత్రించుకొన్నట్లు వర్ణించుట హృద్యమగుమార్గము. హృదయమును బింబముగా రూపించుట క్రొత్తవిషయము. బింబమునఁ జిత్రించుటయుఁ గ్రొత్తవిషయము. ఇఁక "గ్రహణగతమైన చంద్రుని కళవిధాన" అను ఉపమానము సరిగా సమన్వయింపదు. హృదయగతయగు ప్రియురాలు గ్రహణగతయగు చంద్రకళవలె ముదమిూయక యలంతగలిగించు చున్న దన్న ఉపమానస్వారస్యము శూన్యము. స్వారస్యము లేకున్న నాపమ్య మెందులకు? హృదయగత

యగు ప్రియురాలితో గ్రహణగతయగు చంద్రకళ నెవ్వరును ఉపమింపరు. క్రూరునిచేతఁ జిక్కికాని, కారాగృహబద్ధురాలయి కృశించికాని యున్న ప్రియురాలిని గ్రహణగత చంద్రకళతో నుపమించుట స్వారస్యము. గ్రహణగతచంద్రకళ మద మీయకపోవచ్చును. అలఁత యేల కలిగించును? మద మీయక పోవుటయే యలఁత యందురా? అప్పుడామాట యుపవ్యర్థమే! మరియు గ్రహణము పూర్ణిమ నాఁడు వచ్చును. ఆనాఁడు పూర్ణచంద్రుఁడుండును గాని చంద్రకళ యుండదు. అనఁగా గ్రహణగత చంద్రకళ యుండదు. ఇంకను ప్రియురాలిఁ జంద్రకళతోఁ బోల్పవలయును గాని ప్రియురాలిరూపును గాదు. దీనివలన లింగౌచిత్యము నష్టమైనది. భావసౌందర్యము తఱఁగినది.

స. మిసమిసలాడు జవ్వనపు
మేలిమి మేనసొబంగు లొలుకఁగా
ని సొగసు వాడినట్టినళినిందఁ గించెడు...

జవ్వనపుమేలిమి మేనిసొబగుఁ గూర్చుచున్నది. కాని సొగసు వాడినట్టి నళినిందలఁ గించుచున్నదఁట. సాదృశ్యమువలన స్మృతి కలుగును. మనము చంద్రునిఁ జూచినపుడు సాదృశ్యమునుబట్టి ప్రియాముఖమును స్మరింతుము. కాని యొకవానరమునో వృషభమునో స్మరింపము. ఇచ్చట ఆయువతిని జవ్వనపు మేలిమిఁ గాంచుచున్న కవికి సొగసువాడిన నళిని స్మృతికి వచ్చినది. జవ్వనపు మేలిమికిని సొగసువాడిన నళినికిని సాదృశ్య మనుభవవిరుద్ధము. అట్టియెడ స్మృతి యెట్లు కలిగెనో? పోనిమ్ము! జవ్వనపు మేలిమి సొబగుఁగూర్చుచు సొగసులేని నళినిఁ దిరస్కరించుచున్నదన్న నర్థమేమి? ఏమిసారస్యము? సుందరమైన జవ్వనపు మేలిమి గల యాతనిదేహము విరహవేదనచేఁ గృశించి వాడిన నళినివలె నున్నదని కవియాశయము కాఁబోలు! అప్పుడు సొగసువాడినయనుట తప్పు. అనౌచిత్యము. వాడినయన్నఁ జాలును. విరహవేదనచే దేహము కృశించినను సౌందర్యము దగ్గదని కాళిదాస మహాకవి చెప్పినాఁడు.

శ్లో. సమస్తాపః కామం మనసిజనిదాఘప్రసరయోః, నతు గ్రీష్మస్యైవం సుభగమపరాద్ధం యువతిషు.

(Translation) Granted! The distress of love and the advance of summer is same with young woman; but the transgression of heat is not so charming.—Saradaranjan Ray) శాకుంతలము.

మరియు స్త్రీ దేహమును నళినితోఁ బోల్చుట యౌచిత్యము గాని పురుష దేహమును నళినితోఁ బోల్చుట యనౌచిత్యము అసాంప్రదాయికము. "రమణిరూపు" అన్న పై పద్యమునందువలెనే యిచ్చటను లింగౌచిత్యము చెడి సారస్యము వైరస్యముగాఁ బరిణమించినది.

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా."
—ధ్వన్యాలోకము.

ఉ. నాయనుఁగుంజెలీ! చెలిమి నాటిన చిత్తమె యార్ద్రమందు నాశాయత రంజనంబయి ప్రియంబెనయించిన యీదశల్ కడుం దీయగులేమి చెప్ప? విడదీసినరేకుల పూవు చందమై పోయినమైత్రికే గతులు పోవలవంతలు దక్క నీభువిన్.

ఇందలి యుపమానమగు విడఁదీసినరేకుల పూవుచందము ఏ యుపమేయముతో సమన్వయించునో?

కం. కడిగిన మృగమదపాత్రిక
విడువని పరిమళముపగిది విధినియమములన్
విడుపందియు వారల పెం
పుడు మైత్రీప్రేమబంధములు దెగవవురా!

విడువనిపరిమళముపగిది వారి ప్రేమబంధములు తెగవు అని యర్థము. ఈ యుపమానము భిన్నవాక్యములతోఁ జెప్పినచో పరిమళము తెగదు, ప్రేమబంధములు తెగవు అని యుండును. పరిమళము తెగుట కనివిని యెఱుఁగము. పరిమళము విడువనట్లు ప్రేమబంధము విడువదన్నఁ గొంత బాగుగా నుండెడిది. ఇచ్చట భిన్నవచనరూపమగు ఉపమాదోషముగూడ గలదు. భావకవు లిట్టియలంకారౌచిత్యములను పాటింపరేమో !

చ. ప్రాయము ను గ్రసించుఁ దాపవిషమక్కట! యొక్కడి చెల్మితీయముల్.

తాపవిషము ప్రాయమును గ్రసించునఁట. విషము గ్రసింపఁబడును గాని యొకదానిని గ్రసింపదు. ఈ రూపకమునకుఁ బ్రయోజనమేమి? ప్రాయమును హరించుఁ దాపవిషమన్న సముచితముగ నుండును.

ఇంకను మరికొన్ని యిట్టి రచనలు గలవు.

అలంకార శాస్త్రమర్యాద నెఱుంగనిచో నిట్టి యనౌచిత్యదోషములు సంభవించును. వానివలన రసభంగమగును. రసాపకర్షకత్వమే దోషలక్షణము. ఆంగ్లసారస్వతమున నిట్టి మర్యాద లుండు నందురేమో? అందుండ వచ్చును. ఆ భాష కవి యౌచిత్యాపాదకములుగా నుండవచ్చును. చంద్రశబ్దమును ఆంగ్లేయులు స్త్రీలింగముగా వాడుదురు. అట్లే మనమును నా సంప్రదాయము నిందుఁ బ్రవేశపెట్టినచో నెంత యనౌచిత్యమును గలిగించును? అట్లే మన సారస్వత సంప్రదాయములు ఆంగ్లేయభాషలో ననౌచిత్యాపాదకములు గావా?

## అర్థదోషములు

ఈ గ్రంథమునందలి ముప్పాతిక మువ్వీసమీ శీర్షిక క్రింద నుదాహరింపవచ్చును. గ్రంథవిస్తరభీతిచేఁ గొలఁదిగా వ్రాసెదను.

కం. పసినిమ్మపండుచాయలఁ [డల్
గొసరెడు నాకుసుమగంధి కుందనపుటొ
కసుగందిన కందుక మన
వసివాళ్వాడెన్ నిదాఘపరిపీడనచేన్.

'పసినిమ్మపండుచాయల' అను పదము తోడనే గతార్థమగుచుండఁగా కుందనపుపదమేల? ఇందలిసారస్య మేమి? ఇది పునరుక్తిదోషదూషితము కాదోటు !

గీ. కన్నెగేదంగిచెండు నాఁగఁ గళుకు లొలయు
నావెలందిమెుడల్ నగ లేవి లేక
జాలుచెమ్మటముత్యాలసరుల చేత
సహజసౌందర్యమును వెదజల్లుచుండె.

ఈ పద్యము పై "పసినిమ్మపండు" పద్యము క్రిందిది. కసుగందినకందుక మన వసివాళ్వాడినశరీరము కన్నెగేదంగిచెండు నాఁ గళుకు లొలయుచున్నదఁట. నిదాఘపరిపీడనచే వసివాళ్వాడినశరీరము కళుకులొలయునా? విరహవేదనచేఁ గృశించిన సౌందర్యము తగ్గదు. కాని నిదాఘపీడచే సౌందర్యము గూడ తగ్గును అని కదా వెనుకఁ గాళిదాసని ప్రయోగము తెలుపుచున్నది. కనుక నిచ్చటఁ "గన్నెగేదంగిచెండు నాఁగళుకులొలయు" చున్నదనుట యెంతపూర్వాపరవిరోధము! ఎంతరసాభాసము! మరియు నొడలియందు నగలు లేవు. కాని చెమ్మటముత్యాలసరు లున్నవఁట. అనఁగా నొడలియందు నగలు ధరింపఁబడినస్థానములందుఁ జెమ్మటముత్యాలసరు లున్నవన్నమాట. నగలు ధరింపఁదగినస్థానములు కర్ణములు, కంఠము,

కరములు, కౌను, కాళ్ళు, నాసిక, శిరము. ఈ స్థానములందు (కంఠమునందెక్కడ) ముత్యాలసరులు ధరించుట వినము. అట్లు ధరించుట సహజసౌందర్య మేమో నాకుఁ దెలియదు. ముత్యాలసరులు కంఠమున ధరింతురు. కాని యొడలిశబ్దమునకు లక్షణ నాశ్రయించి కంఠమని యర్థము చెప్పినను చెల్లు, ముత్యాలసరులు కంఠమునఁ బర్యాదచేసికొనియున్నప్పు డెట్లు కానఁబడెనో కవికి? ఈ పద్యమున కింత యనర్థమును దెచ్చిపెట్టినది మూఁడవపాదము. అది లేనియెడలఁ బద్యమున సహజసౌందర్య ముండెడిది.

గీ. పదియునాల్గువసంతముల్ వదలనట్టి
వయసుసొగసుందినం బామెపయి నెసంగ
బాల్య మెడలినఁ గదియుజవ్వనపుఁబసలు
ఒడలియం దందముగ నట్టిపడుచునుండె.

పూర్వార్థమందముగనేయున్నది పూర్వార్థమునకు నుత్తరార్థమునకును గల యర్థభేద మేమి? పదునాల్గువత్సరములవయస్సు ఆమెకు సౌందర్యమును గూర్పఁగా జవ్వనపుఁబస యామెశరీరమున నందముగ నున్నదని యర్థ మగుచున్నది. ఇందలి సారస్యము నాకు గోచరించుటలేదు. పునరుక్తిదోషముకన్న సారస్య మన్య మున్నదా యని శంకించుచున్నాను.

పదునాలుగుసంవత్సరముల వయస్సు గల యువతినిఁగూర్చి తెలుపునపుడు సీమంతిని, పడఁతి, గరిత మొదలగు పదము లుచితములు గావు. తరుణి, యువతి, కోమలి మొదలగు పదము లుచితములు. పూర్వకవిప్రయోగము లున్న వందురేమో? వారు పూర్వకవులు. వీరు భావకవులు. భావకవులు పూర్వకవుల మార్గ మేల త్రొక్కవలయును? వారిప్రయోగములు వీరికి శరణమేల? భావప్రధానమైన కవిత్వముగదా వీరిది!

ఔచిత్యానౌచిత్యములఁ ద్రోసిపుచ్చి యర్థానర్థములను విచారింపక యాపాతమధురమైన మోహనము, కుమారుఁడు, స్నిగ్ధము, రక్తి, ఆర్ద్రిమ, ఉదయము, పస, చెరిగి చెరగని, విడిచివిడువని, తనిసి తనియని మొదలగుకొన్ని జిరాయితీమాట లుపయోగించిన నది భావకవిత్వము కాబోలు!

గీ. జిలుఁగుపూలకలంకారిచీర జాఱఁ
జిందు సందెడుకుచ్చెళ్లు చెదరనీక
మాటికిని గాలికడియాలు మలపుకొనుచు
కూఁతవేటటుచని దరికొనియె వనము.

'చీరజాఱఁగాఁ జిందుచున్న కుచ్చెళ్లు చెదరనీక' అనఁగాఁ గట్టుకొన్న చీర ఊడుచుండఁగాఁ బడిపోకుండ నొకచేతఁ గుచ్చెళ్లు పట్టుకొని యొకచేతితోఁ గాలికడియాలు మలపుచున్న దనియా సారస్యము? స్త్రీ చీరజాఱుచుండఁగా సవరించుకొనక మార్గమునఁ బోవుచుండునా? పోయిన నెంతదూరము పోవును? కూఁతవేటు దూరము పోవునా? అది సహజసౌందర్యము కాఁబోలు! ఇట్టి సహజసౌందర్యము నాకనుభూతము కాలేదు. వెనుక "నొడలియందు నగ లేవిలేక" యని చెప్పి యిపటఁ గాలికిఁ గడియాలు పెట్టినాఁడు కవి. మిగిలిన యేయవయవములకును నగలు లేక కాలికిఁ గడియాలు మాత్రము ధరించుట సహజసౌందర్యము కాఁబోలు! లేక కడియాలు కర్ణములకుఁ గవచకుండలములవలె నామెకు సహజములా? అట్లయిన నది సహజ సౌందర్య మగును.

కం. ఆ|నీలాలకయొక్క పోకనీడకుఁ జనియెన్.

పోకచెట్టున కెంతనీడయుండును? నిదాఘకాలములో జాముప్రొద్దువేళఁ జల్లఁదనమునకై పోకనీడ నాశ్రయించువా రుందురా? మనుచరిత్రమున వరూథినివలెఁ బోఁకనును బోదియఁ జేర్చె ఏక కవి యీపెకు సారస్యవిశేషమునకుఁ గాఁబోలు నీడకుఁ జేర్చినాఁడు.

గీ. స్కంధకూలంకషంబుగ జాలువాఱు
పొడుపుసోనపయిఁ బ్రాగభిముఖపుసరణిఁ
బూలకొమ్మల నింపుసొంపులు వహించు
శాఖ యొక్కండు వంతెన జాఁగిపోవు.

"స్కంధకూలంకషంబుగ" చెట్టు మొదలానుకొనియని కవియాశయము కాఁబోలు. కూలంకషము=ఒడ్డు లొరయునది యని యర్థము "స్కంధము కూలము నొరయునట్లుగా" అని యర్థము వచ్చును. కాని నదులు వర్షాకాలమునఁగాని కూలంకషంబుగాఁ బ్రవహింపవు. ఈ గ్రంథమున నిరూపింపఁబడినకాలము నిదాఘకాలము. కనుక ఆసోన కూలంకషముగాఁ బ్రవహింపదు. స్కంధకష మన్నఁ జాలును. కూలపదము వ్యర్థము. అపార్థము నిచ్చును. లేక "స్కంధమును దాఁకి తాఁకక జాలువాఱు" అని యన్నను సరిపోవును. తాఁకి తాఁకక, విడిచివిడువక, చెరిగిచెరగక, ఇట్టి నానుడులు (Phrases) ఈ కవిసంప్రదాయములుగదా. ఇఁకఁ 'బొడుపుసోన' యన నేమో? సోన=ఊటకాలువ. పొడుపుసోన యనఁగా నేమి? పొడుపు=(౧) పొడుచుట, (౨) ఉదయము, (3) పోటు. అని మూఁడర్థములు శబ్దరత్నాకరమునఁ గలవు. ఈ మూఁడును నిచటసరిపడవు. మఱొకచోట 'పొడుపుశేగు' అని కలదు. ఈ యర్థములతో సంబంధము లేని సంజ్ఞావాచకములా యివి? అట్లయిన నీగ్రంథములో నాయికానాయకులకే నామకరణము చేయలేగు కవి. సోనకీ నామకరణమహోత్సవమేల? సంజ్ఞావాచకము కాకున్న నర్థమేమి? సెలయేఱు, ఊటకాలువ అని యర్థమేని సోన యన్నఁ జాలునే? పొడుపుపదసార్థక్యము బోధ గాకున్నది. ఇఁకఁ బూలకొమ్మలతో నిండిన శాఖయఁట. పూలగుత్తులతో నిండిన శాఖ యనఁగూడదా? అంతకన్న నెక్కుడుగా లేదా? పునరుక్తిదోషము పోవునే? కొమ్మ, శాఖ పదములు సమానార్థకములు గావని కవిగారి యభిప్రాయమా? తేటతెల్లము గాకున్నది. ఇఁకఁ బ్రాగభిముఖమఁట. అభిముఖ మన్నఁ జాలును. లేకున్నఁ బ్రాఙ్ముఖ మనుట యుచితతరము. ఇది సాంప్రదాయికపదము. ఇఁక 'వంతెనజాఁగిపోవు' అనుచోట 'గా' అని యుండుట లెస్స.

గీ. సందె సాఁగినకొలఁదిఁ బ్రశాంతమగుచుఁ
జలువయును మాంద్యమును దమ్ము నలమి
కొనఁగ
...................ప్రదోషపవన
మల్లనల్లన వీచె................

సందెసాగినకొలఁది యనఁగా సంజగడచిన కొలఁది, మొత్తముమీఁదఁ జీఁకటిపడినకొలఁది యని యర్థమువచ్చును. ఇచ్చటఁ గిట్టీఁకటి పడువఱకును రాలేదు. 'ఎండ డాసినకొలఁది' అన్న సారస్యముండును. ఒకవేళఁ గవి యాంగ్లసంప్రదాయానుసారముగా P. M. అను నర్థమున సందెపదమును బ్రయోగించెనేమో? మధ్యాహ్నము ౧౨ గంటలు దాఁటినపిమ్మట మరల రాత్రి పండ్రెండు గంటలు సమాప్తి యగువఱకు P. M. అని ఆంగ్లసంప్రదాయము. అట్లే ౧౨గంటలు దాఁటినపిమ్మట మరల రాత్రి పండ్రెండు గంటలవఱకు సందె శబ్దమున కర్థమయిననో 'సందె సాఁగినకొలఁది' అనుమాట సార్థకమగును.

గీ. ముగ్ధమధురంబయిన లేఁడి ముద్దుఁగాఁ,
గోలపవనాగుల లతావలోకనంబు,
పొడుపుశేటిమెలపు, జాలుపొద్దువలపు
నాయము నొకానొక వికార మందఁజేసి

పూర్వార్థము యథోచితముగా నున్నది. ఆమెకు వికారముఁ గూర్చునవి "పొడుపుశేటి మెలపు" ఏమి? "జాలుప్రొద్దు వలపు"

ఏమి! పాయపుఁబేటి మెలపులో మెలపుఁదీసి నగియనిము, జాఱుఁబ్రొద్దువలపు తీసివేసి పై పద్యములోని ప్రదోషపవనమనియు నన్నచో బాగుగా నుండెడిది. ఆమెవికారమునకుఁ బూర్వార్థము గారణ మయినట్లు మూఁడవ పాదమునందలివిషయము గాకున్నది. మెలపు, వలపు అను అనుప్రాసముకొఱకై కవి సారస్యము భగ్నము గావించినాఁడు. అర్థహీన మయిన యనుప్రాస మేల?

గీ. లలితలావణ్యపూర్ణ మా లలనచెలువు
నెదుటఁ గన్పట్టుచుండె నెల్లెడల నాకు.

చెలువు అనఁగా నందము. లావణ్యము అన్న అందము. మొదటిపాదమునకుఁ జక్కని చక్కదనముతో నిండిన స్త్రీయొక్క చక్కఁదన మని యర్థము. ఇందలి సారస్య మద్వితీయము!

గీ. రుచిరవేణునాదోపమ శ్రుతులఁ గలిసి
పాఱుచిఱుసోన బిలబిలధ్వనుల నణఁగి
కనల విననయ్యె నప్పు డాకంఠరవము
గద్గదక్లాంతి నను తాపకలన నిట్లు.

వేణునాదోపమశ్రుతు లనవలెను. ఒకకంఠరవమున కెన్నిశ్రుతులు గావలయును? పెక్కుశ్రుతులున్నఁ గంఠరవ మెట్లు వినవచ్చును? శ్రుతులు అను బహువచనసారస్య మేమి? చిఱుసోన బిలబిలధ్వనుల నణఁగినదఁట ఆకంఠరవము. వేణునాదము శ్రుతిగా నున్న కంఠరవము చిన్న సెలయేటి బిలబిలధ్వనులలో నెట్లణఁగిపోవును? అణఁగిపోయినచోఁ గడల నెట్లు వినవచ్చును? ఎంత పూర్వాపరవిరోధము! గద్గదక్లాంతియన నర్థ మేమి? గద్గదశబ్దము విశేషణ వాచకము. క్లాంతిపదము విశేష్యవాచకము. గద్గదపదము క్లాంతిపదముతో నన్వయింపదు. గద్గదమైన క్లాంతియన్న నర్థము లేదు. అట్టియెడ సమాసమే కుదరదు. అనఁగా గద్గద క్లాంతి యను సమాసమే ఘటిల్లదు. ఇఁక గద్గద పదమును కంఠరవముతో నన్వయింపవలయును. క్లాంతిపదమును దేనితో నన్వయింపవలయును? రవముతో దాని కన్వయము లేదు. క్లాంతిపదము దేనితోడను అన్వయింపదు. ఇది వ్యర్థమును, అనన్వితమును. క్లాంతితీసివేసి గద్గదంబయి అన్న బాగుండెడిది. ఇఁక అను తాపకలన అనఁగాఁ బశ్చాత్తాపము చేతనని యర్థమువచ్చును. 'పశ్చాత్తాపో౽నుతాపశ్చ' అని యమరము. ఇటఁ బశ్చాత్తాప మేమి గలదు? స్వయంకృతాపరాధమునకుఁ బశ్చాత్తాప ముండునుగాని "విధినియమములకు విడు

పందినప్రేమ"కుఁ బశ్చాత్తాప మేమి? ఈపద్యమున సారస్యము సున్న, నైరస్యము మిన్న.

గీ. నయనముల మూలరుచులు స్విన్నంబులయిన
వేల? చెల్లెల!

మూలరుచులుగాదు, కోణరుచులు అనవలయును. మూల తెలుఁగుపదము. దుష్టసమాసమగును. పోనీ, మిశ్రసమాసమని సమాధానపఱచుకొందము. రుచులనఁగాఁ గాంతులు. కోణకాంతులు స్విన్నము లగుట క్రొత్తవిషయము భావకవుల దృష్టుల కాస్విన్నత గోచరించును.

గీ. తేటవలపులు మొలక లెత్తినది మొదలు
నిలిపితిఁ బవిత్రరాగ మాలలనయెడలఁ
దుదకు భగ్నమనోరథదోషి వగుచు
నేటి కారాటపడ మరు లెత్తి మనస!

మనసు భగ్నమనోరథదోషియఁట! ఈ సమాసమునకు విగ్రహవాక్య మెట్లు? 'భగ్నమనోరథం చ తద్దోషి చ' అనియా? 'భగ్నమనోరథం అతఏవదోషి' అనియా? మరొకవిధము నాకుఁ దోఁచకున్నది. మనసు భగ్నమనోరథము గావచ్చునుగాని దానివలన నది దోషి యగునా? మన మొకవస్తువు నభిలషించితి మనుకొనుఁడు. అదిమనకు లభింపలేదు. అందువలన మనము దోషులమైతిమా? ఆదోష మేమి? భగ్నమనోరథత్వము దోషముగ గణింపఁబడునా? భగ్నమనోరథ మన్నఁ జాలదా? దోషిపదముచేఁ గవి దోషి యగుటలేదా?

గీ. హృదయమోహనమయి ప్రేమమృగుళమైన
తావకీనలీలా సుధాదళపుటంబు
మామకీనప్రణయభంగమధుకశాలి
విడిచెనువిరక్తి బాష్పముల్ విడుచుపోల్కి.

నీలీలా సుధాదళపుటము విరక్తిచేత బాష్పములను విడుచునట్లు నా ప్రణయభంగమధుకశాలిని విడుచుచున్నది అని దీనియర్థము. దీని యభిప్రాయము బుజ్జిబ్రద్దలుగొట్టుకొన్నను దెలియకున్నది. ఇది భావకవితాసరస్వతికిఁ గిరీటము. ఇట్టివి పెక్కులీగ్రంథమునఁ గలవు.

చ. క్రమ మని యక్రమం బని ప
రస్పర భిన్న మనోవికార సం
భ్రమములఁ గొన్నినాళు ళల
వంతలఁ జిక్కితి; దేశకాలపా
త్రము లని కొన్నినాళ్లు నిశి
తవ్యథనొందియుఁ దాళుకొంటివా
కమలదళాక్షిపై మమత............

ఇట దేశకాలపాత్రములన నేమి? దేనితో నన్వయము?

గీ. ఎదఁ గృశించెదు నీయరుంతుదవియోగ
దహన దందహ్యమానమై............

అరుంతుదవియోగ మన్నఁ జాలును. దానిని దహనముగా రూపించుట యనుచితము. అరుంతుద వియోగదహన మనుటకన్న నరుంతుదవియోగశల్య మన్న నర్థసారస్యము మెండు. దహనము కాల్చివేయును. శల్య మన్ననో మర్మములను వేధించునన్న యర్థము వచ్చును. అరుంతుదము = Cutting or wounding the vital parts అని Apte నిఘంటువు.

కనుక నరుంతుదవియోగమును దహనముగా రూపించుటచే ఉన్న సారస్య మూడ్చిపెట్టుకొని పోయినది. ఇక దందహ్యమానము అనఁగా మిక్కిలి కాలినది అని అర్థము. భృశార్థమున యఙ్ ప్రత్యయము వచ్చినది. మిక్కిలి కాలిన వస్తువు కృశింపదు. భస్మమగును. నశించును. కనుక ఎద కృశించెదు అనుట అసమంజసము. ప్రకృతివిరుద్ధము.

సీ. తన గుణలతలు పూచిన శోభలో యనఁ
జిఱునవ్వు వెన్నెలచెండ్లు విసర

శోభ లన కొప్పు చిఱునవ్వు అన్నఁగాని అర్థముకుదురదు. లేనిచో 'శోభలో యన' అనునది 'విసర' అను క్రియతో నన్వయించును. లతలు శోభలను బూచునో, పుష్పములను బూచునో?

సీ. తనమనోలీల గాంచిన రాగమధు వనఁ
బలుకు బంతులు పూలపాలనీయ

మనోలీల అనఁగా నేమో? అర్థ మగమ్యముగా నున్నది. ఉత్తరార్థ ముపనిషద్రహస్యమువలె నున్నది.

గీ. విడిచి విడువనిమౌగ్ధ్యంబు వడయు లజ్జ

అనఁగా మౌగ్ధ్యము మెల్లమెల్లఁగా విడుచుచున్నది. లజ్జ పొడముచున్నది అని యర్థము. "లజ్జావిజితమన్మథా" అని ముగ్ధాలక్షణము. లజ్జ అధికమై అభిలాషను అణఁచివేయునవస్థ గలది ముగ్ధ. "మౌగ్ధ్యంబు వడయు లజ్జ" యనఁగా ఇంతదనుక లజ్జలేదనియు, మౌగ్ధ్యమువదలుచుండఁగా నవఁగాముగ్ధావస్థపోవుచుండఁగా లజ్జపొడము నన్నదనియు నర్థము వచ్చును. ఇది ప్రకృతివిరోధదోషము.

కం. విశ్వాసబాష్పజలిలము చిందెన్.

ఆనందబాష్పములు, దుఃఖబాష్పముల ను వింటిమి. విశ్వాసబాష్పములు క్రొత్తవి. పాశ్చాత్యదేశము నుండి దిగుమతియైనవేమో?

చ. కలసినగాటపుం జెలిమి
కాంక్షలు పెంచఁగ రేప్రవల్ తలం
పులను మమేకమైన వల
పుల్ కసకన్ గసగండ్లుపాలుగాఁ
గలసినజంటయందు సఖి
కంఠమయ ట్లొదవన్ ప్రదోషదో
హలమయి తోడనే యతని
యార్తవరాగత తోఁచె నిట్టులన్.

సఖికంఠమయట్లొదవన్ - ఇట నవధారణార్థక ప్రయోజనమేమి? ప్రదోషదోహలమనఁగా అర్థమేమి? దోహలము = ఉత్సాహము అని శబ్దరత్నాకరము. ప్రదోషమందలి యుత్సాహము అని అర్థమగుచున్నది. కంఠము ప్రదోషదోహలమాయెనదనఁగా నర్థము బ్రహ్మభేద్యముగా నున్నది.

శా. ......బాష్పజ్ఞానవిద్యార్థి నై
కాలంబున్ వయసున్ వ్రయించెదను ...

బాష్పజ్ఞానవిద్యార్థి అనఁగా బాష్పము లెట్లు విడువవలయునో అట్టిజ్ఞానము వడయు విద్యార్థి, అనఁగా రోదనవిద్య నభ్యసించువాఁడనియా యర్థము? ఈవిద్యార్థికి గురు వెవరు? ఎంతరసవత్తరమైనపద్యము! 'వ్రయించు' కాదు, 'వ్యయించు' అని కదా యుండవలయును!

చ. పదఁ నికాంక్షమై వలపు
బాతీన నెయ్యముఁ బెంచుకొన్న నీ
హృదయము కక్కసించు నల
యింపులు ప్రాప్తము లయ్యెఁ బ్రేమముల్
పెదిరిన శూన్యభావము
లివీ! రుచియింపవు రక్తిలేమినో
ముదిత! వియోగమం దమృత
మన్ విషమున్ సమవృత్తులేసుమీ?

హృదయము వలపుఁబాతీన నెయ్యముఁ బెంచుకొన్నదఁట. హృదయము నెయ్యమును బెంచుకొన్నదఁట. పట్టినెయ్యము గాదు. వలపుఁబాతీన నెయ్యము. నరికొ్రత్తభావము. దీని సారస్యము పరమరహస్యము.

గీ. ప్రియతమంబగు వస్తుసంప్రీణనమునఁ
బ్రాణికిని హాయిఁ దురు; నాపయిఁ బ్రశాంతి
యొదవు; నజ్జీవశూన్యమౌ బ్రదుకునకును
లేదు తన్మయోన్మీలనామోదసుఖము.

వస్తుసంప్రీణన మనఁగా వస్తులాభమని కవి యుద్దేశము కాఁబోలు. అట్టియర్థము రాదు. ప్రీణనమన సంతోషపెట్టుట యని యర్థము. ఉజ్జీవశూన్యమనఁగానేమో బోధపడకున్నది. తన్మయోన్మీలనామోదసుఖమనఁ బ్రతిపదార్థము స్పష్టము గాకున్నది.

గీ. విగతకాలుష్యముదితమౌ జగతి విడిచి
కాలగతిమెయి శోభలెచ్చటనోఁదాచి
కాంతసంపూర్ణచంద్రనిశాంతములను
మంచుకన్నీళ్లు కార్చవే మబ్బులతివ!

ప్రథమ తృతీయపాదములకు అర్థ మేమి? ఇందలి భావరహస్యము చిదంబరరహస్యమువలె నున్నది.

గీ. మోహనవసంతునకు మోదమును ఘటించు
మసృణముగ్ధంబయిన మావిపసుపుటాకు
హిమకుమారుఁడు రక్తి మాయింపఁజేయుఁ
డే? సఖీ! కాలచపలున కేది నీతి?

మావి పసుపుటాకు వసంతునకు మోదమును ఘటించునఁట. దానిని హిమకుమారుఁడు రక్తితో మాయించునఁట. ఇందలి భావము దేవరహస్యమువలె నున్నది. హిమమును కుమారుఁడని రూపించుటలోఁగల సారస్య మేమి? పైని వసంతుఁడు అని యుంటవలన హిమము అనఁగా హేమంతర్తువు అని అర్థమేమో? ఈ రూపకప్రయోజన మేమి? రమణీయత్వము లేని రూపణ మెందులకు? కాలచపలుఁగు అనఁగూడదు. చపలుఁడగుకాలుఁడు అనవలయును. సంస్కృతభాషా సంప్రదాయము తెలియమిని నిట్టి దోషములు సంభవించును. సంస్కృతపదములు నాలుఁగు దెలిసినంతమాత్రమున సమాసముఁజేయ వీలు లేదు. సంప్రదాయము దెలియవలెను. 'విశేషణం విశేష్యేణబహుళం' అను సూత్రముచే విశేషణమును సమాసములో ముందుఁ బ్రయోగింపవలయును. ఇట్లే యేయే పదము లెట్లు సమాసమునఁ బ్రయోగింపవలయునో వ్యాకరణశాస్త్రమువలనఁ గాని తెలియదు. అది తెలియకున్నచో మహాభారములో అది పద్యతీమని చెప్పి మా 'తె' మాట వచ్చినదన్నట్లుండును.

మ. ఏమిటిఁబోకించుక జీవితాంతమునఁ బ్రేమప్రేమ బాష్పాంజలిన్.

ప్రేమప్రేమబాష్పాంజలి అనఁగా నేమి? ఈ ద్విరుక్తియొక్క సార్థక్యము వాచామగోచరము కాఁబోలు.

మ. మటివంబోకము పూర్ణరాగ పరిణామజ్ఞాన సిద్ధాంతమున్.

ఇది Darwin గారి పరిణామ సిద్ధాంతమునకుఁ బ్రతిగా బయలుదేరిన సిద్ధాంతమో?

ఉ. పొందినటించు ప్రాణివల
పుల్ సొలయించినవేళ నింద్రియా
ళిం దనియింప భౌతికమ
లీమసమౌ; నటఁ బడ్డదర్మపుం
బందము లీడ్చి యీడ్చి పరి
పాకము గానఁగ లేక హేమర
క్తిం దగులాని ప్రేమగుచి
కిన్ వెలియౌట లెఱుంగవో చెలీ!

ఈ పద్యమునందలి వేదాంతము ప్రాణాంతకముగా నున్నది.

గీ. చైత్రుతో వచ్చు పల్లవసంచయంబు
హిమపదాగమమున నశియించునట్లె
పడుచుఁదనముతో నుదయించు వలపులెల్లఁ
గలు కెసలి కృశించును జరాక్రాంతదశను.

పడుచుఁదినము ననున్న ప్రేమ వార్ధక్యమునఁ గృశించునఁట. అట్టియెడ నది విశుద్ధప్రేమ యగునా? భవభూతి యేమి చెప్పినాఁడో చూతము.

శ్లో. అద్వైతం సుఖదుఃఖయో రనుగుణం
సర్వాస్వవస్థాసు యత్ విశ్రామో హృదయ
స్యయత్రజరసా యస్మిన్నహార్యోరసః,
కాలేనావరణాత్యయాత్పరిణతే
యత్స్నేహసారే స్థితం భద్రంప్రేమసుమా
నుషస్య కథమప్యేకంహి తత్ప్రాప్యతే.

Translation:— With great difficulty indeed is gained that unique and benificient love of a good creature that is unchanged in weal and we, obliging under all circumstances, where there is the heart's repose, the ard our of which is not to be netigated with age, which develops into the mature cone of affecti on through the wearing off of the coating by time. (of reserve)

దీనినిఁబట్టి యీ పద్యమునందలి యుక్తార్థ మసంబద్ధముగా నున్నది.

చ. తన్మ యుదయోగ్యమైనమ్యానున్నడశయే కృతార్థమయనున్ బుధివాణి.

ఇచ్చటి ఋషిరహస్యమును గవియును రహస్యముగనే యుంచెను. 'దళయే కృతార్థమ' యను నీరెం డవధారణవాచకములకును సారస్యము గగనకుసుమము.

గీ. తేటకలపులు మొలకలెత్తినది మొదలు,

గీ. వలపునిండిన యకలుష భావవృత్తి

ఈ మొదలయిన తావుల వలపును ప్రేమకుఁ బర్యాయముగా వాడె

గీ. తాపనేటికి నింకనాధ్యాత్మికంబు
ప్రేమ నైతికమను వికారించువలపు

అను పద్యమున వలపును మోహమునకుఁ బర్యాయముగాఁ జెప్పినాఁడు కవి. పోనీ! ప్రేమమోహములకు భేదమును బాటించినాఁ డేమో యన్న నదియు మృగ్యము. చూడుఁడు.

గీ. అకట! వంచించెవిధి, మోహామా! విఫలమ
నోరగుండు వీఁడు.

దీనిని బట్టి కవి పద్యప్రయోజనము బాటించుట లేదన్నచో సత్యదూరము గాదు.

గీ. నష్టమైనట్టి ప్రేమఖండముల కొక్క
సకవితుత్కర జీవగీతికయ చాలు.

ప్రేమఖండములఁట. ఇది యపూర్వప్రయోగము. అక్షర జీవగీతిక అనఁగాఁ బ్రతిపదార్థ మూహ్యముగా లేదు.

గీ. నిమ్మచెట్టులేఁగొమ్మ పందిళ్లక్రిందఁ
బుస్తకపుఁ బేటికలను నాహాస్తగదిత
చిత్రసూత్రమునందు వసించియున్న
నోయి! యిందాఁకమన ప్రేమయును స
ఖుంక!

మన ప్రేమ పుస్తకపుఁ బెట్టెలలో నాహాస్తగదిత చిత్రసూత్రమునందు వసించియున్నదని యర్థము. అనఁగా నేమి? ఏమో? పుస్తకపు పేటికయన పుస్తకముల పెట్టెయనియా? లేక పుస్తక మను పెట్టెయని రూపకమా? రూపకమయినచోఁ బ్రయోజనమేమి? దాని నిర్వహణ మెట్లు? హాస్తగదిత చిత్రసూత్రమనఁగా హస్తము చేత వ్రాసిన చిత్తరువు అనియా? లేక చిత్రమైన త్రాడనియా? లేక చిత్రము అను సూత్రమని రూపకమా? ఏమో! అభేద్యముగానున్నది. హస్తగదిత మనఁగా నేమి? గదితమనఁగాఁ జెప్పఁబడినదని సాంప్రదాయికార్థము, వ్రాయఁబడినదని కాదు. 'గదవ్యక్తాయాం వాచి' అను ధాతువునుండి నిష్పన్నమగు భూతార్థక విశేషణ మీగదితశబ్దము. హస్తముచే జెప్పఁబడిన చిత్రసూత్రమన నేమో?

ఉ. అమృదుశిలపాణి......

ఇట శిలపద మేలొకో? మృదుపాణియన్న బాగుగానున్నది. శిలపదము ఆబవ్ర వేలిపలె నున్నది.

ఉ. ఆ! కోమలరాగసూత్రమున
కట్ బరమావధిగానరాని.

రాగసూత్ర మననేమి? రాగము సూత్రముగా రూపించుటవలన వచ్చిన సారస్యము నాకు గోచరింపకున్నది.

ఉ.................వీ
చీమయమైన సోనవయిచెక్ ...

అనఁగా అనిర్వాచ్యము.

గీ. పదియడుగు లీవలావలఁ గడయనడిచి
చిటికెలోపలఁ గలిసి యుత్కట భరాప్తి.

ఉత్కటభరాప్తి- ఈసమాసము నెట్లు భేదింపవలయును? ఉత్కటమైన దేని యొక్క భరము?

గీ కాలిచల్లాలు పెంపుడు కానఁ బడిన
పశుచుజింకపడంతి నా నడచు నాపె.

పెంపుడు కాన - ఎంత హృద్యమైన భాషీయము! పెంపుడుకుక్క, పెంపుడునెమలి మొదలగు తావులలోని పెంపుడు పదమునకుఁ 'బెంచుకొన్న' అను నర్థము గలదు. పెంపుడు కాన అనఁగాఁ బెంచుకొన్న యడవి. ఎవరీయడవినిఁ బెంచుకొన్నారు?

కం. పెంపుడు మైత్రీ ప్రేమబంధములు
తెగవవురా!

పెంపుడు మైత్రి, పెంపుడుప్రేమ- ఎంత చక్కని జాతీయములు (Idioms)!

గీ క్రిక్కిఱియు కొమ్మ లాకల నెక్కి చలువ
దట్టమగు నీడపందిళ్లు గట్టుచుండ

చలువపందిళ్లు అన్నఁ జాలునే? ఎందుల కీద్రావిడప్రాణాయామము? పడికట్టు రాళ్లవేసి పద్యమును బూరించుట తప్ప సారస్యమావంతయు నగపట్టను. ఇట్టి యర్థదోషములు మరియుఁ బెక్కులు గలవు.

## ప్రకృతివిరోధదోషములు

గీ. వలపు మొగ్గలు దొడిగిన వయసుటనఁటి.

అనఁటి మొగ్గలు దొడిగినదని యెవరును వచింపరు! అఁటి పువ్వువేసినదందురు. చెట్టు మొగ్గదొడిగినదన్నచోఁ జెట్టంతయు మొగ్గలతో నిండినదని యర్థమువచ్చును. అరఁటి కొక్కటే పెద్దపువ్వు వేయును. ఇట్టిచో అనఁటి మొగ్గలు దొడిగినదనుట యెంత ప్రకృతి విరోధము!

గీ. తమి విదారించు నవచంద్రధవళరోచి
రుదయములు పోనిచూపులు...

నవచంద్రుఁడనఁ బ్రతిపచ్చంద్రుఁడా? అతని కాంతి తమిని విదారింపఁజాలునా? ఉదయ చంద్రుఁడా? అట్లయిన నతనికాంతి ధవళమా?

వెనుకఁజూపిన "కన్నె గేదంగి చెండునాఁ గళుకులొలయు" "మిసమిసలాడు జవ్వనపు మేలిమి మేన సొబంగులొలు, ఁగాని సొగసు వాడినట్టి నళినిం దలపించెడు" "ఎదగ్గృళించెడు నీయరుంతుదవియోగ దహనదందహ్యమానమై" మొదలగు తావులందును ఈ ప్రకృతి విరోధ దోషము గలదు. ప్రకృతినే యారాధించు భావకవులకీ ప్రకృతివిరోధ దోష మేల సంభవించెనో! భావకవి ప్రకృతిని మాతగా నారాధించునని యిటీవల శ్రీ సుబ్బరావుగారు రాజమహేంద్రవరమునఁ దమ యధ్యక్షోపన్యాసమున సెలవిచ్చినారు. కాని వారి కీమాతతో విరోధ మేలకలిగెను? ప్రకృతి విరోధము గూడ భావకవులకు రసోపస్కారకమేమో?

## దుష్టసమాసములు

గీ. అజననబద్ధబాంధవమైన చనవు
చిరసమేళన కాంక్షావిచిత్రరక్తి
బలవదాశావిభిన్న తాపంబు నాప
డుమజతను నేమి సేయుదనట్టులఁ జొనర్చె.

రెండవపాదపు సమాసమున కర్థ మనిర్వాచ్యమధురము. సమ్మేళనముగాని సమేళనము గాదు. కాదు, సమేళనము తెలుఁగందురా? దుష్టసమాసమునను. కాంక్షారక్తి శబ్దముల కిట నర్థభేదమేమో? కేవలరక్తిగాదు. విచిత్రరక్తియఁట. సమాసమును, దానియర్థమును నతి విచిత్రముగానున్నవి. మూఁడవ పాదమునందలి సమాసమున కర్థమేమి? బలవదాశచే దాపము విభిన్నమైన దనఁగా నేమి?

గీ. చిరిగి చిరుగని వలపుల దొరయువగలు
విడిచివిడువని మార్గ్యంబు వడయు లజ్జ
సమయ భరమును వ్యక్తిప్రసన్నబుద్ధి
యొండొరుల గడవంబడుచుండ నాపె.

సమయభరమన నేమి? వ్యక్తి ప్రసన్నబుద్ధి యను నీ సమాసమునకు విగ్రహవాక్య మెట్లు?

గీ. అస్ఖలితమగు ప్రేమరహస్య తత్త్వ
విశదతత్పరత విదగ్ధకుశలయగుచు

ఈ సమాసములకు విగ్రహవాక్యము లెట్లు? విదగ్ధకుశల శబ్దము లేకార్థకములు గావా? విశదతత్పరతయన నేమి?

గీ. సాంధ్యకాంతావియోగబాష్పములు గాఁగ.

సంధ్యా కాంత యనవలయును.

గీ. స్తన్యమోహనమైన వాత్సల్యసక్తి.

స్తన్యమోహనము - ఈ సమాసమునకు విగ్రహవాక్యమెట్లు? స్తన్యమువలె మోహనమయినదనియా? స్తన్యముచేత మోహనమయినదనియా?

చ. మృదుళంబగు ప్రేమసమేళనన్

ఇట విగ్రహమెట్లు?

గీ. అపు డదృష్ట దేవత కరమందునుండి
జాఱు పావనదీవనాచయము లనఁగ.

ఇట దీవన ఆచ్ఛికము. పావనచయ శబ్దములు సాంస్కృతికములు. రెంటినడుమను దెలుఁగు పదమును బెట్టి బిగించినాఁడు కవి.

గీ. వకుల సుకుమార తరుమతల్లికలనుండి.

వకులతరువుమధ్య సుకుమారపద మెందులకో! విగ్రహవాక్యమెట్లు? మరియు మతల్లికాది శబ్దములు స్త్రీలింగశబ్దములతోఁ గలసి శ్రేష్ఠార్థవాచకములగును. అది సత్కవిసంప్రదాయము. కాంతామతల్లి యన్నట్లు. తరుమతల్లిక, పురుషమతల్లిక, కాంతా తల్లజుఁడు, లతాతల్లజుఁడు మొదలగునవి తదితర సంప్రదాయములు. ఆలంకారికులు పదములను వాచక లక్షక వ్యంజకములని మువ్విధములుగా భాగించిరి. భావకవుల పదము లీమూఁడు తరగతులలోనికినిఁ జేరవు. ఏలన, వీరి పదముల కాలంకారికులు నిర్ణయించిన వాచ్యలక్ష్యవ్యంగ్యార్థములుగాక క్రొత్త యర్థమున్నట్లున్నది. సంప్రదాయ సిద్ధమగు నర్థమును విద్వాంసులు గ్రహింపక పోరు. ఈ భావగీతమునందలి పెక్కుపద్యములు విశ్వప్రయత్నముచేతను సమన్వయింపకున్నవి. భావకవికిఁ బ్రకృతి సంప్రదాయములు, భాషాసంప్రదాయములు, అలంకారసంప్రదాయములు, వ్యాకరణసంప్రదాయములు, అన్వయ సంప్రదాయములును బూర్వులవానికన్నఁ గడుంగడు భిన్నముగాఁ గన్పట్టుచున్నవి. పోనీ యిట్టి భిన్నతయు నెల్ల భావకవులయం దేకవిధముగాఁ గానరాకున్నది. ఒక్కొక్క భావకవి సంప్రదాయములు వేఱు. విశ్వనాథ సత్యనారాయణగారి సంప్రదాయములు వేఱు. కృష్ణశాస్త్రిగారి సంప్రదాయములు వేఱు అనుగతమగు ధర్మము భావకవుల మొత్తమునకు లేదు. ప్రాచీనుల కట్లుగాక యనుగతధర్మ మున్నది. క్రొత్త రీతులు, క్రొత్తభావములును జొప్పించినను ఆ సంప్రదాయములకు భంగముకలుగకుండఁ జూచుకొనవలయును.

ఇందలి ప్రతిపద్యమును విమర్శించి శాస్త్రీయ ప్రమాణములతో పాటు కావ్యనాటకాదులనుండి దృష్టాంతములను జూప మొదలిడినచో గ్రంథమిఁక నాలుగింతలు పెరుగును. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నిమాత్రమే విమర్శించిచూపితిని.

కవి వ్రాసిన యెల్ల గ్రంథములు నొక్క తీరున నుండవు. కవి బాల్యమున వ్రాసిన గ్రంథములకన్నఁ బిదపఁబిదప వ్రాసిన గ్రంథము లెంతయు హృద్యతరములై యుండును. పింగళి సూరన బాల్యమున వ్రాసిన ప్రభావతీప్రద్యుమ్నముకన్నఁ బిదప వ్రాసిన కళాపూర్ణోదయము రసవత్తరముగా సహృదయులు దలంతురు. కనుక విమర్శకుఁ డొక కవి కావ్యముల విమర్శింపఁబూనినచో నాతని యుత్తమగ్రంథమును బ్రధానముగాఁ దీసికొని విమర్శింపవలయును. కవియొక్క సామర్థ్యవిశేషమా ప్రధానకావ్యము (Master piece) లో లీనమైయుండును. అట్లని శ్రీ సుబ్బరావుగారి యితర కావ్యములఁ గాక ప్రధానమును, మకుటాయమానమును, ఇతర భావకవులకు స్తవనీయమును, అనుకరణీయమును నగు 'తృణకంకణము'నే విమర్శింపఁగడఁగితిని వీరి యితర భావగీతములను, ప్రకృతకాలమునందున్న మరి కొందఱు భావకవులయు గ్రంథములను యథావకాశము విమర్శింతును.

కాని భావకవు లెల్లరు నిదే విధముగా వ్రాయుచున్నా రనుట పెద్ద తప్పు. శ్రీ దువ్వూరి రామిరెడ్డి, పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు, తల్లావఝల శివశంకరశాస్త్రి ప్రభృతులు వ్రాసిన కావ్యములు సుబ్బరావుగారి కావ్యములకన్న రసవత్తరములై యున్నవని యంగీకరింపక తప్పదు. వీరి భావగీతములందుఁ గన్పించిన యన్ని దోషములు వారి కావ్యములం దగపడవు. కొలఁదిగానున్నను అవి రసాపకర్షకములుగా లేవు. అట్టిదోషము లెల్లకవులకును సామాన్యమే. ప్రపంచములోనే కావ్యము నిర్దుష్టము కాఁజాలదు. కాళిదాసాది గ్రంథములలోఁ బెక్కుదోషములున్నవి. కాని వానిని విస్మరింపఁజేయు కౌశలము కవితలోఁ గలదు. రసభంజకము గాని దోషములు కొంతవఱకు సహింపవచ్చును. 'తృణకంకణము'నను అట్టి దోషములు సహింతము. కాని రసభంజకమైనచో నాదోషము క్షంతవ్యము గాదు. మొత్తముమీఁద పైవారి కవిత్వము సంప్రదాయసిద్ధముగా నున్నది. కాని యీ సుబ్బరావుగారి కవిత్వమువలె నసాంప్రదాయికముగా లేదు.

ఈ పైఁజూపిన దోషావళి భావకవితాసరస్వతికి భూషావళియే యన్నచో వారికిని నా సాష్టాంగదండప్రణామము.



# THE MUTUAL ASSURANCE Co., Ltd.

## ది మ్యూచుయల్ అష్యూరెన్సుకంపెని, లిమిటెడ్.

187, మౌంటురోడు :: :: :: చెన్నపురి.



మీ బిడ్డలు సంతోషించుటకై ఉగాదిపండుగనాడు, క్రొత్తధోవతులును, పరికిణీలును కొనుచున్నారు. సర్వ కాల సర్వావస్థలయందును యీ చిరునగవుతో నుండుటకు దగిన యేర్పాటులు చేశారా? లేకపోతే ఆలస్యముచేయక మ్యూచుయల్ అష్యూరెన్సుకంపెని యొక్క పాలిసీ ద్వారా వారి సౌఖ్యమునుగాపాడుడు.

**అన్ని తెలుగుజిల్లాలలోను ఏజంట్లు కావలెను.**



ప్రేమసామ్రాజ్యమునకు పృథివీసామ్రాజ్యమును అర్పించిన
శ్రీ. ఎనిమిదవ ఎడ్వర్డు- ఆతని ప్రేమనిధానము
శ్రీమతి సింప్సను

(ఒక మోటారుబోటులో విహారము)



ఖండాంతరయాత్ర సలిపివచ్చిన శ్రీ. మైసూరు సంస్థానాధిపతి

(విదేశములందు ఒకానొక వైమానికప్రముఖునితో కరస్పర్శగావించుచుండుట)



శ్రీ జౌంధ్ సంస్థానాధిపతి, వారిమనుమరాలు శ్రీమ[redacted]స్కా సాహేబు - పూర్వాచారపరాయణుడగు నీప్రభువు ఇటీవల అభూతపూర్వముగ ఇంగ్లండునకు పయనమయి వచ్చిరి



ఎ. రంగస్వామిఅయ్యంగారి స్మారక మందిరము, మాంబళము

కింగ్స్వేలోని హారిజన సేవకసంఘనిలయము యొక్క ఆవరణలో క్రొత్తగా నిర్మింపబడిన పారిశ్రామిక విద్యాశాల భవనములు. ఈ నిలయమందు ప్రదేశమననే పూర్వము కీ. శే. పంచమజార్జి చక్రవర్తి పట్టాభిషేకోత్సవము జరిగినది.



చెన్నపురి విశ్వకళాపరిషత్తు గ్రంథాలయపు నూతనభవనములు !



(1)

శతవార్షికోత్సవమునాటికి చెన్నపురి క్రైస్తవ ... తాంబ్రములో ... ఈ నూతన భవనములను ప్రవేశించినది.



# మానవధర్మసూత్ర మను గ్రంథ ముండెనా?

జటావల్లభుల పురుషోత్తము

ప్రస్తుతమనుస్మృతి శ్లోకరూపమున నున్నది. ఒకానొకప్పుడు మానవధర్మసూత్ర మను గ్రంథ ముండెడి దని మాక్సుముల్లరు, బుహ్లరు మున్నగు పాశ్చాత్యపండితు లూహించిరి. ఈ యూహకు కారణము లేవన :

(౧) ముందు బయలుదేరిన ధర్మగ్రంథములు సూత్రరూపముననను, పిమ్మట బయలుదేరిన ధర్మగ్రంథములు శ్లోకరూపముననను నున్నట్లు గన్పట్టుచున్నది. గౌతమ ధర్మసూత్రము, ఆపస్తంబధర్మసూత్రము మున్నగునవి ప్రాచీనములు. యాజ్ఞవల్క్యస్మృతి, పరాశరస్మృతి మున్నగునవి శ్లోకరూపమున నున్న నవీన గ్రంథములు. మనుస్మృతి యనేక హేతువులచే ప్రాచీన ధర్మగ్రంథ మని చెప్పవలసియున్నది. గౌతముడు, బోధాయనుడు మున్నగు ప్రాచీనులందఱు మనుధర్మములను పేర్కొని యున్నారు. కావున మనువు వారి కంటె ప్రాచీనుడు కావలెను. అంత ప్రాచీనమైన మనుధర్మశాస్త్రము సూత్రరూపమున నుండుటయె సహజము

(౨) శ్రౌతసూత్రము, గృహ్యసూత్రము, ధర్మసూత్రము అను మూడును కలసి కల్పసూత్ర మనబడును. దీనికే చరణ మని పేరు. ప్రస్తుతము మనకు ఆపస్తంబకల్పసూత్రము, బోధాయనకల్పసూత్రము, హిరణ్యకేశికల్పసూత్రము కలవు. మానవశ్రౌతసూత్రము, మానవగృహ్యసూత్రముకూడ నేడున్నవి. ఇక మానవధర్మసూత్ర మొక్కటియే లోపించియున్నది. అదికూడ నుండుచో మానవచరణము పూర్తియగును. అట్టి దొకప్పు డుండెడి దనుటకు ఆపస్తంబ, బోధాయన, హిరణ్యకేశిచరణముల సాదృశ్యమే సాక్ష్యము. మరియు పై ముగ్గురు ఋషులును నొక్కొక్క సంప్రదాయమునకు మూలపురుషు లగుటచే వారికి పూర్ణచరణము లున్నవి. మనువుకూడ నొక సంప్రదాయమునకు మూలపురుషు డని తేలుచో మానవచరణముకూడ పూర్తిగ నుండవలెనని తేలగలదు 'మంత్రిపరిషదం ద్వాదశామాత్యాన్ కుర్వీతేతి మానవాః'(కౌటిల్య ౧-౨) మున్నగు స్థలములలో 'మానవాః' అని ప్రయోగింపబడుటచే మానవసంప్రదాయమువారు కొందఱున్నా రను భావము వచ్చుచున్నది గాన మనువుకూడ నొక సంప్రదాయమునకు మూలపురుషుడే యని తేలును. అట్లగుచో మానవధర్మసూత్రముకూడ నుండుట సహజమే యగును.

(౩) కొన్నిస్మృతులలోను, నితర గ్రంథములలోను మనువచనములుగ నుల్లేఖింపబడిన వాక్యములు నేటి శ్లోకరూపమనుస్మృతిలో కన్పట్టకపోవుటయే కాక నేటిమనుస్మృతికి వ్యతిరేకముగగూడ గన్పట్టుచున్నవి గాన నా స్మృతికారులకును నితరగ్రంథకర్తలకును తెలిసియున్నది. నేటిమనుస్మృతి కాక మఱొక గ్రంథ మైయుండవలెను. అదియే మానవధర్మ సూత్రము కావచ్చును.

(౪) వసిష్ఠ ధర్మసూత్రములో 'పితృదేవతాతిథిపూజాయా మప్యేవ పశుం హింస్యాదితి మానవం' (౪-౫) అని యుండుటచే ఇట 'ఇతి మానవం' అనుటకు పూర్వమందున్న మాటలన్నియు మనువునుండి యుల్లేఖింపబడినట్లు స్పష్టమగుచున్నది. ఈ మాటలు శ్లోకరూపమున లేవు; సూత్రరూపముననే యున్నవి. ప్రస్తుతమనుస్మృతి శ్లోకరూపమున నున్నది కాన నీ యుల్లేఖ మీ స్మృతినుండి కాదు. కాన నీ మాటల నుల్లేఖించిన వసిష్ఠుడు మానవధర్మసూత్ర మను గ్రంథము నెఱిగియుండవలెను. అట్లే వసిష్ఠధర్మసూత్రములో నుల్లేఖింపబడిన యీ క్రిందివాక్యముగూడ మానవధర్మసూత్రమునుండియే కావలెను. "అథాపి బ్రాహ్మణాయ వా రాజన్యాయ వాభ్యాగతాయ మహోక్షాణం వా మహాజం వా పచే దేవ మస్మా ఆతిథ్యం కుర్వన్తీతి" ఈ వాక్యములోని 'ఇతి'కి పూర్వమునందున్న దంతయు మానవధర్మసూత్రమునుండి యుల్లేఖము కావలెను.

మానవధర్మసూత్ర మను గ్రంథ మొకప్పు డుండె ననుటకు పైన తెల్పబడిన యుపపత్తులు సమంజసములుగ లేవు; సరికదా యందు కొన్ని యుపపత్తు లీ సిద్ధాంతమును బాధించునవిగనే యున్నవి. ఈ యుపపత్తులలో దెల్పబడిన యంశములు సత్యదూర

ములుగ నుండుట వీని దౌర్బల్యమునకు మఱింత హేతువు. ఈ యుక్తులలో నొక్కొక్కదానినే యెత్తికొని దాని బలమును పరిశీలింతము.

(౧) సూత్రరూపమున నున్న గౌతమాపస్తంబాదుల ధర్మగ్రంథములు శ్లోకరూపమునున్న కొన్ని స్మృతులకంటె పూర్వములని స్థిరపడినంతమాత్రమున మనుస్మృతికంటెను గూడ నవి పూర్వములే యని చెప్పుట తప్పు. ఏ యంశమును ఋజువుచేయవలసియున్నదో దానినే 'ఉండియుండవలె' నని యూహించి తుదకా హేతువుచే దానినే సిద్ధాంతీకరించుట హాస్యాస్పదము. సూత్రగ్రంథములకు పూర్వమునగాని, సూత్రగ్రంథములు బయలుదేరుచున్న కాలములోగాని శ్లోకరూప ధర్మగ్రంథములేవియు బయలుదేర లేదనుటకు తగిన ప్రత్యక్షవాక్యమేమియు గాన్పింపనప్పుడును, బయలుదేరినవని యూహించుటకు దగిన యాధారము కొంతయున్నప్పుడును మన మాకాలములో శ్లోకరూప ధర్మగ్రంథములు బయలుదేరినవని చెప్పుటయే యెక్కుడు సమంజసము. సూత్రములకు పూర్వమున గూడ శ్లోకరూప ధర్మగ్రంథము లుండెడివనుటకు యాస్కుని నిరుక్తములో నుల్లేఖింపబడిన యీ క్రిందిశ్లోకమే యాధారము.

అవిశేషేణపుత్రాణాం దాయోభవతి ధర్మతః
మిథునానాం విసర్గాదౌమనుస్స్వాయంభువో ఽబ్రవీత్.

ఇట యాస్కుడు దాయభాగవిషయములో మనువు నుల్లేఖించుచున్నాడు. ఇది శ్లోకరూపమున నున్నది కాన యాస్కునకుగూడ శ్లోకరూప ధర్మగ్రంథములు తెలిసియుండె నని స్పష్ట మగుచున్నది. యాస్కుడు పైన తెల్పబడిన సూత్రగ్రంథములకు తర్వాతివాడు కాడు. కాన నీసూత్రగ్రంథములకు బూర్వమున కూడ శ్లోకరూప ధర్మగ్రంథము లుండెడివనుటకు బలము గల్గుచున్నది. ఈ శ్లోకము మనువుదేయని చెప్పబడినను ప్రస్తుతమనుస్మృతిలో లేకుండుట మనలను బాధించు నంశము గాదు.

కావున ధర్మసూత్రములలో మనువు పేర్కొనబడి యుండుటచే ధర్మసూత్రములకంటె శ్లోకరూప మనుస్మృతియే పూర్వ మని తేలుచున్నది. గౌతముడును, ఆపస్తంబుడును, బోధాయనుడును, వసిష్ఠుడును గూడ మనువును పేర్కొనియున్నారు. కాన వీరందఱును మనుస్మృతి నెఱిగియే యుండిరి. వీరు మనువునుండి యుల్లేఖించిన విషయములు నేటి మనుస్మృతిలో గన్పట్టుచుండుటచే వారెఱిగియున్నది శ్లోకరూప ధర్మగ్రంథమే కాని సూత్రరూప గ్రంథము కాదని స్పష్టమగుచున్నది.

(౨) మనువొక సంప్రదాయమునకు మూలపురుషుడనియు, మానవగృహ్యశ్రౌతసూత్రములు నేడుండుటచే మూడవదగు ధర్మసూత్రము కూడ నాదిలో నుండియుండుట సమంజసమే యనియు తలచుటకు వీలు లేదు. ఏలన: మానవసంప్రదాయ మనునది యెన్నడును నుండినట్లు కన్పింపదు. కౌటిల్యుడు 'ఇతి మానవాః' అని చెప్పినంతమాత్రమున మానవసంప్రదాయమువారుండినట్లు కౌటిల్యుడు తలచెనని చెప్పుటకు వీలులేదు. అట్లు చెప్పినో శంకరాచార్యులవారు కూడ నట్లు తలచెనని చెప్పవలసివచ్చును. ఏలన: శంకరులు గూడ 'ఇతి మానవే' అని యుదాహరించినారు. శంకరుని కాలములోగూడ మానవసంప్రదాయమొకటి యుండెనని దీనివలన తేలగలదు. కాని యట్లు చెప్పుట కాధారమేమియు లేదు; సరికదా ఆసంప్రదాయమే యుండియుండినచో మానవధర్మసూత్రములుగూడ నప్పటికి నిలచియుండవలెనని యనవలసి వచ్చును. కాని శంకరులే కాక శంకరులకు పూర్వముండిన కుమారిలభట్టుకూడ మనుశ్లోకములనే కాని మనుసూత్రముల నుదాహరించియుండలేదు. ఈ యంశములవలన నానాటికి మానవసూత్రములే కాక మానవసంప్రదాయముకూడ లేదని తేలుచున్నది. కాన 'మానవాః' అని ప్రయోగించిన కౌటిల్యునినాటికివి యుండవలెనని చెప్పుటకు కూడ వీలు గలదు

(3) మనువాక్యములుగ కొన్ని స్మృతులలో నుదాహరింపబడిన వాక్యములు నేటి మనుస్మృతిలో గన్పట్టకపోవుటచే నవి మానవగృహ్యసూత్రమునుండి గ్రహింపబడినవని మాక్సుముల్లరు మున్నగువారు చెప్పినమాటలో బలమును, సత్యమునుగూడ లేవు. నేటి మనుస్మృతిలోనున్న యంశములనే లేనట్లుగ వీరు భ్రమించిరి. వసిష్ఠధర్మసూత్రములో నీక్రిందిశ్లోకము గన్పట్టుచున్నది.

ప్రాక్సంస్కృతప్రమీతానాం స్వవంశ్యానామితిస్థితిః,
భాగధేయం మనుః ప్రాహ ఉచ్ఛిష్టోచ్ఛేషణే ఉభే (వసిష్ఠ. ౧౧-౨౨)

ఇట మనువునకు నుదాహరింపబడిన యీ యభిప్రాయము మనుస్మృతిలో లేదని బుహ్లారు పండితుడు చెప్పినాడు. కాని మనుస్మృతిలోని యీ క్రింది రెండుశ్లోకములలోను నీయభిప్రాయమే కాక చాలవఱకు పదములుగూడ గన్పట్టుచున్నవి.

అసంస్కృతప్రమీతానాం త్యాగినాం కులయోషితామ్,
ఉచ్ఛిష్టభాగధేయం స్యాద్దర్భేషు వికిరశ్చ యః
ఉచ్ఛేషణం భూమిగత మజిహ్మస్యాశఠస్య చ,
దాసవర్గస్య తత్పిత్ర్యే భాగధేయం ప్రచక్షతే.
(మను. 3-౨౪౫,౨౪౬)

అట్లే వసిష్ఠధర్మసూత్రములోని యీ క్రిందిశ్లోకములకు మనుస్మృతిలో నాధారము లేదని చెప్పుటకూడ భ్రమమూలకముగ నున్నది.

అహః ప్రాతరహర్నక్త మహరేకమయాచితం
అహః పరాకం తత్రైక మేవం చతురహో పరః,
అనుగ్రహార్థం విప్రాణాం మను ర్ధర్మభృతాం వరః,
బాలవృద్ధాతురేష్వేవం శిశుకృచ్ఛ్రముువాచహ.
(వసిష్ఠ. ౨౩-౪౨, ౪౩)

దీనికి మూలముగ మనుస్మృతిలోని యీ క్రిందిశ్లోకము గలదు.

త్ర్యహం ప్రాతస్త్ర్యహం సాయం త్ర్యహమద్యాదయాచితమ్,
త్ర్యహం పరంచ నాశ్నీయాత్ ప్రాజాపత్యం చరన్ ద్విజః.
(మను. ౧౧-౨౧౧)

ఇతర స్మృతులలో మనువాక్యములుగ నుదాహరింపబడిన కొన్ని వాక్యములు నేటి మనుస్మృతిలోని కొన్ని శ్లోకములకు వ్యతిరేకముగ నున్నవని చెప్పుట గూడ సత్యదూరముగ నున్నది. 'త్రయీవార్తాదండనీతిశ్చేతి మానవాః' అని కౌటిల్యుడు చెప్పియుండగ మనువు ఆన్వీక్షికిని గూడ పేర్కొనుటచే నీరెంటికిని వైరుధ్యమున్నదని బుహ్లారు చెప్పినాడు. కాని ఆన్వీక్షికిని త్రయిలో నంతర్భూతముగ కౌటిల్యుడే యెంచినాడు. కాన వైరుధ్యము పరిహరింపబడుచున్నది. ఇట్లే యితర వైరుధ్యములును కొన్ని పరిహరింపబడవచ్చును కొన్ని వైరుధ్యములు పరిహరింపబడజాలని వైనను గూడ నా యంశము మానవధర్మసూత్రముండెడి దనుటకు బలము నొసగజాలదు. ఏలన : స్మృతులలో నచ్చటచ్చట ప్రక్షిప్తములున్నవను నంశము నందరు నంగీకరించుచునే యున్నారు. అట్టి శ్లోకములను ప్రక్షిప్తములుగనో, పాఠాంతరములుగనో మనము భావింపవలెను. కాని యీ స్వల్ప వైరుధ్యములను గోరంతలు కొండంతలు చేసి వీనికిమూలహేతువు మానవధర్మసూత్ర మని చెప్పుట సాహసము.

(౪) ఇక వసిష్ఠ ధర్మసూత్రములోని ౪-౫ లో 'ఇతి' అని యుండుటచే నది యక్షరశః మనువునుండి యుదాహృతమని చెప్పుటలోని యౌచిత్యమును విచారింతము. ఈ సూత్రమునకు పిమ్మట నీ క్రింది రెండు శ్లోకములును గన్పట్టుచున్నవి.

మధుపర్కే చ యజ్ఞే చ
పితృదైవతకర్మణి,
అత్రైవ చ పశుం హింస్యా
న్నాన్యథేత్యబ్రవీన్మనుః.
నాకృత్వా ప్రాణినాం హింసాం
మాంస ముత్పద్యతే క్వచిత్,
నచ ప్రాణివధః స్వర్గ్యః
స్తస్మాద్యాగే వధో౽వధః.
(వసిష్ఠ. ౪-౬,౭)

ఈ రెండు శ్లోకములును మనుస్మృతిలోనే (౫-౪౧,౪౮)యున్నవి. ఈ రెంటి తాత్పర్యమే "పితృదేవతాతిథిపూజాయా మప్యేవ పశుం హింస్యాత్" అనుచోట (వసిష్ఠ ౪-౫) నున్నది. ఈ యభిప్రాయము మనువుదని చెప్పుటకు వసిష్ఠుడు 'ఇతిమానవమ్' అనుమాటలచే సూత్రమును ముగించుచున్నాడు. ఇట్లు సంగ్రహముగ మనుభావమును తెల్పినపిమ్మట వసిష్ఠుడు మనువాక్యముల నక్షరశః ఉదాహరించుచు రెండుశ్లోకములను గన్పఱచినాడు కావున 'ఇతి'కి పూర్వమందున్న భావమును, దానికి పరమందున్న అక్షరములును మనువువని మనము తెలిసికొనవలెను. 'ఇతి'కి పూర్వమందున్న యక్షరములే మనువువని భావింపరాదా యనః అపుడు శ్లోకములగతి యేమను ప్రశ్న వచ్చును. అదికూడ మనువువేయనుచో వసిష్ఠసూత్రమునాటికే శ్లోకరూపమనుస్మృతి యుండెననియు, దానినుండి వసిష్ఠు డుదాహరించెననియు తేలును. ఇట్లు సూత్రకాలము నాటికే శ్లోకరూపస్మృతి యుండెనని తేలుచో మానవధర్మసూత్ర ముండెనని యూహించుటకే యవసరము పోవును. ఈ శ్లోకములు మనువువి కావనరాదా యన నేటి మనుస్మృతిలోనవి గన్పట్టుచుండ నవి మనువువి కావనుట యెట్లు పొసగును? వసిష్ఠుడు మనువుభావమును సంగ్రహముగ వచనములో చెప్పినపిమ్మట మనువాక్యముల నుదాహరించినాడ

నుటయే సమంజసముగ నుండును. ఇక 'అథాప్రబాహ్మణాయ' మున్న గుసూత్రము మనువునుండి యుదాహృతమగుట కేమియు నాధారము లేదు. దాని చివర 'ఇతి' యని యుండుటచే నది కొంకతి భావమని వసిష్ఠు డుద్దేశించినట్లు మాత్రమే తెలగలదు. ఇట్టిస్థలములలో నొక్కొక్కప్పుడు 'ఇత్యేకే' అని యుండుటయు గాంచనగును.

ఈవిధముగ బరిశీలించి చూడ మానవధర్మసూత్ర మను గ్రంథ ముండెనను నూహ కేవలము నిరాధారమని తెలగలదు. మానవధర్మసూత్ర ముండెనని మనపూర్వులు నమ్మినట్లెచ్చటను గాన్పించదు. అంతియే కాక శ్రీ శంకరాచార్యులవారిశిష్యులయిన సురేశ్వరాచార్యులు మానవచరణము లేదని స్పష్టముగ వ్రాసి యున్నారు.

సాయంకాలపు నీడలు

K. P. S.



# జైత్రపాలుడు - కాకతీయులు

మారేమండ రామారావు

అనుమకొండ యేకశిలా నగరములనుండి యాంధ్రదేశమును పరిపాలించిన కాకతీయులకును, దేవగిరినుండి రాజ్యముచేసిన యాదవులకును కొన్ని పురుషాంతరములకాల మెడ తెగని పోరాటము జరిగెను. ఇందు యాదవ జైత్రపాలునికిని కాకతీయులకును జరిగిన యుద్ధములు మిక్కిలి ముఖ్యమైనవి. వానిని గూర్చి యిటీవల కొన్ని నూతనసిద్ధాంతములు బయల్వెడలినవి. చారిత్రకాధారముల సాహాయ్యమున వానిని విమర్శించుటయే యీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

జైత్రపాలునికిని గాకతీయులకునుగల సంబంధము యాదవ రామచంద్రదేవుని పైఠానుశాసనమునందును[1], హేమాద్రివ్రతఖండము నందలి రాజప్రశస్తియందును[2] గాంచనగుచున్నది. ఈ రాజప్రశస్తిలో జైత్రపాలుడు తిల్లింగాధిపుడగు రుద్రుని బలవుగ నుపయోగించి యుద్ధభూమిలో పురుషమేధమును చేసెనని చెప్పబడియున్నది. పైఠానుశాసనమునందీజైతుగియే త్రికళింగరాజునొకనిని జంపి, యతనిరాజ్యమును గైకొని, కరుణాంతరంగుడై గణపతిని చెరనుండికొనితెచ్చి రాజ్యమున నభిషిక్తునిజేసెనని చెప్పబడినది ఈ రెండాధారములనుండియు దెలియనగు వంశములను బట్టి జైతుగిచేజంపబడిన రుద్రుడెవడు? ఇతనిచేతనే సంహరింపబడిన త్రికళింగరాజెవడు? అతనిచే చెరనుండి విడిపింపబడిన గణపతి యెవడు? ఈ గణపతి యెవనిచే నెప్పుడు ఏ కారణమున చెరబెట్టబడెను? జైతుగి యీతని నేలవిడిపించెను? అనుప్రశ్నలు బయల్వెడలుచున్నవి.

## II

జైత్రపాలునిచే యుద్ధమున జంపబడిన రుద్రుడు తిల్లింగాధిపతియని వర్ణింపబడినాడు. ఈ జైతుగికాలము క్రీ. శ. 1191-1209 నడుమ తెలుగుదేశమున కేలికయని పేర్కొన దగినంత ప్రబలుడును, రుద్రదేవుడను పేరుగల వాడును నగు రాజు కాకతీయవంశజుడు, ననుమకొండపురవరాధీశ్వరుడు నగు రుద్రదేవమహారాజుగాక మఱియొకడు గన్పింపడు అంతియగాక రుద్రదేవునిరాజ్యము యాదవరాజ్య విస్తరణమున కడ్డమువచ్చుటయు[3] నీతనికిని జైత్రపాలునికిని శాత్రవమేర్పడుటకునింకొక కారణమగును. మరియును రుద్రదేవుని రాజ్యాంత్యకాలమునం దతనితమ్ముడగు మహాదేవరాజు కొంతయశాంతిని గలిగించెను.[4] స్వరాజ్య విస్తరణకాంక్షియై, కంటకమువలె నున్న కాకతీయరాజ్యము నెప్పుడు కబళింతుమాయని వేచియున్న జైత్రపాలుడీ యదనును గనిపెట్టి యనుమకొండరాజ్యముపై దాడివెడలెను. అప్పుడు జరిగినయుద్ధములో కాకతి రుద్రదేవుడు మరణించియుండును ఈతని ప్రశంస శా. శ. 1117 కు సరియగు 1196 కు బిమ్మట గన్పింపకుండుటచే[5] నీవృత్తాంత మా సంవత్సరముననే జరిగెనని యూహింపవచ్చును.

ఇదియిట్లుండ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తామిటీవల ప్రకటించిన "కాకతీయాంధ్రరాజ యుగచరిత్రము" నందు జైతుగి రుద్రదేవునిజంపెనని వర్ణించినది "అతిశయోక్తి"యు, "నింద్యము" నని వ్రాసినారు[6]. కాని యద్దేగ్రంథమున వారే యీ యూహను పూర్వపక్షము చేసికొనిరి[7].

## III

జైత్రపాలుడు యుద్ధములో సంహరించిన త్రికళింగరాజెవడు? అనుప్రశ్న కిటుపై సమాధానము నొసగవలసియున్నది. ఈ సందర్భమున ముఖ్యముగ గమనింపదగినవి రెండువిషయములు గలవు. అందు మొదటిది జైతుగి పై త్రికళింగరాజును చంపి యతనిరాజ్యమును వశపరచుకొనె ననునది. రెండవవిషయము జైతుగిచే కారాగారమునుండి విడిపింపబడిన గణపతి కాకతీయగణపతిదేవుడే యని పండితాభిప్రాయమైయుండుట. అగుచో పై త్రికళింగరాజు రుద్రదేవుడు కాజాలడు. అట్లనుటకు రెండుప్రతిబంధకములు గలవు. రుద్రదేవుడు త్రిలింగ లేక తెలుగుదేశమున కేలికయని పైఠానుశాసనమున జెప్పబడి యున్నాడు. అతనికి త్రికళింగరాజబిరుదమున్నటు లెచ్చటను చెప్పబడలేదు. అంతియగాక రుద్రదేవుని మరణానంతర మతనిరాజ్యము జైతుగిచే నాక్రమింపబడక నతనితమ్ముడగు మహాదేవరాజుచే పాలింపబడెను. ఈ కారణములను బట్టి పైత్రికళింగరాజు మహాదేవరాజే యగునని నేనిదివరలో వ్రాసియుంటిని. ఈ యూహకు క్రిందియాధారములుకూడ గలవు.

(1) జైతుగి కాకతీయరాజులలో రుద్రదేవ మహాదేవ గణపతిదేవులకు సమకాలికుడు[8]. అందు రుద్రదేవునితో బోరి యతనిని చంపి, యీజైతుగి గణపతిదేవుని బంధవిముక్తుని జేసెనని యిదివరలో చెప్పియుంటిని. అప్పుడీయిర్వురు కాకతీయరాజులకును నడుమగల మహాదేవరాజుతోగూడ జైత్రపాలుడు యుద్ధముచేసియుండుట అసంభవము కానేరదు.

(2) మహాదేవరాజు మూడు సంవత్సరముల కాలమే రాజ్యముచేసి మరణించుటచే[9] నది హఠాత్సంభవమేయని తోచుచున్నది.

(3) స్థానికగాథలయందును, ప్రతాపచరిత్ర సోమదేవరాజీయాదులందును గూడ మహాదేవరాజు యాదవరాజధాని యగు దేవగిరిని మూడుమాసములు ముట్టడించి, యచటజరిగిన "యసమగజయుద్ధము"న మరణించెనని చెప్పబడియున్నది.[10] గణపతిదేవునినాటి గారవపాడు తామ్రశాసనముగూడ పై దేవగిరి ముట్టడిని పేర్కొనుచున్నది.[11] దీనినిబట్టి యీ ముట్టడిలో నప్పటియాదవరాజగు జైత్ర

---

1. Ep. Ind III. p. 113.

2 Bhandarkar: Early Hist. of the Dekkan. (3rd Edn.) p. 243.

3. కల్యాణీనగరమునుండి ధర్మపురి మంతెనలమీదుగా మాల్యవంతమున కొకగీత గీసిన యెడల నీనాటి కాకతీయరాజ్యపు పశ్చిమోత్తరసీమ యేర్పడును. దానికావల యాదవులుండిరి.

4. ప్రతాపచరిత్రము

5. తెలంగాణాశాసనములు. కాక. నం.7.

6. పుట ౩౬౮.

7. Ibid పుట ౩౭౦.

8. రుద్రదేవుడు 1158-1196, మహాదేవుడు 1196-1198, గణపతి 1198-1261 } 1191-1209 జైత్రపాలుడు

9. సోమదేవరాజీయము-౨ ఆశ్వాసము.

10. నా "కాకతీయాంధ్ర రాజయుగచరిత్ర విమర్శనము" పుట 52.

11. Ep. Ind. X

పాలుడే మహాదేవరాజును గజయుద్ధమున చంపెనని యూహించుట మిక్కిలి సమంజసముగ నుండునుగదా!

ఇట్లు స్పష్టముగ దెలియని యీయంశమును గూర్చి యిటీవల కొన్ని విమర్శనలును, వానితో బాటుగ గొన్ని నూతన సిద్ధాంతములును బయల్వెడలినవి. శ్రీ వీరభద్రరావుగారు మహాదేవరాజు రాజ్యముచేయనే లేదని యొకసిద్ధాంతమును ప్రతిపాదించినారు.[12] వారిటీవల ప్రకటించిన "కాకతీయాంధ్రయుగచరిత్రము"ను విమర్శించుచు "అ. రా." యను మరియొక పండితులు నీయూహ నామోదించినారు.[13] శ్రీ కుంపూరి ఈశ్వరదత్తుగారు పైరాను శాసనమునందలి త్రికళింగరాజు కాకతిమహాదేవరాజు కాజాలడని వ్రాసినారు.[14] ఈపండితుల యూహలన్నియు విమర్శార్హములై యున్నవి.

శ్రీ వీరభద్రరావుగారు మహాదేవరాజు రాజ్యముచేయనే లేదనుటకు జూపిన కారణము మిక్కిలి బలహీనమైయున్నది. అతడు తన యన్నయగు రుద్రదేవునికాలమున దిరుగుబాటుచేసెననియు, నంతట నీసోదరులిర్వురకును యుద్ధముజరిగెననియు, నందు మహాదేవరాజు రుద్రదేవునిచే జంపబడెననియు వీరిసిద్ధాంతము. దీనికి స్థానికచరిత్రము, ముఖ్యముగా బ్రతాపచరిత్రము ఆధారమట! ప్రతాపచరిత్రమునందెచ్చటను పై వృత్తాంతము గన్పింపదు. అంతియగాక నాగ్రంథమున మహాదేవరాజు రుద్రదేవుని యనంతరము రాజ్యమునకువచ్చి, మూడేండ్లు పరిపాలనమొనర్చెనని చెప్పబడియున్నది. ఇట్లు ప్రతాపచరిత్రమునకే గాక శ్రీ వీరభద్రరావుగారి సిద్ధాంతము శాసనములకుగూడ విరుద్ధముగనేయున్నది. కాకతీయులశాసనము లనేకములు మహాదేవరాజు రాజ్యముచేసెనని స్పష్టముగ దెల్పుచున్నవి. అంతియగాక రుద్రదేవుని రాజ్యము క్రీ. శ. 1196 లో నంతమయ్యెననియు, గణపతిదేవుని రాజ్యము 1198 లో ప్రారంభమయ్యెననియు వీరి నిర్ణయము.[15] ఇది వాస్తవమేయై మహాదేవరాజు రాజ్యముచేయకనే మరణించి యుండినచో క్రీ. శ. 1196-1198 నడుమగల కాలమున కాకతీయరాజ్య మరాజకమై యుండెనా? మరియును శ్రీ వీరభద్రరావుగారే తమ నూతనగ్రంథమున నొకచోట[16] రుద్రదేవుని యనంతర మతని సోదరుడగు మహాదేవరాజు "౧౧౯౬ నుండి ౧౧౯౮ వ సంవత్సరమువరకును బరిపాలనముచేసి యాసంవత్సరమున దేవగిరిరాజయిన జైత్రపాలునితో జరిగిన యుద్ధమునందు మృతినొందెను" అని వ్రాసినారు. దీనినుండి వారిసిద్ధాంతము స్వకపోలకల్పితము, నవిశ్వసనీయము నని స్పష్టమగుచున్నది.

మహాదేవరాజు రాజ్యము చేయలేదనుటకు "అ. రా." గారు చూపిన కారణములును వింతగనే యున్నవి. "అతడు రాజ్యమునకు రాలేదనే అభిప్రాయముతో మేము పూర్తిగా ఏకీభవిస్తున్నాము. మిక్కిలి విశ్వాసార్హములయిన ఉప్పరపల్లి, ఏకామ్రనాథ, పాలంపేట శాసనములలో రుద్రుని తరువాత గణపతి రాజ్యమునకువచ్చినట్లు స్పష్టముగా కనబడుతున్నది. పాఖాల, కుందవరం శాసనములలో మహాదేవరాజును గూర్చివ్రాసినది కవుల యత్యుక్తి అని భావించవలెను." అని యీ పండితుని యభిప్రాయము. ఇందీక్రింది భ్రమప్రమాదములు గలవు.

(1) ఉప్పరపల్లి, ఏకామ్రనాథ, పాలంపేట శాసనములు మిక్కిలి విశ్వాసార్హములట. ఇతర కాకతీయశాసనము లన్నిటికంటెను వీనియందుగల విశిష్టతయేమో? అవి "అ. రా." గారి విపరీతసిద్ధాంతమున కనుకూలములని వారేచెప్పియుండుట తప్ప మరియొకకారణ మేమియు గన్పింపదు. అటులే పాఖాల కుందవరము శాసనము లత్యుక్తిపూరితములనుటయు నసమంజసమేయగును. ఈ రెండుశాసనములేకాదు, మల్కాపురగారవపాడు శాసనములును, మరియెన్నియో యితరములును, వాఙ్మయమును, ప్రతాపచరిత్రాదులునుగూడ మహాదేవరాజురాజ్యము చేసెననియే తెల్పుచున్నవి. వీనినన్నిటినిగూడ నత్యుక్తిపూరితములనియే "అ. రా." గారు త్రోసిపుచ్చ సాహసింతురా?

(2) వీరు "మిక్కిలి విశ్వాసార్హము" లని విశ్వసించెడి ఉప్పరపల్లి, ఏకామ్రనాథ, పాలంపేట శాసనములలోని యేకామ్రనాథశాసనము[17] నందలి 9 వ శ్లోకము రుద్రదేవుని ప్రశంసించుచున్నది. పిమ్మట "తదనుజ గణముఖ్యః" యని ప్రారంభింపబడి 10 వ శ్లోకము మహాదేవరాజునుగూర్చి చెప్పుచున్నది. అటుపై 11 వ శ్లోకములో గణపతి ప్రశంస గలదు. దీనివలన రుద్రునియనంతరము గణపతియే రాజ్యమునకువచ్చెనని యేర్పడుట లేదే! ఈ విషయమున "అ రా." గారు మిక్కిలి పొరబడిరి.

(3) పాలంపేటశాసనము[18] రుద్రదేవుని యనంతరము కాకతీయరాజ్యమున కపాయముగలిగెనని చెప్పుచున్నది. అందైనను రుద్రునికిపిమ్మట గణపతి రాజయ్యెనని లేదు.

(4) కాకతీయుల చరిత్రమునకు సంబంధించిన యాధారములన్నియు బాహుళ్యముపై మహాదేవరాజు రాజ్యమేలెననియే చెప్పుచుండ దానిని తిరస్కరించుట మిక్కిలి సాహసకార్యమేయగును. శాసనములలో పూర్వీకులను పేర్కొనునపుడు కొందరిప్రశంస మానుటయు గలదు. పెక్కు కాకతీయశాసనములు రెండవబేతరాజునుండియే వంశావళిని ప్రారంభించుచున్నవి. దానినిబట్టి యాతనికి బూర్వులుండిన మొదటిప్రోలి, మొదటిబేతరాజులు రాజ్యమేలలేదనుట సమంజసముకాదుగదా! అటులే ఉప్పరపల్లి శాసనములో[19] గణపతిదేవుడు "రుద్రనరేంద్రసుపుత్రుండును" అని వర్ణింపబడినాడు. ఇతరాధారములన్నియు నతడు మహాదేవరాజు పుత్రుడనియే చెప్పుచున్నవి. అప్పుడు పై యుప్పరపల్లి శాసనము "మిక్కిలి విశ్వాసార్హ"మని యెంచుట హాస్యాస్పదమగును గదా!

ఇక మిగిలినది జైతుగిచే చంపబడిన త్రికళింగరాజు కాకతిమహాదేవరాజు కాదను శ్రీ ఈశ్వరదత్తుగారి వాదము. ఇట్లనుటకు వీరు పేర్కొనినకారణము మహాదేవరాజునకు త్రికళింగరాజబిరుదము లేకుండుటయే. అయినను పైసమన్వయము నీక్రిందికారణములచే సమర్థింపవచ్చును.

(1) త్రికళింగరాజ బిరుదము తూర్పుగాంగులకును, చేదిహైహయులకును నుండిన

12. "కాకతీయాంధ్రరాజయుగచరిత్రము" పుట ౩౮౦.

13. ప్రతిభ, సం I-సం. i.

14. ఆం. సా. ప. ప.

15. "కాకతీయాంధ్రరాజయుగచరిత్రము" పుటలు ౨౩౬, ౩౮౩.

16. Ibid. పుట ౩౩౯.

17. Ind. Ant. XXI. p. 200

18. Hyd. Arch. Sur. No. 3.

19. Ibid. 27-28 పంక్తులు.

మాట నిజమే. కాని వారిలో నెవడైన నొక రాజు యాదవజైత్రపాలునిచే జంపబడెననుట కాధారములేవియు గానరావు.

(2) కళింగమున నుత్తరకళింగము, మధ్యకళింగము, దక్షిణకళింగము నను విభాగము లుండెడివి. తూర్పుగాంగు లీమూడుభాగములపైనను గూడ తమయధికారమును నెరపనప్పుడు సహితము "త్రికళింగాధిపతి" బిరుదమును వహించిరి. అట్లే చేదిరాజులును కళింగమున కొంతభాగమునే యేలినను పై బిరుదముతోడనే వ్యవహరింపబడిరి. దక్షిణమున కళింగదేశమునకు గోదావరీనది సరిహద్దుగ నుండెను. కాకతిరుద్రుని శాసనములు ద్రాక్షారామమునందుండుటచే[20] నాప్రాంత మతనిచే జయింపబడెనని తెలియుచున్నది. అగుచో రాజమహేంద్రవరమునుండి ద్రాక్షారామమువరకునుగల కళింగదేశభాగము మహాదేవరాజునకు సంక్రమించియుండును. ఈవిధమున చేదిగాంగరాజులవలెనే యితడుగూడ కళింగదేశపాలకుడగుటచే త్రికళింగాధిపతి యగును.

(3) అంతియగాక ద్రాక్షారామమున తూర్పుగాంగుల శాసనము లెన్నియో గలవు. రుద్రునికాలముననే కాకతీయరాజ్య మిచటికి విస్తరించియుండుటచే గాంగులకును కాకతీయులకును నిచట సంఘర్షణ జరిగియుండుట కవకాశ మేర్పడెను. పూర్వ మొకరాజు తన శత్రువును ధిక్కరించుటకై యతనిబిరుదములను తాను వహించు టాచారమైయుండెను. అట్లే తూర్పుగాంగులను ధిక్కరించుటకై కాకతిమహాదేవరాజు వారి త్రికళింగరాజబిరుదమును తాను గైకొనియుండవచ్చును.

ఈ చర్చవలనబట్టి కాకతిమహాదేవరాజు రాజ్యముచేసెననియు, నతడు దేవగిరిని ముట్టడించెననియు, నప్పుడు జరిగినయుద్ధమునందు యాదవజైత్రపాలు డతనిని చంపెననియు స్పష్టమగుచున్నది.

IV

ఇక మిగిలినది గణపతిదేవుని జైత్రపాలుడు బంధవిముక్తుని చేసినవిషయము. ఈగణపతిమహాదేవరాజుపుత్రుడును, కాకతీయరాజులలో నగ్రగణ్యుడునునగు గణపతిదేవుడేయనిపండితు లందరు నంగీకరించియున్నారు. అగుచో నితనిని చెరబెట్టినవారెవరు? జైతుగి యితని నేల విడిపించెను? గణపతి చెరలోనుండిన స్థలకాలములేవి? అనుప్రశ్నలు బయల్వెడలుచున్నవి.

పెదతండ్రియగు రుద్రదేవుడే గణపతిని చెరబెట్టెనని శ్రీవీరభద్రరావుగారి యభిప్రాయము.[21] అందులకు వారు చూపెడికారణము గణపతి తనతండ్రి మహాదేవరాజుతో జేరి తిరుగుబాటుచేయుటయే. ఈ వృత్తాంత మే యాధారమునందును లేకుండుటచే విశ్వసనీయము కాదు. గణపతిదేవుని శాసనములెన్నియో రుద్రదేవుని పెక్కువిధముల పొగడుచున్నవి. ఉప్పరపల్లి శాసనమునం దతడు "రుద్రనరేంద్ర సుపుత్రుండును" అని వర్ణింపబడినాడు. దీనిని బట్టి వారిద్దరకును గల యనుబంధము స్పష్టమగుచున్నది. ఇంతకంటెను జైతుగియే గణపతిదేవుని చెరబెట్టెననుట సమంజసముగనుండును. మహాదేవరాజును జంపి యనంతరవారసుడగు గణపతిదేవుని చెరబెట్టినచో నరాజకమై కాకతీయరాజ్యము విధ్వంసమగుటయు, తనమార్గము నిష్కంటకమగుటయు జరుగనను నుద్దేశముతోడనో, లేక తమయేలికను బందీకృతునిజేసినచో కాకతీయరాజ్యప్రజలు యాదవుల యధికారము నంగీకరింతురను నుద్దేశముతోడనో జైత్రపాలు డట్లు చేసి యుండవచ్చును. అంతియగాక నటు రుద్రుడు నుగాక నిటు శత్రురాజ్యపాలకుడును, మహాదేవరాజహంతకుడునునగు జైత్రపాలుడును గానిచో గణపతిదేవుని చెరబెట్ట నవసరముగలవారింకెవ్వరును గన్పింపరు. జైతుగి గణపతిని విడిపించెనని యున్నదిగాని పైరాను శాసనములో నతనిని చెరబెట్టెనని లేదని శ్రీఈశ్వరదత్తుగారి మరియొకయాక్షేపణ. కాని యా శాసనముననే జైతుగి గణపతిని చెరబెట్టెనని యూహించుట కవకాశము గలదు. అందు జైతుగి "కరుణావరుణాలయః" అని వర్ణింపబడినాడు. దీనినుండి యతడు గణపతిపై కరుణించి యతనిని బంధవిముక్తునిజేసెనని చెప్పవచ్చునుగదా. ఎవరోమరియొకరు చెరబెట్టగా జైతుగి గణపతిపై కరుణించెనా? అట్లనుట కాచెరబెట్టినవారెవరో తెలియుట లేదు. అందువలన మహాదేవరాజును జంపి జైతుగి యతనితనయుడగు గణపతిదేవుని చెరబెట్టి, కొంతకాలమైనపిమ్మట బంధవిముక్తిని చేసెనని చెప్పుటయే సమంజసముగనుండును.

గణపతిదేవుడు చెరలోనుండిన దెచ్చట? అనునది మరియొకప్రశ్న. జైత్రపాలుడే యతనిని చెరబెట్టెనని పైన చెప్పియుంటిమి. అట్టియెడ కాకతీయులకు ప్రబలవిరోధియగు జైత్రపాలుడు గణపతిదేవుని నాంధ్రదేశముననే చెరయందుంచుట సంభవముకాదు. అట్లేయగుచో శత్రురాజులందరను పారదోలి కాకతిరాజ్యలక్ష్మి నకాలప్రళయమునుండి కాపాడిన రేచర్లరుద్రసేనాని మున్నగువారలు గణపతిదేవుని వెంటనే విడిపించియుందురు. అంతియగాక జైత్రపాలు డంత తెలివితక్కువవాడై యుండడు. కాన గణపతిదేవుని కారాగృహనివాసము ఆంధ్రదేశమునగాదనియు, బహుశః దేవగిరిలోనై యుండుననియు చెప్పవచ్చును. మరియును పాలంపేటశాసనములో రుద్రదేవుని మరణానంతరము కాకతీయరాజ్యముపై నెందరో శత్రురాజులు దండెత్తివచ్చి దానిని విధ్వంసముజేయ యత్నింప, రేచర్లరుద్రుడు వారిని పారదోలెనని చెప్పబడినది. ఈ శాసనమున పైయుపద్రవములు జరిగినకాలమునం దెవరు రాజుగనుండిరో చెప్పబడలేదు. గణపతి యాకాలమున రాజుగనుండి, స్వదేశముననే యుండినచో యీవిప్లవములుజరుగుట సంభవము, ఒకవేళ జరిగినను వానిని వర్ణించునపుడు గణపతిప్రశంస వచ్చియేయుండును. ఇదియు నాకాలమున గణపతి దేశమున లేడనియే సూచించుచున్నది.

గణపతిదేవుడు చెరలోనుండినకాల మేది? మదరాసుశాసనశాఖవారి రాజు మొట్టమొదటి శాసనము క్రీ. శ. 1209 నాటిదనియు, నం దతని 10 వ రాజ్యవత్సర మున్నదనియు, నంతకు బూర్వపుశాసనము లేవియు గన్పింపకుండుటచే క్రీ. శ. 1198–1209 నడుమ గొంతకాల మితడు చెరయం దుండియుండవలెననియు నూహించియున్నారు[22]. కాని యీ వృత్తాంతము నింతకంటెను తక్కువకాలమునకు దీసికొనిరావచ్చును. నైజాం రాజ్యమునందలి పిల్లలమఱ్ఱిగ్రామములోని శా. శ. 1124 నాటి యొకశాసనమునందు గణపతిదేవునిరాజ్యము "శమితసకలోపప్లవ ప్రౌఢరాజ్యం" అని వర్ణింపబడినది.[23] ఇంతవరకు నిదియే గణపతినాటి మొదటి

---

20. S. I. I, IV.

21. "కాకతీయాంధ్రరాజయుగచరిత్రము" పుట ౩౮౦.

22 M.E.R. 1906 part II. p. 80.

23. తెలంగాణాశాసనములు, కాక.నం.9 పు. 29. 34-35 పంక్తులు.

శాసనము. దీనినిబట్టి యీ రాజు కారాగృహ నివాసము క్రీ. శ. 1198 లో మహాదేవ రాజు మరణించిననాటినుండి యీ శాసనకాలమగు క్రీ. శ. 1202 వరకునుగల నాలుగేండ్ల కాలమునం దైయుండునని తెలియుచున్నది. ఈ శాసనమున పేర్కొనబడిన ఉపప్లవములు పాలంపేటశాసనములోని శత్రురాజులవిజృంభణమునకే సూచనలని చెప్పవచ్చును. వీనిప్రశంస 1202 నాటి యీ శాసనమునందుండుటచే నీవిప్లవము లాసంవత్సరముననో, యంతకు గొంచెముముందుగనో జరిగెననియు నూహింపవచ్చును.

పైన చర్చింపబడిన విషయములనుబట్టి జైత్రపాలుడు కాకతి మహాదేవరాజునుగూడ జంపెననియు, నతనిపుత్రుడగు గణపతిని చెరబెట్టి క్రీ. శ. 1202 ప్రాంతమున కరుణించి విడిచెననియు చెప్పవచ్చును.



దాగుడు మూత

—శర.—



హరిజనవార్షికోత్సవము, గుడివాడ



హరిజన భోజనవసతిగృహము, తణుకు





కాకినాడ హరిజనబాలికావసతిగృహ విద్యార్థినులు

మైలాపూరు యువతీసమాజము, తృతీయవార్షికోత్సవము



మహాలక్ష్మీ పఠన మందిర చతుర్థవార్షికోత్సవము, గుంటూరు





మైలాపూరు యువతీ సమాజముయొక్క నూతనభవన ప్రవేశోత్సవము



చెన్నపురి సేవాసదనమందు స్థానిక మహిళాసమాజముయొక్క 11-వ సమావేశము

# శరీరయజ్ఞము

[క్రీ. శ. 1561-1562 ఏఁడులనాఁటి చరిత్రకు సంబంధించిన నవల]

కథకుడు: విద్వాన్ టి. ఆర్ముగం పిళ్లై

హుమయూన్ చక్రవర్తి మరణించునప్పు డక్బరు పదుమూఁడేఁడుల యర్భకుఁడు. ముక్కుపచ్చ లారని యాపిన్నవయసుననే యతఁడు తన గురు వగు బహారాంఖాను నిసాయమున సికందర్‌షా, అడాలీ, విక్రమాదిత్య బిరుదనాముఁ డగు హీముూ మొదలగు ప్రబలశత్రువర్గమును రూపుమాపె తనతండ్రిసింహపీఠిక నధిష్ఠించెను.

బహారాంఖానుఁ డక్బరు పదునెనిమిదేఁడులవయస్కుఁ డైనప్పుడు కూడ తన నిరంకుశాధికారముచేఁ గొన్ని యత్యాచారములచేత నతని మనస్సును నొప్పించుచుండినందున చక్రవర్తి రాజ్యవ్యవహారములను స్వాయముగ స్వతంత్రించి నడుపనారంభించి, తత్సంకల్పమునకుం దొలిపూజగ బహారాంఖానుని మక్కా ఫకీరుగ నొనర్చెను.

అట్లు స్వతంత్రించిన అక్బరుపాదుషా పాలనమును సహింపక మాళవము నేలుచుండిన బాజ్‌బహాదూరనెడి వాఁడు తిరుగఁబాటు సూపి చెలరేఁగెను. ఆతని నణఁగఁద్రొక్కుటకు ఆదంఖాన్ అనెడు తన సరదారు నొక్కనిఁ బంపఁగా నతఁడు సారంగపురము సమీపమున బాజ్‌బహదూరును సంపూర్ణముగ నోడించి, మాళవముఖ్యనగరమగు ఉజ్జయినీ పట్టణమును జేరుకొనియెను.

బాజ్‌బహదూరున కొక హైందవభార్య రూపసి, రూపమతియనునది కలదు. ఆమె కోటతలుపులుమూసికొని యాదంఖాను నెదుిరించి పోరెను. అతఁ డా ప్రహరిగోడ నొకచోఁ బగిల్చి యాశిథిలములచే నగడ్తఁ బూడిచి యశ్వారూఢుఁడై పురప్రవేశ మొనర్చెను!

రాణి రూపమతీదేవి ధైర్యసాహసములు తాన చూచి యాశ్చర్యచకితుఁడైన యాదంఖానుఁడు తిన్నఁగ నామె రాణివాసముఁ జొచ్చి తన్నుఁ బరిణయ మాడినచో నామెరాజ్ఞీపదవిని స్థిర మొనర్చెదనని యామెకుకబురంపెను. రూపమతి వాని బారినుండి విమోచన మందు మార్గ మెఱుఁగక నాఁటిరాత్రికి రమ్మని చెప్పి పంపెను.

నిర్దిష్టసమయమున కాతఁ డత్యంతోత్సాహపరవశుఁడై యంతిపురికేగుదెంచి రాణిగారున్న గదిలోనికి వెళ్లెను. హంసతూలికాతల్పమున రాణి సాలంకృతయై మేలి వెలిచీరముసుఁగిడియొక ప్రక్క కొరగికూర్చుండి యాతనిరాకకై యత్యంతసంతోషముసఁ బ్రతీక్షించుచుండినట్లు వ్యక్తముకాఁగా నాదంఖానుఁడు తన నోము ఫలించెనని యువ్విళ్లూరుచు, బిరబిర వెళ్లి యామె ప్రక్కన కూర్చుండెను.

పాప, మామెకు సిగ్గధికముకాఁబోలును, మౌనముగా నుండెనని సరసంపు హావభావములు వ్యక్తపఱచుచు నామెముసుఁగును స్వతంత్రించి తీసివైచినాఁడు. రూపమతీదేవి విషపానము చేసి చచ్చియుండెను!

* * *

హుమయూను చక్రవర్తి కనేక భోగస్త్రీ లుండిరి. వారిలో మాహంఆంగా యనునామె యగ్రగణ్య.



ఆమెయొక్క అపత్య మాదంఖాన్ సరదారుఁడు. కావున నక్బ రాతని మిక్కిలి విశ్వాసపాత్రుఁడనియే నమ్మి యుండువాఁడు. అదియుఁగాక మాహం అంగా తన పాలకజనని కావున నామెపుత్రుఁడు తన కత్యంతము కూర్చువాఁ డని యెంచియుండెను. ఆదంఖానుఁడు గొప్ప శూరుఁడు. కావున నాతఁడు పాదుషావారి విశ్వాసమున కెంతయుఁ దగినవాఁ డనియే యనవలయును. మాళవదేశము జయించినాఁడు కావునఁ దాత్కాలికముగ రాజప్రతినిధియై రాచకార్యములఁ జూడ నారంభించెను.

అక్బరుపేర శాసనము లనేకము సృష్టింపఁబడెను. రాష్ట్రమున విప్లవకారుల రూపుమాపవలయు నని ఆదంఖానుఁడు చేయవలసిన సమస్త శాసనములను జేసి యాచరణ కుంచెను. ధర్మవ్యవస్థను జక్కఁగా నెలకొల్పవలయు నని, దయాదాక్షిణ్యములులేక, స్త్రీవృద్ధ శిశువివక్షలేక, విద్రోహులని యనుమానమున్నంత మాత్రమునఁ బూర్వాపరవిచారణ లేక వారి నందఱ నతిదారుణముగఁ జిత్రవధ గావించెను. న్యాయాచరణమను నెపమున నాతఁ డొనరింపని యక్రమములు లేవు

రాజద్రోహు లని పరిగణింపఁబడినవారిలో నుజ్జయినీనివాసియగు విష్ణుపండితుఁడను యువకుఁ డొక్కఁడు. ఆతఁడొనర్చిన విద్రోహమేదియో విస్పష్టపడలేదు. కాని యాతని వ్రాలున్న లేఖ యొక్కటి బాజ్ బహదూరునింట లభించినదే గొప్ప నేరముగ నిశ్చయింపఁబడినది.

సింహావేదికపై సుఖాసీనుఁ డయి నిండోలగమున్న రాజప్రతినిధియెదుట పెడరెక్కలు విఱిచికట్టఁబడిన విష్ణుపండితుఁడు నిలువఁబెట్టఁబడెను. నిమ్మపండువంటి మైచాయ; సుందరమైన విగ్రహము; చెక్కితీర్చినట్లుండు నవయవస్ఫూర్తి; నూనూఁగుమీసలు; చక్కని బ్రాహ్మణతేజ ముట్టిపడుచుండ నాతఁడు భగవత్సాక్షిగఁ దానెట్టి విద్రోహులతోడను జేరియుండలేదని ప్రమాణ మొనర్చెను.

దొరకిన జాబువిషయమై ప్రశ్నింపఁ నతఁడు చిఱునవ్వు దొలుకఁబోవుచుండఁ దా నా తేదీనాఁ డుదయపురమున నవోఢయైన తన భార్యతోఁ దొలికూటమిసంబరమున మునిఁగియుంటి ననియు, మానవుని జీవితమున నట్టి మహానందదాయకమయిన వేళ నట్టి విద్రోహములనైనఁ దలఁపెట్ట నవకాశ మేర్పడుట హాస్యాస్పదమనియు నుగ్గడించి, తానట్లు చెప్పికొనవలసివచ్చిన దానికు యువకులకు సహజమైన సిగ్గును వ్యక్తపఱచు నొక్క చిన్ననవ్వు నవ్వెను.

ఆ నవ్వు తురుష్కునకుఁ గను గ్రుచ్చెను. "కాఫిరు" లెవ్వరుకాని తన యెదుట నవ్వుటయన్న నది తనవ్యక్తిగౌరవమునకును, నుద్యోగగాంభీర్యమునకును లోపమును సూచించునని వాని నిశ్చితాభిప్రాయము. రాజభీతి లేమిచే వా రట్లు ప్రవర్తించుచుండిరని యాతని మతము.

బొమలు ముడివడ ఖయిదీని గుండె లవియునట్లు తీవ్రదృక్కుల చూచి "జాబులోని నీ సంతకమున కేమందువు?" అని ప్రశ్నించెను.

"అది నా పేరుమాత్రమే సంతకముమాత్రము ముమ్మాటికిఁ గాదు"

"ఏమి తెలివి! అందున నేమిభేదమున్నది? వ్యక్తపఱుపుము."

తన కెంతమాత్రము భయములేదనుకొని యాపాఱుఁడు చాపలమునఁ గొంత యధికప్రసంగము చేయుటకు సాహసించెను. నిరపరాధిత్వము తనకు బాసటయై యుండఁగా నక్బరుసార్వభౌముని సామ్రాజ్యమునఁ దా నెవ్వరికి భయపడవలయును? అందున నీతఁడిక నా తెలివిని సంప్రశ్నించుచుండెను. కావున ముందువెనుక లాలోచింపక "ఈ మాత్రపుఁ దెలివిడి ఇచ్చట మూఁగియున్న నీ ముష్కరుబా టున్నఁ జేని నీ కేకరువుపెట్టఁగలఁడు. అడిగి చూడుము." అని ప్రతివచన మాడెను.

ఆదంఖానున కంతమాత్రమున దుస్సహమయ్యెను. దేహమంతయు వేయితేళ్లు కుట్టినట్లు మండిపోయినది. కన్నులు నిప్పులు గురియ "ఛీ, కాఫిరుగాడిదా, నోరుమూయుము. నీ బొంకటక్కులు నా యెదుట విప్పకుము. ఎవరి తెలివి యెవరి నేమి చేయునో తెలిసికొందువు, కానిమ్ము" అని, సేవకులకు "ఈ సూకరమును చెఱయందుంపుఁడు. తరువాత వీని పని చూచెదము." అని యాజ్ఞాపించెను. ముష్కరులగు తురుష్కులాతని బిరబిర నీడ్చికొని వెళ్లుచుండ సచివుఁ డొక్కఁడు "ఆతని మాటల యాథార్థ్యము గనుఁగొనుట కెంత సేపగును? ఆతని భార్యనో, బంధువులనో యడిగినఁ జాలదా?" అని యుపపాదనము చేసెను.

"దర్యాప్తు చేసి చూడుఁడు. వాఁడ సత్యవాది యనియే తీర్మానము కాఁగలదు."

అట్టి దర్యాప్తేదియు జరుగలేదు. మరునాఁటి సంజకడ విష్ణుపండితుని భార్య, ఇందిరాదేవి యాదంఖానుని దర్శించెను. "ప్రభూ, నా పతి నిరపరాధి రాజద్రోహ మెన్నఁడును దలపెట్టి యెఱుఁగఁడు దైవసాక్షిగ నేను ప్రమాణ మొనర్చుచున్నాను ఆ జాబులోని తారీకున నామగఁడు నా తల్లిగారింట నుండెను. ధర్మదాతలు నా పలుకులను విశ్వసించి నా భర్తను విడిపించి రక్షింపుఁడు." అని యతిదీనముగ రెండుచేతులు సాఁచి వేడుకొనియెను.

అశ్రుకణవిభాస్వంతమయిన యా సుందరకపోలములఁ జూచి, వెడద కన్దోయి సొంపు నెంచి, తరుణారుణాధరబింబమును బెకల్చుకొని వచ్చుచుండు మల్లెమొగ్గవంటి దశన కాంతుల గాంచి యాదంఖానుఁడు నిస్పృహుఁడై కొంతసేపట్టె ఱెప్పవేయక నోరు దెఱచుకొని తేటపాఱఁజూచుచుండెను. అనిర్వాచ్యమైన మందహాస మొక్కటి యుగురెత్తి వానిపెదవులనడుమ నిటునటు దొందాడుకు నేయనారంభించెను. క్షణక్షణమును కాతని నేత్రద్వయ మా సౌందర్యరాశి గ్రోల్చుచున్న మిఱుమిట్లచేఁ గాఁబోలు దిగ్భ్రమ సూచింపుచుండెను. ఎట్టకేల కాతఁడు,

"కాంతామణీ, నీ మగఁడు దోషి యేయని బుజువొనర్చు ప్రబల సాక్ష్యమున్నది. దానిని నీవ చూడు" మనుచు లేచి సమీపముననున్న యొక బీరువా తెఱచెను. అం దొక లేఖ నెత్తి యంజలి "చేవ్రాలు" మాత్ర మగపడున ట్లామెకట్టెదుట దానిని బట్టి "ఈ పే రెవ్వరిదో చదువుము" అని నుడివెను.

బాష్పధారాప్లావితమైన వదనారవిందమును దుడిచికొని ఇందిర యింతలో డనే "పేరుమాత్రము నా మగనిదే కాని వ్రాలుమాత్ర మాతనిది కానేరదు. లోకమున నెందఱు విష్ణుపండితులు లేరు ?......" అని విస్పష్టముగఁ జెప్పెను.

ఆదంఖానుఁ డొక్క వికటవికృతహాస మొనర్చెను. సంపూర్ణచంద్రసన్నిభమయిన ఆమె వదన పుండరీకమును గబళించివైచెడునట్లుచూచుచు నిలుచుండెను. ఆ చూపుల యంతరార్థ మామె కవగతము కాలేదు. సహజముగ స్త్రీజనమునకు ప్రకృతిలో నట్టిచూపులయందే విపత్తిమిడియున్నదో యెఱుకతెట్టుట కలదు. తా నొక్క యగాధమయిన భయంకర వాపీతటమున నొంటికాలిపై నిలిచియుంటి నని యామెకు తట్టెను. దేహ మాపాదమస్తకము కంపించిపోయెను. వాని కపటదృష్టి యువతీజనప్రాణాధికమైన జీవనసర్వస్వమును గబళింపఁగోరుచుండెను.

"అనుపమాంగీ, నీ వచనముల విశ్వసించితినేని విష్ణుపండితుఁడు విమోచనయుఁడే. కాని..... "

"విశ్వసింప కేల పోవలయును ? నా మాటలలోని యాథార్థ్యమును బలపఱచుటకు మా బంధుకోటి యున్నది."

"బేలా, నా కొక్కనిసాక్ష్య మేల కావలయును?" అని నర్మగర్భముగఁ గనుగీటి "వలచితినేని, నీ మాటలను నమ్మకున్నను, నీకొఱకై యీ వ్రాలు నీభర్తది కాదని యొప్పుకొందును."

పాప మాయువతి కాతనిపలుకు లర్థముకాలేదు. కాని యాతని ప్రవర్తన మతివిచిత్రముగ మాత్రము వ్యక్తమగుచుండఁగా నామె బాష్పసిక్తనయనములు కనడ్డప్టుల నిరోధించుచుండ నట్టే కొయ్యవాఱి నిలుచుండెను.

"మోహనాంగీ, ఇదిగో — ఇటు చూడుము. నీ ప్రాణేశ్వరుని యసువులను నీ సుందరకరారవిందములయందుంచెదను. నీ యిష్టము, దాని నేమయినఁ జేసికొనుము. నాశనముచేసెడు నిర్దయాత్ముఁడు కా వనుకొందును." అని తన స్వాధీనమున నున్న మార్దవ మంతయుఁ గేంద్రీకరించికొని యల్లనల్లన వచింపుచుఁ దనకున్న ప్రసన్నభావము నంతయుఁ బ్రదర్శించి యామెను మిక్కిలి సమీపించెను.

ఇందిర వానిసామీప్యమును గుఱుతించులోపున నాగుఁబాములె వాని దక్షిణహస్త మామె లేఁగొనునఁ బ్రాఁకులాడెను. కెవ్వున నొక్క చావుకేక వైచి యాసాధ్వి విలవిలఁ దన్నుకొని వానిచేతిని విదల్చివైచి దూరముగఁ బాఱిపోయెను.

తన మనోరథ మీరీతి భగ్నము కాఁగా నవమానకశాఘాత బాధితుఁడై కోపానల జ్వాలలు ప్రజ్వరిల్ల నాతఁడు కర్కశస్వరమున "మరొక్కసారి బిగ్గఱగనైన నూపిరి విడిచితివా నీ మగనికండలు గోసి కాకులపాలఁ బడవైచెదను. జాగ్రత్త సుమా" అని

క్రౌర్య ముట్టిపడ కఠినముగ గద్దించెను.

"నన్నావలికి పోనిండు" అని యిందిర ద్వారమువద్దకుఁ బరువిడెను. ఆదుష్టున కేదియో తోఁప వెనుకనుండి యదలించి తఱుమువానివలె "అసత్యవాదినీ, నీ విట్టి యబద్ధముల నాకడఁ జూపరాకుము. పొమ్మావల" అనుచుండెను. ఆమె వానిమాటలను వినిపించుకొనక తనదారిని తాను వెళ్లెను.

ఆమె యిలుసేరుటయే తడవుగ రాజభటుఁ డొక్కఁడేతెంచి "మఱునాఁటి వఱువాత విష్ణుగుప్తుఁ డురితీయింపఁబడు"నని రాజాజ్ఞఁ జదివి వినిపించి వెళ్లెను.

విశ్వమంతయు నా సతీమణికి గాఢాంధకారమయమయి కన్పట్టెను. ఇఁకేమున్నది? తన ప్రాణాధికుఁడైన పతిదేవుఁ డిఁక లేఁడు. ఆమెలోని జీవనజ్యోతి యాఱిపోవును. ఆపై లోకమునఁ దన బ్రదుకు సర్వశూన్యమై పోవును.

అంతలో నామెకు మఱొక్కయాలోచన స్ఫురించెను. "పాణిగ్రహణము దొట్టి దృఢతమానురాగముతోఁ దన్ను సౌఖ్యాంబుధినిఁ దొప్పఁదోఁగఁజేసినయాతనితో సహగమనమొనర్చి యేల వెన్నాడరాదు? ఇదియే చక్కని యుపాయము."

అట్లామె యానాఁడంతయు జలమయిన ముట్టక ఉపవసించి, సాయంసమయము కాఁగా నొకపరిచారికను వెంటఁబెట్టుకొని తనమగఁడున్న చెఱసాలకడ కేఁగెను.

కారాగృహాధికారికిఁ దన్నెఱింగించుకొని తన జీవితేశ్వరుని గడసారి చూచిపోనిమ్మని వేఁడెను. కారాపతియుఁ గొంతసే పాలోచించి నిరాకరించుసట్లు తన కేయుదసపు టుత్తరువును లేమిచే నామెను విష్ణుపండితుఁ డున్న భూగర్భస్థమైన గదిలోఁ బ్రవేశపెట్టెను.

ఇఁకఁ గొన్ని గంటలలో మృత్యువువాతఁబడకతప్పదని సంపూర్ణముగ నెఱిఁగిన యాపాపుఁ డాపాదమస్తకముపాలిపోయి జీవచ్ఛవమై పడియుండెను. తన నిర్దోషత్వముతో ధనయౌవనములు, నాత్మవిశ్వాసము ముప్పిరిగొన్నప్పు డాత్మగౌరవముఁ గాపాడుకొనుటకై చాపలమున నిసుమంత యధికప్రసంగము గావించి రాజప్రతినిధికోపాగ్నియందు శలభప్రాయుఁడై పాతికేఁడు లయిన నిండని పసితనమున నకాలయమునినోటఁ బడవలసివచ్చెనుగదా యని చింతచేఁ గుమిలిపోవుచుండెను. ఆనాఁ డరిభీకరుఁ డగు నాదంఖానుని దృణీకరించి యాత్మగౌరవమును గాపాడుకొనఁ దెగింపుతో నిట్ట నిలిచిన చట్రాతిగుండియజన్నిగ ట్టాతఁడు నేఁడు కాఁడు.

నిష్ఫలకోపమున మాటిమాటికిని గఱవఁబడి కాటులువడి కందిపోయిన పెదవులును, నిష్ప్రయోజనమైన తన జీవితగాథను దలఁచి తలఁచి యుద్వేలావేగమున నూడఁబెఱికికొని శేషించి చెల్లాచెదరై ముఖమండలమును గప్పియున్నట్టి కేశములును, నాసన్నమరణమునకై భయముపడి పొరలాడి పొరలాడి పీలికలుగా నయిన వస్త్రములును, ధూళిధూసరితశరీరమును గల యా యువకుఁ డతిదైన్యమున చూపఱులగుండె లవిసిపోవునట్లుగ లాఱ్చుచుండెను.

తన ప్రాణాధికయైన యిందిరను జూడఁగాంచినదే ఒక్కగంతు వైచి యామె కంఠమును గ్రిగ్గఁ గౌఁగిలించి తన యుత్తమాంగ మామె వక్షస్థలమున నిడి బాలకునివలె వెక్కివెక్కి యేడువసాగెను. ఆ యబలయుఁ దన జీవితేశ్వరుని [illegible] కొనుచు తా నతిమాత్రముగ రోదింపఁజొచ్చెను.

ఒకరిమొగ మొకరు చూచిచూచి యాదంపతు లెంతసే పేడ్చిరో తెలియదు.

ఏపాప మెఱుఁగనివానిపై రాజద్రోహనేరము మోపిరిగదా యనియు, నిందలపాలయి యధమాధమముగఁ జావవలసివచ్చిన విధివిధానమును దూఱుచు, నాదంఖానుని దౌష్ట్యమును నిందించియు, నెట్లో ఊరటఁ దెచ్చుకొనఁ బ్రయత్నించి విఫలుఁడై యాతఁడు రోదనమును శరణము నందెను.

ఇందిర యిఁక నోర్వలేక "పరమేశ్వరా, నా జీవితేశ్వరునిజీవము నఱచేతఁ బడియుండ నద్దానిఁ బాఱవైచినట్టి నా పేలతనము నేల సహించెదవు?..." అని ప్రలాపించుచుండ విష్ణుపండితుఁ డులికిపడి లేచి "ఏమంటివి? ఏమంటివి? నా రక్షణోపాయము నీ యఱచేతఁ బడెనా? దానిని నీవు వమ్ముచేసితివా?-ఏమి?-ఎట్లు?-ఏల?" అని వేయిప్రశ్నల నూపిరాడకుండ నామె నడిగెను.

"నాథా, సత్యము. కాని దానికిఁ బ్రతిమూల్యము..."

"మూల్యమా? మూల్యమునా యోచించుకొని నన్ను కటికవాని కర్పించితివి? ఛీ, భార్యా రూపమునన్నున్న పిశాచమా? నీముఖము చూచిన దురితము. హా మ్మావలకు, హా మ్మానవల" కని యామె నుస్మిత్తుఁడై చావబాదెను

పాప మానుకతి దెబ్బలు తినుచునే నడచిన సమస్త వృత్తాంతమును నివేదించెను.

ఆమెకథ నంతయు మెట్టుమెట్టుగ విన్న యాతని కానరాధమునిపైఁ గలిగిన క్రోధమునకు మేర లేదు. నిలువెల్లఁ గంపించుచుండ నాతఁడు లేచి పండ్లు పటపటఁ గొఱికి "లంజాయాః పుత్రుఁడు" అని మేఘగర్జన మొనరించి, నిర్ధనుని యాటోపమువంటి హీన వ్యర్థకోపమునకై తత్క్షణము సిగ్గుపడెను.

ఆతని హృదయపరివర్తనమును గమనించి యా పతివ్రత "హృదయేశ్వరా, యీ మహావిపత్తునుండి విమోచనమార్గ మగపడదు. తొలుత మీ రట్లయిన నాదృశ్యమును నేను జూడనోపను, వినఁజాలను. తొలుత నే నెట్లయిన మరణించెద. దాన నేను మిమ్మచటఁ గలసికొనుటకై ప్రతీక్షించుచుండవచ్చును." అని యేడ్చెను.

మృత్యుదేవత మహాభీకర మైన తన వదనగహ్వరము తెఱచికొని కరాళదంష్ట్రా ధాళధళ్యమున కన్నులకు మిఱుమిట్లు గొలుపుచు నాలుక చాచి ఒక్క కబళమున మ్రింగివేయుటకై యెదుట లొట్టవేయుచుఁ బొడకట్టుచున్నది. క్షణక్షణమునఁ దా నాదీర్ఘజిహ్వాకాపాశమునఁ జుట్టుకొనఁబడుచు ముఖము వైపున కాకర్షింపఁబడుచు పలు మొనలచే కపతుండెనుముఖగ చీల్పఁబడి కరకరననమిలి వేయఁబడుచున్నాఁడు. పంచేంద్రియములు స్వాధీనమున నున్నప్పుడే చిత్రవధ గావింపఁబడి యాతన ననుభవించుచుండెను. తల దిమ్మెక్కినది. మహా దారుణముగ నిట్లు మరణింప నాతనికి మనస్సొప్ప లేదు. ప్రాణము లత్యంతమధురము లయి యున్నవి. యౌవనపుముచ్చటలఁ దనివార నొక్కపరియైనఁ జవి చూచి యెఱుఁగఁడు. ప్రిదిలిప్రిదిలి వచ్చు దుఃఖమున బావురుమని యొక్కపెద్దయేడుపేడ్చినాఁడు. జీవితేశ్వరి నట్టె యదిమి కౌఁగిలించుకొని "ఇందిరా, ఇందిరా, నా... నాకు మతిపోవునది. అయ్యో, నిరపరాధుఁడను నే నీపాడుచావు చావలేను. ప్రాణసంరక్షణార్థమై యేమొనర్చిననేమి? దోషాదోషము లెంతవఱకు మనల నంటియుండును? ఒకవేళ నీవట్లొనర్చియే యుండిన—హృదయమునకును మనసునకును సంబంధము లేని యా ప్రవర్తన మొక-ఒక-శరీరయజ్ఞముగఁ బరిణమించి...పరిగణింపఁబడవచ్చునేమో!......అబ్బ నాకు నిజముగ మతి తప్పిపోవుచున్నది......" అని యాతఁడు తన పలుకుల నైచ్యమునకుఁ దానే క్రుంగిపోయి కూలఁబడినాఁడు.

లోకమున నెట్టిపౌరుషహీనుఁడయినను ధర్మపత్నితో నిట్టిమాటలాడియుండకపోవచ్చును. పౌరుషమునకును మేరయనునది యొక్కటున్నది. ఎట్లున్నను మొత్తముపయి నాతఁడు నొక్కమానవుఁడేకదా!

ఇందిర భర్తకేసి చూచుచు నట్టే చైతన్యశూన్యయై నిలిచెను.

ఆతని పలుకు లొక్కొక్కటియు నామెహృదయమున దృఢముగఁ బాదుకొనినవి. ఆతని యాతనఁ జూచి గుండియలవియ నామె కేమియో తోఁచినది. చివాలున లేచి మొగము మూసికొని విలపించుభర్తను నిదానించి పరికించి చిటుకుపాటుకు మనకుండ బిరబిర వెడలిపోయెను

చెఱసాల వాకిట నిలిచియుండిన తన పరిచారిక నింటికిఁ బంపెను. ఆ నిశీథమున నామె లీనమైపోయినది.

ఆదంఖానుఁ డప్పుడే శయనాగారమున కేఁగుచుండెను. ద్రాక్షారసపానమత్తుఁడై కన్ను లరమూసికొని కాళ్లీడ్చుకొనుచు నాతఁడు పక్కఁ జేరి యందొఱఁగెను. అట్టి వేళయం దాతని యెదుట ఇందిర ప్రవేశపెట్టఁబడెను. ఆమెదర్శనమున నాతఁ డులికిపడి యున్మత్తతపటాపంచలగుడు "కామినీసేవకున కేమి యాజ్ఞ?" యని వికటవినమ్రుఁడై వికృతముగ మోఁకరించెను.

ఆమె వాని కుటిలతను నిరసనభావమునఁ దృణీకరించుచు "ఒక్కక్షణ మేకాంతసంభాషణమునకనుజ్ఞ కావలయును" అని కట్టెవాఱిన మొగముతో నడిగెను. వాఁడు తన గది నొక్కపరి చుట్టును పరికించునంతలో నెక్కడి పరిచారిక లక్కడక్కడ అదృశ్యులైపోయిరి. మరల నతఁడు కృత్రిమమును, హేళనమిశ్రితమును నయినస్వరమున "ఆజ్ఞ" యని గుంజెళ్లుంచువానివలె నరమోఁకరించెను. జుగుప్సాకరములైన వాని సర్వ

చేష్టల నామె గుండె ఱాయి చేసికొని సహించినది. "అయ్యా, నా భర్త బ్రదుకుతెరవొండీ యుదయమున సూచన మొసఁగితివి......"

విస్మయాద్భుతములచే నతఁ డొకింత త్రొటుపాటు పొందినాఁడు. వెంటనే "పరిహిణీ, నీ వమితకుశాగ్ర బుద్ధివి. నీపతిసేవన మద్వితీయము. ఇదిగో ఒక్క సూక్ష్మము గ్రహింపుము–నీభర్త జీవింపఁగలఁడు.

"మాళవమున నేఁడు నేనె సమస్త ప్రాణులరక్షింపను శిక్షింపను దక్షుఁడను. ప్రత్యక్షపరమేశ్వరుఁడను. అట్టి యాశక్తిని నీ మగనివిషయమయి, నీ యఱచేత నిడుచున్నాను. నాయెడ నీకృపాకటాక్ష మున్నదని వచింపుము. చాలును. ఇదిగో నీమగఁడు క్షణమున చెఱవిడివడినాఁడు." అనెను.

"నా పునరాగమన మా మాట వనించినట్లే." అని యా బ్రాహ్మణి నిరంతర మేకధారగా ప్రవహించుచున్న బాష్పములను గొనగోట మీటికొనుచు ప్రతివచియించెను.

* * *

* * *

అరుణోదయ మింకను కాలేదు. ఉజ్జయినీపుర కారాగారకవాట పాటనమునకయి యది బ్రద్దలగురీతి నిందిర దబదబ గ్రుద్దెను. ఇట్టివేళ నెవ్వరా యని చెఱనాయకుఁడు తలుపులఁ దెఱచెను. అతనిచేత నత్యంతావసరముగ నిందిర యొక్క ఫర్మానాను దుఱిమి "క్షణమైన నాలసింపకు"మని మందలించెను.

అతఁ డాపత్త్రిమును జదివి యామెను దేఱిపాఱఁజూచి యాడు విఱిచెను. అతని ప్రవర్తనమున కచ్చెరువడుచుండు నామెయెదుట విష్ణుపండితుఁ డుండినగదితలుపు తెఱవఁబడియుండుట కన్పట్టెను. తోడనే యామె యా చీఁకటికొట్టున దూఱి "నాథా, నాథా" అని బిగ్గఱగ నేదో చెప్పరాని లోఁదడ కుత్తుకను నిరోధించుచుండ నఱచెను.

ఆమె కా గాఢాంధకారమునఁ దన ప్రతిధ్వని వెక్కిరించుచున్నట్లుండెను. బదులు లేదు.

ఇంతలో చెఱసాలయధికారి మినుకుమినుకు మనుచున్న దీపముతో నాగదిఁ బ్రవేశించెను. ఆ యల్ప వెలుఁగున గదినడుమ త్రాడు మెడఁజుట్టి వ్రేలాడుచుండిన విష్ణుపండితుని శవము కన్పట్టెను ఆ యువతి కాళ్లు మని చావుకేక వైచి నిట్టనిలువునఁ గూలిపోయినది.

స్పృహనందిన వెంటనే యామెకు తనచేత నున్న రాజాజ్ఞను జదువ నిచ్చెను. అది "విష్ణుపండితుని అర్ధరాత్రమునకే ఉరిదీసియుండవలయు" నని యున్నది.

నీచాతినీచమును, ఘోరాతిఘోరమును నగు నట్టి యాయమానుషమున కామె భీషణరోషాకులదందహ్యమాన మానసయై తీవ్రతర ప్రతిహింసచేఁగాని తనకసి తీర దని దారుణముగ ప్రతిజ్ఞచేసికొనెను. ప్రతిహింసానమయప్రతీక్షణమే యామె ప్రకృతకర్తవ్యముగ తీర్మానించుకొన్నది. వేఱొండు ఆలోచన ఆమెకు లేదు.

ఆదంఖానుఁడు హాయిగ హుక్కా పీల్చుచు చెక్కుచెదరక యేదో కాలక్షేపము చేయుచుండెను. ఇందిర యావేళకే రాజోద్యోగు లందఱకు విఖ్యాత మైనకారణమున నామెకు రాజసౌధమున నాటంకమనునది లేకపోయెను. అతివేగమున నా యువతి సరసర రాజప్రతినిధి యొద్ద కేతెంచి క్రోధసంక్షుభితమైన వక్షస్థలి నిమ్నోన్నత మగుచుండ మహారోషము నొందిన కాలభుజంగివలె బుసకొట్టుచు నిశితతర దృక్కులు నాతనిశిరమును శూలఘాతబాధితముగ నొనర్చుచు నిలుచుండెను.

ఆదంఖానుఁ డామెయందు కలిగిన పరిశుద్ధమైన సౌందర్యవ్యత్యయమునకు స్వాంతమున విస్మయ మందక పోలేదు. తేజోరాశిగ నుండిన యాకాంత చూపునందున ప్రేమము వలె నాతనికి వెఱగుగొల్పెను. వాని నివ్వెఱపాటును తిరస్కరించికొని యామె వానిని గక్కుమిక్కుఁడకుండ జావఁదట్టెను. తిట్టితిట్టి యలసిపోయినపిదప నామెను జూచి మోటు సరసముగ "ఏమి—" విష్ణుపండితుఁడు కారాగారవిమోచన మందినాఁడు కాఁడా? అట్టి సంపూర్ణస్వేచ్ఛ వాని కేఁక నెవ్వ రిచ్చియుందురు?—ఇందిరా, నా హృన్మందిరా! మనదాంపత్యసుఖమున కంతరాయముగ నుండువానిని మననిచ్చునంతటి తెలివిలేనికార్య మాచరింతునా? —" అనుచుండఁగా నా యువతి గిరుక్కునఁ దిరిగి పాఱిపోయెను.

నాఁటి నడిరేయి యిందిర యెవరికిని దెలియకుండ చంబాల్‌నదిలో నొకపడవ నెక్కి పయనము సాగించెను. చంబాల్ నది యమునకు నొక యుపనది; ఉజ్జయిని నానుకొని పాఱుచున్నది. అట్లామె

కొన్నాళ్లలో కాళిందీముఖమున నాగ్రాపట్టణము దాటి ఢిల్లీనగరమును జేరెను.

ఢిల్లీపట్టణమున నాఁడు శృంగాటకము లన్నియు జనవికీర్ణము లయి అలజడి నందుచుండెను. శృంగాటకములే కాక వీథులన్నియుఁగూడ ప్రజల గుంపులు గుసగుసలాడుచుండఁ బొంపిరివోవుచుండెను. "భూనాథుఁగారు దారుణముగ వధింపఁబడిరి." అని వారు రహస్యముగ నొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి.

ఇంతలోఁ గొందఱు రాజకీయోద్యోగు లొకజట్టుగఁ గూడి ప్రజలవేకులు తమ్మనుగమింప రాజభవనమును సమీపించిరి. వారందఱొక్కమాటగ రాజదర్శన మపేక్షించి యాతనినోట సత్యాసత్యముల వినఁ గుతూహలము గనుపఱచిరి.

అట్టిగుచక్రవర్తి తన ప్రజల కౌతూహలమును దీర్పుట కనుమతించి తన సౌధపు డాబాకడ కేతెంచి "చక్రవర్తి, చక్రవర్తి" అనుచు, "సద్గు, సద్గు" అనుచుఁ గిక్కిరిసిన పౌరుల నొక్కసారి పరికించెను. నిశ్శబ్దమయ్యెను. చక్రవర్తి దుఃఖరుద్ధకంఠముతోఁ,

"మా గురుస్వాములు మక్కాయాత్రఁ జేయుచు భౌతికశరీరమును వదలినమాట మా కెల్లరకును హృదయవిదారక మయ్యెను. మీ రెల్లరు నాతని యాత్మశాంతికయి యథోచితముగ నచ్చటచ్చట దుఃఖసూచకములగు రీతులఁ బ్రవర్తింపుఁడు. సాయంకాల మగుడు మేము జుమ్మామసీదున వారిజీవములకు శాంతిఁ గోరుచుఁ బ్రార్థన చేయవచ్చెదము."

అని నుడివి అశ్రుసిక్తనయనములతోఁ బ్రజల నెల్లరను మఱొక్కసారి తిలకించి మరలెను.

ఆ క్షణముననే జనమధ్యమునుండి "సార్వభౌమా, ధర్మభిక్షు ధర్మభిక్షు" అని యతిదీనమైన యబలారోదనము వినఁబడెను.

చక్రవర్తి మరలినకాలు మరల్చికొని ప్రజాసముదాయము వంకఁ జూచెను.

దూరముగ్ధులై ప్రజలు తమంతతామె యిరుపాయలై వెనుక కొదిగి నిలుచుచుండ నిందిర పాదుషాకనులఁ బడునట్లు నిలిచి రూపెత్తిన దైన్యమనునట్లు, బాహుద్వయము సాఁచి "ప్రత్యక్షజగత్సంరక్షణా, అభయము. శరణు. శరణు. న్యాయభిక్షు. అబలా జనము నెడఁ గావించిన పైశాచికాపరాధమునకై ధర్మభిక్షు దయసేయుఁడు" అని ప్రలాపించెను.

వజీరులు, ఉమ్రావులు, సర్దారులు మొదలగు బాలవృద్ధ మామె సౌందర్యమును, దైన్యమును జూచి యాశ్చర్యోత్సుక్యచకితులై యట్టె చూచుచు నిలిచియుండిరి.

"కాంతామణీ, ధర్మభిక్షు మడుగఁబడిన తత్క్షణము పంచిపెట్టవలసినది మా ధర్మము. దేశకాలపాత్రముల యోజన మక్కఱలేదు. కాని-యింటివి కదా, మా నేఁటి శోకవార్త" అని ప్రవచించుచు, నామెదుఃఖము తన కంటెను మించియే యుండవలయునని గ్రహించి "తల్లీ, మాదివాణపు ప్రాంగణములోనికి రమ్మా. నీయభాగ్యమును విని మరియు వెళ్లెదము." అని నుడివి లోనికి వెళ్లెను.

ప్రజాళి విస్మయమంది యామెను బరివేష్టించి దివాణమువఱకు వెంబడించెను. రాజాజ్ఞచేఁ గాఁబోలును భటులా జనమును వడఁబోసి యామెను చక్రవర్తిదర్శనమునకై ప్రవేశింపఁజేసిరి.

పాదషావారిసమక్షమున యావద్వృత్తాంతమును బూసగ్రుచ్చినతెఱఁగున నివేదింపఁబడెను. ఆమెవిషాదగాథ విన విన నక్బరునకు మరేదానిపైనను యోజనపోలేదు. బొమలు ముడివడుచుండ, మొగ మెఱ్ఱబాఱుచుండ, ఊపిరి వెచ్చఁబాఱి వడి వడి యగుచుండ నొడుగఱచి సాంతము వినినాఁడు.

"సాధ్వీ, నీ మాటల యాథార్థ్యము దృఢపఱుప సాక్ష్యమున్నదా?"

"సార్వభౌమా, ఇదిగో ఆతఁడు నా జీవితేశ్వరుని నాకర్పింపవలసినదని చెఱసాలపాలకున కిడిన యానతిపత్రము; ఆతని స్వహస్తపరిలిఖితము. తిలకింపుఁడు.

"అర్ధరాత్ర మప్పుడే యురితీయవలయునని యారాత్రి నాకనుఁ బామి పంపిన మఱొక్క యాజ్ఞాపత్రమును దమరు కోరినచో నా కారాగృహాధికారి చూపఁగలఁడు; నివేదింపఁగలఁడు.

"మహాప్రభూ, నాభర్త నిర్దోషుఁడని లోక మెఱుఁగును. తుద కాదంఖానుఁడే నమ్మినాఁడు. నమ్మియే నా గొంతు కోసినాఁడు" అని యా సాధ్వి యాక్రందించెను.

సార్వభౌముఁ డా పత్త్రిములు పుచ్చుకొని చక్కఁగ పరికించినాఁడు.

"అమ్మా, పాపమునకుఁ బ్రతిఫలము ననుభవింపఁగలఁడు. ఖండిత

ముగ మేము ధర్మ మొనర్చెదము." అని ధైర్యముచెప్పి యామెను బంపివైచెను.

పీర్ ముహమ్మద్ షిర్వానీ యను సర్దారుఁడు ఆదంఖానుని బదలీ చేసి ఢిల్లీకిఁ బంపెను. రాజాజ్ఞ ననుసరించి, విషయ మిది యని తెలుపలేదు.

మాళవము నవలీలగ జయించిన శూరునకు నూతనగౌరవము లేవో వర్షింపఁబడనున్నవని మురియుచు పాదుషాసందర్శనము చేసిన యాదంఖానునకుఁ దనదురదృష్టము పొడకట్టినది.

కటికవానికంటెను మిక్కిలి యధముఁడై తా నొనర్చిన ఘాతుకకృత్యములు పేర్కొనఁబడి వరుసగ తెలిపి లేనన్ని ప్రశ్నలు వేయఁబడెను. బాజ్‌బహద్దర తటిద్రోహిని పావాక్రాంత మొనర్చిన తన్నట్లు ప్రశ్నించుట సార్వభౌమునకుఁ దగవుకాదని యాదంఖానుఁ డనుకొనుచుండెను. సార్వభౌముఁడు తనకొక్క వరుసలో భ్రాతృసముఁడైనను, మొగము వాచునట్లు వానిని తీవ్రముగ దూషించెను.

అతఁ డిదంతయు నేదోయొక రాజకీయతంత్ర మనుకొని, తనపదవిని శంకించుకొనుచు, నందుపై తన్న న్యాయముగ నాతఁడు నిందలపాలు సేయుచున్నాఁడని ప్రతివచించెను.

"ఒక కాఫిరువిద్రోహి ప్రాణములు దీసినంత నేమాయెను ? ఒక కాఫిరు నిల్లాలిని జెఱచినంత మాత్రమునఁ బుట్టిమునిఁగిపోయిన దేమి ?

"గోరంతనుకొండంతలుగఁ జేసి తనపై నెవరో కుట్రపన్ని చాడీలు మోపియున్నారు. ఇది రాజబంధువులయెడఁ బాటింప నవసరములేదు" అని యాతఁడు నుడివినాఁడు.

పాదషాకు వాని నెట్లయినను ఆత్మద్రోహ మొనర్చుకొనునట్లు చేయవలయు నని యుండెను. త్రోడనే యాతఁడు,

"కావునఁ బరిస్థితులగమనింపఁగా నీ విష్ణుపండితుఁడు నిర్దోషుఁడైయుండ వచ్చును కాదా ?" అని మార్దవముగ నడిగెను.

"చిత్తము. అసలు విద్రోహ మొనర్చిన విష్ణుపండితుఁడు వేఱొక్కఁడు మాకుఁ దొరకినాఁడు. ఈ విష్ణుపండితునిచావు వాని దురదృష్ట మనవలసినదే !"

అక్బరుప్రవర్తన మున్నట్లుండి సంపూర్ణముగమాఱిపోయెను. కన్నుల విస్ఫులింగములు గురియ కఠినవచో నిరూఢిని "ఛీ, సూకరమా, దురదృష్టమా ? అంత చులుకనగఁ జోవుచుంటివా ? గడ్డపార మ్రింగి సొంటికషాయమా ?" అని భీకరముగ గర్జించెను. పిడుగులవంటి యాను డుగుల కొకింత వెనుతగ్గి గొంతు సర్దుకొని వాఁడు "వాని నురిదీయునప్పుడు దోషియనుకొని నాధర్మమును నిర్వర్తించితిని." అని సమర్థింపఁజూచెను.

"అట్లయినచో నిది యెందులకు సృష్టింపఁబడెనో వచింపుము" అని వాని ముక్కునకు సరిగ నిందిరారమణిద్వారా వాఁడు వ్రాసి యిచ్చి పంపిన పత్రమునుంచి "పశువా, వచింపుము."

అని జలధరమాలా గంభీర గర్జనమున నదలించెను.

పుట్టినదాది యాదంఖానుఁ డెన్నఁడు నట్లు బెదరింపఁబడి యుండలేదు. మాహాంఅంగా తన్ను రాజకుటుంబమునలొక రాజువలెనే పెంచెను. రాజమర్యాదల నాతఁ డనుభవించుచుఁ గూడ నుండెను. నేఁ డాతఁ డొక్క తుచ్ఛపు నేరస్థునిమాడ్కి సంప్రశ్నింపఁబడుచుండ వానికి దిక్కులు తోఁచలేదు. తన యకృత్యముల ప్రతిఫల మాతని కప్పుడే తట్టినది. గ్రుక్కిళ్లు మ్రింగికొనుచు నట్లే నిట్ట నిలుచుండెను.

"మా పేరను, పవిత్రమైన మా వంశగౌరవము పేరను నీ వాచరించుచుండిన పరిపాలనమా యిది ? మా యపకీర్తికిఁ గారణభూతుఁడవై మా పరిపాలనము నిట్లు కళంకపఱచిన నిన్ను కండలుకండలుగ కోసి కాకులకు వైచినను పాపములేదు.

"విష్ణుపండితుని ద్రోహిగ నీవు నిశ్చయించియుండిన దీని నేఁ వ్రాసితివయ్యా !

"అదియు నెట్టి పరిత్తులపైన— అబ్బ ! నే నెఱుఁగుదను. జుగుప్సాకరము !

"పోనిమ్ము. అంతటి యధమాధమ వ్యాపారముఁ జేసికొంటివి కాదా, దాని నట్లే నిలుపుకొనరాదా ? అంతటి ఘాతుకకృత్యమేల చేయవలయును ?"

అవమానము, సభఃకరణము భారాతిభారమై తన్నుఁగూల్చి వైచుచుండ నాదంఖానుఁ డెట్లో మొండిధైర్యము దెచ్చుకొని "నే... నేను ధర్మవ్యవస్థతోఁ బాటు—"

"ఛీ, తుచ్ఛశ్వానమా, నోరుమూయుము. ధర్మవ్యవస్థతోఁ బాటు

దక్షిణాఫ్రికా రాయబారవర్గమునకు చెన్నపురి పురపాలకసంఘమువారి ఆదరణ



తిలక వర్ధంత్యుత్సవము, చెన్నపురి








ఆయిదవ ఆంధ్రహోమియోపతిక్ వైద్యమహాసభ, అనంతపురము


జన్నాడ వైద్యవిద్యార్థి పట్టప్రదానోత్సవము


ఆంధ్ర ఆయుర్వేద విద్యాపీఠపు ౬-వ వార్షికోత్సవము, ఉండి


కృష్ణామండల ద్వితీయానువంశీయాయుర్వేద వైద్యమహాసభ, గుడివాడ




శ్రీ సనాతనవిద్యాలయము, అష్టమ వార్షికోత్సవము, రాజమండ్రి



కాకినాడ విద్యార్థినీ సమాజవార్షికోత్సవము



రాజమండ్రి దేశీయ విద్యాలయవార్షికోత్సవము



గుంటూరుజిల్లా బాలికాభట సమ్మేళనము

ఆత్మనైచ్యలాభ పరాయణత్వమును సమ్మిళిత మొనర్చుకొంటివి కాంబోలును! నీ వేమొగము పెట్టుకొని మాయెదుట బదులాడసాహసించుచుంటివో యెఱుకపడదు."

"ప్రభూ—" క్రోధపరవశత్వమున నేమోయనుటకు నోరెత్తినాఁడు.

"నరాధమా, నీవు కామాంధుఁడవై, మందుఁడవై యొనర్చిన పైశాచికకృత్యమునకు గుఱియైన యాసాధ్వి యటనే యున్నది. నీ పాపపరిణామముగ నీ తుచ్ఛశిరము నొక్కవ్రేటునఁ ద్రుంచి యామెయొసిని సమర్పింప నాత్రపడుచుంటిని. కాని యామెకు నీవొనర్చిన పరిభవ దవానల మట్లుపశాంతిబొందునా యని సందేహముఁదఁ బోయుచున్నాను"

ఏ సత్ప్రతిఫలమోకాని యాదంఖానున కొక యుక్తితట్టినది. ఇందిర సుందరాకార మాతని హృదయమునఁ బ్రతిబింబించుచుండఁగాఁ బోలును "సార్వభౌమా, ఇందిర విత్తంతు వయిపోయినది. ఎట్లయిన నే నామెను సతంతువుగ నొనర్తును. నేను యావజ్జీవ సువివాహితుఁడనై యుండవలె ననుకొనియుంటిని. ఇప్పట్టునఁ దమ రనుమతించినచో నామెను నిక్కా చేసికొనెదను." అనియెను.

వానిమాటలకు అక్బరునకుఁ జిఱునవ్వుతోఁచినది. కాని యతఁ డొక్కక్షణ మాలోచనానిమగ్నుఁడై "నీవు చేసిన ఘోరపాపమున కిది తగుమైన ప్రాయశ్చిత్తము గాకపోవుట యటుండ నీయాత్మలాభ మినుమడించుచునే యున్నది. అయినను బ్రస్తుత మదియే కొంతవఱకు సమంజసమై యామెను కొంత ఆదరణీయగ నొనర్పఁగల మార్గముగ నగపడుచున్నది.

"నీ కొక్కవారము గడువొసఁగితిని. అంతలో నవాయి ననునయపఱచి వివాహమునకు, మతాంతరప్రవేశమునకు సమ్మతింపఁ జేసికొనుము. సమ్మతింపనిచో నీగతి పిదప కలదు." అని వచించి కక్ష్యాంతరప్రవేశ మొనరించెను.

ఇందిర కిది గోరుచుట్టుపైని రోఁకటి పోటు. ఎవ్వనిపై తీవ్రతరప్రతిహింసాప్రతిపాలనమునఁ గాని కషాయిత రోష ముపశాంతింపదో అట్టి యధమాధముని, మతాంతరప్రవేశ మొనర్చి, పాణిగ్రహణ మొనర్చుకొనుటయా? అమానుషము. అంతకంటెను సజీవముగ కార్చిచ్చు నత్యానందమునఁ బ్రవేశింపవచ్చును.

అక్బ రామె నేకాంతముగఁబిలువనంపి కొన్ని రహస్యముల నచ్చఁ జెప్పెను. అతని వాక్యములలోని ప్రతిహింసాప్రక్రియ తనకు లాభకారి యని తోఁచినవెంటనే ఇందిర తాత్కాలికముగ నాదంఖాన పిశాచమును బెండ్లాడఁ దన యంగీకారమును సూచించెను.

అక్బరుసొంతమహాలున నాతని సమక్షమున వివాహము నిరాడంబరముగ జరిగెను. పెండ్లికూఁతు రొక జీవన్మృతకళేబరమువలె కన్పట్టెను.

మాహం ఆంగా కిదంతయు కడుప్రమందెను. మాళవమున కాతనిని పట్టాభిషిక్తు నొనర్పవలయు నని యామె యక్బరు నెన్నోసారులు మందలించుచుండినది. ఇట్టి యధమ వివాహ మామెకు మిక్కిలి హీనముగ తోఁచెను. వివాహము జరుపరా దనియు, వెంటనే తన పుత్రునకు మాళవము నభిషేకింపనిచో నంతఃపురకల్లోలము కలిగింతు ననియు నామె అక్బరు ముఖ్యామాత్యుఁడయిన షామ్సుద్దీనుని మందలించెను. ఆ వృద్ధుఁ డా పలుకుల నొక లెక్క సేయలేదు. ఆమెకినుక తత్క్షణ మొక ఘోరతరప్రళయకార్యముగ పరిణమించెను.

వివాహవేదికను వీడి మాతృదేవ్యాశీస్సు లంద నేతెంచిన పుత్రు నొక ప్రత్యేకగృహభాగమునకుఁ బిలిచి వాని కష్టపరంపరల కన్నింటికిని షామ్సుద్దీన్ కారకుఁ డనియు, వాఁ డంతమొందినఁగాని యక్బరు చక్రవర్తి యాతనియెడఁ బ్రసన్నుఁడు కానేరఁ డనియు నుద్బోధించెను. కోఁతికి కల్లుపోసినట్లా మొపలుకులు వానికి శివ మెత్తించినవి. ముందు వెనుకలుచూడక వాఁ డాక్షణముననే మేడపై కేఁగి నమాజు చేసికొనుచుండిన యావృద్ధసచివుని తల తెగనఱికివేసెను. బయట కొంచెము దూరమున నుండిన పెగ్గడబంటులాతఁడు లోనికేఁగివచ్చుటఁ జూచిరి. ఆశీస్సు లందుట కేఁగినాఁ డనుకొనిరి.

ఇంతలో సేవకుఁ డొక్కఁ డేతెంచి యాదంఖానుని చక్రవర్తి రమ్మనుచున్నారని పిలుచుకొనివెళ్లెను. ఇంతలో నీ రహస్య మెవ్వ రెఱుఁగరని నమ్మకముతో నాతఁడు హృదయావేగమును జంపివైచికొనుచు నక్బరు పాదుషాయెదుట నిలిచెను. ఆతని సమీపమునఁ దన యధమము, నమంగళకరము నగు వదనము నగపడనీక మతాంతరశరణమున లభించిన మేలిమునుఁగున రూపెత్తిన సమస్త

దుఃఖములవలె నిందిర నిలిచియుండెను.

"ఆదంఖాన్, నీకొఱకై తనసర్వస్వమునైన మానధనమును వమ్ము చేసికొని మతమును పరిత్యజించి తన శరీరమునే యర్పించుకొన్న యీసుదతీలలామ వివాహపుటోలి నీవేమియు నొసంగలేదు ఇద్దాని నొసఁగెదనని మాటమాత్రమైన నాతో ననలేదు."

ఆ ధోరణియం దాతఁడు తనపరిణయవేళయందే దో గొప్పబహూకృతి నీయ నిచ్చగించి యుపన్యసించుచుండెనని యాతఁడు విశ్వసించి "చిత్తము, ప్రభూ, నన్నే యర్పించుకొంటినికాదా!" అని సరసములాడెను.

"ఇదిగో, నీ వన్నది నిజమే యగునో, నీ పత్త్రమున సంతక మొనర్పుము. నీ విదివఱ కార్జించియున్న సమస్తము నీమెవశ మగుచున్నది."

సార్వభౌముఁడు త న్నన్యాయ మొనర్చుచున్నాఁ డని యాతఁడు తలఁచెనుగాని పాదుషా తీక్ష్ణదృక్కుల లోని తీవ్రత తన్ను భయకంపితునిగఁ జేయుచు బలవంతపఱచుచున్నందున తప్పించుకొలేక వణఁకుచున్న హస్తముతో సంతకము నొనర్చినాఁడు.

ఇంతలో షామ్సుద్దీనుని హత్యాసమాచారము రాజప్రాసాదమున ఘోషించెను. అతనిబంధుమిత్ర పరివారకోటియొనర్చిన హాహారావము సార్వభౌముని చెవిలోఁ బడినది. ఆ యలజడికి నెదుటనున్న ఆదంఖానుని వ్యక్తిత్వమున వింతవింత భావోద్రేకములు కలిగి, ఆతనిముఖవికాసములు వికృతాకారముల సూచించినవి.

అతికుశాగ్రబుద్ధియగు నక్బరు కిటి చక్కఁగ నేరస్థుని పట్టియిచ్చినది. నిశితతరదృక్కుల నాతని సమస్త దిశల శూలఘాతములవలెఁ గ్రుచ్చుకొనునట్లు పఱపుచు వజ్రకఠినమైన పలుకుములుకు లుట్టిపడ "ద్రోహీ, నకరవాల మిట్లిమ్ము." అని యడిగెను.

అంతరంగ ముత్తుంగతరంగితము కాఁగా దోషి చుట్టును బరికించిచూచి యావలికే తన్ను వలయాకారముగఁ బరివేష్టించియున్న షామ్సుద్దీన్ సేవకులు(తన్నప్పుడు చూచిన వారు) కంటఁబడఁగాఁ దన ప్రయత్నమెట్లును విఫల మగునని తీర్మానించి, తనకటారిని పాదుషాకయివశము గావించెను.

రక్తసిక్త మయిన ఆ ఖడ్గమును జక్కఁగఁ బరిశీలించి చూచి,

"ఈరుధిర మమాత్యునిదే కదా ? నిక్కము వచింపుము." అని కర్కశముగఁ బ్రశ్నించినాఁడు.

"............"

పిడి నొకచేత, మొన నొకచేతఁ బట్టి నడుము మోఁకాలువంచి యక్బరా పాడుకత్తిని రెండుగ విఱిచివేసెను.

సమీపమున నిలచియున్న దండనాధిపతిని జూచి,

"ఈ ఘోరపాపుని తో లొలిచి నడివీధుల నూరేగించి, పురశృంగాటకమున వీనితలను నఱికి వ్రేలఁగట్టుఁడు" అని యాజ్ఞాపించెను.

"గుండుదెబ్బదినితుపాకీవైపునకుఁ బొఱుతెంచు బెబ్బులివలె బొబ్బరించుచు ఆదంఖానుఁ డక్బరుమీఁది కొక్క దుముకున నెగిరి పైఁబడెను. ఇట్టి సన్నివేశమును బ్రతీక్షించియే యుండిన యా యువకచక్రవర్తి యొక్క చిన్నియుపుటున వాని పాటను దప్పించి గుఱిచూచి యొక్క గ్రుద్దు బలముగ వాని కడుపుపైని గ్రుద్దెను. ఆపోటున కాతఁ డొక్క యడుగుఱిచి నేలఁగూలెను.

తక్షణము చుట్టుపట్టుల నున్న పరిజనము దగ్గఱిమూఁగి వానిపైఁబడి యడిమిపట్టి కాలుసేతులు బంధించి వైచిరి.

"వీనిఁ గొంపోయి కోటకొమ్ము మీఁదనుండి నేలపైఁ బాఱవేయుఁడు. నేలపై వాఁడు పడుచోట సహస్ర శూలములఁ బాతియుంచి వానిపైఁబడి కాకులు గ్రద్దలు కాహారముగ చిత్రవధ నందనీయుఁడు." అని యక్బ రాజ్ఞాపించినాఁడు.

ఊరిచావున వానిని గట్టియుంచి వచ్చిపోవువారిచేతులయందొక్కొక్క కొఱివి నిచ్చి వానిచేఁ గొంచెము కొంచెము కాల్పించి యుసురుబాపుకొనుట మంచిదని యచటనున్నవా రందఱును సలహా నిచ్చిరి. కాని ఆదంఖానుఁడు కోటకొమ్మునుండియే శూలారోహణము గావింపఁబడెను.

* * *

ఇందిర తనపని ముగిసినదని చితినెక్కి తనతోలిమగనిఁ జేరుకొనవలయునని సంకల్పించియుండెను. అక్బరామె నా కార్యమునుండి విరమించునట్లనేకవిధముల నుపబోధించి యుజ్జయినికిఁ బంపెను.

మతాంతరప్రవేశమున కామె క్రుంగిపోవుచుండెను. ఇష్టజన బంధువర్గ మామెను దమలోఁ జేర్చుకొనలేదు. పగసాధించెనను గొప్పదనము

సైతమామెకు బంధువు లొసంగ లేదు.

అప్పుడప్పుడు పీర్ మహమ్మద్ షిర్వానీ మాళవపతిమాత్ర మామె నాదరించుచుండెను. రాజకీయోద్యోగు లామెను సార్వభౌముని సోదర మందినదని గౌరవింప మొదలిడిరి.

ఎట్లో షిర్వానీ యామెహృదయమును దనవశ మొనర్చుటయందు సఫలీకృతమనోరథుం డైనాడు. అనతికాలములో సార్వభౌముని యాధ్వర్యమున నుజ్జయినీనగరమున నిందిరాషిర్వానీల పాణిగ్రహణమహోత్సవ మతి వైభవముగ జరుపబడెను.

అరిగోలు

— (హంపివద్ద తుంగభద్ర నదిలో) —

D. A. R.



# టాకీ పరిశ్రమ: దాని భవిష్యత్తు

ఎ. వి. సీతారామయ్య

వర్తమాన కాలంలో ప్రపంచంలో ముఖ్యమైన పరిశ్రమ టాకీపరిశ్రమ. ప్రతి దేశంలో వర్తకశిఖామణులంతా తమ దృష్టిని ఈ వ్యాపారమునందే నిల్పి మిక్కుటమైన ధనము నార్జించుచున్నారు. మన దేశంలోని పెట్టుబడిదారులుకూడా దీని విలువనుగ్రహించి ఈ వ్యాపారమునే పెంపొందించుకొని లాభములను పొందటానికి ప్రయత్నిస్తున్నారు. మొట్టమొదట ఈ ఫిలిం వ్యాపారానికి మన దేశంలో శంకుస్థాపనచేసేవది ఫాల్కే. ఆయన 1913 లో మనదేశంలో ఫిలిములు తయారుచేయడం ప్రారంభించాడు. తరువాత 1931 లో ఇంపీరియల్ ఫిలింకంపెనివారు మొదటి టాకీ తయారుచేశారు. ఫిలిం ప్రదర్శనశాల మొదట కలకత్తాలో 1907 లో జె. యఫ్. మదన్ కట్టించాడు. అనగా మన దేశంలో ఫిలిములు తయారుచేయుడం మొదలెట్టి 23 సంవత్సరాలైనది ప్రదర్శించడం మొదలెట్టి 30 సంవత్సరాలైనది. కాని మన పరిశ్రమ యింకా శైశవావస్థయందే వున్నదని చెప్పవలసివున్నాము.

## ఫిలిము తయారున కయ్యే ఖర్చు

విదేశములలోని ఫిలిముల కయ్యేఖర్చులటుంచి మన ఫిలిములనుగురించి ఆలోచిస్తే సగటున మనఫిలిమున కొక్కొక్కదానికి రు. 60,000 లు కావాలి. ముడిఫిలిము లాబరేటరీఖర్చులు వగైరాలకు ఒక రు. 18,000; స్టూడియో అద్దెకు రూ. 12,000; నటుల జీతాలు రు. 15,000; దుస్తులు వగైరా రూ. 10,000; ప్రకటనలకు రు. 5000- అనగా మొ. రు. 60,000 లవుతుంది. ఇది మామూలుగాతీయబడే ఒకహిందీఫిలిమున కయ్యేఖర్చు. ఒక్కొక్క సమయంలో తలవని తలంపుగా వచ్చే యిబ్బందులవలన పెరుగుట కూడా కద్దు. ఏనాయిక పాత్రధారిణికో శరీరంలో అస్వస్థత ఏర్పడి ప రోజులు పనిచేయలేక పోతే కొన్నివేలు నష్ట మొస్తుందిగదా!

## మన ఫిలిం వ్యాపారము

ప్రస్తుతం మన దేశంలో ఫిలిములను తయారుచేసే కంపెనీలు 110. ఫిలిములను పంచిపెట్టే కంపెనీలు (Distributing Offices) 99. సినిమా ప్రదర్శనశాలలు 670. మొత్తం ఈ మూడుశాఖలకు వినియోగింపబడిన పెట్టుబడి 5 కోట్ల రూపాయలు. ఈ వ్యాపారంలో పనిచేస్తున్న ఉద్యోగుల సంఖ్య 25,000. ఈ లెక్కలు ఒక సంవత్సరం కింద తయారుచేసినవి. ఇప్పుడు చాలా పెరిగివుంటా యనటానికి సందేహం లేదు. కాని మన పారిశ్రామికులు ఇంకా మన పరిశ్రమ శైశవావస్థయందే వున్నదంటున్నారు.

మన దేశంలో ఫిలిములను చూచే అలవాటు తక్కిన దేశములలో మాదిరే రోజురోజుకు పెరిగిపోతున్నది ప్రజలలో. అందువలననే దేశీయ విదేశీయ ఫిలిములు ప్రదర్శింపబడుతున్న వాటి సంఖ్యకూడా పెరిగిపోతున్నది. 1935 లో మన దేశంలో చూపబడిన ఫిలిములు:—

| | పెద్దవి | చిన్నవి |
|---|---|---|
| స్వదేశీఫిలిములు | 297 | 92 |
| ఇంగ్లీషు | 39 | 575 |
| అమెరికా-హాలివుడ్ వగైరా | 311 | 823 |
| జర్మనీ | 1 | |
| ఫ్రెంచి | 3 | |
| బెల్జియను | | 3 |
| స్విస్సు | | 1 |
| డేనిషు | | 1 |
| ఆస్ట్రేలియన్ | | 3 |
| జపాను | | 1 |

4000 అడుగులకు పైన పొడవుగల ఫిలిములు పెద్దవాటికింద పరిగణిస్తారు. అంతకంటె తక్కువవాటిలో హాస్యరసచిత్రములు, వార్తాచిత్రములు, ఏంతలు వగైరా లుంటాయి.

మన దేశంలో ముడిఫిలిం (Raw film) ఈవిధంగా దిగుమతి అగుతున్నది:—

| | అడుగులు | వెల రూ. |
|---|---|---|
| 1933-34 | 369,17 201 | 1519755 |
| 1934-35 | 60101131 | 2149240 |
| 1935-36 | 60669534 | 2102262 |

ఈ దిగుమతిచేయబడిన ముడిఫిలిముల మీది సుంకము వలన ప్రభుత్వమువారికి రాబడి:—

| | | | |
|---|---|---|---|
| సం॥ | 1933-34 | రు. | 364666 |
| ,, | 1934-35 | రు. | 479000 |
| ,, | 1935-36 | రు. | 438280 |

చిత్రపట ఫిలిములు (Exposed Films) అనగా తయారు చేయబడిన చిత్రపటములు మన దేశములోనికి ఈక్రిందవిధముగా దిగుమతి చేయబడినవి:—

| సం. | అడుగులు | వెల రూ. |
|---|---|---|
| 1933-34 | 10826366 | 2779462 |
| 1934-35 | 9026731 | 2488818 |
| 1935 36 | 8537589 | 2411048 |

ఈవిధముగా దిగుమతి చేయబడిన విదేశీయ చిత్రపటముల మీది సుంకములవలన ప్రభుత్వమువారికి రాబడి:—

| సం. | రూ. |
|---|---|
| 1933 34 | 916571 |
| 1934-35 | 880483 |
| 1935-36 | 964486 |

మన దేశములో ఫిలింవ్యాపారము ఈ విధముగా వృద్ధి పొందుచున్నప్పటికిని ఇంగ్లాండులోని ఫిలింపరిశ్రమతో పోల్చిచూచినట్లయితే మనము చాలా వెనుకగా నడచుచున్నామని తెలియగలదు. ఇంగ్లాండులో 4300 కు పైగా సినిమా ప్రదర్శనశాలలున్నాయి. 1934 లో ఆ ప్రదర్శనశాలలలో 91½ కోట్ల టిక్కెట్లు అమ్ముడుపోయినాయి. దానివలన రాబడి 55 కోట్ల రూపాయలు ప్రభుత్వమువారికి అందువలన రాబడి 9½ కోట్ల రూపాయలు. ఇంతికీ మన దేశంలోని జనసంఖ్యలో ఇంగ్లాండులోని జనసంఖ్య ఏడవవంతు వుంటుంది. దీనివలన ఈ పరిశ్రమలో ఎంత లాభమున్నదో, దీనిని సరిగా ప్రోత్సహించినట్లయితే ప్రభుత్వానికి ఎంతలాభమో కూడా తెలుస్తుంది కాని ప్రభుత్వం సరిగా సాయం చేయటం లేదని అనుకుంటూ తమకుతామే ఓదార్చుకుంటూ కూర్చునేకంటే తామే ఈ పరిశ్రమాభివృద్ధికి చేయగల కృషి చేయుచున్నామాయని ఫిలింపారిశ్రామికులు ఆలోచించుకోవాలి. కాని వారట్లు చేసేందుకు సిద్ధంగా వున్నారా అనేదే ప్రశ్న!

ఉద్దేశములను- మంచివి గానీయండి చెడ్డవి గానీయండి- ప్రచారంలో పెట్టడానికి ఫిలిం వంటి యంత్రం మరొకటి లేదని రూఢి అయిపోయింది ఉద్దేశముల ప్రచుగమయేకళ. కాని అటువంటికళ ఏమైనా మన ఫిలిములలో కనబడుతున్నదా అంటే శూన్యమని చెప్పాలి. ప్రస్తుత పరిస్థితులలో మన హైందవ సినిమా ఎప్పటికైనా కళావిమయకంగా పరిణమిస్తుందా అని సందేహం కలుగజేస్తుంది.

## టాకీపరిశ్రమ: దానిభవిష్యత్తు

ఫిలిం పరిశ్రమలో ఉపయోగింపబడుతున్న యంత్రాలు వగైరా అన్నీ అన్ని దేశాలలోనూ ఒక రకపువే. చక్కని ఫిలిములు తయారు చేసేందుకు అనువైన శీతోష్ణాది పరిస్థితులు విదేశములకంటె తీసిపోవు. విదేశములలోని శాస్త్రజ్ఞులవంటి శాస్త్రజ్ఞులు మనదేశంలో నున్నారు. వ్యాపారానికి కావలసినంత పెట్టుబడి వున్నది. విదేశీయ నటులకు తీసిపోనినటులున్నారు. ఫిలిం ప్రదర్శన యంత్రములు, వాటిని నడుపువారు, ఫిలిం వ్యాపారమందు అనుభవము జ్ఞానము కలవారు వున్నారు. మరి ఇన్నివుండి మనపరిశ్రమ ఈవిధంగా యింకా శైశవావస్థయందే వుండటం ఎందుచేత ?

పరిశ్రమ సరియైన వ్యాపార పద్ధతులమీద నడపబడకపోవడంవలన.

పెట్టుబడిదారుకు ఈ పరిశ్రమ విషయమై కొంతవరకైనా తెలిసివుండాలి. పరిశ్రమలో ఏ రంగమందు కొంత దానివిషయమై జ్ఞానం సంపాదించుకోవడం చాలా అవసరం. లేకపోతే ఏశాఖకు ఎవరిని నియమించాలో, ఏశాఖ ఏవిధంగా పరిపాలించాలో తెలియక జీవితంలో వెంటనతికివున్న పాత అనుచరులను తనవ్యాపారంలో వివిధశాఖాధ్యక్షులుగా నియమించడం వారికీ అంతా కొత్తగా వడంచేత పని పాడవటం జరుగుతుంది. లేక పరిశ్రమలో అనుభవజ్ఞుల్ని నియమించినా ధనాశచేత వాడు పెట్టుబడిదారుయొక్క అజ్ఞానాన్ని ఆధారంచేసుకొని పని పాడుచేయవచ్చు. అందువలన పెట్టుబడిదారుకే కొంత జ్ఞానంవుండటం అవసరం ఈపరిశ్రమలో. ఇది మన హైందవఫిలిం పారిశ్రామికులలో ఏ ఒకరిద్దరికో తప్ప తక్కినవారిలో మృగ్యం.

వ్యాపారాన్ని ఆరంభించదలచుకోగానే పరిశ్రమలోని అనుభవజ్ఞులను జ్ఞానం కలవారిని కలుసుకొని వారితో సంప్రదించి తనవ్యాపారంయొక్క వివిధశాఖలకు ఆయాశాఖలలో అనుభవమూ, జ్ఞానమూ కలవారిని అధ్యక్షులుగా నిర్ణయించి తాను వ్యాపారదృష్టిని అజమాయిషీ చేసుకుంటుండాలి. అంతేకాని మనవాళ్లను పైకితీసుకురావలెననే ప్రసిద్ధాదర్శంతో మనవాళ్లని ఉంచితే త్వరలోనే వ్యాపారం కట్టిపేయవలసివస్తుంది. కాని మన ఫిలింపరిశ్రమలో ఎక్కువచోట్ల యిదే జరుగుతున్నది.

పరిశ్రమ ప్రారంభించినతరువాత, అనగా ఉదాహరణగా- ఫిలిం తీసే సమయంలో త అభిరుచులు, తన యిష్టాయిష్టతలు తీసుకుపోయి ఫిలిం తయారుచేయుచున్న శాస్త్రజ్ఞులను చికాకుపరచి తన అధికారమును దుర్వినియోగము చేయరాదు. మనఫిలిములలో నిది యెక్కువగా జరుగుచున్నది. డబ్బుపెట్టువానియిష్టము ననుసరించినటుల నెన్నుకొనుట మొదలు పాటలను కూర్చుటవరకు జరుగవలె. పరిశ్రమవిషయమై జ్ఞానముగల పెట్టుబడిదారులు లేకపోవుటయే దీనికి కారణము.

ఈ కారణముచేతనే సరియైన శాస్త్రజ్ఞుల నెన్నుకొనలేకపోవుట. డైరెక్టరును సయితము సరియైనవానిని ఎన్నుకొనగల సమర్థులు మన పారిశ్రామికులలో బహు కొద్దిమంది వున్నారు. ఫిలిం తయారైనతరువాత దానిని పంచుటలో (Distribution) జ్ఞానముగల వారిని నియమించి సరియైన ప్రదర్శనశాలలలో ప్రదర్శించునట్లు చూడాలి చాల చిత్రములు ప్రదర్శనశాలాలోపములవలననే పాడైపోతున్నాయి.

ఫిలిము మొదలుపెట్టినది లగాయితు ప్రచారములో పెట్టిన కొంతకాలమువరకు ప్రచారణ చక్కగా జరగాలి. దానికిగాను ప్రత్యేకముగా ఒకడు నియోగింపబడి ఆపని పర్యవేక్షిస్తుండాలి.

అప్పుడే చిత్రము బాగుంటుంది. ధనము బాగావస్తుంది.

కాని మనవాళ్లు ఏశాఖకు ఎంత ఖర్చు చేయాలో తెలియక, ఏశాఖలో ఎవరిని నియమించాలో తెలియక, ఎట్టివారి పర్యవేక్షణమున ఫిలిము తయారుచేయుట- ప్రదర్శకుల కిచ్చుట చేయవలెనో తెలియక ఎట్టి ప్రదర్శన శాలలలో ప్రదర్శించవలెనో తెలియక పరిశ్రమను పాడుచేశారు, పాడుచేస్తున్నారు.

23 సంవత్సరముల అనుభవము తరువాత పరిశ్రమ శైశవావస్థయం దున్నదంటే సిగ్గుచేటు. ప్రభుత్వమువారు సహాయము చేయలేదని చెప్పటం పారిశ్రామికులకు రివాజైపోయింది. కాని తమచేతిలో నున్నంతవరకు తాము చేయుచున్నారా? ఎవరైనా ప్రశ్నిస్తే తాము తీసే ఫిలిములు పామరజనము కొరకని ఒక తెలివితక్కువ జవాబు యిస్తారు. వారికి కళావిషయకమైన ఫిలిము ఆనందించడం చేతకానట్లు. విదేశఫిలిములు దేశమున దిగుమతి చేయనీయరాదనీ, విదేశీయకంపెనీలవారిని మనదేశమున-ప్రదర్శనశాలలు కట్టనీయరాదనీ ఒక ప్రబలఆందోళన జాతీయభావం పొంగిపోతున్నట్లు అంతేకాని వారిఫిలిములూ, వారి ప్రదర్శనశాలలూ అనవసరము లయేట్లు తామెందుకు తయారు చేయరాదో? బొంబాయిలో ఒక విదేశీయకంపెనీవారు ప్రదర్శనశాల నొకదానిని కట్టడానికి ప్రయత్నిస్తుంటే ఈ మహాజాతీయనాయకు లంతా ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వంవారు ఆకంపెనీకి ప్రదర్శనశాల కట్టుకొనుటకు అనుమతి నివ్వరాదని. కలకత్తాలో మెట్రోసినిమా కట్టదలచినపుడుగూడా ఇటువంటి ఆందోళనే చేశారు. కాని యిప్పుడు ఆ ఆందోళన చేసినవారు గూడా అక్కడిఫిలిములు చూడటానికి పోతుంటారు. ఆసినిమాలో 100 కి 50 మంది కనీసము దేశీయులే. అంత సౌందర్యవంతము, అంత సుఖవంతము అయిన ప్రదర్శనశాల అంతకుముందే నిర్మించి వున్నట్లయితే మెట్రో సినిమా అనవసర మయేదేగా! ఒకడు స్టూడియో పెడితే యిక అందరూ స్టూడియోలు పెట్టేవారే. ఒకడు ఫిలింతీస్తే అంతా ఫిలిములు తీసేవారే. ఒకడు చక్కని ప్రదర్శనశాల, కట్టించడం, ఒకడు చక్కని ముద్రాక్షరశాల, ఒకడు ఫిలింనటులకు కావలసిన రంగులు, దుస్తులు వగైరా తయారుచేయడం, మరొకడు మరొకశాఖ-ఆవిధంగా పరిశ్రమ నాధారంచేసుకొని పరిశ్రమను బాగుపరచి తాము బాగుపడరాదూ? రంగుల దగ్గరనుంచీ విదేశంమీద ఆధారపడవలసినదేనా యిప్పటికీ? వేలకు వేలుగా టాకీలు తీస్తున్నారు. ఒక ఫిలిమునకైనా మన్నునకైనా చక్కని పోస్టర్లను తయారు చేసిన కంపెనీ వున్నదా. పాశ్చాత్య ఫిలిముల పోస్టర్లమాదిరి?

ఈ విధంగా జరుగుతే కొంతకాలం మన ఫిలింపరిశ్రమ ఏమవుతుంది ?

దానికి జవాబు యిప్పుడే వస్తున్నది మన వారి ప్రదర్శన శాలలున్నా అనేకముగా విదేశీయ మెట్రో సినిమాకే ప్రేక్షకులు చేరుకుంటున్నారు. మన ఫిలిములు యిన్ని తయారవుతున్నా విదేశీయ ఫిలిములలోని ఆఖరు రకపువాటితో సమానంగా కూడా తయారుగావడంలేదు కొద్దిమినహాయింపులతో. ఇప్పుడు గనక మనపారిశ్రామికులు నిద్రమేల్కొని మన పరిశ్రమను ఫిలిము తయారుచేయడం మొదలు ప్రదర్శించడం వగైరా పాశ్చాత్య సంస్థలతో సమానంగా చేయకపోతే మన పరిశ్రమ విదేశీయ కంపెనీలపోటీకి నిలువలేక పడిపోతుంది.

విదేశీయ కంపెనీలు ప్రదర్శనశాలలు కట్టుకుంటుంటేనే హాదిలి ప్రేక్షకులు కోరుతున్న మన పారిశ్రామికులు ఇతరదేశపు కంపెనీలు వారి ధనముతో వారి శాస్త్రజ్ఞులతో మన దేశంలో మన నటులతో మన కధలను మన భాషలలో తీసి తాము నిర్మించిన ప్రదర్శనశాలలలోగనక ప్రదర్శిస్తే మన ఫిలింకంపెనీల గతి ఏమగునో వూహించుకోవాలి. వారి ఫిలిములను రానీయకూడదని కొట్టుకుంటే లాభం లేదు. నిజంగా మన ఫిలింకంపెనీలలో కొన్ని అయినా కష్టపడి చక్కని ఫిలిములను తయారు చేయడానికి కారణం విదేశఫిలిముల ప్రదర్శన, అందువలని పోటీయే. వారు ప్రదర్శనశాలలు నిర్మించడం ఆరంభించినతరువాతనే మనవాళ్ళు మేల్కొన్నారు ప్రదర్శనశాలల విషయమై. అప్పుడే విదేశీయకంపెనీలవారు తమ యంత్రములతో తమశాస్త్రజ్ఞుల సహాయమున మా ఫిలిముల నిచ్చట తయారుచేయడానికి ప్రయత్నిస్తున్నారు. మనవాళ్లు ఈవిధంగానే కదులుతుంటే వారు మనల్ని వెనక్కుతోసి పరిశ్రమను స్వాధీనపరుచుకుంటారు

తీరికగడియలు —వాసన్.



# "పుణ్యాత్ములు!"

బొడ్డు బాపిరాజు

జడివానకు మిడిగాలికి
అడగని వెనుగిడుపుమాట కడుగు తడబడం
దడికట్టిన చీకటి నె
ద్దడి జనునున్న దొకబిడ్డ తన జనకునితో.

'నా' యనువారు లేని తన నాయనకుం దనకున్ పరస్పరా
పాయ సాంత్వనమ్ములె క్షుధానలశాంతులుగా, పురాభవా
చారము పాప మోపికల దాటుడి తద్వ్యధిదగ్ధజీవితా
ధ్యాయములందు 'సౌఖ్యప్రద'మన్న దొకానొకచోట నున్నదా?

ఆరేడేళ్లవయస్సు చిన్న దది ఒయ్యాం బ్రాపుగా చూపుగా
పారాడున్ ముదివగ్గు; అయ్యతని సేవాభావ మొక్కండె వ్యా
పారంబైనది యా కుమారికకు; అవ్వారిద్ద రోరంత ప్రొ
ద్దారం ద్రొక్కని గుమ్మ ముండడదు చివాట్లో తిట్లో పాటించుచున్.

కొడుకులగన్న ఏజననికో దయపుట్టగ పెట్టె డోగిరం
బోడి నిడ, ఒక్కపూట కరవో అరలోనరవో క్షుధాగ్ని త్రో
పడ, సులభంబు లంబువులు పారణగాగ కొరంతదీర్చు నా
బడుగుల గోడు దేవునకె పట్టగ లే దనవచ్చు గట్టిగా!

తొలికోడిన్ జతిగూండి లేచిన మొదల్ దోగాడుచున్ ప్రొద్దుపో
కలదాకన్ నగరంబునన్ 'భవతి! భిక్షాం దేహి' యం చార్చి, జో
లెలు కన్నీళ్లను నింపు వారి గతు లాలింపంగ పాలింపగా
చలిమిన్ దగ్గరచుట్టముల్పగిది వచ్చెం గాలియు న్వానయున్!

జలనిధి బాడబమ్ము నవి చావని లోపలిమంటతో, నర
మ్మునయి పూడురీతి నళుపుం జలిగాలిని, పాడువడ్డ కొం
పల వలె నున్న అక్కటికిమబ్బుల క్రిందుగ సాగిపోవు దు
ర్బలుల కొకింత వెల్గు కనుపట్టదు పో బ్రదుకుల్ తరింపగా!

సత్తువ సన్నమై నడువజాలక, గాలికి తేలిపోవుచున్
బొత్తిగ నిల్వలేని పదముల్ పడనెట్టెడి చిన్నిబొట్టెకేల్
మెత్తన వెంబట్టి బడిని మెల్లగ పోవు తదంధభిక్షు నా
పత్తుల కడ్డము స్వర్లోకనివాసము కన్నులువిచ్చి చూచెడిన్.

తమి రెట్టింపగ కొందరయ్యలట శ్రద్ధాభక్తులే భిన్నభి
న్నములై మూర్తులుదాల్చినట్టుల పురాణగ్రంథపారాయణ

ప్రమదామత్తత నున్నవార, లస లీబాహ్యప్రపంచమ్ము వా
రి మనోభావములందె లే; దడిగినారే సాక్షి ? ఆ దేవుడే !

'ఏమండయ్యాలు ! గుప్పెడన్నమును పెట్టించండి !' యం చాగలే
కామూలమ్ముగ కూలిపడ్డ దరె ! ఆయమ్మాయి; గగ్గోలుగా
'ఏ మమ్మా ?' యని వృద్ధుడుం బడియె నశ్లే నిల్చుపాళాన. లే
డా మందన్ కలికాన కొక్కరుడు 'కట్టా !' యన్న పాపాత్ముడే !

'ఎక్కడ దాపురించితిరి యీ నడి కేతిరి ? వండి వార్చిరే !
గ్రక్కున బెట్టగా ముడుపుగట్టితిమా ?' యన గేస్తు; కొందరే
ప్రక్కకొ పొండు, మంచికథపట్టిననే చెడగొట్టిరే ! మిముం
డక్కలలాగు పెంచుటకునో యిగ మాపసి రేపుమాపులున్ !

పోవోయీ !' యన, గోడుగోడునను 'బాబుల్ ! మీ కటాక్షమ్ములెం
డే వేళన్ మెదు కింతయుం గొరుకలేనేలేదు, పస్తయ్యె; మా
దైవమ్ముల్ తమ రాగ్రహింప కిడు డేదైనన్ కలో గంజో' యం
చావృద్ధుండటు రాతిగుండె కరగన్ యాచించి చేసాచినన్.

చిటపటమంచు చిందిపడు చిన్కులవే కరుణాబ్ధియశ్రులో !
అట హరిభక్తులందరికి 'ఆగిన దయ్యె పురాణ' మన్న పె
న్గటకట యొండె కాని, చెవి నాటదు వృద్ధుని కాకిగోల, అ
క్కటిక జనింప దింత; పయిగా పడగెంటు డనంగజాలిరే !

ఉన్నావా భగవంతు డన్నఘనుడా ? ఊకొట్టి యార్తధ్వనుల్
విన్నావా ? పరమార్థచింతకుల తద్వృత్తంబు సాంతంబు గ
న్గొన్నావా ? అటులైన నేటి కిటు జాగుల్ ? నీ సదాస్తిక్య మో
యన్నా రూఢి యొనర్చుకోదగును రమ్మా ఏల తాటస్థ్యముల్ ?

విడివిడనట్టి గుండెదడ, వేసట వాయకమున్న లేచి, కాల్
తడబడ తండ్రిచేయి పదిలమ్ముగ పట్టిన పట్టి, పాప, మ
య్యెడ నిలుచుండ కేగుచు "బలే, ప్రభు లన్నము పెట్టకున్న కొ
ట్టెడి, నిక నేమి పున్నియము, లేమి పురాణము !" లంచు నార్చినన్.

"అమ్మ ! మన పాపమే; వారి ననగ నేల ?
పెట్టి పుట్టిన పుణ్యాత్మ ! లట్టుగాక;
కుడిచి కూర్చుండి సద్గ్రంథగోష్ఠి వారి,
కెపుడు పొట్టకూటికి దేవురింపు మనకు !"




చెన్నపురిలోని గవర్నమెంటు స్కూల్ ఆఫ్ టెక్నాలజీ ఆంధ్రవిద్యార్థి సంఘపు చతుర్థవార్షికోత్సవము



అణ్ణామలై విశ్వవిద్యాలయమందలి ఆంధ్రసంఘము



నెల్లూరులో మొల్ల జయంత్యుత్సవము,



ఆంధ్రభారతీతీర్థ సమావేశము, (విశాఖపట్టణము) (అధ్యక్షులు: శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు.)



ఆంధ్రమహిళా గానసభ చతుర్థవార్షిక సమావేశము, రాజమండ్రి

# పరిణామ, జన్మాంతరసిద్ధాంత విమర్శ

ప్రకృతిపరిశోధన అన్నిశాఖలంగును విరివిగ సాగుచున్నది. జీవశాస్త్రవేత్తలు పరిణామ సిద్ధాంతమును మిగుల అభిమానించు చున్నారు. వారి పరిశోధన ఫలితములను విచారింతము. సకలజీవులును రెండు రకములుగ నున్నవి: ఏకకణజీవులు, బహుళకణజీవులు. ఒక్క జీవకణముగా పుట్టి, ఒకే జీవకణముగా పెరిగి, అటులనే అంతరించు జీవులు ఏకకణ జీవు లనబడును. అనేక జీవకణములు చేరి వివిధావయవములు గల శరీరములతో నొప్పునవి బహుళకణ జీవులు. ఇవియు ప్రప్రథమమున ఏకకణ జీవులుగనే జీవయాత్ర మొదలు పెట్టును. ఆ జీవకణము గర్భధారణము పొందును. అప్పుడది రెండుగా విభజనమగును. ఆ రెండును రెండేసిగా చీలును; నాలుగగును. ఆ నాలుగును అదే తీరున ఎనిమిదగును. ఇట్లు ద్వివిభజనపద్ధతి సాగుచుండ అనేక కణములు ఏర్పడును. ఏకకణజీవులందివి వేర్వేరుగానే స్వతంత్రజీవులైపోవును. బహుళకణజీవులందివి వేర్వేరు ఇంద్రియగోళములుగను, అవయవములుగను ఏర్పడి, సమష్టిని తల్లి జీవినిబోలు క్రొత్త జంతువుగా తయారగును.

ప్రతి జీవకణమును పరిపూర్ణమగు మఱొక కణమునుండియే పుట్టవలెను. ద్వివిభజనమందు జీవకణము కొంచెము పొడవుగ సాగును. దానిమధ్యమందున్న జీవాంకురము రెండుభాగము లగును. ఆ జీవకణము నడుమను ఒక గాడి యేర్పడి, క్రమముగా లోతై, దానిని రెండు జీవకణములుగా చీల్చును. ఆ చీలిక యేర్పడునప్పుడే అందలి జీవాంకురపు సగభాగములు ఆ రెండు నూతనకణములను ఆక్రమించుకొనగా అవి స్వతంత్ర జీవకణములగును. అవి మరల నిటులనే ద్వివిభజనమందును. ఇటుల ఒక జీవకణమునుండి మఱొక జీవకణము పుట్టునప్పుడు, మధ్య అంతరము లేకుండ జీవయాత్రసాగివచ్చును. మధ్యమరణమనునది లేదు. ఇప్పుడు లోకమునగల చెట్లలోగాని, తృణములందుగాని, పశువులలోగాని, పక్షులందుగాని, నరులలోగాని, క్రిమికీటకాదులందుగాని ఏదేని జీవకణము ఆధారముగ లేకుండ స్వతంత్రముగ పుట్టిన జీవకణ మొక్కటైనను లేదు. ఇట్లీ వంశవృక్షము సనాకము యుగములుగనిది వ్యాపించి యున్నది; ముందునకును యుగములు దాటి సాగగలదు.

పైని పేర్కొనిన గర్భధారణము రెండు విధముల సంభవించుచున్నది. ఏకకణజీవియందు, పరసంభోగము లేకయే, వయఃపరిపాకమువలన ఒకరీతి ఉద్రేకము గల్గును. అప్పుడది గర్భధారణ మయినట్లు ద్వివిభజనమగుట సాగించును. దానికి అన్యప్రేరణ మక్కఱలేదు. బహుళకణజీవులలోను కొన్ని సంభోగరూపమున అన్యప్రేరణ లేకయే గర్భధారణము చేయుచున్నవి. ఒకానొక పరిపాకదశయందు, తల్లిశరీరమునందు ఒక జీవకణము వేఱుపడును, ఇది నూతన జీవోత్పత్తికి మూలాధారమగును. ఈ మాతృకాజీవకణము ద్వివిభజనపద్ధతిని సాగించి తల్లిజంతు

ప్రకృతిశాస్త్రవేత్తలు ప్రశంసించు పరిణామసూత్రము స్థూలదేహ సంబంధమైనది; జన్మాంతర సిద్ధాంతము సూక్ష్మశరీర సంబంధమైనది.

తత్వానందస్వామి

వుబోలు ఒక నూతనప్రాణి సిద్ధమగుటకు ఆధారభూతమగును. సంభోగమూలమున గర్భధారణమగువిధము రెండవది. తల్లిగర్భాశయమున ఒక జీవకణము ప్రత్యేకముగ నేర్పడును. ఇదియే శోణితబిందువు. సంభోగసమయమున తండ్రివలన ఒక జీవకణమువచ్చి దీనితో చేరి మిళితమైపోవును. ఇది శుక్లబిందువు. ఇట్లు శుక్లశోణిత బిందుద్వయముచేత నేర్పడిన బిందువు పుట్టబోవు జీవికి మాతృకాకణ మగును. ఈ రెండు కణములందలి జీవాంకురములును ఏకమైపోవును. ఇదియే గర్భధారణము. అంతట ఈ జీవకణము ద్వివిభజనము సాగించును. నూతనజీవి యేర్పడి యుక్తకాలమున తల్లిగర్భాశయమునుండి వెలువడును. అండజములలో పరిణతిపొందిన గ్రుడ్డుమాత్రమే తల్లిగర్భాశయమునుండి వెలువడి వచ్చి, కొంతకాలము పొదుగబడి, అందుండి నూతన జంతువు పుట్టును. ఈ జీవోత్పత్తివిధానమునందంతటను ఒక్క జీవకణము తల్లిజీవిలో మున్ముందు ఏర్పడుచున్నది. దీనిని మాతృకాజీవకణ మందురు. ఇది తల్లిజీవియొక్క మాతృకా జీవకణమునుండి పుట్టుచు, అందుండు జీవరసధాతువును పంచుకొనుచున్నది. ఇట్టి మాతృకా జీవకణములనుండియే నూతన జీవోత్పత్తి సాగివచ్చును. ప్రతిజీవియందును ఇట్టి మాతృకా జీవకణము ఒక్కటుండును. ఒకదీపము వేలు దీపములను వెలిగించుచు తాను కొఱవడనట్లు, మాతృకాజీవకణము నూతనజీవోత్పత్తికి మూలమగుచును తాను క్షయమునందదు. దీని యందుమాత్రమే జీవరసధాతు వుండును. దీని ప్రభావముచేతనే నూతనజీవోత్పత్తి వెలయుచుండుట. దీనినుండి ద్వివిభజనపద్ధతిని జనించు ఇతరజీవకణములందు జీవరసధాతువు చేరదు. ఈ కణములు శరీరావయవములను నిర్మాణము చేయుటకు వినియోగపడునేకాని, నూతన జీవోత్పత్తిని కల్పింపజాలవు. మాతృకాజీవకణములకును తక్కిన జీవకణములకును భేద మిదియే. శుక్లశోణిత బిందువులందలి జీవాంకురములు కలిసి ఒకేజీవాంకురముగ నేర్పడుట యందును, ఆబిందుద్వయముకూడి ఏకకణ మగుటయందును గల మర్మము ఇంకను జీవశాస్త్రవేత్తలకు విశదముకాలేదు. ఇటుల జీవవంశవృక్షము సాగిపోవుచుండగా, ఆయాపరిస్థితులనుబట్టియు, అవసరములబట్టియు జీవులందును వాని శరీరావయవములందును పరివర్తనములు జరుగుచుండును. నూతనసంస్కారములు కల్గుచుండును. ప్రాతవి మారుచుండును. దీనినే పరిణామసిద్ధాంత మందురు. ఈ సిద్ధాంతానుసారమే చిన్న ఏకకణజీవిసంతానమునుండి, అనేకవేల పరివర్తనములు సంస్కారములు సంఘటిలుచురాగా, క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు, నరులు పుట్టుకొనివచ్చిరనెడు పరిణామవాదము నిరూపణమైనది.

పైనుదాహరించినద్వివిభజనక్రియను మనము కల్పన చేయవచ్చును. మంచినీటిలో "ఎమీబా"అను ఏకకణజీవి కలదు. అది అత్యంతము చిన్నదగుజంతువు. ఆ ఒక్క కణమునందే అవయవములన్నియు అవ్యక్తములై కూడియున్నవి. ఒక "ఎమీబా"ను సునిశితమగు శస్త్రముతో రెండుగా ఖండించినయెడల ఆ రెండుభాగము

బను వెంటనే రెండు "ఎమీబా" లగును. వానిని మరల ఖండించుచో అవియు నాలుగు స్వతంత్రములను, పూర్ణవికాసముగల ఎమీబా లగును. ఇట్లు ఎన్నిసారులు ఖండించినను "ఎమీబా"ను చంపలేము సరిగదా దానిసంతానసంఖ్య అపరిమితముగా పెరిగిపోవును. తారచేపను ఖండించినను ఇటులనే జరుగును. ఖండింపబడిన ముక్కలు వెనువెంటనే అవయవములనుసయితము సృష్టిచేసికొని, పూర్తియగు తారచేప లగుచున్నవి. వానపామును నరికినయెడల దానిముక్కలు స్వతంత్రజీవు లగుచున్నవి. సహజముగ నేర్పడని, ఇట్టిసంతానవృద్ధిని కల్పన చేయవచ్చును. ఇట్టి జంతువు లన్నిటియందును ఎక్కడినుండి జీవాత్మలు వచ్చి చేరుచుండగలరు? వారి జన్మాంతర ప్రాప్తికి వారికర్మ ఆధారమను టెట్లు? అను ప్రశ్నలు కలుగుచున్నవి.

స్థూలశరీరములు లేకుండ జీవులు సూక్ష్మశరీరములతో నుండునా? జీవుడులేనిది చేతనకర్మలు సాగజాలవుగదా! జీవకణముల చలనమునకును, వాని ద్వివిభజనక్రియకును జీవాత్మయే కర్తయగునెడల, క్రొత్తగా నేర్పడిన జీవకణములలో జీవుడు ప్రవేశించులోపల అది మృతమై తిరిగి బ్రతుకుచున్నదా? లేక నూతనజీవుడు ముందు ప్రవేశించియే, తానొకభాగమును మొదటి జీవకణమునుండి వేరుచేసికొనునా? మఱియు సంభోగముచే సంతానవృద్ధి యగుపట్ల, మాతృకాజీవకణములు రెండు ఏకమగుచున్నవి; వానిలోని జీవాంశములును మొట్టమొదట ఏకమై, జీవయాత్రను ప్రారంభించుచున్నవి. అప్పుడు రెండు జీవాత్మలు ఏకమై, మరల విడిపోవుచున్నారనవలయునా? అట్లగునెడల వారి విశిష్టములగు సూక్ష్మశరీరము లనెడు ఆవరణల గతియేమి? ఆ జీవాత్మల వ్యక్తిత్వములు క్షణకాలము నాశమంది, పునర్భవము లగునా? జీవకణ విభజనలతోపాటు జీవాత్మలును ఖండములై పెరిగిపోదురా? అప్పుడు వ్యక్తిత్వ మెక్కడ? ఈ సంశయములును ప్రకృతిశాస్త్రమును బాధించుచున్నవి.

జన్మాంతర సిద్ధాంతమునుకూడ విచారింతము. జీవుడు, లేక జీవాత్మ అనేక జన్మలను పొందుచున్నాడు; అనగా వేర్వేరు శరీరములను ధరించుచున్నాడు; అవి అనుకూలములు కానప్పుడు వానిని విడిచి క్రొత్తక్రొత్తవానిలో ప్రవేశించుచున్నాడు. ఇట్టి జననమరణములు అసంఖ్యాకములై, పెద్దగొలుసులోని కడియములవలె ఒకదానినంటి ఒకటిగా వచ్చుచున్నవి. ఈ కడియములు చిన్నవి పెద్దవిగ నుండవచ్చును. అనగా జన్మకాలములుగాని, మరణకాలములుగాని (అనగా ఒకజన్మాంతమునకును మరుజన్మ ప్రారంభమునకును మధ్యకాలములుగాని) హెచ్చుతగ్గులుగా నుండవచ్చును. చెట్లగింజలను ఉదాహరణగ చూడుడు. కొన్ని గింజలు సత్వరము పెరిగి పరిపక్వతగాంచి తిరిగి మొలకలెత్తుటకు సమర్థములగునుగదా. వాని మొక్కలును స్వల్పకాలము జీవించునవిగనే యుండవచ్చును. మఱికొన్ని చెట్లగింజలు పరిపక్వమగుటకు నెలలు సంవత్సరములుగూడ పట్టును. అవి మొలకలెత్తుటకును చాలకాలము పట్టును. అటులనే జీవుల జన్మపునర్జన్మల తీరును గ్రహింపవలె నందురు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

మానవుడు జీర్ణములయిన బట్టలను తీసివేసి క్రొత్తవానిని ధరించుతీరున జీవుడు జీర్ణములయిన శరీరములను విడిచివేసి క్రొత్తవానిని ధరించుచుండును. మరణకాలమున జీర్ణములయిన తనువులు, అనగా అక్కరకురాని వానినుండి వెలువడి, జననకాలమున క్రొత్తతనువులందు, అనగా తనపురోగమనమునకు అనుకూలించునట్టి శరీరములందు ప్రవేశించును. ఇది స్థూలశరీర ప్రశంస.

ఈరీతిగా స్థూలశరీరములు మారిపోవుచున్నను జీవుడు అంతరించిపోక తన వ్యక్తిత్వమును నిలుపుకొనుచు జీవయాత్రను అనంతముగా సాగించును. వీని వ్యక్తిత్వమును దేనినిబట్టి గుర్తింపగలము? మరణసమయమందు విచ్ఛిన్నమైపోక, జననకాలమునందు మారిపోక జీవుని అంటివచ్చు సూక్ష్మశరీరమొకటి కలదు. దానిని లింగశరీరమనియు పేర్కొందురు. దశేంద్రియములు, పంచప్రాణములు, అహంకారము, మనస్సు అను వానితో ఈ లింగశరీరము ఏర్పడియుండును గీతలో దీనియం దారుఇంద్రియములుమాత్రముండునని చెప్పబడియున్నది.

మమైవాంశో జీవలోకే
జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠానీంద్రియాణి
ప్రకృతిస్థాని కర్షతి.

"సనాతనమగు నా ఈశ్వరాంశము జీవలోకమునందు జీవుడై మనస్సుతోగూడ ఆరింద్రియములను ఆకర్షించుచున్నది."

శరీరం య దవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గంధానివాశయాత్.

"ఇట్లు జీవరూపము దాల్చిన ఈశ్వరుడు శరీరమును ధరించునప్పుడును విడుచునప్పుడును, వాయువు తననివాసములగు పుష్పాదుల వాసనలను వెంటదీసికొనిపోవుతీరున, మనస్సును, ఇంద్రియములను తనవెంట తీసికొనిపోవుచుండును.

శ్రోత్రం చక్షుః స్పర్శనంచ
రసనం ఘ్రాణమేవచ,
అధిష్ఠాయ మనశ్చాయం
విషయా నుపసేవతే.

"ఈ జీవుడు చెవులు, కన్నులు, చర్మము, నాలుక, ముక్కు, మనస్సు అనువానిని ఆధారము చేసికొని ప్రపంచవిషయభోగములను పొందుచున్నాడు.

సాంఖ్యులు మున్నగువారు ఈ లింగశరీరాంగముల సంఖ్యను వేఱువిధముగ పేర్కొనుచున్నారు. కాని ఎల్లరును దీనిని ప్రపంచానుభవముల భాండాగారముగ అంగీకరించియున్నారు. దీనియందు దైవాంశరూపుడగు జీవు డుండును. ఈతడు ప్రపంచానుభవములచే గడించు ఫలితార్థములు ఈ లింగశరీరమున ముద్రితములై యుండును. ఈ ముద్రలనే జన్మసంస్కారములు, పూర్వవాసనలు అందురు. ఈ సంస్కారముల ననుసరించి యింద్రియములకు రాగద్వేషములు అభిమాన తిరస్కారభావములు అలవడుచుండును. వేర్వేరు వ్యక్తుల అభిలాషలందును, అభిప్రాయములందును, అభిరుచులందును భేదములు కానిపించుటకు హేతువులు ఈ సంస్కారములే. ఇవి ఆయా జన్మలందు కావించు కర్మల ననుసరించియు, వానివలన గల్గు కష్టసుఖముల ననుసరించియు, ఇవి ఆధారముగా లభించు నైతికశిక్షణము ననుసరించియు సంస్కారములు మారుచుండును. ఇటుల లింగశరీరము పరివర్తనము పొందుచుండును. ఇది సూక్ష్మశరీరపరిణామము. ఈ పరిణామదశలకు అనుకూలముగా జీవుడు స్థూ

శరీరములను మార్చుకొనుచుండును. స్థూలశరీరములు తఱుచుగా మారిపోవుచుండ, సూక్ష్మశరీరము అటుల పూర్తిగ మారిపోక పరిణామము పొందుచుండును. జీవుని వ్యక్తిత్వమునకు ఈ సూక్ష్మ శరీరమే ఆధారము. జీవులందు గోచరించు స్వభావభేదములకును ఈ సూక్ష్మ శరీరమందలి సంస్కారములే మూలము.

ప్రకృతి శాస్త్రజ్ఞులు స్థూలశరీర పరిణామమును, తద్ద్వారా జరుగు జీవాంకుర యాత్రను పరిగణింతురు. వారు గమనించు జీవయాత్ర తెంపులేని ప్రవాహరూపమున సాగుచున్నది. సృష్ట్యాదిని ఎటులో పుట్టిన జీవకణము సతతము సంతానవృద్ధి గాంచుచున్నది. దాని సంతానమునకు అంతులేదు. ఆ సంతానము స్థూలపరిణామము పొందుచుండును. కాని పరమావధి ఏమో తెలియదు. ప్రకృతి శాస్త్రజ్ఞులు మాతృకాజీవకణమునందలి జీవాంకురమునే జీవు డనుచున్నారు. జన్మాంతరసిద్ధాంతులు "జీవుడు జీవాత్మ అనునది జీవాంకురము కాదు. ఈ జీవాంకురము స్థూల చరిత్రగలది. జీవుడు దీనిని అధిష్ఠించి, దీని ద్వారమున పనుల చేయించుకొనును. జీవుడు మానసిక నైతిక చరిత్ర గలవాడు. స్థూలోపాధి లేక జీవాంకురము మనజాలదు. స్థూలోపాధిలేకయు జీవుడు మనగలడు. స్థూలశరీరము నరరూపము తాల్చుటతో జీవాంకురము నడపు పరిణామము ఆగిపోవుచున్నది. జీవుని పరిణామము దీనిని అతిక్రమించి చాలవఱకు సాగిపోవును. అనేక నరజన్మల నెత్తినగాని జీవుడు పరమావధిని చేరడు. జీవునకు భౌతిక మగు పరిమాణాకారములు లేవు. వానికి పరిమాణ మనునదియే లేదు. ఇక ఆకార మెక్కడిది? అతడు కేవలము భావగమ్యుడు. ఆత్మస్వరూపి" అనుచున్నారు.

మఱొక విషయము. సాధారణముగా జంతు శరీరములందుండు చేతన పదార్థమును సావయవపదార్థ మందురు. ఇందొకరీతి నిర్మాణ విశేష ముండును. ఇట్టిదే వృక్షజాతులందును కలదు. ఇది ప్రాణిచేష్టలకు ఉపాధిగా అక్కఱకు వచ్చుచున్నది. ఇదికాక లోకములో జడపదార్థమనునది కలదు. ఇందు జీవలక్షణములు గోచరింపవు. పరిణామచిహ్నములు లేవు. నిర్మాణవిశేషమును ప్రస్ఫుటముగ నుండదు. ప్రకృతిశాస్త్రజ్ఞులు దీనిని కేవలము జడమందురు. కాని చేతనములందలి సజీవ పదార్థము తోచేరి, అందు శీర్ణమై, ఇదియు సచేతనము కాగలదు. అదెట్లు ఘటిల్లుచున్నదో తెలియుట లేదు. భూమిలోపలి జడధాతువు లెన్నియో చెట్టుచేమలలోనికి పోయి, వానితో సారూప్యము పొంది సచేతనములగుచున్నవి; జంతువులశరీరములలోనికి పోయి, అందు శీర్ణమై, సచేతన పదార్థములగుచున్నవి. ఇంతేల, జీవకణద్రవ్యములుగను, జీవాంకురములుగను కూడ పరిణామము పొందుచున్నవి. ఇటుల చూచునెడ చేతనములకును జడములకును నడుమ హద్దులను నిర్ణయించుట ప్రకృతిశాస్త్రజ్ఞులకును సాధ్యము కాకున్నది. జగదీశచంద్రబోసుగారు లోహపాషాణములందును జీవమున్నదనియు, జగమున జడపదార్థమనునదియే లేదనియు నిదర్శనములు చూపుచున్నారు. 'సర్వమిదం ఆత్మమయం' అను శ్రుతి ప్రకృతిశాస్త్రముద్వారమునను రుజువుకాగలస్థితి వచ్చుచున్నది.

సామాన్యముగా జడము, అచేతనము అని వర్ణింపబడు పదార్థములస్థితియు కొంత విచారింతము. పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు వాని అణువుల పరిశోధనలుచేసి, వానియందుకూడ నిర్ణీతనిర్మాణక్రమ మున్నదని కనుగొనిరి. వేర్వేరు అణువులు భిన్న భిన్న నిర్మాణములు కలవై జాతిభేదమునొందియున్నవని చెప్పుచున్నారు. ఇట్టి స్థిరతరజాతీయ నిర్మాణముండుట చేతనములక్షణములలో ప్రధానలక్షణముగ సంగీకరింపబడుచున్నది. మఱియు ఈ అణువులందు సంతతగతమైన సంచలనమున్నదట. ఈ చలనము సయితము నిర్ణీతమైయుండునట. ఇందువలనను అణువులందు జాతిభేదము పాటింపవచ్చును. ఇదియు సచేతనవస్తులక్షణమే. ఈలక్షణములందు సరివర్తనములగల్పించునెడల ఒకజాతిఅణువు వేఱొకజాతి అణువుగా మారుననుచున్నారు. హీలియమను పదార్థాణువు రేడియమను పదార్థాణువుగను, రేడియము పదార్థాణువు సీసపు నణువుగను మారగలదనుచున్నారు. అట్టి మార్పు పరిశోధనల చేయుచున్నారు. చేతనాచేతనము లను విభేదము నుణిభౌతిశాస్త్రపరిశోధనలవలన అంతరించిపోవుచున్నదని జనరలు స్మట్సుగారు ప్రవచించుచున్నారు. ఈ విశ్వములో ఏపదార్థమును, ఏ శక్తియు తత్త్వతః మఱొకదాని నుండి భిన్నముకాదని విశ్వసింపబడుచున్నది. ఇక పదార్థములందలి జాతిభేదము అజ్ఞానజనకము. అవస్థాభేదమేగాని వానియందు జాతిభేదములేదు. ఉష్ణము, కాంతి, విద్యుచ్ఛక్తి, గమనశక్తి, కాంతిశక్తి అనునవన్నియు ఒకేశక్తి యొక్క రూపాంతరభేదము లని ఆధునిక శాస్త్రములు ఒప్పుకొనుచున్నవి మఱియు పదార్థ మనునది శక్తియొక్క గతిభేదముచే ఆభాసముగ కల్పిత మగుచున్న దనియు కొందఱు విజ్ఞులు రుజువు చేయబూనియున్నారు. ఇది "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అను శ్రుతివాక్యమునకు చేరువగ వచ్చుచున్నది.

ఇప్పుడు "ప్రాణము" అని మనము చెప్పుకొనునది ద్రవ్యరాశియందు అంతర్యామియై పరగు ఆత్మయొక్క ప్రథమ ప్రకాశచిహ్నమే! చేతనపదార్థములు తమయందు ఆత్మకలదను నిదర్శనమును సూచించుచున్నవి. అచేతనపదార్థములు తమయందు గల ఆత్మప్రకాశమును మాటుపఱచుచున్నవి. ఇటుల దాచబడియున్న ఆత్మప్రకాశమును క్రమక్రమముగా గోచరింపజేయు పరివర్తనమే పరిణామ మనబడుచున్నది. ఆ పరిణామము పూర్తియై, సకలావరణలు తొలగి ఆత్మ ఆత్మగా ప్రకాశించుటే పరమగమ్యము. ఈ పరిణామక్రమమున జడద్రవ్యము ప్రాథమదశయు, జంతుపదార్థము లేక జీవరసము అనునది మాధ్యమికదశయు, ఆత్మ పరమోత్తమదశయు నని ఆలంకారిక భాషలో చెప్పుకోవచ్చును. వీనినడుమ అసంఖ్యాకములగు అవస్థాభేదములు కలవు.

ప్రాథమిక చేతనావస్థలందు సయితము మనస్సును, ఆత్మయు నుండునని దృఢముగ వక్కాణింప వీలుపడుటలేదు. అనుమానప్రమాణముతో ఉండితీరవలయు నని వచించుచున్నాము. వీని నామరూపక్రియలు స్పష్టమగుటలేదు. పరిణామక్రమములో ఏదశయందు ఆత్మప్రకాశము నిస్సందేహముగా గోచరింప మొదలిడునో నిర్ణయింపజాలకున్నాము. స్వస్మృతి జీవలక్షణమని చెప్పుదురు. ఈ స్మృతి ఏదశయందు ప్రభవమగునో నిశ్చయింపబడుట లేదు. ప్రతి జీవకణమునందును, ప్రతి శుక్లబిందువునందును, ప్రతిశోణిత బిందువునందును జీవు డుండుట సంశయాస్పదము. చేతనచర్య యున్నంతనే జీవుడు కల డనలేము. నరునందుమాత్రమే జీవుడు, లేక జీవాత్మ కలదని వాదించు మతములనేకము కలవు. ఊహాపోహలు, తర్కసామర్థ్యము, వాక్చాతుర్యము మున్నగునవి జీవాత్మ లక్షణములని వారి వాదన. ఈ నరుడే పూర్ణ పరిణతమూర్తి యనియు వారి విశ్వాసము. కాని

నిత్యమును దాటిన పరిణామావస్థలు కలవని నుడువుచుండుట యుక్తముగ నున్నది.

ఇప్పటికి మూడంశములు నిర్ధారణ యైనవి:

(౧) ప్రతి జీవకణమునందును (అది ప్రథమ జీవ పరిణామదశకు చేరినదైనను కూడ అందు) జీవాత్మ కలదనుటకు వీలులేదు.

(౨) జీవ పరిణామదశలందు ఉత్తమస్థితి లోనే జీవుడు ప్రకటనమగును.

(3) జీవచేష్టలు గోచరించిన చోట్లనెల్ల జీవాత్మ యుండితీరవలయునను వాదన నిరాధారము.

సంభోగమువలన కూడిన రెండు జీవకణములు ఏకమగుటకు పూర్వము వాని రెండింటను ప్రాణమున్నను, జీవుడు కలడను వాదన చెల్లదు. జీవాత్మలేనిది జీవచేష్టలుండుట అసంభవము కాదు. జీవాత్మ ప్రవేశముచేతనే జీవచేష్టలు ప్రారంభమగుటలేదు. జీవోత్పత్తికి మూలమగు మాతృకా జీవకణమునందు, సృష్ట్యాదిని వెలసిన జీవకణమునుండి పారంపర్యముగవచ్చి సంక్రమించు జీవరసధాతువు ప్రవేశముగాంచు తరుణమున, ఆత్మ, లేక జీవుడు ప్రవేశించు ననుట సమంజసమే. కాని జీవచర్యలు గోచరించు తావులందెల్ల జీవాత్మ కలదను వాదన విపరీతముగ నున్నది. అప్పుడు నరుని శరీరమునందెల్లెడల అసంఖ్యాకములగు జీవాత్మ లుండు ననవలసివచ్చును.

జడద్రవ్యమునను ఆత్మ నామరూపక్రియా రహితమై అవ్యక్తముగ నుండును. అప్పుడు దానిని వర్ణింపజాలము. దానికి జీవుడను నామము నిడజాలము. సచేతన పదార్థముల ఉత్తమ పరిణామదశలందు ఆ అవ్యక్తాత్మ స్వస్మృతిని బడయుచున్నది. అందు అహంకారము, నేనను భావము గోచరించును. పిమ్మట ఆ ఆత్మ పూర్ణస్మృతిని ప్రకటించును. విషయపరిశీలనాశక్తి, తనను గూర్చిన అభిమానము, ఇచ్ఛాద్వేషములు స్వస్మృతి లక్షణములే. ఇవి ప్రస్ఫుటముగ గోచరించు చోట జీవాత్మ కలదని ధైర్యముగ వచింపగలము. ఇట్టి పరిణామమునకు అనుకూలమగు ఉపాధి లభించునప్పుడే జీవుడు అందు ప్రవేశించుచున్నాడు. కాని అంతకు పూర్వము జీవుడు ప్రవేశింపడు అనవచ్చును. జీవరసధాతువు పయితము ఒక జీవకణము జీవోత్పత్తికి అర్హమగు పక్వదశకువచ్చినప్పుడే అందు ప్రవేశించుచున్నది. ఇట్టి జీవకణములు నూతన జీవోత్పత్తికి అనువగుదశయందే తల్లిశరీరమునందును, తండ్రి శరీరమునందును ఏర్పడుచుండును. శుక్లశోణితబిందువు లన్నియు జీవోత్పాదనకు అర్హములగు జీవకణములు కావు.

జీవుడు స్థూలోపాధిలో ప్రవేశించుటకు పూర్వమును సచేతన వ్యక్తియే; స్వతంత్ర జీవనచరిత్ర కలవాడే. ఆ స్థూలోపాధి నాశనానంతరము సయితము స్వతంత్ర జీవనము కలిగియే యుండును. అతడు దీర్ఘమగు తన జీవయాత్రలో, శరీరములనెడు బసలలో వాసముచేయుచు, వానిని విడుచుచు పోవును. జన్మాంతరసూత్ర మిట్లు తెలుపుచున్నది. జీవాత్మ దైవాంశయు, సనాతనము నైయున్నది. సృష్టి అనాది. అది కల్పసమయమున వికాసము నందుచు, లయకాలమున బీజప్రాయమై అవ్యక్తమున కలిసిపోవుచుండును. కాబట్టి జీవునకును సృష్టికిని ఎప్పుడు సంబంధమేర్పడినది, ఎప్పుడు జీవుడు సృష్టిలో ప్రవేశించినాడు? అనుసమస్యలు మనను బాధింపవు. వానిజోలి మన కక్కరలేదు. ఆ ప్రసక్తి పెట్టుకొనినను మనబుద్ధిబలముతో వానిని పరిష్కారము చేయజాలము. మనబుద్ధి కొంత వికాసమును పొందినవెనుకనే ప్రకృతిపరిశోధనకు కడంగ గల్గుచున్నాము. మఱియు ఆ ప్రకృతినిసయితము ఒకానొక పరిణామదశనుండి మాత్రమే స్మరింప గల్గుచున్నాము. కావున అంతకు పూర్వదశ దశాంతరములను గ్రహించుటకు అనుమానప్రమాణమే ఆధారమగుచున్నది.

స్థూలోపాధులును, అందలి జీవ పరిణామదశలును తనకు అనుకూలములగునప్పుడే జీవు డందు ప్రవేశించుచు, అవి అనుకూలముగ లేనప్పుడు విడిచివేయుచు నుండునని గ్రహించితిమి.

సరే! ఇటుల జీవుడు, లేక జీవాత్మ ప్రవేశించును, నిర్గమించును అనుట కూడ ఆలంకారిక భావమేగాని వాస్తవికవచనముకాదు. జీవాత్మ దేశపరిమాణము, ఆకారము గల భౌతిక వస్తువుకాదు. అది భావగమ్యమగు అంతఃకరణ సంస్కారరాశి. అది ఒకతనువున ప్రవేశించుట, దానిని ఆక్రమించుట విడుచుట నిజముగా పొసగదు. జీవాత్మ ఒకానొకపరిణామ దశయందున్న ఉపాధిని అభిమానించి, దానితోడి ఐక్యభావమువహించి, దానిని వశము చేసికొని, తనప్రయోజనమునకై కొంతకాలము వినియోగించుకొని, పిమ్మట మానుకొనును. ననుటలో కొంతఅర్థముండును. ఆత్మ అనిర్వాచ్యమగుటచేత ఇదమిత్థమని ఖచితముగ వక్కాణింపజాలము. ఈపైని పేర్కొనిన స్వీకరణ విసర్జనములనే జన్మాంతరయాత్రయని నొప్పను. ఈయాత్రయందు అంతఃకరణమున చేరియుండు సంస్కారములు, లేక వాసనలు పరివర్తనము నందుచు పరిణామమును సాగించును. అదియే జన్మాంతరములు పడయుటకు ఫలితార్థముకూడను.

కావున పరిణామక్రమము జడదశనుండి చేతనదశకు, చేతనదశనుండి స్మృతిదశకు, స్మృతిదశనుండి యింద్రియజ్ఞానదశకు, ఇంద్రియజ్ఞానదశనుండి స్వస్ఫురణదశకు, అందుండి కైవల్యమునకు నడుచుచుండును. కైవల్యమును ముక్తియనియు, మోక్షమనియు, బ్రహ్మనిర్వాణమనియు పేర్కొనదగును. కించిద్భాగభేదములున్నను ప్రస్తుతము మనము విచారింప నవసరము లేదు.

కైవల్యదశయందు ఆత్మకు దేహావసరముండదు. అప్పుడు జీవుడు జీవభావమును, వ్యక్తిత్వమును పాటింపడు. వాని సంస్కారములు, వాసనలు వ్యయమునై చనును. అతడు తనను సంకుచితమగు సూక్ష్మలింగవు ద్వారమున చూచుకొనక, నిరావరణదృష్టితో తన అఖండాకారమును స్మరించును. తాను జీవాత్మ ననుకొనుట భ్రాంతి యనియు, తాను నిజముగా అఖండ సచ్చిదానంద పరమాత్మనే యనియు తెలిసికొనును. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' అను జ్ఞానముతో అతడు పరమాత్మయే యగును. సముద్రమునుండి వేఱుపడిన ఉప్పుకల్లు సముద్రమున మఱల లయమగును. ఇంక ఉప్పు కల్లను మాటలేదు. ఇది దాని నాశమా? కాదు కాదు. దాని సంపూర్ణ వికాసము; అఖండస్వరూప ప్రాప్తి. అటులనే జీవునకు మోక్షప్రాప్తివలన నష్టము గాని, నాశముగాని లేదు. వానికి పరమార్థప్రాప్తియే గలిగి కృతకృత్యుని చేసినది.

ఇప్పుడు మనము ప్రస్తావించుచు వచ్చిన పరిణామదశలు లింగశరీరమునకు సంబంధించి నడచినవనియు, జన్మాంతరయాత్రయు దానిదే యనియు, ఈ పరిణామ జన్మాంతర విధానములకు పరమావధి జీవుని మోక్షమనియు గ్రహింపవలయును.

---

# రథోత్సవము

కొత్తపల్లి సూర్యారావు

కృష్ణదేవాలయంబుచేఁ గీర్తిగనిన
దగుటఁ గృష్ణాపురం బనునాఖ్య నొప్పి
కృష్ణపుర మాంధ్రమునను బ్రాగ్దిశను గలదు
సంజ్ఞలను వ్యాకరణసూత్రచర్చ వలదు.
శ్రీరామాలాండ్రీ సీ
తారామాక్షౌరశాల దశరథరామా
స్టోరుసును నాంజనేయా
హారాలయమనుచు దీర్ఘభాక్త్వము లేదే.
ధనికు ల్దాతలు వర్తకు ల్గలరు క్షే
త్రస్వాములు వైద్యులున్
ఋణదాత ల్గల రన్నిజాతుల ప్రజల్
శ్రీ కృష్ణభక్తుల్దయా
ఖను; లాయూరికిఁ జాలు న్యాయసభలుం
గార్యాలయంబు ప్రభు
త్వనివేశంబులు నన్న వన్నమిడు స
త్రంబు ల్బడుల్ రాజిలున్.
పండితుఁడుం గవీంద్రుఁడు స్వ
వర్ణహితైషి మతాభిమాన యు
క్తుం డట నెల్లవాఁ; డటకుఁ
గొం. దఱు క్రైస్తవులేగుదెంచి యుం
దుండఁగ నూరిబైటఁ గల
యూషరభూములు గొన్ని కొందఱు మం
చుండఁగ నమ్మివేసి రుప
యోగము లేదని వానిస్వాములున్.
ఊరిబైట నొక్కయూరుఁ గట్టిరి వారు
స్పర్ధనో యనంగ భగవదాల
యంబు వైద్యశాల యర్భకులకు నున్న
తంపుఁబాఠశాల దానఁగలదు.
విద్యకొఱకు నెల్లవిద్యార్థు లాయూర
నున్నవారుఁ బ్రక్కయూళ్లవారు
వచ్చి పురమునిండ బసలకు బాధలు
పడఁగవలసివచ్చెఁ బలువురకును.
పాఠశాలప్రక్క బైటను క్రైస్తవుల్
బసలకొఱకుఁ గొన్ని "బారకీచు"
లంచుఁ గట్టి రందు నాయూరిగ్రామ వి
ద్యార్థు లద్దెలిచ్చి యధివసింత్రు.

తక్కినవెల్ల నేటికిఁ బ్ర
ధానముగా నటనుండు బాలకు
ల్మిక్కిలి బుద్ధిమంతులయి
మిత్రత వాటిల నెల్లవారుఁ దా
మెక్కకుటుంబ సంభవుల
యోజ మెలంగుదు రిచ్చటం గడు
న్మక్కువతో నభేదగతి
మజ్జన భోజన భాజనాదులన్.
బుద్ధిమంతులెల్ల బుద్ధిమంతులె యెప్డు
లేనివార లద్ది లేనివార
పాయసాంశములను భరతాదులైనట్లు
మైత్రి వారువారు మసలుచుంద్రు.
అనవరతాదరంబున స్వ
యం కృషిచే వివిధార్థసాధన
ల్మునుకొని చేయువారలును;
బొత్తము ముట్టక యాటలాడఁ బ
ట్టనములవెంటఁ బోవుచు "బ
డాయిలు" గొట్టెడువారు; రెంపమూఁ
డునుసమ లొక్కకత్యనె క
డుం బ్రియమొప్పఁగ నుండువారలున్.
నిష్ఫలమంటలం దుఱుక
నేర్పరులు న్విశభోజనంబుల
న్మెప్పు గడించువారుఁ గడి
మిం దమకంఠము రైలుక్రింద నే
చప్పుడులేక పెట్టు నతి
సాహసులు న్బడియుక్యవారిపైఁ
దప్పులు మోపువారు వివి
ధంబుల బాలకు లుందు రచ్చటన్.
వారిలోన నొక్కవైఖరివార ల
త్యంత గర్వదృష్టి నహరహంబు
బూతులేనిమాట పొరపాటుగానైనఁ
బలుకకుండువారు పలువు రుంద్రు.
అట్టివారితోడ నాయూరిబాలుఁ డొ
కండు మైత్రి సల్పి కలసి మెలసి
వారుచేయుచుండ వారిలోఁదానును
దారుణములు చేయఁ దగిలియుండు.

జనసమ్మర్దమునందుఁ ద్రోసికొనుచు
  స్వంత దేహము నీడ్చి వే
చనుచున్ శ్రావ్యముగాని పాటలను "శ
  స్పాటంబు"గాఁ బాడుచుం
గనుగీటు ల్చేయువాటు లొప్పఁగను సం
  ఘర్షణంబు గావించుచు
న్వెనుక ల్ముందులు లేక త్రిమ్మరుదు రా
  స్వేచ్ఛార్థులౌ బాలకుల్.
చెప్పువారు లేరు చెప్పిన వినువారు
గారు- బ్రాహ్మణులను గాఱు లఱచు
టయును స్త్రీలఁ జూచి నయహీనపుం బ్రసం
గములు చేయువారు గర్వవృత్తి.
ఒరే! నేనుం మాల ముట్టుకొని యీ యా
  యుర్వీసురుం దాఁకితి
న్నారు లొక్కండఱు నిల్చినప్పు డెవఁడో
  నామీఁదఁ బడ్డట్లుగాఁ
గాఱుల్పేలుచుఁ దూలి మీఁదఁబడితిం
  గాల్ద్రొక్కితిం జూడన
ట్లూరేగింపగు దారిలో నిలిచి మూ
  త్రోత్సర్జనం జేసితిన్.
బుద్ధిలేదు రాగిబొమ్మలు వేల్పులా
యేట నేటఁ బెండ్లి యేమి ఛాంద
సం బటంద్రుగాని చక్కఁ జూడరు తాము
చేయు పనులలో విశేషమేమొ.
తోటపెద్దుబెదరెఁ దొంగగుండు త్రొక్కిన
టంచుఁ దేలు పామటంచు గుంపు
గాఁగ నతివలున్నకడ నటునిటుఁ జుట్టు
కొని 'యభాసు' చేయుచును జరింత్రు.
ఆవచ్చుదానిఁ జూడుఁడు,
తోవచ్చెడువాఁడు మగఁడు దుప్పటిలాగుం
జీవంకు వచ్చెఁ బిమ్మట
నావెలదుక నేడిపింత మనుచు న్నగుచున్.
ఏమిర కన్నుఁగానవ ప
  యింబడెదంచు పగుం దెమల్చి, పో
పో మఱి ప్రేలకంచుఁ; బువుఁ
  బోఁడిని గన్గల తా మొ త్రోసికొం
చీమెయి నర్ధరాత్రమునఁ
  గృష్ణు రథాంతికమందు గుంపులోఁ

హాము చరిత్రు చెప్పఁ గల
  దా యొకరైనను వారి కింతయున్.
తేరుమీఁది కెక్కె దేవుఁడు, కుంభము
పోసి త్రాడులాగఁబోవునప్పు
డూరిలోని వారు లొక్కొక్క సంఘమై
చూడవచ్చి రచటి శోభనంబు.
మా జట్టువారి కచ్చటఁ
గనఁబడుటయె లేదు కన్ను, కాయము స్వప్ర
జనియెను స్వేచ్ఛావిహృతిం [హాయుం
జినతనమో కష్టకాలచేష్టయొ యెఱుఁగన్.
మధుసనము చూఱపుచ్చిన మర్కటముల
కంటె నధికంబుగా నుండఁగా నొకింత
వేళఁ జనుదెంచి రాయూరి వెలఁదు, లందు
జట్టులో నున్న చినవాని జనని గలదు.
జట్టు గూడి వీడి స్వైరవిహారంబు
సలిపి తాముఁదాము సంగ్రహించి
నట్టి కొంతుకాసనపుటాన వాళ్లిగు కొన్ని
వస్తువులను గొంచు బసకుఁ జేరి.
ఒకరి ప్రశ్న యొకరి కుప్పొంగి చూపుకొం
చుండ నూరిలోన నుండు బాల
చెల్లి చేతిలోని చేరుమా ఱపహరిం
చినయతఁడు నూపె స్నేహితులకు.
చిన్నమనియె మనసు చిన్నవానికి, సోద
రికిని సఖుఁడొసర్చిన కృతి కప్పు
డేమి యనకపోయె నిఁటికి మఱునాఁడు
జట్టుఁగూడరాఁ డసహ్యమునను.
ఏలర రావటం చడుగ
  నింటికడం బనియున్న దం చనున్
శాఁకు వచ్చియు న్మొగము
  చాఁటగు నేస్తుని జూచినంతటం
బొలఁగ నిశ్వసించు నతి
  సాహసమున్ బొనరింప నెంచున
వ్వేళ లిఖించు నొజ్జలకు
  వే సెలవిమ్మని వేఁకి వంకగన్.
ఇటులుండం బ్రియమిత్రుఁ డొక్కఁడు సఖా
  యిట్లేల నీవుంటి వె
ప్పటియట్లేటికి రావు మాకడకుఁ జె
  ప్పంగూడదా యెవ్వరే

నటనల్పల్పిరో నన్నుఁ జంపుకొని తి
న్నన్లేను, దానెంత దు
ర్ఘట మాకార్యముగాని చెప్పఁగ నినుం
బ్రార్థింతు నన్నంతటన్.

చెలిమికాఁడ నన్నుఁ జీకాకు పెట్టకు
కదపినంత నోడలు కంపమొందుఁ
గ్రోధమూర్తినగుదుఁ గొన్నినాళ్లారక
యుండు మవలఁ దెలియకుండఁబోదు.

అనిన న్మిత్రుఁడు వల్కెఁ జాలు నిటు వే
దాంతంబు నాతోడఁ జె
ప్పని దే యేమియు సాహసంబుడుగు మా
స్వార్థంబుగానీ, విరో
ధినిమిత్తంబునఁ గాని తొందరను సా
ధింపంగ నత్యాహితం
బు నసాధారణకష్టము ల్దొడరుఁ బో
వుం బుద్ధిక్రోధంబునన్.

ఏమియు లేని వేదన యి
దేటికి నీ కపశంబుగాఁగ రాఁ
గా మనశక్తికి న్మిగిలి
కార్యము మించినయప్డు గాదె నీ
కేమియు దుఃఖపాటు కత
మేమి యొకింత వేసరించె పనిని నీ
నేమియొనర్చినాఁడ వది
యొల్లను జెప్పుమ యుక్తిసెప్పెదన్.

అనవుడు మిత్రమాయిది ర
హస్యము నీహృదయంబులోన నే
యునుపుము, నాఁటిరాతిరి ర
థోత్సవమప్పుడు స్వైరలీలల
న్మన మొనరించినట్టి యువ
మానపుఁ జేతలు కారణంబుగా
మన తెగవారలందఱు న
మానులె దీనికిఁ గర్త లౌటకున్.

అనిన న్నేనును గారకుండనొ సరే
యట్లేని వృత్తాంత మె
ల్లను వాక్రుచ్చుచు క్రొత్తవారమ మదే
లా, యిట్లుగానంచు నీ

ననరాదా యెవరేమి చేసిరొ త్వదీ
యాంతర్యముం దెల్ప కే
మని మాలోపము వెల్లడింతు మది స
త్యంబైనఁ గాదందుమా?

సంశయంబు వలదు చావుమటన్న నేఁ
జెత్తు యుష్మదర్థ మిత్తెఱంగు
వాఁడ నగుదుఁగాదె పరికింపలేదె యి
న్నాళ్లనుండి నీవు నాఁగ నతఁడు.

అందఱము నొక్కబడిలోన యభ్యసించి
నార, మనుకొననేల యెవ్వారికైన
ననుభవముమీఁదనే తెలియంగ నగును
జెప్పఁగాఁ దలకెక్కదు చెడ్డవేళ.

అనిన నీకేమి యనుభవంబునను దెలిసె
మాకుఁ దెలియనిదేమి యీమర్మమేమి
చెప్పు మన మిత్రుఁ డిట్లని చిన్నవాఁడు
నోడివె నెంతయు నానాఁటి దుడుకుఁదనము.

ఒకనారికొంగు వేఱొకపూరుషుని చెంగు
ముడివైచితివి బ్రహ్మముడిగ నీవు
ఇరువురు తరుణుల శిరసులందలి బెండు
చెండులు మార్చె నృసింహరావు
పల్లవాధరి యోర్తు పిల్లాండ్లు సర్దుకో
నొరఁగినఁ దమ్మపై నుమిసె గోపు
నడ్డిపై చెయి నిల్పిన యొకర్తు దండకుఁ
జేతివేత్రపు వంపుఁ జేర్చె సింగు
మరువమును దమనంబని యఱచె సీను
బాదుషాహిసోపో యని వాగినాఁడ
నేను బదిమంది స్త్రీలున్నచో నిలఁబడి
యాగడంబున హద్దు మర్యాద లేక.

నీయమ్మ యాఁడుదే మఱి
నాయమ్మయు నాఁడుదే మనకుఁ గొంటెతనం
బీయర్థము స్ఫురియింపం
జేయని కతమున నసభ్యశీలత వొడమెన్.

ఒకనిభార్యను జీకటి నొడిసిపట్టె
నీదుభార్య నొకండు మన్నించు నొక్క
డుండగీఁ డెందు నెఱిఁగియుఁ దొల్లుదోవ
నెఱుకవారలకడ సంశయింపవలదె.

వ్యర్థ్వ నారిగాఁడు పదిమందిలోన నా
సోదరిని నెతింగియును గ్రహించెఁ
జేతిలో నుమాలు, చెయివ్రేళ్ళ కంఁచిన
ట్లున్నదల్లము కడు నుసుకుచేత.

ఎట్లు విగ్రహింతు నీకు రాభవమున
కర్హశిక్షనేసి ఁానుచుఁ గృశత
నున్నవాఁడ నిదియ యున్నయథార్థంబు
మార్గమేమి చెప్పుమా సఖుండ.

అనిన నృక్కున గ్రేఁలుపెట్టుకొని య
  న్నా నారిగాఁడా యొన
ర్చిన దీరీతిని, నేఁడు గన్గొనుము నే
  శిక్షింతు నామూర్ఖు నొ
క్కనినేకాదు సమస్తమిత్రులనుజ
  క్కంజేయుదు న్రాత్రి నీ
వును రమ్మక్కడ కొక్కసారి విడిపో
  వుం జిక్కు శీఘ్రంబుగన్.

అనుచు మిత్రుఁడు పల్కి రాత్రివఱకున్
  వ్యక్తంబుగాకుండ నుం
చి నిజస్నేహితు లందఱం బిలిచి తె
  చ్చెం దత్ప్రసంగంబు సి
గ్గున నారాయణుఁ డట్టె వాంచెఁ దల; నీ
  కున్ బుద్ధిలేదాయటం
చును నల్వుర్నలుతట్ల దూసికొని తిం
  చుం దిట్టి రా పిమ్మటన్.

కొంటెతనమునకును గొలఁది యుండదొ పరి
చయముఁ గన్నచోటఁ జలుపఁ దగునె
పురుషులొద్దనైనఁ బోవునుగాని యా
వనయు మిత్రుచెలియ లనినఁ దగునె.

రేపు నీ చెల్లెలే వచ్చునోపుదువాకా
చూచి యొరుచేయు నవమతి శుద్ధమూఢ
ని న్ననఁగనేల మేమేమి నీతిపరుల
మెంతపని చేసితిమి మన మిందఱమును.

వీఁడగుటం బ్రశాంతమతి
  విన్నఁదనంబున నూఱకుండె నె
వ్వాఁడొ పగండె యైన నినుఁ
  బట్టి వధింపఁడె, మేలు, నేను, నీ
తోడని యొట్టువెట్టుకొని
  తొందరమాన్పితిఁ గాకయుండిన
న్నేఁడొ మఱొక్కనాఁడొ యిది
  నిశ్చయమే యయియుండకుండునే.

వీఁడు కనుకఁ దీఱెఁ బెద్దలే విన్నచో
నేమి జరగియుండునో మనగతి
చదువు చెప్పుటకునో చట్టుబండలఁ జేయు
నోయటంచు దొరలనే యడిగిన.

సత్యమార్గమునకుఁ జదువు చెప్పెదము దు
ర్మార్గమొనరుపంగ మరఁగినారు
నడత చెడిపోఁగాన నదువుండు మీ రన
నెవరు చేర్చికొంద్రు హీనగుణుల.

తండ్రు లంపుసొమ్ము తగులఁబెట్టుచు నడ్డ
గాడిదల విధమునఁ గానిపనులు
చేసి చదువు మంటఁ జేరిచి తిరుగంగ
వచ్చినామొ యిందుఁ జచ్చులార.

మనజట్టులోన నెవ్వఁడుఁ
గనఁబడఁ డొకయేఁడుఁ గ్రమముగాఁ బైమెట్టె
క్కినవాఁడు సిగ్గులేచే
యనినాఁ డిట్లుండు మొఱక యేమియులేదే.

ఈనాఁడాదిగ నిట్లుచేయ మిది నీ
  వెవ్వారికిం దెల్పఁబో
కోనెయ్యుండ యటంచు నీతనికిఁ జే
  యుంచా సమస్తుల్ నా
తో నొక్కించుక చెప్పఁబట్టికద యీ
  దుఃఖంబు వారించుకోఁ
గానయ్యెం బెడదారినుండి తొలఁగం
  గాఁ బోవనయ్యెం గదన్.

నామాట లిష్టముండని
యామీరలు తొలఁగిపోవుఁ డాలకుమాతోఁ
బ్రేమమున నుండువారలు
ప్రేమింపుం డితనినను చుఁ బ్రియమునఁ జెప్పన్.

ఎల్లవారు నొప్పి రేకవాక్యంబుగా
మంచివేళయగుట మంచిదనుచు
బుద్ధిగలిగి మనిరి, పోలడె నదుబుద్ధి
విశుటు మిత్రునుండి విహితులకును.



ఈడ్పుగంటి రాఘవేంద్ర రావుగారు
కొంతకాలము గవర్నరుపదవి నలంకరించి
ప్రస్తుతము ప్రధానామాత్యపదవి (సం. రా.)
నాక్రమించిన ఆంధ్రుడు



శ్రీమతి డి. శాండిల్య, శ్రీమతి డి. రామచంద్రరావు సతి
సర్ యస్. రాధాకృష్ణన్‌గారి కుమార్తెలు. ఉన్నతవిద్య బడ
యుటకై తల్లిగారితో (నడుమ) కూడ ఇంగ్లండుకుపయనమైరి.



కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు
కొంతకాలము గవర్నరుపదవి నలంకరించి
ప్రస్తుతము ప్రధానామాత్యపదవి (మదరాసు)
నాక్రమించిన యాంధ్రుడు



కోకా లక్ష్మీ నరసింహారావు నాయుడుగారు
ప్యారిసులో శిల్ప, లలితకళల ప్రొఫెసరుగానుండు ఆంధ్రుడు
(ఫ్రెంచిభార్యతోను, కుమార్తెతోను)



వంగల శివరాముగారు - వారిభార్య, కుమారీ కుమారులు
లక్నో విశ్వకళాపరిషత్తు ప్రొఫెసరుగానుండి జినీవాలోని నానాజాతి
సమితి యుద్యోగిగ నియమింపబడిన ఆంధ్రుడు

## విజయనగరసామ్రాజ్యషట్చతవార్షికోత్సవము, హంపి

౧. చారిత్రక మహాసభ అధ్యక్షుడు డా. యం. హెచ్. కృష్ణగారికి స్వాగతము



మహాసభకు అధ్యక్షతవహించిన శ్రీ. డా. కుర్తకోటి శంకరాచార్యులవారు అధ్యక్షోపన్యాసము గావించుచుండుట



# భవభూతి ఉత్తరరామచరిత్ర

ప్రొవ్విడి రామం

మానవజీవితములోని వివిధ ప్రవృత్తులను ఆహ్లాదకరంగా నిరూపించడమే సాహిత్యము యొక్క పరమావధి. జీవితమునకు సంబంధించిన మహోన్నతమైన భావములను, అప్రతిహతమైన కళాచాతుర్యాన్ని కూడా వ్యక్తీకరించేటందుకు అనుగుణ్యంగా వుండే సాహిత్యాంగములలో నాటకము ఒకటి. సంస్కృతవాఙ్మయములోని రచనావిధానము లన్నిటిలోనూ నాటకం అగ్రస్థానాన్ని అలంకరించింది. కాబట్టి కాళిదాసు, భవభూతి మొదలయిన మహాకవీశ్వరులు ఏసంఘటనలో ఏవిశిష్టమైన కళాచాతుర్యాన్ని విజృంభింపచేసి, తమనాటకాలకు అమృతత్వంసిద్ధింపచేసినారో పరిశీలించినట్లయితే, వారినాటకాల్లో వుండే గొప్పదనం మనం పూర్తిగా గ్రహించడానికి అవకాశం వుంటుంది. అనేక సంవత్సరముల క్రిందటనే సంస్కృతనాటకముల ఉత్కృష్టతను అన్ని దేశములవారూ గ్రహించినారు, కనుక తిరిగి ప్రస్తుతం వాటి విమర్శన అవసరంలేదని భ్రమపడటం చాలాపొరపాటు. ఆధునిక పరిస్థితులలో ఆంగ్లేయులవలన తమపాశ్చాత్యవిజ్ఞానంచేత యితరదేశములలోని మహాకవీశ్వరుల రచనలను, రచనావిధానములనుకూడా గమనించడానికి తగిన అవకాశంవున్నది. కాబట్టి ప్రాచ్యపాశ్చాత్య విమర్శనాదృష్టితో సంస్కృత నాటకములను పరిశీలించినట్లయితే, సంస్కృతనాటకములందు మనకుండే విజ్ఞానాన్ని అభివృద్ధిచేసుకోడానికి అవకాశం వుంది.

కళోపాసకులలో అగ్రస్థానాన్ని అలంకరించినవాడు భవభూతి. ఈయన ఉత్తరరామచరిత్రలో మొదటనుంచీ కొసవరకూ తన ప్రత్యేకవ్యక్తిత్వాన్ని పూర్తిగా నిరూపించినాడు. కేవలం కరుణరసాన్ని రమ్యంగా పోషించినంతమాత్రముచేతనే భవభూతి సుప్రసిద్ధుడైనాడని భావించడం అంత సమంజసం కాదు. మహోత్తమమైన అనుభవములు, గంభీరమైనభావములు, అప్రతిహతమైన కళాపోషణ యితనిగొప్పదనానికి కారణాలు. ఈనాటకములో వచ్చేపాత్రలన్నీకూడా మహోత్కృష్టమైనవే. అంగరసమైన శృంగారాన్ని యీకవి అతిరమ్యంగా పోషించినాడు. భోగలాలసత్వానికిగాని, నీచకార్యాలకుగాని ఉపక్రమించిన పాత్ర ఒకటికూడా యీనాటకంలో మనకు కనబడదు.

సీతారాముల ప్రేమయొక్క ఆదర్శప్రాయముగా యీకవి ప్రదర్శించినాడు. భవభూతి మూడు నాటకములు వ్రాసినప్పటికి ఉత్తరరామచరిత్రమాత్రమే తన కీర్తిని చిరస్థాయిగా చేసినది. ఒక్కమహాకావ్యమువల్లనే నిశిత ప్రతిభావంతుడని ఈ కల్పాంతమువరకూ ప్రఖ్యాతిని సంపాదించే భాగ్యము యీ మహాకవికి మాత్రమే లభించింది.

ఉదారభావములు గల పురుషుడు తన ఆశయాల్ని సాధించవలసివచ్చినప్పుడు భౌతిక విషయాలతో తనకు తటస్థించే సంఘర్షణను ఈకవి చాలా చక్కగా నిరూపించినాడు. యీ సంఘర్షణ బాహ్యంగాను, ఆంతరంగికం

గాను కూడా రామునిపాత్రలో మనకు కనపడుతుంది. రాముడు తన హృదయమును సీతకు అర్పించినాడు. సీతకు రామునికి అవినాభావసంబంధ మున్నది. కాని కొన్నిపరిస్థితుల ననుసరించి లోకకల్యాణంకోసం రాముడు సీతను విడిచిపెట్టవలసి వస్తుంది. అప్పుడు రాముని మనస్సుకనూ అంతరాత్మకనూ గల సంఘర్షణ భవభూతి అనన్య సామాన్యమైన కళానైపుణ్యాన్ని విజృంభింపచేసి ప్రదర్శించినాడు. పాత్రల బాహ్యనటన, వారి వారి వివిధ మానసిక ప్రవృత్తుల నిరూపణ యీ నాటకంలో అహమహమికా భావంతో శోభిస్తూన్నవి. మహాకవి షేక్స్పియరుకూడా 'మేక్‌బెత్' మొదలయిన నాటకములలో ఇటువంటి కళానైపుణ్యాన్ని కొంతవరకు నిరూపించినాడు.

ఉత్తర రామచరిత్రయొక్క ప్రప్రథమం లోనే నాటకముయొక్క ప్రధాన రసమును సూచించినాడు. మహాకవి భవభూతి ప్రస్తావనఅయినతరువాత నాయికా నాయకులు రంగస్థలముపైన ప్రవేశిస్తారు. రాముడు పితృవియోగమునకు ఖేదపడుతూన్న సీతను "దేవి, సమాశ్వసిహి. ఏవ మేతే హృదయమర్మచ్ఛిదః సంసారభాగాః" అని ఓదారుస్తాడు. సీత కూడా "జానామ్యార్యపుత్ర! కింతు సంతాపకారిణో గురుబంధుజనవియోగా భవన్తి" అని అంటుంది. ఈ మాటలు ప్రేక్షకులకు కరుణరసావిర్భావాన్ని కలుగచేస్తాయి. పాశ్చాత్య కవీశ్వరులుకూడా నాటకములలో ప్రధానరసమును మొదటి రంగంలోనే సూచిస్తారు. దీనినే వారు "The key-note of the play" అని అంటారు.

సీతాపరిత్యాగము ఈ నాటకములో ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తూన్నది. ఈ అపూర్వమైన కార్యాన్ని నిర్వర్తించడానికి తగిన పరిస్థితులు ప్రథమాంకములోనే మనకు కనపడతాయి. గురువైన వశిష్ఠుడు, కౌసల్య మొదలైన పెద్దలు యాగసందర్శనార్థము అయోధ్యనుంచి వెళ్లేరు. కాబట్టి సీతను త్యజించేటప్పుడు రాముని అతికష్టకాలంలో సమర్థులు ఇంటివద్ద యెవరూ లేకపోయినారు. ఇంతే కాకుండా సీతను ఋష్యాశ్రమ సందర్శనమనే మిషపైని అడవులలో వదలిపెట్టినాడు. సీతకు ఋష్యాశ్రమ సందర్శనాసక్తి కలుగచేయడానికి కూడా మొదటి అంకములోని చిత్రపట దర్శనమే కారణమైనది శ్రీరాముని తొలినాటి మహదాశయాల్ని కూడా కవి యీ అంకంలోనే వ్యక్తీకరించినాడు. వశిష్ఠుని సందేశానికి ప్రత్యుత్తరంగా రాముడు "స్నేహం దయాంచ సౌఖ్యం చ యదివా జానకీమపి, ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మేవ్యథా" అన్నప్పుడు రామునియొక్క త్యాగశీలతా, లోకారాధనాసక్తీ మనకు స్పష్టముగా బోధపడుతూన్నవి.

ఈ అంకంలో నాయకుని మనోభావాలను భవభూతి అతిరమ్యంగా వర్ణించినాడు. సీత అగ్నికంటె పవిత్రమైనదనీన్నీ, తన ప్రాణముకంటె ప్రియతమమైన దనీన్నీ రామునికి తెలుసును. కాబట్టి "ఇమాం ధన్యనా పరిదదామి మృత్యవే సౌనికో గృహశకుంతికా మివ" అని సీతావియోగసమయమునందు పరితపిస్తాడు. కాని తండ్రియైన దశరథుడు లోకకల్యాణంకోసం అతని ప్రాణములనూ రామునీ కూడా విడిచిపెట్టినాడన్న సంగతి జ్ఞాపకం తెచ్చుకుంటాడు. "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం మతం" అని నిశ్చయించి, సీతనూ తన జీవితమందలి సౌఖ్యాన్నీ కూడా ఒకేసారి విడిచి పెడతాడు. ఇక్కడ రాముని మానసిక ప్రవృత్తిని గమనించిన ప్రతిరసికుని హృదయమూ ద్రవించిపోతుంది. మొదటి అంకం పూర్తి అయేసరికి సీతాపరిత్యాగము మొదలయిన కొన్ని క్లిష్టపరిస్థితులు సంభవించడము చేత ప్రేక్షకులకు కథయందలి ఆసక్తి యెక్కువై వారుముందుకథను తెలుసుకోడానికి ఆతురత పడతారు.

ప్రథమాంకాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే కవి కొన్ని సంఘటనలలో అప్రతిహతమైన కళానైపుణ్యాన్ని ప్రదర్శించినాడని మనకు తెలుస్తూన్నది. చిత్రపట వర్ణనంలో ప్రస్రవణగిరి, జృంభకాస్త్రములు, గంగానది మొదలైనవాటికి ప్రాధాన్యం ఇచ్చినాడు. నాటకం పూర్తిఅయేవరకు నాయకునకూ పైన చెప్పినవాటికీ అత్యంతమైన సన్నిహిత సంబంధంవుంది. అష్టావక్రసందేశంలో భవభూతి అమోఘమైన లౌకికవిజ్ఞానాన్ని చూపించినాడు. శాంత, వశిష్ఠుడు మొదలయినవారు వారి వారి పాత్రలకు ఉచితములయిన సందేశములనే సీతారాములకు పంపించినారు. వశిష్ఠుడు "యుక్తం ప్రజానా మనురంజనే స్యాత్, స్యాత్ యశో యత్పరమం ధనం వః" అన్న సందేశాన్ని పంపి, రాముని లోకారాధన శక్తిని పెంపొందించినాడు. గర్భవతియైన సీతయొక్క కోరిక ననుసరించి ఆమెకోరిన పదార్థముల నీయవలసినదని శాంత మొదలయినవారు స్త్రీల కుచితమైన సందేశమును పంపినారు.

రాముడు చిత్రపటంలో తన పూర్వవృత్తాంతాన్ని చూచి "ప్రత్యావృత్తస్స పునరివమే జానకీ విప్రయోగః" అని అంటాడు. అప్పుడు తనకు సీతావియోగం కలుగుతుందని రాముడు కలలోనైనా అనుకోలేదు. కాని అంకం పూర్తికాకపూర్వమే జానకీవియోగం తటస్థించినదని మనకు తెలుస్తుంది. దీనినే ఆంగ్లేయభాషలో 'Dramatic Irony' అని అంటారు. మహాకవుల కవనంలో మనకు ఇటువంటి సమత్కృతి కనపడుతుంది. మహాపతివ్రత అయిన సీతయొక్క శీలము అనుమానింపబడినదని బహిరంగంగాచెప్పడం కళారాధకుని ధర్మంకాదు కనుక ఆవిషయం యెప్పుడు చెప్పవలసివచ్చినా పాత్రలచెవిలో రహస్యంగానే చెప్పించినాడు మహాకవి భవభూతి.

సీతారాముల ప్రేమనుకూడా యీ అంకంలో కవి నాలావిపులంగా వర్ణించినాడు. ఇంత ప్రేమగల దంపతులు వియోగాన్ని పొందవలసివచ్చినది గనుకనే ప్రేక్షకులకు వారియందు సానుభూతి కలుగుచున్నది. సీతారాముల ప్రేమను కవి గుంభనరమ్యంగా వర్ణించినాడో మచ్చునకు ఒకసంఘటన చూపెంచి. సీత ఋష్యాశ్రమ సందర్శనానికి వెళతానన్నప్పుడు వెంటనే రాముడు ఆమెకోరికను అంగీకరించి, దానికి తగినయేర్పాట్లు చేసినాడు. అప్పుడు సీత రామునితో "యుష్మాభిరపి ఆగంతవ్యం" అని అంటుంది. "అయికఠినే కిమేతదపి వక్తవ్యం" అని రాముడు జవాబిస్తాడు. పై సంభాషణవలన సీతారాముల గాఢమైన అనురాగం మనకు తెలుస్తుంది. వారిద్దరకు అత్యధికమైన ప్రేమ ఉండడంచేత రాముడు సీతతో ఋష్యాశ్రమమునకు వెళ్లడం సహజమనిన్నీ తనను, ప్రత్యేకంగాపిలవడం అనవసరమనిన్నీ రాముని పైవాక్యములయొక్క భావము.

రెండవ అంకంలోనూ, దానికి ముందుండే శుద్ధవిష్కంభంలోకూడా భవభూతి యొక్క కళానైపుణ్యాన్ని ప్రదర్శించినాడు. ఈ అంకంలో కథను కొంతవరకు పెంపొందించి మూడవ అంకంలో సంభవించే పరిస్థితులకు తగిన యేర్పాట్లను చేసేను. శంబూకవధ విషయమై రాముడు దండకారణ్య ప్రాంతములకు వస్తాడు. అప్పుడు పంచవటీ మొదలయిన

ప్రదేశాలు చూపడం జరుగుతుంది. ఆ ప్రదేశాలు సీతారాములకు చిరపరిచితములేకనుక వియోగావస్థలోవున్న రామునికి యెక్కువ వుద్రేకాన్నీ, శోకాన్నీ కూడా కలుగ చేస్తాయి. యింతే కాకుండా సీతను పరిత్యజించిన తరువాత రాముడు ఆమెకోసం యే విధంగా తపనపడుతూవున్నదీ మనకు యింత వరకూ తెలియదు. కాని "రామస్య గాత్రమసి నిర్భరగర్భఖిన్న సీతావివాసనపటోః కరుణా కుతస్తే" అని రాముడు అనేసరికల్లా ప్రతి రసికుని హృదయం ద్రవిస్తుంది. శూద్రకుడు వెళ్లిన తరువాత రాముడు ఒంటరిగా వుండడం తటస్థిస్తుంది. అప్పుడు అతను తన మనోవేదనను మరింత యెక్కువగా వెల్లడించి తన పరితాపాన్ని నిరూపించినాడు.

శుద్ధవిష్కంభంవల్ల సీత యిద్దరు పిల్లలను ప్రసవించినదనిన్నీ, వారికి పాలు త్రాగే వయస్సు పోగానే వాల్మీకిఆశ్రమంవద్ద విడిచి పెట్టబడినారనిన్నీ మనకు తెలుస్తున్నది. దీనివల్ల సీత ఆటవికులచేత గాని, క్రూరమృగములచేత గాని చంపబడలేదని గ్రహించవచ్చును. నాలుగో అంకం మొదలు రమారమి నాటకం కొసవరకూ కథంతా వాల్మీకి ఆశ్రమంవద్దనే జరుగుతుంది. కుశలవులుకూడా యిక్కడనుండి రాబోయే కథలో ప్రాధాన్యం వహిస్తారు. కాబట్టి వాల్మీకి ఆశ్రమం గురించీ, లవకుశులను గురించీ విష్కంభంలోనే కవి కొంత వరకు సూచించినాడు. ఇంతే కాకుండా మొదటి అంకానికీ, రెండవ అంకానికీ మధ్య రమారమి పన్నెండు సంవత్సరములు గడచినవనికూడా మనకు బోధపడుతుంది.

మూడో అంకము యీ నాటకానికి హృదయంవంటిది. ఇక్కడనే నాయకుని ఆవేగం మిన్నుముట్టి పోతుంది. ఈ అంకంలో నిశిత ప్రతిభావంతుడైన భవభూతియొక్క నాట్యకళా ప్రపూర్ణత మనకు కనపడుతూంది. రాముడు సీతను పరిత్యజించినతరువాత తనను గురించి ఆయన ఏ విధముగా తపనపడుచున్నదీ యింతవరకు సీతకు తెలియలేదు. కాబట్టి యీ అంకంలో నాయికా నాయకులను యిద్దరినీ భవభూతి యిక్కడ ప్రవేశపెట్టినాడు. రాముని ఆవేదన సీత ప్రత్యక్షంగా చూసినది కాబట్టి ఆమెకు కూడా హృదయం కరిగిపోయి "ఏవం మందభాగిన్యహం పునఃపునరప్యాయాసకారిణ్యార్యపుత్రస్య" అని అంటుంది. సీత యిప్పుడు రాముని పరితాపాన్ని ప్రత్యక్షంగా చూసింది గనకనే తిరిగీ ఆమెకు రామునితో సమాగమం కలిగినప్పుడు, రాముడు తనపై అపనిందవేసి అన్యాయంగా పరిత్యజించినాడన్న భావం మనస్సులో పెట్టుకోకుండా పూర్వం కంటె యెక్కువ అనురాగంతో భర్తను కలుసుకుంది. సీతకు ఇంత క్లిష్టమైన పరిస్థితులు సంభవించి, వియోగదుఃఖంతో కృశించి పోతూన్నప్పటికీ రామునియందు మాత్రము ఆమెకు పూజ్యభావం తప్ప మరొకటి లేదు.

ఇదగాక "దళతి హృదయం గాఢోద్వేగం ద్విధా తు న భిద్యతే" మొదలయిన శ్లోకాలు రాముడు చదివినప్పుడు ప్రేక్షకుల హృదయాలే ద్రవించి స్రవించిపోయి, కన్నీటిని విడవడానికి తగిన అవకాశంవుంది. అటువంటి సమయంలో రాముని హృదయం యెక్కడ పగిలిపోతుందో అని మనకు అనుమానం కలుగవచ్చును. కనుక నాయకునికి యేవిధమైన ప్రమాదం రాకుండా చూడడానికి రాముని దగ్గిర ఒక వనదేవతను సృష్టించినాడు భవభూతి. గ్రీకు నాటకాలలోకూడా దేవతలు నాయకులపక్షం వహించి క్లిష్టపరిస్థితులలో వారిని కాపాడుతూన్నట్టు మనకు తెలుస్తుంది.

ఇంతేకాకుండా యీ అంకంలోని కరికలభ వృత్తాంతానికి కొంతైనా ప్రాధాన్యం వున్నది. కరుణారసంతో యింతవరకు పొంగి పొరలుతూవుండే హృదయాలకు ఏనుగుల యొక్క శృంగారచేష్టలు కొంతవుపశమనాన్ని కలుగజేస్తాయి. దీనినే ఆంగ్లభాషలో "Dramatic relief" అని అంటారు. ఇంత క్లిష్టమైన పరిస్థితులలోకూడా "లీలోత్ఖాతమృణాల కాండకబళచ్ఛేదేషు సంపాదితాః, పుష్యత్పుష్కరవాసితస్య పయసో గండూష సంక్రాంతయః" మొదలైన శ్లోకాలు ప్రేక్షకులకు ఆనందాన్ని కలుగజేస్తాయి.

రామునికి దుర్భరమైన హృదయపరితాపాన్ని కలుగచేయడానికి కారణభూతమైనవి యిదివరకు సీతారాములు కలసి సంచరించిన ప్రదేశములేనని మనవిచేసినాను. అక్కడ కదళీవనంలో వున్న శిలాతలం, గిరిమయూరం మొదలైనవి రామునియందు అణగియున్న వియోగదుఃఖాన్ని వేయిరెట్లు ప్రేరేపించినాయి. వాసంతికూడా సీతనుగురించి ప్రసంగిస్తూ "త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం. ఇత్యాదిభిః ప్రియశతైరనురుధ్య ముగ్ధాం తామేవ" మొదలైన శ్లోకాలచేత రాముని యెత్తిపొడుస్తుంది. అప్పుడు రాముడు "హా! జానకి! క్వాఽసి" అని క్రుంగిపోతాడు. ఆ సమయంలో తన దుఃఖం హృదయాన్ని భేదించి, భూమ్యాకాశాలనుకూడా ఆవరిస్తున్నదా అనిపిస్తుంది. రాముడు తాను అశ్వమేధయాగం చేస్తానని యీ ప్రదేశాన్ని విడిచివెళ్లినప్పుడు సూచించినాడు. ఈ విషయం మనకు యిక్కడ తెలియక పోయినట్లయితే నాలుగోఅంకంలో వచ్చే యాగాశ్వాన్ని గురించి మనం పూర్తిగా అర్థం చేసుకోడానికి తగిన అవకాశం వుండదు.

మొదటి మూడంకములలోనూ కవి అమితమైన కరుణరసాన్ని నిరూపించినాడు కనుక ప్రేక్షకులకు కొంత ఉపశమాన్ని కలుగజేయడానికి భవభూతి చతుర్థాంకంలో కొంత హాస్యరసాన్ని ప్రదర్శించినాడు. వటువులు ఋష్యాశ్రమాలలో యేవిధంగా తమ విద్యార్థిదశలను గడిపేవారో భవభూతి యిక్కడ చక్కగా నిరూపించినాడు. "పశ్చాత్పుచ్ఛం వహతి విపులం" మొదలయిన వటుల అమాయకపు మాటలు ప్రేక్షకులకు అమితానందాన్ని కలుగజేస్తాయి.

సీతావియోగం జనకునకు, కౌసల్యకు యేవిధమైన క్లేశాన్ని కలిగించినదో మనకు నాల్గో అంకంలో తెలుస్తూన్నది. యిక్కడ కౌసల్యపాత్రను అద్భుతంగా పోషించినాడు భవభూతి. సీతయందుండే ప్రేమచేతనే ఆమె అయోధ్యను వదలి వాల్మీకిఆశ్రమానికి వచ్చినదని మనకు తెలుస్తున్నది. కౌసల్యను జనకునీ కూడా వాల్మీకిఆశ్రమానికి తీసుకొనిరావడంలో ప్రత్యేకప్రయోజన మున్నది. సీతారాములకు తిరిగీ సంయోగం కలిగినప్పుడు రాజబంధువు లందరూ దగ్గిరవుండాలి గనుక జనకునీ కౌసల్యనూ కూడా భవభూతి యిచ్చట ప్రవేశపెట్టినాడు. ఈ అంకంలో జనకుని ప్రవర్తన కొంచెం విచిత్రంగా కనపడుతుంది. సీతావియోగంచేత తాను అమితంగా తపనపడుతూ ఉంటాడు. అప్పుడు తాను కౌసల్యనుచూసి ఆమెకూడా తనవలెనే ఖేదపడుతూన్నదనే సంగతిని గమనించకుండా "ప్రజాపాలకస్య మాతుః" మొదలయిన మాటలచేత ఆమెను కొంచెం ఆక్షేపిస్తాడు. తరువాత

ఆమెస్వభావాన్ని గుర్తించి, పూర్వం తనకూ దశరథునికీ ఉండే సంబంధమూ, అప్పటి కౌసల్యశోభా మొదలయినవాటిని జ్ఞప్తికి తెచ్చుకొంటాను. పిమ్మట పూర్వం వలె పూజ్యభావాన్నే ఆమెయందు చూపిస్తాడు.

ఇంతవరకూ కథాసంవిధానముయొక్క అభివృద్ధినే మనము గమనించినాము. ఇప్పుడు ఐదారు అంకములలో సంభవించే సంఘటనలు కథయొక్క సంపూర్ణత్వాన్ని సిద్ధింపచేయడానికి తోడ్పడుతాయి. రాముడు, కుశలవులు, చంద్రకేతువు యీసమయంలో ప్రాముఖ్యమైన స్థానాన్ని ఆక్రమిస్తారు. వీరికిగల పరస్పర సంబంధము స్పష్టముగా వారికి తెలియకపోయినప్పటికీ, వారందరున్నూ ఒక అపూర్వమైన ప్రేమసంబంధముచే చుట్టబడినారని మాత్రం గ్రహింపగలిగేరు చంద్రకేతువు, లవుడు కలుసుకున్నప్పుడు వారికి ఒకరియందొకరికుండే భావాలను వ్యక్తీకరించడంలో భవభూతి అపూర్వమైన కళానైపుణ్యాన్ని విజృంభింపజేసినాడు. వారిద్దరికీ అత్యంత సన్నిహితమైన సంబంధము వుండటంచేత ఒకరిపై ఒకరికి ఒకేవిధమైన అభిప్రాయాలు కలుగడం సహజం. ఈ విషయాన్ని నిరూపించడానికి భవభూతి చంద్రకేతునిచేత, లవునిచేత ఒకే శ్లోకాన్ని చదివించినాడు. "యదృచ్ఛాసంవాదః కిము గుణగణానా మతిశయః పురాణోవా, జన్మాంతరనిబిడబద్ధఃపరిచయః, నిజో వాసంబంధః కిము విధివశాత్కోప్యవిదితో మమైతస్మిన్ దృష్టే హృదయ మవధానంరచయతి" అని ఒకరిగురించి ఒకరు ఒకేరీతిగా ఒకేసారి అనుకుంటారు. ఈ విధమైన కళాచాతుర్యాన్ని ఆంగ్లకవీశ్వరులుగాని, ఆంధ్రకవీశ్వరులుగాని ప్రదర్శించలేదనియే చెప్పవచ్చును.

కాని యింతస్నేహము వారికి వున్నప్పటికీ కథాసంవిధానానికి యుద్ధ మవసరంగనుక, రాముని పరాక్రమప్రశంసనే వారియుద్ధానికి బీజంగా ప్రదర్శించినాడు భవభూతి. కాని లవుడు ఒక్కడూ మహాసేనతో యుద్ధంచేయడం ఉచితంకాదు గనుక జృంభకాస్త్రప్రయోగంచేత సర్వసేనామూర్ఛ గావింపచేసి, లవునకూ చంద్రకేతునకూ మాత్రమే యుద్ధాన్ని కల్పించినాడు. ఇచ్చటి జృంభకాస్త్రప్రయోగమే రామునికి, కుశలవులు తనకుమారులేమోనని అనుమానించేటట్టు చేయడానికి కారణంగా యేర్పడినది.

ఇంతవరకూ కుశలవులకూ, రఘుకులానికీ గల సంబంధము కౌసల్యాదులెవరూ సరిగా కనిపెట్టలేకపోయినారు. కాని ఆరో అంకంలో రాముడుమాత్రము కుశలవులు తనకుమారులేమోనని సవిమర్శనంగా చాలావరకు ఆలోచించినాడు. జానకి గర్భవతిఅయినప్పుడు ఆమె గర్భస్పర్శవల్ల కవలలను ప్రసవిస్తుందని రాముడు జానకికంటె ముందే తెలుసుకొన్నాడు. కుశలవులముఖములూ, కళ్లూకూడా జానకియొక్క ముఖమూ కళ్లయొక్క ప్రతిబింబములే. ఇదిగాక తపఃప్రభావముచేతనే పొందదగినటువంటివన్నీ, రఘుకులమునకు వంశపారంపర్యముగా వస్తూన్నటువంటివన్నీ జృంభకాస్త్రములు వీరివద్దవుండడం చేత కుశలవులు రఘుకులమునకు సంబంధించినవారైయుండాలని రామునికి బలమైన అనుమానం కలిగించి. కుశలవులకుకూడా రాముని చూడగనే అమితమైన పూజ్యభావం కలిగింది. రాముడు వారి తండ్రి అని తెలియకపోయినప్పటికీ తండ్రిగారియందు చూపవలసిన ప్రేమనేవారు రామునియందు చూపించినారు. కుశుడు కొంచెము వీరప్రతాపాన్ని ప్రదర్శించడానికి ప్రయత్నించగా లవుడు వానిని నివారించి తమ స్నేహితుడైన చంద్రకేతునకు రాముడు పితృసముడు కనుక వారుకూడా రాముని గురుభావంతో చూడాలని అంటాడు. ఇంతే కాకుండా రామునియందు వారికి పూజ్యభావమే వున్నదనిన్నీ, సైనికుల గుప్రవర్తనే వారిని యుద్ధమునకు రేపించినదనిన్నీ లవుడు చెప్పినప్పుడు వారికి రామునియందుండే పూజ్యభావం మనకు సుబోధక మవుతున్నది.

సప్తమాంకంలోని అంతర్నాటకం నిశిత ప్రతిభావంతుడైన భవభూతికళానైపుణ్యాన్ని వేనోళ్లతో చాటుచున్నది. ఇంతవరకూ రామునికి సీతయొక్క వృత్తాంతము తెలియకపోవడంచేత, నాటకం విషాదాంతంగా పరిణమిస్తుందేమోనని భ్రమపడడానికి అవకాశం వుంటుంది. కాని ఈ అంతర్నాటిక సీతారాములకు సంయోగాన్ని కలుగజేసి నాటకాన్ని శుభాంతమైనదాన్నిగా చేస్తూన్నది. ఇటువంటి సంఘటనలు సంభవించే నాటకాలను ఆంగ్లేయభాషలో Tragi-comediesఅని అంటారు. యిటువంటి నాటకములలో మొదట పరిస్థితులుమాత్రము చాలా విషమంగావుండి తరువాత శుభాంతాన్ని పొందింపిస్తాయి. ఇంతేకాకుండా రాముడు సీతను పరిత్యజించినతరువాత ఆమెసంగతి యేమైనదీ రామునికి తెలియలేదు. కనుక ఆ విషయాన్ని ఇక్కడ భవభూతి అంతర్నాటకంద్వారా నిరూపించినాడు. ఈ అంతర్నాటకాన్ని చూడడానికి పౌరజానపదులందరూ వచ్చేరు. అప్పుడు గంగాపృథ్వులు సీతను తీసుకొనివచ్చి, తమనుకూడా పునీతులుగా చేయదగినది సీతయేనని చెప్పి, సీతారాములకు తిరిగీ సంయోగాన్ని యేర్పరుస్తారు.

ఈ నాటకంలో మొదటినుంచీ కొసవరకూ ప్రధానమైన కరుణరసాన్ని భవభూతి అనుసంధించినాడు. మొదటి మూడుఅంకములలోనూ రాముని హృదయ పరితాపాన్ని భవభూతి నిరూపించినాడు. ఈపరితాపం ప్రేక్షకులకు కరుణరసావిర్భావాన్ని కలుగుచేస్తుంది. నాలుగో అంకంలో జనకునిశోకం కరుణరససంవిధానానికి తోడ్పడుతుంది. పంచమాంకంలో ప్రేక్షకులకు కొంతవిశ్రాంతి కలుగజేయుడానికి వీరరసాన్ని యెక్కువగా ప్రదర్శించినా, కరుణరసానుసంధానంమాత్రం చేయకపోలేదు. "హృదయమర్మచ్ఛేద దారుణాని చంద్రకేతోర్వచనాని" అని సుమంత్రుడు రాముడికి సంతానం లేదనే విషయాన్ని గురించి ప్రసంగిస్తాడు.

ఆరవఅంకంలో కుశలవులు రామాయణంలో శ్లోకాలు చదివినప్పుడున్నూ, సప్తమాంకంలో అంతర్నాటకాన్ని చూసినప్పుడున్నూ రాముడుకి అమితమైన దుఃఖముకలుగుతుంది. అప్పుడు ప్రేక్షకులకు కరుణరసావిర్భావం కలుగుతుంది. ఈవిధంగానే యేడంకాలలోనూ భవభూతి ప్రధానమగు కరుణరసాన్ని అనుసంధించేడు.

రాముని పాత్రపోషణలో భవభూతి అమోఘమైన ప్రజ్ఞనువిజృంభింపచేసేడు. అలంకారికులు నిర్దేశించిన ధీరోదాత్తుని లక్షణాలన్నీ రామునికి వర్తిస్తాయని చెప్పడం సూర్యునిలో కాంతివుంది అనిచెప్పడంవంటిది. తన హృదయంకంటె యెక్కువగా ప్రేమించిన సీతను లోకంకోసం త్యాగం చెయ్యవలసివచ్చినప్పుడు రాముడనుభవించిన మనోవేదన మొదటినుంచీ కొసవరకూ భవభూతి అప్రతిహతంగా నిర్వహించేడు. రామునియొక్క సీతాత్యాగవిషయంలో వాసంతిక విమర్శించినప్పుడు రాముడున్నూ, నాల్గో

అంకంలో జనకుడు రాముని గురించి విమర్శించినప్పుడు కంచుకియున్నూ, యేడో అంకంలో పృథివి విమర్శించినప్పుడు భాగీరథినీ, లోకం కోసమే సీతను విడిచిపెట్టినాడు గాని, తనకు ఆమెపై సందేహమువల్ల కాదని స్థిరపరుస్తారు. ఈ విధంగా యితర పాత్రలచేతను రాముని పాత్రను విమర్శింపచేసి రాముని నాయకత్వానికి భంగం లేకుండా సమర్థించేను కవి. ఈలాగే శంబూకవధవృత్తాంతం కూడా లోకం కోసమే వధ జరిపినట్టు చూపించినాడు యీ మేధావి.

గంభీరమైన భావాలను, మహత్తరమైన అనుభవాలను విశదీకరించడంలో భవభూతి నిరుపమానమైన ప్రజ్ఞను కనపర్చినాడు. చిన్న వాక్యాలలో మహత్తరమైన భావాన్ని అద్భుతంగా నిరూపించగలిగే నేర్పు యీ మహాకవికి వున్నది. శంబూకవధానంతరం "కృతం రామసదృశం కర్మ" అనే వాక్యంలో ఆ వధయందు రామునికుండే నిరసనభావం, భూతదయా, మనకు చక్కగా వ్యక్తమవుతూ ఉన్నాయి. ఇంతేకాకుండా వాక్యం పూర్తి కాకుండా భావం పూర్తి అయిపోయినట్లయితే ఆ వాక్యాన్ని అసంపూర్తిగానే విడిచిపెడతాడు గాని పొల్లుముక్కలతో మాత్రం వాక్యాన్ని పూర్తిచేయడం యీ కవ్యుపాసకుని పని కాదు. భావానుగుణమైన భాష యితనిసొమ్ము. ఈ నాటకంలో అనేకస్థలములయందు హృదయోద్వేగాన్ని కలిగించే భావాలనే యీ కవి విశదీకరించినాడు. కనుక ఆ వుద్వేగాన్ని తెలియచేయడానికి తగిన పదజాలాన్ని ఉపయోగిస్తేనే గాని లేకపోతే చాలా పేలవంగా ఉంటుంది. ఈ సంగతి గ్రహించలేక భవభూతిశైలి క్లిష్టము కఠినంగా ఉంటుందని అంటారు. ఈ మహాకవియొక్క ప్రకృతివర్ణన, కవితామాధుర్యము, వటువుల అధ్యయనక్రమనిరూపణ యీయన విజ్ఞానాన్ని తెలియచేస్తాయి. "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి, లోకోత్తరాణాం చేతాంసి కోను విజ్ఞాతుమర్హతి" మొదలైన అర్థాంతరన్యాసాలున్నూ, "ప్రసన్నం సౌజన్యాత్ దయితకరుణైర్గాఢకరుణం ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయమస్మిన్ క్షణఇవ" మొదలయిన శ్లోకములలోని భావశబలత్వమూ యీ మహాకవియొక్క కవితాప్రతిభను విజృంభింపచేస్తున్నాయి. ఇటువంటి గంభీరమైన భావములను వ్యక్తీకరించిన మహాకవి భవభూతియొక్క హృదయము ఎంత గంభీరమైనదో పాఠకులే గ్రహింతురు గాక!

---

## చిలుకా!

కొగంటి దుర్గామల్లికార్జునరావు

గూటిని నుంటిని
దీటుగ నేనని
సారెసారెకును
సంతసింపకుము చిలుకా!

పొంగుట యెంత
క్రుంగుట యెంత
ఏరో జెట్టిదో
ఎవండెఱుంగునే చిలుకా!

మురిసిపడుచు న-
మ్మోహమనెడి యం
భోరాశినిఁ బడి
మునిఁగిపోవకుము చిలుకా!

తనువుపైని యా
తమినెల్లా విడి
తత్త్వం బెఱింగి
తగ వర్తిల్లుము చిలుకా!

---



సంధ్యలోకి సాగి
— S. S. S. —

# ఆత్మబోధము

[ఆంధ్రీకరణము]

కవితా కోవిద,

ఉల్లంశెట్టి అప్పయ్య

తపమునఁగ్ని పాపతతిఁ బాయువారికి
శాంతులకు నభోగసక్తులకును
మోక్షలాలసుల కపేక్షింపఁబడుచు నీ
యాత్మబోధ మమరు నవనియందు.

అన్యసాధనంబు లన్నింటికన్న నేమి
జ్ఞానముననె ముక్తిఁ గాంచవలయు
నితరపరికరంబు లెన్ని యున్నఁగాని
వంట సేయనగునె వహ్ని లేక ?

కర్మమును దానికి విరోధకలన లేమి
నట్టికర్మంబుల నవిద్య మాఁగుటెట్లు ?
జ్ఞానతేజ మక్కజముగాఁ గలిగనేని
గడపు నజ్ఞాన తిమిర ప్రకాండమెల్ల.

అలముకొనియున్నయట్టి యజ్ఞానవశమున
నాత్మ లుప్తమైనయట్లు తోఁచు
నదియె స్వయంప్రకాశ మగుచుండు మేఘాలఁ
గప్పఁబడినయట్లు కానిపించు.

కలుషజీవమందుఁ గలుగు నజ్ఞానంబు
జ్ఞానచింతనమున నీనఁబోవు
పంకమిళితజలము బాగొగ్గిరగా నంత
కతకరేణు విముడు గతి దనర్చి.

స్వప్నతుల్యమైన సంసారమిది కాన
రాగద్వేషములకు రచ్చపట్టు
అనుభవించు కాలమందు శాశ్వతమట్లు
బోధవలనఁ దోఁచు పూజ్యమట్లు.

అద్వయంబు నగుచు నాధారమగు నాత్మ
నెఱుఁగనంతవఱకు నిజమంచు
కానిపించు శుక్తిఁ గలధౌత మున్నట్లు
నిజము తెలియ భ్రాంతి నిలువలేదు.

సచ్చిదాత్మక ప్రశస్తంబు బ్రహ్మంబు
అందుఁ గల్పితమ్ములయ్యె జగము
లొక్క కాంచనమ్ము పెక్కుభూషణములై
వివిధ రూపములను వెలసినట్లు.

ఇంద్రియాధినేత యాకాశ ముపాధులఁ
బ్రతిఫలించుచుండు బహువిధముల
ఆకసము ఘటాళి వ్యాపించి తన్నాశ
మందుఁ గేవలతను బొందినట్లు.

అఖిలలోకములకు నాధారభూతుఁడై
వెలయునీశునందె కలుగు సృష్టి
అందె పెరుగు నంతమందును దనయందె
బుద్బుదములు వారిఁ బొందినట్లు.

జాతినామాశ్రమమ్ముల జరుగునట్టి
బహువిధోపాధులెల్లను బ్రహ్మమందుఁ
గల్పితములయ్యె నీటిలోఁ గలుగునట్టి
వివిధవర్ణరుచుల్ వలె విస్తరిల్లి.

పంపకమ్మొనర్పఁబడిన మహాభూత
పంచకమునఁ గర్మ సంచితమున
నిది శరీరమయ్యె నిలఁగల సుఖదుఃఖ
రాసు లనుభవించు రమ్యగృహము.

ప్రాణపంచకమ్ముఁ బ్రథితమనోబుద్ధు
లింద్రియదశకమ్ము నింపుఁగూర్చి
సూక్ష్మదేహమయ్యెఁ జూ ప్రత్యగాత్మకు
భోగయోగ్యమగుచుఁ బుడమి వెలసి.

ఆదిశూన్య మనిర్వాచ్యమగు నవిద్య
కారణోపాధినాఁబడుఁ గ్రమత మూఁడు
దేహములకంటె నన్యతం దెలియఁబడుచు
వరలు నద్దాని నాత్మగా నెఱుఁగవలయు.

పంచకోశాదియోగ సంప్రాప్తమునను
తత్తదాకృతుల్ తోఁచు నాత్మకు, వినీల
రక్తపీతాంబరద్యుతుల్ స్ఫటికమణికి
సన్నికృష్టవశంబున నున్నయట్లు.

కోశయుక్తవపువుఁగూడి నిర్మలుఁడైన
చిన్మయాత్మ వేరుసేయు యుక్తి
నంటియున్న పొట్టు గెంటి బియ్యమునకై
వడ్లుదంచునట్టి వడువుఁ దెలిసి.

సతత సర్వగతుండయ్యు జ్ఞానరూపి
ప్రతిఫలింపఁ డబుద్ధి సంబద్ధమందు
స్వచ్ఛ జలరాసులందునఁ బ్రస్ఫుటించి
యాకసము కానఁబడుఁ బంకమందు లేదు.

సన్నిధాన బలంబున సాక్షియగుచు
నాత్మరాజు రాజ్యముసేయు నంతెకాని
యతఁడు దేహేంద్రియాదులకంటె వేరు
ధీమనంబులకంటె నతీతుఁడతఁడు.

ఇంద్రియప్రచార మిట్లుంట నాత్ముండు
వానిఁ బొరయుననుట వట్టి వెఱ్ఱి
పఱుగులెత్తు మేఘపజ్క్తిఁగాంచి విధుండు
పఱుగులెత్తుననుట భ్రాంతికాదె?

ఆత్మచైతన్యవశత బుద్ధ్యాదులెలమి
స్వీయ విషయంబులను జక్కఁజేసికొనును
సరసిజాప్తుని కాంతి పుంజమ్మువలన
జనులు చైతన్యమును బొందఁజాలినట్లు.

అమలసచ్చిదాత్మయందు దేహేంద్రియ
కర్మగుణములెల్ల కల్పితములు
నీల రక్త పీత నిఖిలవర్ణంబులు
గగనరంగమందుఁ గలిగినట్లు.

ప్రచలితంబగు వారిపూరమునఁదోఁచు
శశియుఁ బ్రచలితుఁడైనట్లు జ్ఞానహీన
మానసోపాధిచేత నాత్మకును నిట్లె
కాని, కర్తృత్వభోక్తృత్వ కలన లేదు.

బుద్ధికారణమునఁ బొలుపొందు రాగేచ్ఛ
లాత్మయందుఁ దోఁచు నదియెకాని
బుద్ధిలీనని్ద్రఁ బొలుచునే విషయాళు
లాత్మధర్మ మిద్ది యని యెఱుంగు.

అర్కునకుఁగాంతి, శీతలంబంబువులకు
నగ్ని కుష్ణతల్ సిద్ధంబులైనయట్లు
సచ్చిదానంద శాశ్వత స్వచ్ఛతాదు
లాత్మకు స్వభావసంసిద్ధమైనరూపు.

ఆత్మ సచ్చిదంశ, యామీఁద బుద్ధి కా
ర్యంబు, నీద్వయంబు నండఁజేర్చి
యనుభవంబు లేమి నజ్ఞాన జీవుండు
నాత్మఁ గంటి ననుచు వ్యవహరించు.

ఆత్మయందు విక్రియాదులు శూన్యంబు
బోధ మబ్బలేదు బుద్ధికెపుడు
అట్టులయ్యు జీవుఁడన్నియు నేనంచు
మోహ వివశుఁడగుచు మారియుచుండు.

ఆత్మ కించిజ్ఞుఁడని భయంబందు టెల్ల
రజ్జువుంగాంచి సర్ప విభ్రాంతిఁగొనుట
నేఁ బరాత్ముఁడఁ జీవుండ నెట్టులనుచు
నిశ్చయించిన నగువాఁడు నిర్భయుండు.

అవి జడంబులగుట నాత్మను బుద్ధీంద్రి
యములచేతఁ దెలియ నలవికాదు
దీపకళికచేతఁ దెలియంబడు ఘటాళి
ఘటమువలన దివ్వె కాంచఁబడునె ?

దీపమునకు స్వీయదీప్తిఁ జూపుటకునై
యన్యదీపకాంక్ష యనవసరము
జ్ఞానరూప మాత్మకాన, నద్దానిని
గనఁగ వేరుజ్ఞాన మనవసరము.

నేతినేతి యనెడు వాక్య నియతిచేత
నిఖిల దేహేంద్రియాదుల నిగ్రహించి
వేదవిదిత మహావాక్య వితతివలన
నెఱుఁగు జీవాత్మ పరమాత్మ లేకమగుట.

వివిధ దేహేంద్రియాదు లవిద్యవలనఁ
గల్పితములయ్యె బుద్బుదోత్కరములట్లు
కావున తదన్య మోహవికార రహిత
నిర్గుణబ్రహ్మమేనని నిశ్చయింపు.

నేను దేహేంద్రియాన్యుఁడ నైనకతన
జన్మ కార్శ్యాలయాదు లసంభవములు
ఇంద్రియ విహీనుఁడను గాన నెపుడు నన్నుఁ
గలియఁజాలదు విషయ సంగప్రసక్తి.

వేదశాసనమున వివరింపఁబడియుండె
ప్రాణమనము లాత్మ వడయనట్టు
లేను మనసులేమి నెపుడు రాగద్వేష
భయములంది వెతలఁ బడను పడను.

నిర్గుణుండ నేను నిష్క్రియుండను నేను
నిత్య నిర్వికల్ప నిర్మలుండ
నిర్వికారపరత నిత్యుండ సత్యుండ
నిత్యముక్తి నేను నిశ్చయముగ.

ఆకసంబుపగిది నంతర్బహిర్గత
వ్యాప్తి నచ్యుతుండ ననుచు నెపుడు
సర్వసమతనే నసంగుండ నమలుండ
నిర్మలుండ నచల నిష్ఠితుండ.

నిత్యశుద్ధవిముక్తైకక నిర్మలంబు
సచ్చిదానందసందోహ సమధికంబు
నద్వయము సత్యనిరత మ్మనంతమనుచుఁ
బరగు బ్రహ్మమ్మ నేనయై వరలుచుందు.

బ్రహ్మమస్మి యనెడు భావనా నిరతి న
విద్యవలనఁ గలుగు వెతలు బాయు
వర రసాయనమున వాడఁబాఱి నశించు
రోగపుంజమట్లు రూఢి మెఱయ.

విజనదేశమందు విమల విరాగియై
యింద్రియముల నిగ్రహించి యోగి
యన్యచింతమాని యచట నాసీనుఁడై
సేయవలయు నాత్మ చింతనమ్ము.

దృశ్యమాన ప్రపంచమ్ము ధీయుతుండు
స్వీయబుద్ధిచేఁ దనయందుఁ జేర్చి యేక
మైన యాత్మ నాకాశమ ట్లనవరతము
భావన యొనర్పవలయును నేనె యనుచు.

వివిధరూప వర్ణాదు లవిద్యవలనఁ
గల్పితములంచు వాని యక్కఱలు మాని
సచ్చిదానంద విగ్రహు స్వావలంబ
నమునఁ బరమార్గవిదుఁడు చింతనముసేయు.

అది చిదానంద కేవలావ్యక్తరూపి
తనకుఁదానె ప్రకాశించు దానియందు
జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాదులు గల్గలేదు
భేదభావంబు దానికి లేదు లేదు.

ఆత్మ యరణియందు నశ్రాంత మీరీతి
ధ్యానమథన మెలమిఁ బూని సలుప
నుదయమందినట్టి యుజ్జ్వలజ్ఞానాగ్ని
కాల్చివేయు మోహకాష్ఠములను.

అలముకొనినయట్టి యజ్ఞానతిమిరమ్ము
అరుణకిరణదీప్తి నంతకంత
కపహృతమ్ముగాఁగ నాత్మస్వరూపంబు
తనకుఁదావెలుంగు తరణియట్లు.

ఆత్మసంప్రాప్తి యవిరతంబైననేమి
యటమటించి యవిద్యచే యద్భుతగుణం
బట్టియజ్ఞాన మడఁగిన నది లభించు
స్వీయకంఠాభరణము చేఁజిక్కినట్లు.

మొద్దునందు పురుషుఁబోలె బ్రహ్మమునందు
జీవకల్పనమ్ము సేయఁబడియెఁ
దత్త్వదృష్టిఁజూడఁ దజ్జీవతా బుద్ధి
బ్రహ్మమందుఁ గానఁబడుట లేదు.

తత్త్వరూప సంప్రాప్తి నుత్పన్నమైన
యద్వయ జ్ఞానతేజ మహామ్మను యను
నజ్ఞతా దిగ్భ్రమాదుల నణఁగఁద్రొక్కి
యరుణదీప్తియై విలసిల్లు టబ్బురంబె.

ఆత్మయందుఁ దనకు నఖిల ప్రపంచమ్ము
గలదటంచు యోగి జ్ఞానదృష్టి
నెఱిఁగి చూచుచుండు నేకమై యొప్పారు
నాత్మరూపి నేన యనుచు నెపుడు.

ఆత్మకంటె జగతి నన్య మింకెయ్యది
మట్టికంటె పాత్ర మెట్టి భేద
మనుచు యోగిచంద్రుఁ డఖిల ప్రపంచమ్ము
స్వాత్మరూపమట్లు సతముఁగాంచు.

ప్రాపితోపాధిగుణముల రూపుమాపి
సచ్చిదానంద ధర్మసంసర్గమంది
యోగివరుఁడు జీవన్ముక్తి నొందుచుండు
పురుగు తుమ్మెదరూపంబుఁ బొందినట్లు.

మోహసాగరమును దాఁటి మోదమంది
రాగవైరాది రాక్షసప్రకరములను
దునిమి తూటాడి శాంతిసంతుష్టిఁ జెలఁగి
యావని వెలయు నాత్మారాముఁడగుచుయోగి.

బాహ్యసౌఖ్యములను భ్రమియింప కశ్రాంత
మాత్మచింత (దృప్తి నంది యోగి
ఘటమునందు దీపకళికవోలెఁ దదంత
గమున నంచితోపరతిఁ జెలంగు.

అతఁ డుపాధిస్థితుండయ్యు నాకసంబు
పోల్కిఁ దద్ధర్మముల నెప్డుఁ బొందకుండు
సర్వవిదుఁడయ్యు మూఢుని చాడ్పునుండు
గాలివలె సంచరించు భోగములవిడిచి.

జలములందు జలం బాకసమునయందు
నాకసం బగ్నియం దగ్నియ ట్లుపాధి
రహిత మగునంత సన్మౌని బ్రహ్మమందు
ననవగోధతఁ జెంది తా నైక్యమగును.

లాభములకంటె నెయ్యది లాభకరము
సౌఖ్యములకంటె నెయ్యది సౌఖ్యతరము
జ్ఞానములకంటె నెది మహాజ్ఞానమగును
దాని బ్రహ్మంబటంచును దలఁపవలయు.

దేనిఁ జూచినవెనుక నెద్దియును లేదు?
ఏది తానైనపిమ్మట లేదు భవము?
దేనిఁదెలిసి యన్యంబును దెలియఁదగదు?
అదియె బ్రహ్మంబటంచును నరయవలయు.

అడ్డు నిడుపు క్రిందు లందుఁ బ్రపూర్ణమ్ము
సచ్చిదాత్మకమ్ము శాశ్వత మ్మ
నంత మద్వయ మ్మనశ్వరం బగు నెద్ది
దాని బ్రహ్మమంచుఁ దలఁపవలయు.

## కాంగ్రెసు కన్వెన్షను సభలు, ఢిల్లీ.



హరిజనవాడలో మహాత్ముని విడిదివద్ద
పండిత నెహ్రూగారు మార్తాండ ఉపాధ్యాయగారితో సంప్రదించుట.



సర్దారు పటేలుగారు, సరోజినిదేవిగారు, ఉపాధ్యాయగారు, (ఎడమచివర)
నెహ్రూగారి కార్యదర్శి వర్కింగుకమిటీ సభకు పోవుట.





పండిత జవహరిలాల్ నెహ్రూగారు కాంగ్రెసు కన్వెన్షనుసభకు



పండిత నెహ్రూగారు అన్సారీనగరమున జాతీయపతాకా స్థాపన మొనరించుట



మహాత్మగాంధిగారు ఢిల్లీలో నేలగ క్షేమపుపక్క కాలినడకను హరిజనవాడకు బోవుట. పండిత నెహ్రూ, గఫూరుఖానుగార్లు మున్నగువారు వారి వెంట నడచుచున్నారు.





ఆచార్య కృపాలిని (ప్రధాన కార్యదర్శి), శరతుచంద్రబోసు, పండిత నెహ్రూ, పురుషోత్తమదాసు టాండనుగార్లు



ఢిల్లీలో అ. భా. కాం. సంఘసభ్యులు విరామ సమయమున ఫలాహారములు గైకొనుట' యం. బాపినీడు, కల్లూరి సుబ్బారావుగార్లు ముందు బల్లవద్ద కూర్చొని యున్నారు.

నర్తకి
శ్రీమతి భానుమతి

మదనపల్లి దివ్యజ్ఞానసమాజకళాశాలయందలి
గాయనీ గాయకబృందము

నర్తకి
శ్రీమతి వరలక్ష్మి



మైలాపూరు శారదావిద్యాలయ విద్యార్థినుల నాటకవినోద ప్రదర్శనము

బొంబాయి గానమందిరపు దశమవార్షికోత్సవములందు సంగీతప్రదర్శనము గావించిన
శ్రీమతి శాంత అంబాడి





కడచినసంవత్సరము విద్వాన్ పరీక్షలలో పాల్గొన్న
శారదానికేతన (గుంటూరు) విద్యార్థినులు



శ్రీమతి చక్కా పద్మావతి శ్రీమతి యస్. బాపాయమ్మ
కడచినవత్సరము విద్వాన్ పరీక్షలలో విజయము గాంచిన మదరాసు యువతీమణులు.
నడుమనున్నది శ్రీమతి బత్తుల కామాక్షమ,

# పునిస్త్రీ పునర్వివాహం

యల్లాప్రగడ సీతాకుమారి

**" పిరకబడ్డకొద్దీ సంఘం మరీ తొక్కి పడుతుంది. రేపు నీకొచ్చే కష్టనష్టాల కేమన్నా ఈసంఘం బాధ్యతవహిస్తుందా ?"**

ఆ రోజుల్లో సుధా నేనూ కలిసి చదువుకుంటుండేవాళ్లం. సుధ మా క్లాసులోకల్లా చురుకైంది. చాలా మందిపిల్లలు స్నేహితంగాఉండికూడా పోట్లాడుకుంటూ ఉంటారు. కాని నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు సుధా, నేనూ ఎప్పుడూ పోట్లాడుకునే వాళ్లం గాదు.

ఆ యేడు నాకు పెళ్లిచెయ్యాలని నాన్నగారు చాలా ప్రయత్నాలు చేస్తున్నారు. పదమూడోయేడు వెళ్లకుండానే చెయ్యాలని అమ్మగోల. కాని ఏం లాభం? ఎక్కడికివెళ్లినా వేలమీదఉంది లెక్క. వెతగ్గా వెతగ్గా, తిరగ్గా తిరగ్గా హైదరాబాదులో ఒక సంబంధం కుదిరింది. విధుశేఖరం "డాక్టరుపరీక్ష"కుచదువుతున్నాడు. తండ్రికి పి. డబుల్ యు. డి. ఆఫీసులో పెద్ద ఎక్కౌంటెంటు పని. నేగే కొంతఆస్తికూడా ఉందిట. కట్నం రెండువేలు.

నాకు చాలా కష్టంవేసింది. ఏమంటే నాకు అప్పియవాల్లో కుంటీ, గుడ్డీ ఏమీ లేదు. ఇప్పుడు ఫోర్తుఫారం చదువుతూఉన్నాను. కొద్దిగా సంగీతం వచ్చును. ఇంటిపనులు కొన్ని చేతవును. ఏవిధంగానూ గృహనిర్వాహణానికి అనర్హురాలినికానప్పుడు రెండువేలు ఇస్తేనేగాని పెండ్లికాని కర్మం నా కెందు కొచ్చిందో తెలీదు. పైగా నాన్నగారు ఎలాగూ గండువేలివ్వలేనప్పుడు ఈ సంబంధం ఎందుకు కుదర్చిందీగూడ తెలీదు.

సాయంకాలం సుధావాళ్లింటికి వెళ్లాను. మాటలసందర్భంలో సుధ "ఏం, ఇంకా మీవాళ్లు నీపెళ్లి ప్రయత్నంలోనే ఉన్నారా?" అని అడిగింది.

"ఆ. ఇప్పుడో సంబంధం కుదిరింది. కట్నం రెండువేలు."

"ఆఁ! అలాగా! మరి నీకిష్టమేనా?"

"నాకిష్టంలేదుగాని మావాళ్లకు నా ఇష్టంతోపని లేదు."

"పోనీ, ఇప్పుడేంతొందరొచ్చింది, ఇంకా కొన్నాళ్లు చదువుకోరాదూ? అప్పుడు మూడుపాళ్లు కట్నాలేమీ ఇవ్వకుండానే సంబంధంకుదరవచ్చు."

"ఆఁ! అందరికీ మీనాన్నగారిలాటి ధైర్యం ఉండొద్దూ?"

"కాదు మధూ, పిరకబడ్డ కొద్దీ సంఘం మరీ తొక్కిపడుతుంది. రేపు నీకొచ్చే కష్టనష్టాలకేమన్నా ఈ సంఘం బాధ్యతవహిస్తుందా?"

ఆ రాత్రంతా సుధమాటలే నాతల్లో మెదులుతూ ఉన్నయి. ఒకసారి, మర్నాడు ఎలాగైనా నాకీ పెండ్లినద్దనీ, సుధలాగా ఇంకాకొంతకాలం చదువుకుంటాననీ మావాళ్లతో చెప్పవలెననుకున్నాను. కాని అంతలోనే మళ్లీ "ఏమో, తీరానిశ్చయమైన పెళ్లిమానేస్తారా?" అనిపించి చెప్పడానికి వెనక్కుతీశాను. సంఘాన్నెదురించలేని మానాన్నగారి పిరికితనమే నాలోగూడ కనిపించిందేమో!

సరి, వివాహకాలం వచ్చింది, కట్నం ఇచ్చేసమయం వచ్చింది, నాన్నగారు విధు తండ్రిని లోపలికి తీసుకుపోయి "బావగారూ, సమయానికి డబ్బు తటస్థపడలేదు. ఇస్తా ఇస్తాననిచెప్పి ఓ వెధవ సమయానికి ముఖం తప్పించాడు. ఇప్పుడైనా మునిగిపోయిందేమీ లేదు. ఎలాగూ మాపొలంలో కొంత దీనిక్రింద అమ్మవలెననుకుంటున్నాము కనుక ఆ పొలం మీకే వ్రాసి ఇస్తాను.ఇప్పుడుమాత్రం శుభకార్యం జరుగనియ్యండి" అంటూ చెప్పారు. విధుతండ్రి తెలివైనవాడే కాని హైదరాబాదువాడు కనుక మా నిజస్థితి తెలియక ఈ విషయం లోమాత్రం బోల్తాపడ్డాడు. పెండ్లి సక్రమంగానే జరిగిపోయింది.

పెళ్లయినతరువాత నాన్నగారికేమీ ఆస్తిలేదనీ, తమనిమోసపుచ్చారనీ విధుతండ్రికి తెలిసిపోయింది. దానితో ఆయనకు ఏదోపెద్దపరాభవం జరిగినట్లు ఎక్కడలేని కోపం వచ్చింది. అక్కడితో నాచరిత్రలో విషాదఘట్టం ప్రారంభం అయింది. ఇక వాళ్లెవరూ మాఊరు రావటం కాని, మీళ్లెవరు వెళ్లినా మాట్లాడ్డం గానీ లేకుండా నిలిచిపోయినయి.

౨

ఒకరోజు సాయంకాలం సుధ మాఇంటికి వచ్చింది.

"ఏం మధూ, ఈ పరీక్షతో నీకు మెట్రిక్ అయిపోతుందిగదా, ఇకముందేమిచేస్తావు ?"

నేను కొంచెం నిరుత్సాహంతో "ఏమో సుధా, ఇక మానివేస్తాను." అన్నాను. సుధ మామూలుగా కులాసాగానూ, ఉత్సాహంగానూ ఉన్నది కాని నాకుమాత్రం అప్పుడే ఈ నిరుత్సాహం ఎక్కడినుంచి వచ్చిందో! "ఐతే నీవేం చేస్తావు మరి?"

"హైదరాబాదులో మా మామయ్యగారి ఇంట్లో ఉండి మెడికల్ కోర్సు చదువుతాను."

"పెండ్లి విషయం ఏమన్నా ప్రయత్నిస్తున్నారా ?"

"లేదు. ఇప్పుడైతే ఎంత లేదన్నా కాస్త మంచి సంబంధం కావాలంటే రెండు మూడు వేలన్నా కావాలి. ఆ డబ్బు పెట్టి చదువుకుంటే తర్వాత కట్నం లేకుండా సంబంధమూ వస్తుంది, నాకు చదువూ ఉంటుంది. అందుకని నాన్నగారు ఎలాగైనా కష్టపడి నాకు డాక్టరు చదువు చెప్పిస్తానంటున్నారు."

* * *

రెండేళ్లు గడిచిపోయినయి. నన్ను తీసికెళ్లమని నాన్నగారు ఎంతమంది చేత కబురుచేసినా 'కాలం ఇవ్వంది లాభంలే'దని విధుతండ్రి చెపుతూ వచ్చాడు. చివరకు ఒకరోజున మా నాన్నగారు నన్ను తీసుకొని హైదరాబాదు వెళ్లారు. కాని విధుతండ్రి మా నాన్నగారిని తీవ్రంగా దూషించి, మోసకారుల పిల్ల మాకు వద్దని మమ్మల్ని పంపివేశారు. నాకు మటుకు ప్రత్యేకంగా విధు ఉద్దేశం ఎలా ఉంటుందో కనుక్కోవలె నని పించిందిగాని, దురదృష్టం, విధు ఆరోజున ఊళ్లో లేడట. స్కూలుపిల్లలతో 'విహారం' (Excursion) వెళ్లాడట.

ఇక నేను శాశ్వతంగా పుట్టింట్లోనే ఉండవలసి వచ్చింది. ఈ రోజుల్లో, నాలాటి వ్యర్థజీవినుల కథలు ఏమైనా దొరకగానే వాళ్లేం చేసేవాళ్లోనని చదువుతూ ఉండేదాన్ని. అందులో చాలామంది రకరకాల విషాలు త్రాగి మరణిస్తుండేవాళ్లు. మరికొందరు దాసీలల్లే ఉంటామనీ, ఉండనిస్తేనే చాలనీ భర్తకు ఉత్తరాలు వ్రాస్తుండేవాళ్లు. కాని ఇవేవీ నాకు మంచి వనిపించలేదు. ఏమాత్రమూ ఇష్టంలేని విధుదగ్గిర పడుస్తూపడిఉండేకంటే చనిపోవటమే నయమేమోననిపించింది. కాని ఏవిషం తింటే నిర్బాధాకరంగా మరణిస్తానో తెలీదు. పైగా నా కావిషాలు ఎవరమ్ముతారు? పోనీ, నాటుపద్ధతులున్నాయి: చీర ముట్టించుకోనీ, నూతిలో పడీ మోస్తరు. అమ్మబాబో! ఛా. కాకపోయినా సమానంగా వ్యర్థజీవులమైన మా ఇద్దరిలో విధు హాయిగా కులాసాగా తిరుగుతూ చదువుకుంటూ ఉంటే నాకే చచ్చిపోయే కర్మం ఏం వచ్చిందీ ?

కాని సంఘం! ఈ పక్షపాతపు గుడ్డిసంఘం విధు నేమీ అనడం లేదు కాని "ఫలానివారమ్మాయిని మగడు వదిలిపెట్టాట్ట, విన్నారా" అంటూ నన్నే చెప్పకునేవాళ్లు. పోనియ్యి, ఈ సంఘంతో నాకేమి లెక్క? సుధ చెప్పినట్లు నా కష్టసుఖాలకి సంఘం ఏమన్నా పూచీ పడుతుందా ?

కాని నా స్థితికి ఇప్పుడు నాన్నగారు కూడా విచారించ సాగారు. అనవసరంగా తొందరపడి, ఎక్కువలకు పోయి, మోసంచేసి చేసిన నా వివాహం ఈ విధంగా ఫలించినందుకు చాలా క్రుంగిపోయినారు.

మరి రెండేళ్లయింది. ఇంతలో కొద్దిజీతాలవాళ్లు కొంపలు తీసే "రిట్రెంచిమెంటు" భయంకరాకారంతో వచ్చి పడ్డది. నాన్నగారింకా బాగా నౌకరీ చేయగలిగేఉన్నా, సర్వీసుఅయిపోయిందని పెన్షనుపుచ్చుకోమన్నారు. కాని ఇదివరకు జీతమంతా వస్తేనే కష్టంగా జరుపుకొనే స్థితిలో ఈ సగంజీతంతో ఇల్లుగడవటం ఎంతో కష్టంగా ఉంది. ఇంతే కాక చేతికి వచ్చిన మగపిల్లలు కూడా లేరు.

ఎవరికయినా కష్టాలు లెక్కువవుతూన్న కొద్దీ ధైర్యం, సాహసం ఎక్కువవుతాయి. అలాగే ఇప్పుడు నాకు కూడ ధైర్యంకలిగి, ఎలాగన్నా కష్టపడి వీళ్లను పోషించాలి అని నిశ్చయం చేసుకున్నాను.

ప్రయత్నంచేస్తే ఫలం ఉండక పోదు. మా ఊళ్లోనే బాలికాపాఠశాలలో ఒకటీచరుపని ఖాళీవచ్చింది. హిందూస్త్రీని కనుక నా కా ఉద్యోగం ఎక్కువప్రయాస లేకుండానే దొరికిపోయింది. గత్యంతరం లేక నాన్నగారేమీ అడ్డు చెప్పలేదు. ఇప్పుడు నాజీతం, నాన్నగారి పెన్షనూ కలుపుకొని హాయిగా జీవిస్తున్నాం.

వేసంకాలంలో సుధ వచ్చిందని తెలిసి ఒకరోజున చూడ్డానికి వెళ్లాను,

"ఏంసుధా, ఇంకా ఎన్నాళ్లుంది చదువు?"

సుధ ఉత్సాహంగా "ఇంకో ఏడాదైతే ఎం. బి. బి. ఎస్. డిగ్రీవస్తుంది."

"మధూ, నీకు తెలీదేమో, ఈ మధ్య నేను పెళ్లిచేసుకున్నాను." అని అంది.

"అదేమిటి, చదువు పూర్తయేదాకా చేసుకోనన్నావుగదూ? వరుడెవరు?"

"హైదరాబాదులోనే ఉంటాడు, విధుశేఖరం అని...."

నేను అదిరిపడి "విధుశేఖరమా? ఏ విధుశేఖరం?" అన్నాను.

"లక్ష్మీప్రసాదంగారని, ఆయనకొడుకు. మా కాలేజీలోనే మెడికల్ కోర్సు చదువుతున్నాడు"

కొంచెం సర్దుకొని "అలాంగా! కట్నం ఏమైనా ఇచ్చారా?" అన్నాను.

"లేదు. విధు తండ్రిమాత్రం కట్నం కావాలన్నాట్ట. కాని ఈ ఏడవగానే విధుకో పెద్ద నౌకరీ దొరుకుతుందని ... పెట్టుబడికోసం తీసుకున్నాట్ట."

ఇక అక్కడ నిలవలేకపోయాను. "కొంచెం పనుంది సుధా, రేపు మళ్లీ వస్తాను."

"తప్పకుండా వస్తావుకదూ?"

## 3

ఇంటికి పోయి గదిలో పడుకున్నాను. నా గుర్తావయవాల్లోనుంచీ పొగలువస్తున్నట్టనిపించింది. "విధు పెళ్లిచేసుకున్నాడు. ఎవర్ని? సుధను. మరి నేనో? విధూ నావాడు ఎప్పుడూ కాలేదు. నేనూ అతనిదాన్ని కాలేదు. కాని మా ఇద్దరికీ సంఘం ఓ సంబంధం అంటగట్టింది. ఇప్పుడు విధు ఆ సంబంధాన్ని తెంచుకొని వేరే పెండ్లిచేసుకున్నాడు. నేనేంగావాలో ఆలోచించనన్నా లేదు. మరి దీనికి ప్రతిక్రియ ఏంచేస్తాను? ఎలాగన్నా, విధు వదిలిపెట్టినాగాని నాకేమీనష్టం కలగలేదని అతనూ, అతనితండ్రీ తెలుసుకునేటట్లు చేస్తే నా ఆత్మతృప్తిపడి మనసు కుదుటబడుతుంది. కాని ఈ సంఘం మగవాళ్లకిచ్చిన అతిచనువువల్ల విధు గబిక్కిన పెండ్లి చేసుక్కున్నాడు. మరి నేనో...

మర్నాడు సాయంత్రం సుధను కలుసుకున్నాను.

"సుధా, నీకు తెలీదేమో, నేను పెళ్లిచేసుకోబోతున్నాను."

"అదేమిటీ, నీకు పెళ్లయింది కాదూ?"

"అవును, ఆరేళ్లక్రింద. కాని నేను అతన్ని వదలివేశాను."

"వదలిపెట్టావా? ఎందుకని?"

"వినగలిగితే కంగారుపడకుండా విను. ఇప్పుడు నీభర్తఅయిన విధుశేఖరాన్నే నేను చేసుకున్నది. కాని మా నాన్నగారు ఇస్తానన్నకట్నం ఇవ్వలేకపోవటంచేత విధుతండ్రినన్ను వాళ్లింటికి రానివ్వలేదు."

"ఏమిటీ, ఎంతపనిజరిగింది! విధుకు ఇదివరకే పెండ్లయినసంగతి నాకిదివరకు తెలియదు. ఇలా నన్ను మోసం చేసి పెళ్లిచేసుకున్నాడా విధు?"

"సుధా, ఐతే ఒకసంగతి నీవు విధునుపెళ్లిచేసుకున్నందుకు నాకేమీ కష్టంగాలేదు. ఏమంటే, ఎలాగూ అతనికీ నాకూ తెలియదు. స్థితికిమించిన సంబంధాలకు పోతే ఎప్పుడూ ఇలాగే జరుగుతుంటుంది."

"కాని, మధూ, విధుమాత్రం చాలా మంచివాడు. అతనిలా చేస్తాడని నేననుకోలేదు. కాని ఇందులో అతని తప్పేక్కువ ఉండదనుకుంటాను. అంతా అతనితండ్రి కుట్ర అనుకుంటాను."

"కావచ్చును; కాని విధుకు నామీద ఇష్టం ఉంటే ఎలాగైనా



స్వతంత్రించి తీసుకు పోయేవాడే. ఇంతకూ అతనికొరకు నేనుగూడ ఎక్కువగా వాంఛించిందీ లేదు. హాయిగా ఇక్కడ టీచరుపని చేస్తూ స్వతంత్రంగా బతుకుతూఉన్నాను."

"మరి ఇప్పుడు నీ వెవర్ని పెళ్లి చేసుకో బోతున్నావు?"

"ఈ వూళ్లోనే మాపక్క ఇంటి భగీరథాన్ని. అతను చాలా తెలివైన వాడూ, బుద్ధిమంతుడూ కూడాను. కాని తండ్రి ఇచ్చిపోయిన ఆస్తి ఏమీ లేకపోవడంచేత త్వరలోనే చదువు చాలించి ఈ వూళ్లోనే టీచరుగా ఉంటున్నాడు అంచాత కట్నాలిచ్చే మంచిసంబంధాలేమీ దొరకడంలేదు. కనుక అతన్ని నేను చేసుకుంటే సరిపోతుంది."

"బాగానే ఉంది. కాని- కాని, మధూ, ఇప్పటి హిందూలా ప్రకారం, పేరుకుమాత్రమే నీకు భర్తఅయినా, విధు ఉండగా నీవు వివాహంచేసుకోడానికి వీలులేదు."

నాకు వళ్లు మండిపోయింది. "వీలు లేదా? పెళ్లిలోకూడా అతనిముఖం తిన్నగా చూళ్లేదునేను. అలాటి విధు శాశ్వతంగా నన్ను వదిలిపెట్టి వేరే పెళ్లిచేసుకొని సుఖపడుతూ ఉంటే నేను మాత్రం పెళ్లిచేసుకోడానికి వీల్లేదా? మరేం చెయ్యడానికి వీలుంటుందో??"

సుధ తాపీగా "భరణంకోసం అతనిమీద దావావెయ్యవచ్చును." అంది.

"అతనిడబ్బు నా కవసరంలేదు. డబ్బుకోసం నేను పెళ్లిచేసుకోలేదు. నాపొట్ట నేనుపోసుకొని ముసలివాళ్లయిన మా అమ్మనూ, నాన్నగారినీ గూడా పోషించుకోగలుగుతున్నాను. కాని- కాని,సుధా, నాకు తోడునీడగా ఉండడానికి, అతని కష్టసుఖాల్లో నేనూ - నా కష్టసుఖాల్లో అతనూ బాధ్యతవహించడానికి ఇప్పుడిప్పుడు నాకు పెళ్లి అవసరం అనిపిస్తున్నది. ఏం లాభం, నేను వితంతువు-కంటే గూడ అధమం అయిపోయాను."

సుధ చాలా సేపు నిశ్శబ్దంగా ఆలోచించడం మొదలు పెట్టింది. ఆమెముఖంలో అనేకభావాలు కనుపించాయి. చివరకు ప్రశాంతంగా, "మధూ, నాకు తెలిసినంతమట్టుకు విధుశేఖరానికి నీ మీద ద్వేషం గాని, ఈర్ష్యకాని లేదనుకుంటాను. ఇంతేకాక స్నేహితురాలినైన నేనే నీ సౌఖ్యజీవనానికి అడ్డుపడ్డం మరీ హృదయవిదారకంగా ఉంది. ఏమైతేనేమి, జరిగిందేమో జరిగిపోయింది. ఇప్పుడైనా నీవు సంఘాన్నెదురించి మళ్లీ పెళ్లిచేసుకుంటాననడం నాకెంతో ఆనందంగా ఉంది. ఈశెలవల్లో ఇక్కడే గడుపుదామని విధుకూడ ఇవ్వాళో రేపో ఈ వూరొస్తాడు కనుక నే నెలాగైనా విధుదగ్గిరనుంచి నీకు వివాహానికి అనుజ్ఞాపత్రం తీసుకొని ఇస్తాను. అతను తప్పకుండా ఇస్తాడని నాకు నమ్మకం ఉంది." అంది.

సుధ ఔదార్యానికి నాకు చాలా తృప్తికలిగింది. "నీ ఆలోచన బాగానే ఉన్నది సుధా నేను మళ్లీ రేపు కలుస్తాను" అని ఇంటికి వచ్చాను.

౪

ఆరాత్రి కూడ నా పని ఆలోచించడమే అయింది. "విధు అనుజ్ఞ ఇస్తే కాని నేను పెళ్లి చేసుకోకూడదా? ఎంత దురవస్థ! పోనీ, పెళ్లిమానీ ఇలాగే ఉంటే? ఏం లాభం, ఏం గొప్ప? అలాటివాళ్లెంతమందో ఆంధ్రదేశంలో! వాళ్లల్లో నేనూ ఒకదాన్ని. ఇప్పటికి ఎలాగో ఈ అనుజ్ఞతోనే పెళ్ల చేసుకుంటే సంఘానికి ఒక ఆదర్శం చూపించినదాన్నవుతానేమో". రెండురోజుల ఆలోచనా ఫలితంగా ఈ నిశ్చయానికి రాగలిగాను. కాని అప్పుడే నాలో ఈ శపథంకూడా చేసుకున్నాను. "ఎలాగైనా ప్రయత్నించి నా జన్మలో స్త్రీలకు గూడ భర్త ఉండగానే పునర్వివాహాధికారం వచ్చేటట్లు చెయ్యాలని, లేదా పురుషులకీ ఆ అధికారం తీసివేయించాలని."

రెండురోజుల తర్వాత సుధను కలుసుకున్నాను. సుధ ఉత్సాహంతోనూ, ఆనందంతోనూ బయటికి వచ్చి నన్ను లోపలికి తీసుకు వెళ్లింది.

నేనూ సుధా హాల్లో కూచోని మాట్లాడుతూ ఉండగా లోపలినుంచి విధుశేఖరంవచ్చి, నన్ను చూడగానే మందహాసంతో హైదరాబాదు పద్ధతిగా "నమస్కారం" అంటూ నేరుగా కుర్చీలో కూర్చున్నాడు. నాకు అతని ప్రవర్తనకు ఆశ్చర్యం వేసింది. ఇప్పుడు విరోధంగా మాట్లాడాలో, స్నేహంగా మాట్లాడాలో గూడ తెలీలేదు. అంతలో అతనే ముందుగా మాట్లాడ్డం మొదలెట్టాడు. "మీ విషయంలో చాలా పొరపాటు జరిగింది. ఈమధ్య మీసంగతే నాకు తెలియలేదు."

ఏమనాలో తెలీక "అలాగా" అన్నాను.

ఇంతలో సుధ అందుకొని "చూచావా, మధూ, వాళ్ల నాన్నగారు తప్పంతా మీదేనన్నారుట!"

ఆశ్చర్యంతో "ఎలా" అన్నాను.

విధు అందుకొని "ఎన్నిసార్లు పిల్లను పంపమని కబురు చేసినా నిన్న పంపలేదు, ఇస్తానన్న కట్నం ఇవ్వకపోగా పిల్లనుగూడ పంపటం లేదని చెప్పి నన్ను వేరేపెళ్లి చేసుకోమన్నారు" అన్నాడు. నేను కొంచెం గొంతు సవరించుకొని "సరిగానే ఉంది. మా నాన్నగారిమీద ఆయన కసి తీర్చుకున్నారు" అన్నాను. సుధ అందుకొని, "కాని, మధూ, నీమీద కసితీర్చుకోవలెననే ఉద్దేశ్యం విధుకేమీ లేదు. నిన్న నేను చెప్పగానే అనుజ్ఞాపత్రం వ్రాసిఇచ్చారు" అంది.

విధు చిరునవ్వుతో "ఇందులో మాలాభం కూడ కొంత ఉంది" అన్నాడు.

"ఏమిటది?"

"నువ్వు వేరేపెళ్లి చేసుకుంటే నామూలాన ఒకస్త్రీ జీవితం పాడయిపోయిందనే విచారం నాకుండదు. మనోవర్తి ఇవ్వవలసి వచ్చిందనే కష్టం మానాన్నగారికి ఉండదు."

లోపలినుంచి 'టీ' వచ్చింది. అందరం టీ తీసుకుంటూ "సుధా, సాధ్యమైనంతత్వరగా బహుశా, పై వారంలోనే చేసుకుంటాను. తప్పకుండా వస్తావుకాదూ?" అంటూ విధువైపు తిరిగి "ఇక్కడే ఉంటారు కనుక మీరుగూడ సుధతోటి ఆ వేళకు..."

"ఓ, తప్పకుండా."

సుధదగ్గిరనుంచి అనుజ్ఞాపత్రం తీసుకొని వెళ్లిపోయినాను.

౫

భగీరథంతో నావివాహం సక్రమంగా జరిగిపోయింది. ఇంట్లో ఎవరూ అడ్డు చెప్పలేదు. మా ఆదర్శవివాహాన్ని ప్రకటిస్తూ పత్రికలన్నీ నన్ను "పునిస్త్రీ పునర్వివాహాన్ని వెలువరించిన ప్రథమాంధ్రస్త్రీ" నంటూ పొగుడుతూ వ్రాశాయి.



"ఇక్కడే ఉంటారు కనుక మీరు గూడ సుధతోటి ఆ..."

# నివేదన

త్రిపురాన వేంకటకృష్ణారావు దొర

క్రొత్తవి, సొంపుతో మనసుఁగొన్నవి, లోపలితేనెపొంతునై
కెత్తిన పూతలో వలపులీనుచు నున్నవి, కొన్నిచిన్ని పూ
గుత్తులు, క్రొత్తమక్కువలకున్ సరిపోయిన వేరితెచ్చి క్రొం
గ్రొత్తగ వీఁడు సిదుగుడిగువమ్మము చేరఁగ వచ్చె నమ్మరో!

పట్టిన దోసిటం గల నవప్రసవంబులు భక్తిసిక్తమై
నట్టి యెడంద పాదుగల యాశయవల్లికిఁ బూతరీతిఁ గ
న్పట్టఁగ నిల్చి, వీఁడు తన వాంచిన యాఁదల పట్టు మెచ్చి నీ
వెట్టి యనుంగుదీవనల నిచ్చెదవో యని పొంగిపోవుచున్.

గొనబుగులాబి క్రొందళుకు గుత్తులతోఁ దొలిగట్టుచట్టుపైఁ
దనరెడు బాలభానుని విధంబున నీ పొదిగట్టు మెట్టుపై
ననువుగ నున్న వీనిఁ గనినంతనె వీరఁదేమొ కాని తె
చ్చినవి సమస్తమున్ జిదిమిచిమ్ముచు రెమ్మొద రమ్మ భారతీ!

తీయని వీని మానసము తీపిని జూడరు వీనిఁ జేర రా
నీయరు వీరి కొక్కరికె యిన్నిట నీమది గూడ గుత్తమై
పోయినయట్లు వీ - రెవరో?—పూజరులంట బిఱాన వచ్చి తా
రే యఖిలాన కందు రవనీయరు వీనికి నెట్టి సేవకున్.

తగినవి నూతనంబులు గదా యని తెచ్చినవాని నన్నిటన్
గగనలతాంత మొక్కటియుఁ గాదఁట! యుత్పల చంపకవ్రజం
బగపడనైనఁబోదఁట! యపైన నపూర్వములంట! యేమి యూ
డిగముల నిట్టిచో మఱి ఘటింపఁగలాఁడమ! వీఁడు నీ కిటన్.

తడవులఁబట్టి పెద్దలు సుధాకలితంబుగఁ గ్రొత్త క్రొత్తవౌ
బెడఁగులు కూర్చి కూర్చి కడుఁ బేరిచి కట్టిన నీదు నింటి పెం
పెడలఁగఁ గతులంబెనుచు నిట్టివి యెట్టివి కల్గకుండ నీ
కొడుకుల దిద్దుకోత గదె? కూరిమి నందఱు నిన్ను గొల్వఁగన్.

---

# భారతదేశమున భీమాప్రచారావశ్యకత

ముల్లెల శ్రీరామమూర్తి

ప్రతి వ్యాపారము ప్రజల నాకర్షించుటకు మంచి పద్ధతులతో విరివిగా ప్రచారము జరుగుటావశ్యకము. అట్లు జరిగినప్పుడే ఆ యా ఉద్యమ తత్వములు ప్రజలకు బోధపడి వాటి యభివృద్ధికి తోడ్పడగలరు. ప్రస్తుతకాలమున భారతదేశమున రోజురోజుకు అభివృద్ధి యగుచున్న ఉద్యమములలో మానవ జీవిత భీమావిధాన మత్యంత ప్రాముఖ్యమైనది. అరువది సంవత్సరములనాడు మన భరతవర్షమున జీవిత భీమాకంపెనీలు స్థాపించుట కారంభించబడి నేటికి ౧౮౦ భీమాకంపెనీలవరకు పెరిగి మన దేశీయుల సౌజన్యమున జయప్రదముగ నిర్వహింపబడుచూ వివిధరకముల భీమావ్యాపారమును సాగించుచున్నవి. ముఖ్యముగ గత ౨౦, ౩౦ సంవత్సరములనుండియే మన దేశీయ భీమాకంపెనీలలో మంచియభివృద్ధి కలిగినది. భారతదేశమున భీమాకంపెనీల యభివృద్ధి యీవిధముగా జరిగినట్లు లెక్కలవలన తెలియుచున్నది.

| | | |
|---|---|---|
| ౧౮౯౮-౧౯౦౨ | వరకు | ౭ |
| ౧౯౦౩-౧౯౦౭ | , | ౧౮ |
| ౧౯౦౮-౧౯౧౨ | , | ౧౩ |
| ౧౯౧౩-౧౯౧౭ | , | ౨౨ |
| ౧౯౧౮-౧౯౨౨ | , | ౧౨౦ |
| | మొత్తం | ౧౮౦ |

ఈ అంకెలనుబట్టి భీమావ్యాపారము ఎంత యభివృద్ధిగనున్నదో, ఎంత ప్రాముఖ్యత వహించుచున్నదో స్పష్టమగుచున్నది. ఈకంపెనీల యభివృద్ధిసంఖ్యనుబట్టి మనము సంతోషింపకూడదు. పైన తెలిపిన ౧౮౦ భీమాకంపెనీలుగల భారతదేశప్రజల సంఖ్య ౩౫ కోట్లు. దాదాపు ౧౦ కోట్ల జనాభాగల అమెరికాదేశమున గత పది సంవత్సరముల నాటికి ౩౦౦ భీమాకంపెనీలు పనిచేయుచున్నవి. ఇప్పటి కాసంఖ్య చాల పెరిగియుండును. అమెరికాదేశ జనసంఖ్యను బట్టి భారతదేశమున ౧౦౫౦ భీమాకంపెనీలకు పైగా స్థాపన కావలసియున్నది. కనుక పాశ్చాత్యదేశములతో పోల్చిన మనదేశమున భీమావ్యాపారము, కంపెనీలు చాలతక్కువగనున్నవి.

మనదేశమున భీమా వ్యాపారాభివృద్ధికూడ యీదిగువ నుదాహరించినరీతిగ అభివృద్ధియైనది.

౧౯౧౩ సం. నాటికి అన్నికంపెనీల సాలీనా ఆదాయము ౧ కోటి ౨౬ లక్షల ౬౯ వేలరూపాయలుండి, ౧౯౨౬ సం. ఆఖరుకు ౩ కోట్ల ౩౧ లక్షల ౫౦ వేలరూపాయలకు పెరిగినది. ఇప్పటికి దీనికి రెట్టింపునకు పైగా సాలీనా ఆదాయము ఉండవచ్చును. కాబట్టి మనదేశమున భీమావ్యాపార మెంత యభివృద్ధి యగుచున్నదో విదితమగుచున్నది. అయితే విదేశములలో జరుగుచున్న భీమావ్యాపారమునకు, మనదేశములోని భీమావ్యాపారమునకు పోల్చిచూచినచో మనదేశమునకు స్థానమే లేదను వివరము ముందు రానున్నది.

ఇప్పుడు చర్చించవలసిన ముఖ్యవిషయమేమనగా, విదేశకంపెనీలవారు చాలమంది మన దేశమున ఏజెన్సీలు స్థాపించి యిప్పటికి కూడా భీమావ్యాపారమును లాగుచున్నారు. ౧౯౨౪ సం.కు పూర్వము మనదేశమున జరిగిన భీమావ్యాపారమున ౧౦౦ కి ౮౦ వంతులు విదేశకంపెనీలకు చెందుచుండెడిది. ౧౯౨౪ సం. నాటికి జరిగిన భీమావ్యాపారమున ౧౦౦ కి ౭౨ వంతులు మాత్రమే విదేశకంపెనీలకు చెందినది. అనగా చాలమార్పు జరిగినది. ఇప్పటికైనను ౧౦౦ కి ౩౦ వంతుల భీమావ్యాపారము విదేశీయులకు చెందుచున్నదని చెప్పవచ్చును.

మన భారతవర్షమున దేశీయకంపెనీలు విరివిగాలేని ఆరోజులలో విదేశకంపెనీలకు భీమావ్యాపారము పోయినదన్న మనము కుంద పనిలేదు. ౧౮౦ దేశీయ భీమాకంపెనీలు భారతవర్షమున దశదిశల స్థాపితమై జయప్రదముగ, నిర్విఘ్నముగ పనిచేయుచున్న యీ రోజులలోకూడ ౧౦౦ కి ౩౦ వంతుల భీమావ్యాపారము విదేశీకంపెనీలకు చెందుచున్నదనిన దీని కెవరు బాధ్యులు? దీని నరికట్టుట ఎట్లు? అను విషయమును చర్చించి విదేశీకంపెనీలకు మనదేశంలో నుంచి భీమావ్యాపారం దక్కకుండా కొన్ని సూచనలు చేయుటయే యీ వ్యాసము వ్రాయుటకుగల ప్రధానోద్దేశ్యమై యున్నది.

అసలు భీమాపద్ధతి ఆర్థికశాస్త్రమునకు సంబంధించినది. ప్రజలలో పరస్పర సహకారము నభివృద్ధి చేయగలుగుటయే దీని యథార్థము. విద్యాగంధము గలవారు కొంచెము తర్కించుకొని బుద్ధిబల ముపయోగించిన గాని దీనితత్వము కొంతవరకైన తెలియదవచ్చును. భీమా చేయుటలో మరణము సంభవించిన గాని ఫలితము కనబడదు. భీమా చేసినది మొదలు పట్టా రద్దు కాకుండ డబ్బు కట్టుచుండవలెను. అప్పటికప్పుడు సద్యోగర్భమువలె చేతిలో పడునది కాదు. ఏదో కొంతధైర్యమవలంబించి డబ్బు కట్టుచుండవలెను. దీనికి ఉదారత గూడ కొంత యుండవలెను. ఇట్టి తరి ఈభీమా రహస్యము సులభముగ అర్థముకాదని చెప్పక చెప్పుచున్నది. మనదేశ భీమావ్యాపారమును గూర్చియు, ప్రచారాభివృద్ధిని గురించియు చర్చించునప్పుడు భీమావ్యాపారమునకు పుట్టినిల్లయిన బ్రిటిష్ మున్నగు పాశ్చాత్యదేశములలోని భీమావ్యాపార, ప్రచారములను గూర్చి కూడ ముచ్చటించుకొనుట అతిముఖ్యమని తలచెదను.

ఈభీమావ్యాపారము తొలుత ఇంగ్లాండు దేశమున ౧౬౨౧ స. మున ప్రారంభించబడినది. వీరినిచూచి ౧౮౪౭ సం. లో భీమాపద్ధతి నేర్చుకొన్న అమెరికావారు యీనాడు నిఖిల ప్రపంచమున కెల్ల భీమావ్యాపారమున మకుటమువలె వెలుగుచున్నారు. కనడాదేశీయులు ౧౮౪౬ సం. మున స్వంతముగ భీమావ్యాపార కంపెనీలను స్థాపించుకొనిరి. ౧౮౮౧ సం. నాటికి జపానువారికి భీమా అంటేనే తెలియదు. మన భరతవర్షమున ౧౮౪౭ సం. మున మొదటి భీమాకంపెనీ స్థాపించబడినది. ఇప్పుడు అమెరికా ఇంగ్లాండు దేశములు ప్రపంచములోకెల్ల భీమావ్యాపారమున అత్యున్నతదశలో నున్నవి. ౧౯౨౦ నాటి భీమావ్యాపారమును బట్టి చూచినచో ౯౨౦ లక్షల జనాభాగల అమెరికాదేశమున ౨౪ వేల కోట్ల రూపాయిల భీమావ్యాపారమును, ౪౫౦ లక్షల

జనాభాగలిగిన బ్రిటనుదేశమున ౩౩౦౮ కోట్ల రూపాయిల భీమావ్యాపారమును, ౮౨ లక్షల జనాభా గలిగిన కనడాదేశమున ౧౫౦౦ కోట్ల రూపాయిల భీమా వ్యాపారమును, ౬౭౭ లక్షల ప్రజలు కలిగిన జపానుదేశమున ౧౦౦౦ కోట్ల రూపాయిల భీమా వ్యాపారమును అమలులో నున్నది. అప్పటికే ౩౧౦౦ లక్షలజనాభా గలిగిన భారతవర్షమంతటికిని ౬౦ కోట్ల రూపాయిల భీమావ్యాపారముమాత్రమే అమలులో నున్నది.

పై భీమావ్యాపారఅంకెలను దేశముల జనాభానుబట్టి సగటున భాగించినచో అమెరికాలో తలకు ౨౫౦౦ రూపాయిలు, కనడాలో తలకు ౧౩౮౦ రూపాయిలు, గ్రేటు బ్రిటనులో తలకు ౬౦౦ రూపాయిలు, ఇండియాదేశమున తలకు ౨ రూపాయిలు చొప్పున భీమావ్యాపారము అమలులో నున్నట్లు లెక్కలు చెప్పుచున్నవి. దీనినిబట్టి చూచిన భీమావ్యాపారమున మన భారతదేశము ఎన్నిరెట్లు వెనుకబడియున్నదో స్పష్టముగ కనుపించుచున్నది. ఏదేశములోనైనను ఏ ఉద్యమమైనను సామాన్యప్రజలలో కూడ చక్కగ వ్యాపించినపుడే ఆ ఉద్యమము తేజోవంతము కాగలదు. ౧౯౦ దేశీయ భీమాకంపెనీలు స్థాపింపబడి పనిచేయుచున్న యీకాలమునకూడ భారతవర్షము భీమావ్యాపారమున నిఖిలప్రపంచమున వెనుకబడియున్నది. ప్రపంచములో భీమాయను ఆకాశమున అమెరికా, ఇంగ్లండు దేశ సూర్యచంద్రులవలె వెలుగుచున్నవి. వా శమున అంత విరివిగా భీమావ్యాపారము జరుగుచున్ననూ తృప్తిలేక పాశ్చాత్యకంపెనీలవారు మనదేశమున ఏజన్సీలు స్థాపించి భీమావ్యాపారమును సంపాదించి తద్వారా సాలుకు కోట్ల రూపాయిలను ఏటేటను మనదేశము నుండి కొల్లగొట్టుచున్నారు. విదేశికంపెనీలవారికి మనదేశమున విరివిగ భీమావ్యాపారము జరుగుటలో మన దేశీయ భీమాకంపెనీలవారి ఉదాసీనత చాల యున్నదని చెప్పకతప్పదు. దీనికితోడు మనదేశము విదేశీయులచే పరిపాలింపబడుటయు, మన దేశప్రజలలో గల విద్యాశూన్యతయు, బాగుగ తోడైనదని కూడ చెప్పవలెను.

పాశ్చాత్యదేశములలో నూటికి ౯౦ మంది చదువు వచ్చినవారు గలరు. మన భారతవర్షమునందో నూటికి౧౧మందిమాత్రమే విద్యవచ్చినవారు గలరు విద్యాగంధము కలిగినవారిలో కూడ విశేషమంది పట్టణనగరవాసులైయున్నారు. భారతవర్షమున గల ౭ లక్షల పల్లె గ్రామములలో గల ప్రజలలో విద్యాశూన్యత తాండవము చేయుచున్నది. ప్రజలలో ఈ విద్యాహీనత నశించుటకు ప్రభుత్వము నిర్బంధముగ విద్యనేర్పు చట్టమును నిర్మించి అములులో పెట్టవలసియున్నది. కాని ఇంతలో మనదేశమున నిరక్షరత్వము నశించు సూచనలు లేవు.

ఇక భీమావ్యాపారమునకు సంబంధించినంతవరకు ౧౯౦ దేశీయ భీమాకంపెనీలవారు భీమాతత్వము ప్రజలలో వ్యాప్తిజెందుటకు ఏమైన ప్రయత్నించుచున్నారాయని విచారింప వలసియున్నది. పత్రికలలో ప్రకటనలు చేయుట తప్ప దేశీయభీమాకంపెనీలవారు చేయు భీమాప్రచార మిసుమంతలేదు. ఇప్పటివరకు మన దేశీయభీమాకంపెనీలకు జరిగిన, జరుగుచున్న భీమావ్యాపారము జీవితరథమును నడపుకొనుటకై పనిచేయుచున్న ఏజంట్లవలననేయని నిస్సంశయముగ ఘంటకొట్టి చెప్పవచ్చును. నూటికి ౯౦ మంది వరకు చదువు వచ్చిన ప్రజలుగల అమెరికా, ఇంగ్లడు మున్నగు దేశములలోనే యీరోజువరకూ ఆ దేశములభీమాకంపెనీలవారు స్వయముగావార, పక్ష, మాస పత్రికలను స్థాపించియూ, ప్రచారకులకు చక్కనితరిఫీదును కళాశాలలలో నొసగి, డిగ్రీలనిచ్చి అట్టివారిచే ప్రచారములను గావించియూ, వివిధరకములైన భీమా వ్యాపారరహస్యములు, లాభములు, ప్రజలకు భీమావలని కలుగుచున్న మేళ్లు తెలుపు పుస్తకములను ప్రకటించియూ, చౌకధరల కాపుస్తకములను ప్రజల కందించియూ, తేలికభాషలో సామాన్యులకు కూడ తెలియులాగున ఎప్పటికప్పుడు కరపత్రములను ముద్రించి గ్రామ గ్రామములకు పంపించియూ, క్లబ్బులను గ్రంథాలయములను స్థాపించియూ, తరచు పాటకచేరీలను జరిగించియూ, ఆనుపత్రులు, టెన్నిస్, బాడ్మింటన్ మున్నగు సంస్థలను క్రీడావిహారములను నిర్మించియూ, సామాన్య ప్రజలగు పల్లెటూరివారి నాకర్షింపగల మ్యాజిక్కులాంతరు ప్రదర్శన ఉపన్యాసముల ద్వారాను, ఇంక ననేకవిధములుగ విరివిగా భీమా ప్రచారము చేయుచూ తమ కంపెనీల భీమా వ్యాపారములను దినదినము అభివృద్ధి చేసుకొనుచూ, భీమా కంపెనీలవారు కొంతమొత్తమును ప్రత్యేకించి నీప్రజలకు వివిధరీతుల తోడ్పడుచున్నారు. పైన వ్రాసిన విషయములలో ఏవిధముగానూ మన దేశీయ భీమాకంపెనీలవారు ప్రచారము చేయుటలేదు.

అమెరికాదేశమున భీమాకంపెనీలవారివలన ప్రజలకు కలిగిన లాభములు వర్ణనాతీతము. అమెరికా భీమా కంపెనీలవారు తమ ధనమును తక్కువ వడ్డీలకు రైతులకు ఋణమిచ్చి వారి బాధలను తొలగించుచున్నారు. బీదలకు కొద్ది కొద్ది మొత్తములు అప్పుగానిచ్చి వారిగృహ నిర్మాణములకు తోడ్పడుచున్నారు. అమెరికా దేశప్రజలలో ౧౯౦౬ సం. నాటికి నూటికి ౧౨ మంది చొప్పుననూ, ౧౯౨౬ సం. నాటికి ౧౦౦ కి ౪౯ మంది చొప్పుననూ భీమాచేసుకొనిరి. ఒక్క అమెరికా దేశమున జీవితభీమాకంపెనీలు ౩౫౦ కి పైగా ఉన్నవి. మన భారతదేశీయ భీమా కంపెనీలవారు తమ జీవిత మంతయూ తమతమ కంపెనీలకు ధారవోసి, భీమావ్యాపారమును సంపాదించు ఏజంట్లకే అనేక అమానుష నిర్బంధముల నేర్పాటుచేసి, ఏదోసాకులతో వారికిచ్చు కమీషనులనే ఎగబెట్టుచూ, గట్టిగా అడిగిన ఏజన్సీలనే ఊడబెరుకుచున్నారు. ఇట్టిస్థితిలో పైన ఉదాహరించిన రీతిని పాశ్చాత్యదేశీయ భీమాకంపెనీలవారివలె ధనమును వెచ్చించి, మనదేశీయ భీమా కంపెనీలవారు పూనుకొని, భీమాప్రచారమును సాగించుట చాల అనుమానమే అయిననూ, అట్టి ఆవశ్యకతను బహిరంగముగ ప్రచారముచేయుట, కంపెనీలవారిని విమర్శించుచుండుట భీమాప్రచారకుల విధి యని తలచుచున్నాను.

పాశ్చాత్యదేశ ప్రభుత్వములు స్వాతంత్రము గల వగుటచే భీమాశాస్త్ర విషయమున కళాశాలలలో బోధించుచూ, ప్రత్యేక "భీమాశాస్త్ర పరీక్షలను" పెట్టి డిగ్రీలనొసగి భీమాశాస్త్రమును ప్రోత్సహించుచూ భీమావ్యాపారమునకు పూర్ణముగ తోడ్పడుచున్నారు. మన భారతదేశమున ౧౯౧౨ సం. రమున భీమా చట్టము చేయబడినది. మనదేశీయ భీమా కంపెనీల నుంచి భారతప్రభుత్వమువారు హామీగా బహు స్వల్పవడ్డీకి కోట్ల రూపాయిలను పుచ్చుకొనుచున్నారు. మన దేశపు విశ్వకళా పరిషత్తులలో ప్రభుత్వమువారు భీమాశాస్త్రమును ప్రవేశపెట్టలేదు సరిగదా భీమా ప్రచారకులకు వా



వల్లభాయి పటేలుగారికి మద్రాసులో స్వాగతము—౧. మద్రాసు సెంట్రలుస్టేషనువద్ద

౨. పురపాలకసంఘమువారును, మేయరుగారును పటేలుగారికి సమ్మానముచేసిన సందర్భమున



'డైసల్ కారు' అనబడు నిట్టిరైలుబండ్లను యం. యస్. యం. కంపెనీవారు క్రొత్తగా ప్రవేశపెట్టినారు. ఇవి క్రూడ్ ఆయిల్‌తో నడుచును. ఒక్కొక్క బండిలోను 110 ప్రయాణీకులకు జాగాయుండును.



లినో ముద్రణ యంత్రము అరవమునకు క్రొత్తగా తయారుచేయబడినది. అచ్చుకూర్చవలసిన యగత్యము లేకయే మామూలు టైపుయంత్రములోవలె టైపు చేయవచ్చును.



'క్వీన్ మేరీ'-బ్రహ్మాండమైన ఈ స్టీమరు లక్షలకొలది రూపాయలు వెచ్చించి నూతనముగా నిర్మింపబడినది. దీని నిర్మాణమునకు నెలల తరబడి ప్రయాసపడవలసి వచ్చినది.

పురపారిశుద్ధ్య ప్రచారసంఘము, చెన్నపురి



పడమటి గోదావరిజిల్లా మాధ్యమిక పాఠశాలోపాధ్యాయ వార్షికసభ, భీమవరము





సంక్రమణమండలములందు జరిగిన తుపానునష్ట నివారణకు పాటుపడుచున్న మద్రాసు మేయరుసంఘము



ప్రపంచయాత్ర సలిపి తిరిగివచ్చిన శ్రీ అరండేలు దంపతులకు మద్రాసు ఎగ్మూరుస్టేషనులో స్వాగతము

లేమియు జోక్యము కలుగచేసుకొనుట లేదు. విదేశీకంపెనీలవారు భారతదేశమున భీమా చేసుకొనకుండ అరికట్టుటకేమియు ఇండియా ప్రభుత్వము ప్రయత్నించుటలేదు. ఇందులకు కారణము తమ ఇంగ్లండు దేశపు భీమాకంపెనీల వ్యాపారము భరతవర్షమున నశించునేమో యనుభీతి వారి కుండవచ్చును.

ఏతావతా పైసందర్భములనుబట్టి మన దేశమున భీమా ప్రచారము చాల జరుగవలసి యున్నది. ఈ ప్రచారము దేశీయభీమాకంపెనీలవారందరు ఏకీభవించి, సాలుకు కొంత మొత్తము భీమా ప్రచారమునకై ప్రత్యేకించవలెను. ఆ మొత్తమును అఖిలభారత భీమా ప్రచార కేంద్రసంఘమేర్పరచి వారిస్వాధీనమున ఉంచవలెను.

పై అఖిలభారత ప్రచార సంఘమునకు భాషలనుబట్టి రాష్ట్రములవారీగా ఉప సంఘములను ఏర్పాటు చేయవలెను. కేంద్ర సంఘమువారికి ఎప్పటికప్పుడు దేశీయ భీమాకంపెనీల భీమా వ్యాపారాభివృద్ధి, క్లెయిములు మొదలగు వివరములు అన్ని కంపెనీలవారు పంపుచుండవలెను. వాటిని కేంద్ర ప్రచారకసంఘమువారు రాష్ట్రభాషలను బట్టి ఏర్పరుపబడిన ఉపసంఘములవారికి నివేదికలుగ తయారుచేసి పంపుచుండవలెను. రాష్ట్ర ప్రచారసంఘములవారు ఆవృత్తాంతములను దేశభాషలలో ముద్రించి పల్లెలలో బస్తీలలో, ప్రచారము జరుపుచుండవలెను. కేంద్రసంఘమువారు భీమాశాస్త్రమును గూర్చి నెలకు రెండు నెలలకు చిన్నపుస్తకములు ప్రకటించవలెను. వాటిలో పాశ్చాత్యదేశముల భీమా ప్రచారము, ఆదేశప్రజలకు భీమాపైగల అభిరుచి, వ్యాపారాభివృద్ధి ప్రచురించుచుండవలెను. భీమా శాస్త్రకోవిదులచే భీమా వాఙ్మయమును రచింపజేసి గ్రంథములుగ దేశభాషలలో తయారుచేసి ఉపసంఘముల ద్వారా పల్లెలలో భీమా ప్రచారము జరిగించవలెను. ప్రతి రాష్ట్ర ప్రచారసంఘమునకు కనీసము అనుభవనీయులైన ప్రచారకులు ౨౦ మందియైనను ఉండవలెను. దేశీయ భీమాకంపెనీలవారును, కేంద్రప్రచార సంఘమువారును ప్రభుత్వమువారిని వత్తిడిచేసి అమెరికా ఇంగ్లండు దేశములలోవలె, విశ్వకళాపరిషత్తులలో భీమాశాస్త్రపరీక్షలు పెట్టించుటకు యత్నించవలెను. అంతవరకు దేశీయ భీమాకంపెనీలవారే అట్టి పరీక్షల నేర్పాటుచేసి, భీమా ప్రచారకులను తయారు చేయవలెను. దేశీయ భీమాకంపెనీలలోనే భీమా చేయవలసిన అవశ్యకత, విదేశీ కంపెనీలలో భీమా చేసినందున మన దేశీయులకు కలుగు కష్టనష్టములను తెలుపు ప్రచారము చేయించి, విదేశీ కంపెనీలవారు మన దేశమునుంచి తీసుకుపోవు భీమా వ్యాపారమును అరికట్టవలెను. దేశభాషలలో నడువను భీమా ప్రచార పత్రికలకు కంపెనీలవారు, కేంద్ర ప్రచారసంఘమువారు ధనసహాయము చేయవలెను. ఈ రీతిగా బహుళ ప్రచారము జరుగుటకు ధనము ముఖ్యము. భీమాశాస్త్రకోవిదులైన భారతీయులు చాలమంది గలరు. ఇంత ప్రచారము జరుగుటకు దేశీయ కంపెనీలవారు పూనుకొని ప్రతిసంవత్సరము తమ తమ కంపెనీలనుంచి సాలుకు వేయిరూపాయలు ప్రచారమునకై ప్రత్యేకించి, కేంద్ర ప్రచారసంఘమేర్పరచి ప్రచారము సాగించుచో, బహుత్వరితకాలమున భరతవర్షమున భీమావ్యాపారము అభివృద్ధి కాగలదు. విదేశీయులకుపోవు భీమావ్యాపారము ఆగిపోగలదు. విదేశీకంపెనీలకు ౧౦౦ కి ౧ వంతు కూడ భీమావ్యాపారము పోనివ్వకూడదను దీక్ష దేశీయ భీమాకంపెనీలకు కలిగిననాడే మన దేశపుకంపెనీలు అత్యున్నతస్థాన మాక్రమింపగలవు.

రాష్ట్రప్రచారమున కేర్పరుపబడిన ప్రచారకులు ఎల్లపుడును పల్లెలలో సంచారము చేయుచూ భీమా 'ఢంకా'ను కొట్టుచుండవలెను. ఇంతటి బహుళమైనపనికి దేశీయ కంపెనీలవారు ఏకోన్ముఖులయి పూనుకొని పరస్పర సహకారవిశ్వాసములతో కృషి చేయకపోయినచో మన దేశమున భీమా ఉద్యమము బహు దీర్ఘకాలము వరకు ఉన్నతస్థితికి రాదు. విదేశీకంపెనీలవారు ఏదో విధముగ తమ వ్యాపారమును సాగించుచు మన దేశీయుల ధనములను దోచుకొనిపోగలరు.

భారత దేశీయ కంపెనీలవారు నాయీ సూచనలను కొంతవరకైనను అమలున పెట్టి పనిజరుపుచో భారతదేశమున భీమావ్యాపారమభివృద్ధి గాంచగలదనే ఆశతో యీవ్యాసమును ముగించుచున్నాను.





పాగనులోని

# ఆనందదేవాలయము: భారతీయ శిల్పచాతురి

కె. నరసింహాచారి

ప్రస్తుతము హిందూ దేశమునకును బర్మా దేశమునకును గల సంబంధము 'బాదరాయణ సంబంధ'మని చెప్పవచ్చును. ఇంకొకవిధముగా జెప్పినయెడల 'మీ యబ్బ మా యబ్బ ఓ యబ్బ!' అన్నటువంటిది. బర్మాదేశీయులకును అచ్చటి భారతీయులకును వాత్సల్యము తగ్గుచువచ్చుచున్నది; మాత్సర్యమెక్కుడగుచున్నది. ఇది కాలానైన రీత్యమేమో! మానునట్లుండినది కాదు. భరతఖండము విజ్ఞానాధికులకు పుట్టినిల్లు. అట్టి విజ్ఞానాధికులలో నొకరగు గౌతమబుద్ధుని మతమే కదా ఈ నాటివరకును బర్మా, చీనా, జపాను దేశీయుల మతమై యొప్పుచున్నది. ఇది కాక ఆ కాలమున, ఆ విదేశములవారు భారతదేశమునకు వచ్చియే కదా సకలశాస్త్రపారంగతత్వము సంపాదించుకొని పోవుచుండిరి. భారతీయ శిల్పము, భారతీయకళలు వారి నాకర్షింపగలిగినవి. ఆ కారణమున వారికి భారతీయులన్న స్నేహభావము మాత్రమే కాక గురుభావముగూడ నుండెను. భారతీయులన్నా దేశములో నతిపూజ్యభావముండెను, అందు బౌద్ధమతము ప్రబలిన తరువాత భారతీయబౌద్ధులన్నా దేశమువారికి కానరిది కన్నట్లయియుండెను.

ఇందులకు తోడు ఒక కాలమున బర్మాదేశము భారతీయ ప్రభువుల యాధిపత్యమునకు లోనై కూడ నుండెను. అప్పుడు అనేకులు భారతీయులు బర్మాదేశమునకు వలసపోయి బర్మీయులైపోయిరి. వారచట శిల్పులుగను, వణిజులుగను, గురువులుగను నుండిరి.

క్రీస్తుశకము ౮ వ శతాబ్దమునుండి హిందూదేశమున బౌద్ధమతము క్షీణింపసాగెను. అప్పుడనేక బౌద్ధులకు బర్మాదేశమునకు వలసపోవలసినట్లేర్పడెను. శ్రీ శంకరాచార్యులు హిందూదేశమున బౌద్ధమతము నంతమొందించిరని చెప్పవచ్చును. వారియనంతరము శైవమతావలంబియగు రాజరాజను చోళదేశాధిపతి దక్షిణ హిందూదేశము నాక్రమించి సింహళమును గూడ జయించిన కాలమునను, తర్వాతను అచటి బౌద్ధశిల్పులేమి, కర్మకారులేమి, విద్యార్థులేమి, మతాచార్యులేమి బర్మాదేశము నాశ్రయముగ జేసికొనవలసినవారైరి. బర్మాదేశము వారికి నిలువనీడ యొసగెను. ఈ కారణమున సుమారు ౧౧ వ శతాబ్దము నుండి బర్మాదేశమున భారతీయ బౌద్ధశిల్పవృక్షము వేరూని వృద్ధినందసాగెను. ఆ కాలమువఱకును హిందూస్థానమున ప్రబలియుండిన దారుశిల్పవిద్య క్రమముగా క్షీణింపమొదలిడి, బర్మా దేశమున తలయెత్తనారంభించినది. మౌర్య, గుప్తరాజుల పోషణ క్రింద వృద్ధిపొందిన దారుశిల్పోదాహరణములు ప్రస్తుతము భారతదేశమున కానరాకుండినను, వలసపోయిన భారతీయులవలన బర్మాదేశమున ఉన్నతదశకు తేబడి, యిప్పటికిగూడ కన్నులపండువుగ నానందించుటకవకాశములు కలుగజేయునవై యున్నవి. ఈ దారుశిల్పము కాలక్రమముగ నశించి, శిలాశిల్పము ప్రబలి, యదియు ప్రస్తుతము నశించి సిమెంటు రీయిన్‌ఫోర్స్డు కాంక్రీటు (Reinforced concrete) శిల్పముగా మారిపోవుచున్నది.

పాటలీపుత్రమున అశోకుని కాలమునాటి మందిరములు దారు నిర్మి



౧. మాయాదేవి శిరోలంకారములు



౨. కటిభాగమునందలి ఆభరణములు



౩. కర్ణాభరణములు

తములైయుండినట్లు నిదర్శనములు కలవు. భరతఖండమున బౌద్ధమతము క్షీణించినందున బౌద్ధ విహారములు, సంఘారామములు, స్తూపములు ఇత్యాదులుగూడ మతము పోయినదారిని బోయి బర్మాదేశము నాశ్రయించినవి. పూర్వపు భారతీయబౌద్ధ సంఘారామముల తీరు చూడవలెనన్న ఇప్పటికిని బౌద్ధమతము ప్రధానముగా గల బర్మాదేశమున జూడవచ్చును.

అందు పాగన్‌లోని దేవాలయములును, గోపురములును, అమరపురములోని సంఘారామములును చూడదగినవి. పాగన్‌లోని ఆనంద దేవాలయము వాటిలో పేరుగన్నది. దానినిర్మాణమునుగుఱించి, ఇంద్రుడును, విశ్వకర్మయును, నల్వురు మహాలోకపాలురును, సరస్వతియును అందులకు తోడ్పడిరని ఐతిహ్యము కలదు.

కొందఱు బౌద్ధ-అర్హతులు హిమాలయదేశమునుండి పాగన్‌కు వెళ్లిరి. వారు పాగన్ నగరవీధులలో భిక్షాటన మొనరించుచుండగా పాగన్ రాజగు క్యాంజిత్థ (క్రీ. శ. ౧౦౮౪-౧౧౧౨) వారిని చూచుట తటస్థించగా వారి వేషభాషలవలన గౌరవనీయులుగా నెంచి, అంతఃపురమునకు రావించి అతిథిసత్కారములగావించి, వారెచ్చటనుండి వచ్చినదియు, పుట్టుపూర్వోత్తరముల గుఱించియు విచారించెను. వారు హిమాలయమునందలి నందమూలపర్వత గృహారామము నుండి వచ్చితిమని చెప్పగా సంతసించి, వారి యాలయరూపనిర్మాణములగుఱించి విశదముగా తెలిసికొని అట్టి ఆలయమును నిర్మింప సంకల్పించుకొని ఆనంద దేవాలయమును నిర్మింపించెను. ఈ దేవాలయము క్రీ.శ. ౧౦౯౦ యందు కట్టబడెను. దీనిని కట్టినవెంటనే ప్రతిష్ఠోత్సవసమయమున క్యాంజిత్థుడు (త్రిభువనాదిత్య ధర్మరాజబిరుదాంకితుడు) స్వయముగా నాయత్నములను జరిపించెను. అతడు గజారూఢుడై బ్రాహ్మణ పురోహితులతోను, బౌద్ధ సన్యాసులతోను పరివేష్టింపబడి దేవాలయమునకుపోయి వారిసహాయమున ప్రతిష్ఠోత్సవములను సంపూర్ణముగా జరిపించెను.

ఆనంద దేవాలయము అందలి యప్రతిమానసుందర చిత్రములవలనను, శిలావిగ్రహములవలనను బర్మాదేశమునందంతటను ముఖ్యమయియున్నది. అది ౨౧౦ అడుగుల పొడవును, అంతియె వెడల్పును గలిగి, నలుప్రక్కలను ముందునకు మీఱివచ్చియుండు మూలకప్పులుగల ద్వారమంటపములతో ప్రకాశించుచున్నది. పైకి పోనుపోనుఒక్కొక్క అంతస్తును చిన్నదగుచు తుదకు మిక్కిలి చిన్నదగు నొకశిఖరమును కలిగియున్నది. ఆలయమునందలి యడుగుభాగమున బుద్ధుని జ్ఞానసంపాదన చరిత్రములును, మారుడు బుద్ధునిపై దాడిచేయుటయు, బుద్ధుని జయమునకు దేవతలు ఆయనను పూజించుటయు చిత్రింపబడియున్నవి. రెండవయంతస్తున ౫౩౭ జాతక కథలు కలవు. ఇతర దేవాలయములం

రెండును లేని యొక్క గొప్ప విశేషాంశము ఆనంద దేవాలయమున గలదు. అవి వేదన, కడసటి పదిజాతకములును ఒక్కొక్కటి ౧౮-౨౦ చిత్రములలో జూపబడియుండుటయే. ఒక్కొక్కచిత్రముక్రిందను ౧౨ వ శతాబ్దపు బర్మాదేశభాషయందు వర్ణనలు కలవు. ఆలయమునందంతటను ఇట్టి ఉబ్బెత్తుచిత్రములు ౧౪౭౨ కలవు. భూమ్యుపరిభాగమున గట్టబడియు దాని నిర్మాణకౌశలమువలన అందు ప్రవేశించు వెలుగు తక్కువయగుటయు, అందువలన అది యొక గుహాలయమో యను భ్రమ పుట్టించగలిగియున్నది. ఆలయములోపల అనేకమైన ఇఱుకు మార్గములు సమాంతరములుగా పోవుచుండును. వీటికి అడ్డముగా ఇంకను ఇఱుకైన మార్గములు అల్లికవలె వ్యాపించియున్నవి. గవాక్షములకెదురుగనుండు మార్గములు మిగుల నిఱుకైనవి. ఈ మార్గముల గుండా సౌమ్యమగు వెలుగు లోపల ప్రవేశించును. ఈ ఇఱుకుమార్గముల కడ్డముగా ద్వారమంటపమునుండి వెడల్పుమార్గములు కలవు. అడ్డదిడ్డముగాబోవు సమార్గము లనేకము లుండుటవలన మధ్యమధ్యనుండు గోడభాగములు గోడలుగా గానబడక బలిష్ఠములగు స్తంభములవలె గానబడును. ప్రతిద్వారమంటపమునుండియు వచ్చు మార్గమునకెదురుగా ఆలయమధ్యమున నొక బ్రహ్మాండమైన స్తంభమువలె నేర్పడియుండుభాగమున నాలుగు ముఖములను నాలుగు మహాబుద్ధవిగ్రహములు కలవు. ఇవి యొక్కొక్కటి ౩౦ అడుగుల యెత్తుండును. వీటి పరిమాణమును బట్టి వీటిని కట్టియుండు గూడులు గల ఆ మధ్యస్తంభ మెంత బ్రహ్మాండమైనదియో యూహించవచ్చును. చిన్నదగు పైయంతస్తునుండి యీ విగ్రహములపై వెలుతురు పడునట్లుపర్పాటుగలదు. ఈ నాలుగు విగ్రహములును ఈ భద్రకల్పమున నవతరించిన నలుగురు బుద్ధులయొక్క రూపములు. ఇవియుండు గూడులు గల ఆ గొప్ప మధ్యస్తంభము మహోన్నతమై పైయంతస్తుల కాధారమై శిఖరము వఱకును గలదు. వెలుపటిగోడకు లోపల మఱియొక గోడ కలదు. ఈ రెంటికిని మధ్యగల మార్గము పొడవునను బుద్ధుని జీవితమును వర్ణించు శిలావిగ్రహములు అనేకములు కలవు. అవన్నియు వెలుపటిగోడయొక్క లోవైపున గూడులందున్నవి. అవి వరుసకు ౨౦ విగ్రహములవంతున రెండువరుసలలోను కలవు. ఒక్కొక్క విగ్రహమును సుమారు ౪ అడుగుల యెత్తుగల రాతియందు మలచబడి ౩ అడుగుల ఎత్తుమొదలు ౪ అంగుళములపర్యంతము పరిమాణభేదములు గలిగియున్నవి. ప్రతిశిల్పమునందును ప్రధానపాత్రలు పెద్దవిగను, చిల్లరపాత్రలు చిన్నవిగను మలచబడియున్నవి. ఇవి ప్రదక్షిణముగా జూచుచు పోయినయెడల వరుసగా తుషితస్వర్గమునందు దేవతలు బోధిసత్త్వుని కడపటి యవతారమగు బుద్ధుడుగా నవతరించుమని ప్రార్థించుట యాదిగా గలవు. ప్రతిమార్గమును నిట్లే ఇరుప్రక్కలందును శిలావిగ్రహములు


౪. చేతికడియములు, దండకడియములు

౫. కిరీటము



౬. తుషిత స్వర్గమునందు దేవతలు బోధిసత్త్వశ్వేతకేతుని ప్రార్థించుట





౭. మహారాణులు మాయాదేవికి మజ్జనాద్యుపచారములు చేయుట



౮. లంబినీవనమున మాయాదేవిసాల వృక్షశాఖనుబట్టుకొని నిలిచియుండుట

గల గూళ్లతో నిండియున్నది. ఇవి కాక, ద్వారమంటపములు నాలుగింటియందును పదునాలేసి విగ్రహములు కలవు. గవాక్షముల కెదురుగనుండు ఇఱుకుమార్గములందు జాతక కథల శిల్పములు కలవు. ఇవి (?) అడుగు యెత్తుగలిగి మార్గమునకు నాలుగేసి కలవు. ఇందనేకములు ఒకదాని నొకటి పోలి చర్విత చర్వణముగ కాన్పించును. శిల్పములలో ముఖ్యమైనవి రెండు కలవు. ఇవి రాజగు క్యంజిత్థునిదియు, హీనయాన మతగురువగు పిన్ అరహాన్ అను సన్యాసిదియు నైయున్నవి.

### శిల్పస్వభావము

శిల్పము లన్నియు మధ్యకాలము నాటివై, భారతీయశిల్పులచే మలచబడిన వైయున్నవి. ఒకదానినుండి మరియొకటి విశేషముగా భేదపడకుండుటవలన శిల్పులు విశేషనైపుణ్యముగలవా రని యెంచుటకు వీలులేకున్నవి. అట్లుండినను ఉండవచ్చును. లేక వేలకొలది శిల్పములను చేయవలసివచ్చినపుడు, ఒకేమాదిరిగ ననేకశిల్పము లేర్పడియుండుట సహజ మగుట కారణముగా నుండవచ్చును. విగ్రహములు మొత్తమున నంత శిల్పనైపుణ్యమును వెలిపుచ్చకపోయినను, కొన్నింటియందు గల కిరీటాద్యలంకారములును, సింహాసనములును, ఆభరణములును, సిగముడులును మిక్కిలి జాగరూకతతోను, శ్రద్ధతోను మలచబడియున్నవి (చిత్రములు ౧ మొదలు ౯ వఱకు). కొన్నివిగ్రహములందు ముక్కు, పెదవులు కడు నందముగా మలచబడియున్నవి.

హిందూదేశమునందలి బుద్ధ విగ్రహములకువలెనే ఈ ఆలయమునందు గల బుద్ధవిగ్రహములకును తిరునామములు ప్రధానములుగా మలచుట శిల్పులకు సహజమైనది. కొన్నిచోట్ల అసందర్భముగ గూడ తిరునామములను మూపయందును జూడనీ శిల్పులు పెంచిన్నయును పాటించుటయందు శ్రద్ధ వహించలేదన వచ్చును. కొన్నిచోటులందు అడవిని చూపునపుడు అంతఃపురమును గాని దేవాలయమును గాని శిల్పమున ప్రవేశపెట్టిరి. శిల్పులు తమకిష్ట మున్నయెడల నేర్పరితనమును జూపగలుగుదు రనుటకు కొన్నిశిల్పములు నిదర్శనములుగా కలవు. మొత్తమునకు శిల్పముల సంఖ్య యెక్కువగా నుండుటవలన గూడ అనేకములు ఒకేతీరుగ నుండుట తటస్థించును. గౌతముడు పురపీథులందు వాహ్యాళి పోవు శిల్పమున (చిత్రము ౧౦) రథమునకు వెనుకటి రెండు చక్రములుమాత్ర ముండి ముందుప్రక్క రథమును లాగవలసిన గుఱ్ఱములు రథమును మోయునట్లు దానిక్రింద చూపబడియున్నవి. ఆభరణములు అన్ని శిల్పములందును కడుసొంపుగా మలచబడియున్నవి.

౧వ చిత్రము నందు మాయాదేవి యొక్క శిరోలంకారములు కలవు. ఇది యొక శిల్పములోని యొకభాగము యొక్కచిత్రము. ఎడమ ప్రక్క నున్న (?) మాయాదేవి శిరోజములను నువ్విగ కొండెగా ముడిచియు, మఱియొక్క...

ఆభరణములను పట్టియు నైయున్న చున్నారు.

౯-వ చిత్రమునందు కటిభాగపు ఆభరణములు లేవు. వెండి నూలు లేవు, గొలుసులేవి, మణులేవి సము శృంగారవంతముగా మలచబడియున్నవి. ఇది బౌద్ధసన్యాసి శిల్పములో నొక భాగము. ఇట్లనే మూర్తులకు నాభరణములను, కిరీటములను, వేణి యలంకారములను, దండకడియములను ౬, ౭, ౫ చిత్రములందు కలవు. క్రీస్తుశకారంభమున నిట్టి శిల్పపద్ధతి జనాదరణకు దూరమగుట సంభవించినది కాబోలును.

భారతీయ శిల్పవిద్యాపారంగతులు అభివృద్ధిగాంచెదమనెను, వెనుకటి కాలము నాగరికతను వారి యాలయములను కట్టి యందు సనాతన తేజముండుటవలనను నిట్టి శిల్పములు నానాటికి నామమాత్రావశిష్టములగుచున్నవి.

ఆనంద దేవాలయమునందలి శిల్పములు బుద్ధభగవానుని జీవచరిత్రకు సంబంధించినవి యుండుటవలన వీటి నన్నిటిని మనగూర్చి బుద్ధుని జీవితచరితమును వ్రాయుట సాధ్యమగును. ఒకానొక బౌద్ధభిక్షువు ఈ శిల్పములందలి కథాసారమును దేవాలయమునకు వచ్చు భక్తులకందఱకును సుబోధకముగా నుండుటకుగాను ఒక్కొక్క శిల్పమునకు క్రింద కథాసారమును సద్విరూపమున బర్మాభాషయందు పలకలపై వ్రాయించి యుంచియున్నాడు. కొన్ని ముఖ్యములగు శిల్పములు చిత్రములను, అందలి కథాంశములను ఇచట కలవు.

చిత్రము ౮: తుషిత స్వర్గమునందలి దేవతలు భగవంతుని ప్రార్థించుట. ఇరువురు దేవప్రతినిధులు 'బోధిసత్త్వ శ్వేతకేతు'ను భూలోకమున నవతరించుమని ప్రార్థించగా బోధిసత్త్వుడు సమ్మతించుట ఇందు కలదు. ఈ శిల్పమునందలి ఆలయము వంటిది మన దేశమున నేపాళదేశములో కలదు. ఈ విధమగు ఆలయములు చీనా, జపాను దేశములలోనే కలవు. కాలక్రమమున నీవిధమయిన శిల్పము చీనానుండి భారతదేశమునకును, ఇటనుండి బర్మాకును వ్యాపించి యుండవచ్చును.

చిత్రము ౭: గౌతముని తల్లియగు మాయాదేవికి గలిగిన స్వప్నప్రకారము ప్రపంచమున కధిపతులగు నలుగురు మహారాజులు, లేక లోకపాలకులు చేరి, తన్ను మంచముతోగూడ హిమాలయమునందలి అనవతప్త సరోవరమునకు సమీపమునగల 'మనోశిల' యను పీఠభూమికి గొనిపోయి అచ్చట నొక సాలవృక్షము క్రింద విడిచి యవలికి పోయినట్లును, తర్వాత వారి రాణులు నల్వురును వచ్చి మాయాదేవిని అనవతప్తసరోవరమునకు గొనిపోయి మజ్జనమాడించి, మానవజన్మముయొక్క పాపములను పోగడిగి, దేవసంబంధములగు వస్త్రాభరణములతో నలంకరించుట ఈచిత్రమున కలదు. సరోవరమును సూచించుటకుగాను శిల్పమున రెండుప్రక్కలందును తామరతూడులును, వాటిపై చిలుకలు వ్రాలియుండుటయు కలవు. ఈ శిల్పులు జంతు, పక్షి, వృక్షరూపములను మలచుటలో ప్రజ్ఞావంతులని చెప్పవచ్చును. (౧౧ చిత్రము నందలి అశ్వచిత్రము జూడుడు.)

౯. కాలదేవల ఋంషి శుద్ధోదనుని జూడవచ్చుట

౧౦. గౌతమునికి వృద్ధు డెదురువచ్చుట



౧౧. సిద్ధార్థుడు కాంతకారూఢుడయి పురము నుండి నిర్గమించుట



౧౨. గౌతముడు శిరోజములను కోసివేసికొనుట

బౌద్ధశిల్పము లన్నింటియందును స్త్రీ పురుష విగ్రహములందు వస్త్రాలంకారములు నడుమునకు క్రిందమాత్రమేయుండును. వక్షోభాగమంతయు ప్రచ్ఛన్నము కాక ఆభరణమాత్రపూరితమై యుండును. స్త్రీ విగ్రహములందు వక్షోరుహములు అనాచ్ఛాదితములైయుండుట ఇప్పటి మలయాళదేశమునందుండెడి యాచారమునకు దృష్టాంతమైయుండుటను సూచించును. బౌద్ధకాలమునందు కంఠాభరణము లెక్కువగా నుండెడివి. చేతులకు అనేకవిధములగు గాజులును, దండలకు కడియములును గూడ ముఖ్యమగు ఆభరణములు. వస్త్రములు నడుమునుండి చీలమండలవఱకును జీరాడుచుండును. శిల్పులు వస్త్రములందు మడతలు చూపకుండుటవలన కాళ్లవద్ద వస్త్రమున్నట్లుగనే తోచదు. కాళ్లప్రక్కలందుగల యొకటిరెండు మడతలే వస్త్రమును సూచించుట కాధారములు. పురుషులకు వస్త్రములు మోకాళ్లవఱకుమాత్రము కలవు. ఆ కాలమునాటి ఆభరణములు కొన్ని ౧-౫ చిత్రములందు కలవు.

చిత్రము ౮: ఆనందదేవాలయమునందలి యుత్తమ శిల్పములలో నిది యొకటి. మాయాదేవి లుంబినీవనమునకు బోయినపుడు అచ్చట నొకసాలవృక్షశాఖను బట్టుకొని నిలిచియుండగా బుద్ధుడు జన్మించును. చిత్రమునందు మాయాదేవి వృక్షశాఖను కుడిచేతితో బట్టుకొని యున్నది. ఎడమచేతితో సహోదరియగు మహాప్రజాపతినికౌగిలించుకొని యామె యాధారమున నిలిచియున్నది. మహాప్రజాపతి ప్రక్క నొక చెలికత్తె యొక చేతిలో చామరమును బట్టుకొని, మరియొకచేతిలో నాసనద్రవ్యమును బట్టుకొనియున్నది. మాయాదేవి కుడిప్రక్క నలుగురుమహాలోకపాలకులు శిశువును చేతులలో బట్టుకొనియున్నారు.

చిత్రము ౯: గౌతముని జననానంతరము త్రయస్త్రింశ స్వర్గమున దేవతలు "కపిలవస్తు నగరమున శుద్ధోదన రాజునకు పుత్రోదయమైనది. ఒకనాడాపుత్రుడే జ్ఞాన రాజ్యాధిపత్యమును వహించి బుద్ధుడగు"నని ఆనందాబ్ధి దేలుచుండిరి. అట్టి తరుణమున కాలదేవలుడను ఋషి, శుద్ధోదనుని గురువు, త్రయస్త్రింశ స్వర్గమున నుండుట తటస్థించినందున వారి సంతోష కారణ మెరిగినవాడై భూలోకమునకేగి శుద్ధోదనునిజూచి పుత్రుని జూపుమని కోరెను. రాజు పుత్రుని గురువునాశీర్వాదము నందదేగా ఆబాలుడు తన పాదములను ఋషిశిరమునందుంచెను. దాని భావమును గ్రహించి యాబాలుడు తనకన్న జ్ఞానాధికుడని ఋషి లేచి నిలిచి యాబాలునికి నమస్కరించెను. ఋషికి రెండు జడముడులు కలవు. ౫ న శతాబ్దమునకు ముందు ఋషులు రెండు జడముడులను గలిగియుండుట యాచారమై యుండెను.

చిత్రము ౧౦: గౌతముడు రథారూఢుడై పురవీథులలో బోవునపుడు గలుగు దుఃఖకారణములగు నాలుగు దృశ్యములలో నొకటగు వృద్ధ దర్శనము ఇందు కలదు.



సాహిత్య-కళాసంఘము, చెన్నపురి—ప్రారంభోత్సవము



చెన్నపురి లయోలాకళాశాల ఆంధ్రవిద్యార్థిసంఘవార్షిక సమావేశము



చెన్నపురిలో దక్షిణభారతవైశ్యసంఘముయొక్క సారస్వతశాఖ ప్రారంభోత్సవము



లక్నో ఆంధ్రసంఘము ౧౯౩౮



ఆంధ్రవిశ్వకళాపరిషత్తు: వేదాంతశాస్త్ర విద్యార్థిసంఘము



ఆక్సుఫర్డులో ప్రాచ్యమతాధ్యాపకుడుగ నియమింపబడిన సర్ యస్. రాధాకృష్ణన్ గారికి చెన్నపురి ఆంధ్రుల అభినందన సమా[illegible]



కోపెన్‌హాగన్‌లో జరిగిన భాషాతత్వశాస్త్ర మహాసమ్మేళనమునకు చెన్నపురి విశ్వకళాపరిషత్తు తరఫున వెడలి తిరిగివచ్చిన చేకమల్ల రాజగోపాలరావుగారికి సెంట్రలుస్టేషనులో స్వాగతము

# మదరాసు అసెంబ్లీ, కౌన్సిళ్ల ఆంధ్ర కాంగ్రెసు సభ్యులు



[illegible]



[illegible]



పి. వీరభద్రస్వామి



సాకేటి గురువులు



పుల్లెల శ్యామసుందరరావు



చల్లా నరసింహం



వి. వి. గిరి



భాస్కరరావు పట్నాయకు



డి. వెంకటరామస్వామి




వి. జగన్నాథగుప్త



తెన్నేటి విశ్వనాథం



బులుసు సాంబమూర్తి

## మదరాసు అసెంబ్లీ కౌన్సిళ్ల ఆంధ్ర కాంగ్రెసు సభ్యులు



[illegible] ంకటనారాయణరెడ్డి



యం. నారాయణరావు



నడింపల్లి సుబ్బరాజు



కాశీనాథుని పూర్ణమల్లికార్జునరావు



డి. లక్ష్మీనరసింహరాజు



ఒ. లక్ష్మణస్వామిరావు



టి. యస్. రామకృష్ణారెడ్డి



యన్. రంగారెడ్డి



శ్రీ కమతం షణ్ముగం



హెచ్. సీతారామరెడ్డి



జి. వెంకటరెడ్డి



డి. గోవిందదాసు

## మదరాసు అసెంబ్లీ కౌన్సిళ్ల ఆంధ్ర కాంగ్రెసుసభ్యులు



మల్లిపూడి పళ్లంరాజు



దేవత శ్రీరామమూర్తి



బయ్యా సూర్యనారాయణమూర్తి



వి. వి. నరసింహం



లక్కరాజు సుబ్బారావు



కె. వి. ఆర్. స్వామినాయుడు



భారు రాజారావు



కళా. వెంకట్రావు



మాగంటి బాపినీడు



గొట్టిముక్కల వెంకన్న



శ్రీమతి గంధం అమ్మన్నరాజా



వి. గంగరాజు

# మదరాసు అసెంబ్లీ కౌన్సిళ్ల ఆంధ్ర కాంగ్రెసు సభ్యులు



దండు నారాయణరాజు



కాట్రగడ్డ వెంకటనారాయణరావు



వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదరావు



అయ్యదేవర కాళేశ్వరరావు



కల్లూరి చంద్రమౌళి



కొండా వెంకటప్పయ్య



పోతుల బుచ్చప్ప నాయుడు



అవుతు రామిరెడ్డి



పుష్పూటూరి పున్నారావు



రేబూరి సుబ్బరామరెడ్డి



ఓరుగంటి వెంకటసుబ్బయ్య



బెజవాడ గోపాలరెడ్డి

[illegible] కల్పి నాధారముగాగాని రథమున [illegible] వచ్చుచున్నాడు. రథముముందుభాగము మకరమును [illegible] అ[illegible]దముగానున్నది. మకరశిర మునుండి [illegible] ముకటి గాలి [illegible]నాడుచున్నవి. సారధియగు ఛన్నుడు [illegible]నమును సాగించుచు న్నాడు.

[illegible] చిత్రము నందు బోధిసత్త్వుడు ([illegible]) అశ్వారూఢుడై కపిల వస్తునగరమును వీడి తపమాచరించ [illegible]. ఛన్నుడు అశ్వము [illegible]కను బట్టుకొనియున్నాడు. [illegible] నాయశ్వముయొక్క [illegible], ఖురధ్వానములుగాని, [illegible] చిత్రమున [illegible]వస్తువాను [illegible] విగ్రహమనుటకు [illegible] గలుగుదు [illegible] దేవతా[illegible] కొంతొక [illegible] చేతుల్లపై [illegible] పోవుచున్నాడు. [illegible] మిగుల నంద [illegible] యొకటి.

చిత్రము [illegible]: సన్న్యాసియగుటకు [illegible]మకొనిన గౌతముడు తన ఖడ్గముతో శిరోజములను గోసి కొనుట. ఇదియు నొక యందమగు శిల్పము. ఇట్టి శిల్పములెన్ని యోగల [illegible]నంద దేవాలయము బర్మాదేశము నందలి [illegible]లయములలో ముఖ్య మయినది. ఇట్టి ముఖ్యమగు ఆలయ ములో[illegible] శిల్పము లాకాలమున భార తీయశిల్పులచే మలచబడిన వని వినుట ఎవరికి సంతోషకారణము కాకమానును?

---

# అ ను న య ము

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

నా చిన్ని పాత్రికను
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

ఎన్ని మధుమాసములు ?
ఎన్ని ప్రభాతములు ?
ఎన్ని పూవులు విడిచె ?
ఎన్ని పూవులు వాడె ?
నిండ నేలేదు నా
చిన్ని పాత్రిక యింక
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

నా చిన్ని పాత్రికను—
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

పొదలడొంకల విరియు
పూవు పూవుకి పోయి
కణకణమ్మును దీసి
నింపుకొను మన్నాను
నవ్వించకోయి ! నను
కవ్వించకోయి ! నను

తొణికిపోయిన కణము
దొరకదు కొంతో శ్రమను
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

నా చిన్ని పాత్రికను
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

మధుకణములతో నిండి
విడచినవి పూలన్ని—
అపుడె సీతాకోక
చిలుకలును తుమ్మెదలు
కొనిపోవ వేగపడి
పరుగిడుచునున్న యవి
ఆలసించిన బిందు
వయిన దొరకదు నిజము !
వేగపడవలెనోయి !
వేళ యిక లేదోయి !

నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!

నా చిన్ని పాత్రికను—
నింపుకొననీవోయి !
నింపుకొననీవోయి !!'

---

# వర్తకసంఘాభివృద్ధి

బారు గోవిందరావు

మన దేశములోని పరిశ్రమల యొక్కయు, వాణిజ్యము యొక్కయు, యజమానుల యొక్కయు నభివృద్ధి గోరకములకై యేర్పరుపబడుచున్న సంఘములను గూర్చి చర్చించుట యవసరము. ఇతరదేశములలో వలెనే మన దేశీయులు కూడ వీని యావశ్యకతను గుర్తించుచున్నారు ప్రజలు గావించిన యాందోళనమున కిడచినకాలములో వివిధసమస్యల విషయమై ఫలితములు వచ్చినవి కావున నిట్టి సంఘములందు ప్రజలకు విశ్వాసము కలుగుచున్నది. పరిశ్రమలు, ఎగుమతులు, దిగుమతులు, ఓడల వ్యాపారము, రాకపోకల సౌకర్యములు, ఆర్థిక విషయములు, కార్మిక సమస్యలు, వర్తక సుంకములు మొదలగు వ్యవహారములనేకము వీని విచారణలోనికి వచ్చును. కడచిన పన్నెండేండ్లలోను బయలుదేరిన సమస్యల మూలమున పరిశ్రమాధికారులు, వర్తకులు మేల్కొనుట యవసరమాయెను. నేను సామాన్యవర్తకులకు గూడ మన జాతీయ వర్తకపు స్థితిని, అంతర్జాతీయ విషయములతో దానికి గల సంబంధమును తెలిసికొనవలెనని కోరుచున్నాను.

౧౯వ శతాబ్దము వరకును మన యార్థిక స్థితి విదేశవ్యవహారములతో సంబంధము లేకుండెను. విదేశవర్తకులు మన దేశమునకు ప్రథమముగ వచ్చువరకు మన పారిశ్రామికస్థితి వారి పారిశ్రామికస్థితికి తీసిపోకుండెను. ప్రాచీనకాలములో పరిశ్రమలను చేతులతోనే కష్టించి చక్కగ చేయుచుండినారు. అప్పుడు ధనికులు వాని నాదరించి పోషించుచుండిరి. కాని ఉత్పత్తి నాగరకులు కోలకముండగనే గుంపుబడిన పట్టణములలోని పరిశ్రమలు తగిన యాదరణము లేక రానురాను క్షీణించినవి. మన దేశము ప్రభుత్వమువారి స్వాధీనమైనప్పటినుండి పరిశ్రమలకు ప్రోత్సాహము లేకుండెను. ప్రభుత్వమువారు రాకపోకల సౌకర్యము కలుగజేయ యత్నించిరి. కారణమేమన, వారి దేశములో తయారైనవి మన దేశమున విక్రయము చేసికొనవచ్చును, వారు తయారుచేసిన సరకులు మన దేశములో వ్యాపింపజేయవచ్చును.

గడచిన శతాబ్దపు ప్రారంభములోనే మన దేశములో నీలిమందు, తేయాకు, కాఫీ మున్నగు పంటలు వేయబడ మొదలైనవి. ౧౮౫౪ లో జనపనారపరిశ్రమ బెంగాలులో ప్రారంభమాయెను. ఇదియంతయు యూరోపియనుల స్వాధీనములోనే యుండెను. ప్రత్తి యంత్రపరిశ్రమ విస్తారముగా బొంబాయి రాజధానిలో నున్నది. దరిమిలా నితర ప్రాంతములలో మిల్లులు బయలుదేర జొచ్చినవి. పార్శీలు, గుజరాతీయులు చాలవరకీ పరిశ్రమ నడుపుచున్నారు. బొగ్గుగనుల పరిశ్రమ యూరోపుమహాసంగ్రామమునకు పిమ్మట బాగుగ వృద్ధియయినది. 'తాతా' కంపెనీ దీనికి సంబంధించియున్నను ఈ పరిశ్రమలో ప్రాధాన్యమంతయు పాశ్చాత్యులదేనని చెప్పవలయును. మాంగనీసు, అభ్రకము, సీసము, కాగితము, ఇటుక, సిమెంటు, అగ్గిపెట్టె, తోళ్లపదును మున్నగు పరిశ్రమలెన్నియో అభివృద్ధి జెందుచున్నవి. కాని మన నడక చాల నిమ్మదిగ నున్నది. ఏ దేశపు వర్తకులైనను వారి మేలును వారు చూచుకొనుచుండవలసినదే. యుద్ధమునకు పూర్వము వర్తకసంఘములన్నియు సామాన్యవిషయములనే విచారించుచుండెడివి. తరువాత వానికృషి పెరిగినది. యూరోపియనుసంఘములు, దేశీయసంఘములు కలసి పనిచేయుట ప్రారంభమైనది. కలకత్తా జనపనార మిల్లుల సంఘమువారును, బొంబాయి మిల్లుయజమానుల సంఘమువారును కార్మికులు పనిచేయవలసిన కాలపరిమితిని గూర్చియు, వారి జీతములను గూర్చియు నిర్ణయమునకు రాగల్గిరి. దీనికి కారణము కార్మికులు కనబరచుచు వచ్చిన యసంతృప్తియే. నాటినుండియే కార్మికసంఘములు బయలుదేరినవని చెప్పవచ్చును. ఈ సంఘముల యుద్దేశము ఆత్మరక్షణమే కాక ఆత్మసంస్కారము కూడ నయియున్నది.

హిందూదేశములో వాణిజ్యసంఘములు చిరకాలముక్రిందనే స్థాపింపబడినవి. వర్తకుల పరస్పరము తగవులను బరిష్కరించుట, వారి యోగక్షేమములను కాపాడుకొనుట వాని యుద్దేశ్యములు. మన దేశములో నట్టి సంఘములలో కొన్నిటిని పేర్కొందము. కలకత్తాలో బియ్యపువర్తకుల సంఘము, తోళ్లవర్తకులసంఘము మున్నగునవి గలవు. బొంబాయిలో బట్టలవర్తకులసంఘము, ధాన్యపువర్తకులసంఘము మొదలగునవి కలవు. చెన్నరాజధానిలో కూడ తోళ్లవర్తకుల సంఘము మున్నగునవి కలవు ఆంధ్రజిల్లాలీసంఘముల యావశ్యకతను గుర్తింపకపోవుట శోచనీయము. పొగాకు, ప్రత్తి, చేనకు-బియ్యము, పప్పులు, నార మున్నగు ననేక వస్తువులతో వర్తకులు వ్యాపారము చేయుదురు. గోపాలపురము, విశాఖపట్టణము, కాకినాడ, మచిలీపట్టణము మున్నగు రేవుస్థలములు గలవు. బళ్లారి, నెల్లూరు, గుంటూరు, రాజమహేంద్రవరము, విశాఖపట్టణము, విజయనగరము పట్టణములకు చుట్టుపట్ల పొలములలోను, అడవులలోను పండు సరకులు ప్రోగుచేయబడి వ్యాపకము చేయబడుచున్నవి. ఈ పట్టణములన్నిటిలోను వర్తకసంఘము లేర్పడవలెను. ఆంధ్రవర్తకులలో చదువుకొనినవారు తక్కువమంది యుండుటచేతనే వారీవిషయములో వెనుకబడియున్నారు. సంఘీభావముయొక్క శక్తిని, దేశములో క్లిష్టపరిస్థితుల పరిణామమును వారు గుర్తింపలేకపోవుటకు హేతువు వారి యజ్ఞానమే! వివిధ వ్యాపారములకు సంబంధించి స్థాపింపబడిన వర్తకసంఘముల పలుకుబడి మిక్కుటము. ఈ పదిసంవత్సరములలోను దేశములో ననేకసంఘములు స్థాపింపబడినవి సుమారు ౧౦౦ యేండ్లక్రిందట 'బెంగాలు ఛేంబరు ఆఫ్ కామర్సు' బొంబాయి మదరాసు వర్తకసంఘములు స్థాపింపబడినవి. అటులనే ౧౮౫౩ లో బర్మావర్తకసంఘము, ౧౮౬౦ లో కరాచీవర్తకసంఘము స్థాపింపబడినవి. ఈ సంఘములందలి సభ్యులించుమించుగా సందరును విదేశస్థులే. వారిలో ననేకులు బ్యాంకరులు, ఓడలయజమానులు, భీమాకంపెనీల యజమానులు. ఈ యూరోపియను సంఘములన్నియు 'అసోసియేటెడ్ ఛేంబరు ఆఫ్ కామర్సు' (Associated Chamber of Commerce of India and Ceylon) నకు అనుబంధసంస్థలుగ చేయబడినవి.

హిందూదేశపు వర్తకులుకూడ సంఘముల నేర్పరచుకొనుటకు ప్రారంభించిరి. ౧౮౮౭ లో కలకత్తాలో బెంగాలు నేషనల్ ఛేంబరును, ౧౮౮౫ లో కాకినాడలో గోదావరి వర్తకసంఘమును, ౧౯౦౭ లో బొంబాయిలో ఇండియన్ వర్తకులసంఘము, ౧౯౦౯ లో మదరాసులో దక్షిణఇండియా వర్తకసంఘము మొదలగునవియు రంగూను, కాన్పూరు, లాహోరు, ట్యూటికోరన్, తదితర పట్టణము

లలోకూడ స్థాపింపబడినవి. వీటి కన్నిటికిని పరిపాలకవర్గములు, పరిపాలకోపవర్గములు గలవు. ఇవి అన్నియు రాష్ట్రీయ విషయములలోనే సాధారణముగ జోక్యము కల్గించుకొనుచుండును. కాని హిందూదేశపు వర్తకులకు సంబంధించిన ఓడలవ్యాపారము, బ్యాంకింగు, రాకపోకల సౌకర్యము, మారకము, రక్షణమున్నగు సమస్యలను గూర్చి కూడ నన్ని సంఘములును విచారించును. వ్యక్తులు, సంఘములుగూడ సభ్యులుగ చేర్చుకొనబడుదురు. హిందూదేశ పారిశ్రామిక వాణిజ్య సంఘ సమ్మేళన (Federation of Indian Chambers of Commerce and Industry) వారు కొన్ని ముఖ్యసమస్యలపై ఈ సంఘములవారి యభిప్రాయముల నీయవలసినదిగ కోరుచుందురు. ఈ యభిప్రాయములలోని సంఖ్యాధిక్యమును బట్టి ముఖ్యమైనవానినే ఈ మహాసమ్మేళనవారు ఆమోదింతురు. అందుచే వారి యభిప్రాయమునకు విలువ యెక్కువయగును. ఈ సంఘములలో కొన్నిటికి రయిల్వేలలోను, పోర్టు ట్రస్టులలోను, స్థానిక సంస్థలలోను, రాష్ట్రీయ, కేంద్ర శాసనసభలలోను ప్రాతినిధ్యమున్నది. ఈ సంఘములు సంవత్సరమున కొకసారి సమావేశము జరిగినపుడు సింహావలోకనము చేసి, మఱియు ముఖ్యములగు సమస్యలను చర్చించును, వానిపై యభిప్రాయములు ప్రచురించుచుండును. ఈ సంఘములును, కార్యనిర్వాహక వర్గములును తఱచుగ సమావేశమగుచు పనిని నడుపుచునుండును మఱియు బియ్యము, ఇనుము, ప్రత్తి, మొదలగు వానికి ధరల పట్టీలు వేయించి విరివిగ వ్యాపింపజేయుచుండును. వార్షిక నివేదికలుగూడ ప్రచురింపబడుచుండును. బొంబాయిసంఘమునకు త్రైమాసిక పత్రికయొకటియున్నది. మన దేశములోని భారతవర్తకసంఘములన్నిటిలోను నిదియే గొప్పసంస్థ. చెడిపోయిన వర్తకపు రకముల పట్టిని తయారుచేసి ధ్రువపత్రముల నిచ్చి వర్తకులలో గల తగవులను బరిష్కరించి, భారత వర్తకులకును, విదేశవర్తకులకును సంబంధము గల్గించి తదితరములగు విషయములలో చక్కని పని చేయుచుండును. ఆంధ్రదేశములో వర్తకులకు తగినంత యనుభవము, విషయపరిజ్ఞానము లేకుండుటనే వారు నష్టపడుచుందురు. తెలుగు జిల్లాలలో వర్తకసంఘములను స్థాపించుట చాల యావశ్యకమై యున్నది. ప్రజాసామాన్యము యొక్క మంచిచెడుగుల నారయకుండినది వర్తకులదే తప్పు. వారి స్వంత వ్యాపారమునే వారు చూచుకొనుచుందురు.

మన దేశములో యజమానుల సంఘములు గూడ గలవు. ఈ సంఘములలో ననేక పరిశ్రమలవారికి ప్రాతినిధ్యమున్నది. ౧౮౭౫లో బొంబాయిలోని దేశీయ, వైదేశిక మిల్లుయజమానులు కలసి ఒక సంఘమును స్థాపించిరి. గడచిన నాలుగు సంవత్సరములలో వీరి పని ప్రసిద్ధిలోనికి వచ్చినది. ప్రత్తిపరిశ్రమ విషయమున వీరు చేసిన పనియే యిందులకు నిదర్శనము. ఈ సంఘము చేయు కొన్ని ముఖ్యకార్యము లెవ్వియన: ప్రత్తిపరిశ్రమ వ్యాపారములకు సంబంధించిన లెక్కలను తయారుచేయుట, వానిని పంచిపెట్టించుట, సభ్యసంస్థల ట్రేడుమార్కులను రిజిష్టరు చేయించుట మున్నగునవి. కాక కూలీల జీతములను స్థిరపరచుట, ఉత్పత్తి వ్యయమును తగ్గించుట, పరిశ్రమలను రక్షించుట కూడ అయియున్నవి. అహమ్మదాబాదు మిల్లుయజమానుల సంఘము యజమానులకును, కార్మికులకును సామరస్యము కలిగించి చక్కగ పని చేయుచున్నది. ఇట్లే ఢిల్లీ, బరోడా, కలకత్తా నగరములలో సంఘములు వెలసినవి. ౧౮౮౪లో కలకత్తాలో స్థాపింపబడిన ఇండియను జ్యూటుమిల్లు సంఘమే మిల్లు యజమానుల ప్రథమ సంఘము. ఇది తూర్పు ఇండియా జ్యూటుసంఘముతో కలసి పనిచేయుట శ్రేయస్కరము. ఏలయన జ్యూటు విషయములో ప్రపంచములోని వర్తకమంతయు మనదే. కాని భారతీయులు ఐకమత్యముతో వర్తింపకుండుట శోచనీయము. దీనికి హేతువు నిర్హేతుకమైన పరస్పర స్పర్థాద్వేషములే. గనుల వ్యాపారము చేయువారు కూడ సంఘములుగా నేర్పడియున్నారు. కలకత్తాలో 'ఇండియన్ మైనింగ్ అసోసియేషన్' అనియు 'ఇండియన్ మైనింగ్ ఫెడరేషన్' అనియు రెండు సంస్థలు గలవు. యూరోపియను వ్యాపారస్థులు ఒండలువ, ఒరిస్సా, బీహారు, బెంగాలులలోని కొందఱు బొగ్గు వ్యాపారస్థులును దీనిలో సభ్యులుగా నున్నారు. బొగ్గుపైననే మన పరిశ్రమలు ఆధారపడియుండుటచే ఈ సంఘములు పట్టుదలతో కృషిచేయవలసిన యావశ్యకత వాటికి యేర్పడియున్నది.

హిందూదేశములో తేయాకు, కాఫీ తోటలు చాలచోట్ల నెలకొనియున్నవి. ఆ పరిశ్రమలను వృద్ధిచేయుటకు, రక్షించుటకు సంఘములు బయలుదేరినవి. ౫౦ యేండ్ల క్రితము ఇండియను తేయాకు సంఘము స్థాపింపబడినది. ఈశాన్యదేశములో తేయాకు పండించువారి యోగక్షేమములకు బూనుకొనిన సంఘమిది యొక్కటియే! తేయాకు పండించువారిలో ౧౦౦ కి ౭౦ మంది ఇచటనే యున్నారు. తేయాకు తోటలలోని కూలిపని బానిసతనమనియే చెప్పవచ్చును. యూరోపియనులు భారతీయుల క్షేమమునకు అప్పుడప్పుడు వ్యతిరేకముగా వర్తించుటచే, సుమారు ౧౦ సంవత్సరముల క్రితము ప్రత్యేకముగ భారతీయులతో గూడిన సంఘమొకటి వంగదేశములో స్థాపింపబడినది. దక్షిణదేశములోకూడ ఇటువంటి సంఘము గలదు. ౧౯౨౯ లో బొంబాయిలో స్థాపింపబడిన జాతీయనౌకాయజమానిసంఘము మన దేశపు ఓడవ్యాపారమును ప్రోత్సహించుచున్నది. పై సంఘములే కాక సిమెంటు, ఉప్పు, పంచదార, గ్లాసు, అగ్గిపెట్టెలు మున్నగువానిని తయారుచేయువారల కేంద్రసంఘము లెన్నియో కలవు. ఆ సంఘములు ఆయా పరిశ్రమలను కాపాడుటకు స్థాపింపబడినవి. వివిధ వర్తకసంఘములను గూర్చి ప్రసంగించితిమిగాన కేంద్రసంఘములనుగూర్చి చర్చింతము.

మన దేశములోని యూరోపియను వర్తకసంఘములు మొదట ౧౯౨౦లో ఇండియా, సిలోనుల వర్తకసంఘమహాసమ్మేళనము నేర్పాటు చేయుటకు తీర్మానించినవి. వార్షిక సమావేశములలో వర్తకమునకును, పరిశ్రమలకును సంబంధించిన సమస్యలు గూర్చి చర్చింపబడుచున్నవి. అట్లే హైందవవర్తకులు గూడ నేకీభవించి ౧౯౨౭ లో "ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు అండ్ ఇండస్ట్రీ" అను పేరట నొక సంఘమును కలకత్తాలో స్థాపించిరి. వీరు ప్రతియేటను అధ్యక్షుని, కార్యనిర్వాహకవర్గమును నెన్నుకొనుచుందురు. మఱియు ప్రతివార్షిక సమావేశమును ఢిల్లీలోనే జరుపబడుచున్నది. ఈ సమ్మేళన యొక్క ముఖ్యోద్దేశము లేమన: (౧) దేశీయ వైదేశిక వర్తకములను, పరిశ్రమలను, ఆర్థిక విషయములను, రాకపోకల సౌకర్యములను చక్కబరచుట; (౨) సంఘీభావముతో పని



K. P. S

12. హొయిసలేశ్వర దేవాలయము వెలుపలి గోడమీది సుందరశిల్ప రచనాఖండము.

S. S. S.



# కొన్ని శాసన పద్యములు

సంపాదకుడు: దీపాల పిచ్చయ్యశాస్త్రి

## ౧. హంద్రిక పెద్దనమంత్రి

ధరణికోటలో ఇంద్ర ప్రతిష్ఠితమైయున్న అమరేశ్వర లింగమునకు శా. శ. ౧౨౭౩ లో దేశటిప్రోలయ వేమారెడ్డి రెండవ పుత్రుఁడగు అనవేమారెడ్డి తన కన్నయు, ప్రభువు నగు అనపోతరెడ్డికి ఆయురారోగ్యములు కోరి పునఃప్రతిష్ఠ కావించెననియు, అటు పిమ్మట శా. శ. ౧౫౪౮ అక్షయసంవత్సర శ్రావణ బ ౧౦. ఆదివారమునాఁడు ఈ పెద్దనమంత్రి మూఁడవప్రతిష్ఠ చేయించెననియు శాసనమునఁ గలదు. అందలి పద్యము లివి.

ఇంద్రుఁడు ధాన్యవాటి నమృతేశుఁ బ్రతిష్ఠయొనర్చెఁ బంట రె
డ్డీంద్రుఁడు నన్నవేమధరణీశుఁడు చేసె పునఃప్రతిష్ఠ, ఆ
చంద్రదినేంద్ర తారకము శాశ్వతమౌనని యాశ్వరాజ్ఞచే
హంద్రిక పెద్దమంత్రి సుగుణాంబుధి సల్పెను సుప్రతిష్ఠయున్.

వర వసువేదబాణ శశివర్ణితమౌ శక వత్సరంబులన్
అరయఁగ నక్షయాబ్దమున హంద్రికకోనయపెద్దమంత్రి యు
ద్ధర రవిచంద్రతారకము దన్నటకోటమరేశలింగమున్
స్థిరతరభక్తితోడను ప్రతిష్ఠయొనర్చెను పుణ్యశాలియై.

## ౨. గంపభూపతి

గుంటూరుజిల్లా పెదముక్కెనలోని శిలాస్తంభముమీఁది పద్యములు.

అమలపయోధి ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...

అతని వంశంబున వి - ఖ్యాతులు నరపతులు......
...చోడాధీశుఁడు, త (?) - ద్ఖ్యాతలనాథునకు గండభూపతి పుట్టెను.

ఆమన జాహ్నవీ గాధిసుతుండై యుదయించె విరోధి గోత్ర సు
త్రాముఁడు, శత్రుపద్మ హిమధాముఁడు, శాత్రవ కంసగోపకా
రాముఁ, డరాతిపంక్తిముఖరాముఁడు, భీకరవిద్విషత్పురీ
భీముఁడు, వైరిసింహబలభీముఁడు ముమ్మడిభీముఁ డిమ్మహిన్.

అతనికి___

శారదనీరదపారద - నారదకుందేందు చందనక్షితి...
హారతుషార యశఃపరి - పూరిత దిక్కుండు గండభూపతి పుట్టెన్.

ఖండితరాత్మీయ భుజా - దండస్థిత మండలాగ్రదంతాహిత నీ
దండశిరస్సృతి హారా_క్షిక-మండితరణముఖుఁడు గండమండలికుఁ డిలన్.

3. సూరయ పండఁడు

శ్రీరమణుం డుర్వీగురు - దారుఁడు శ్రీగిరీశవిభుఁడు దర్పితరిపుసం
హారుఁడు ధీరుఁడనందగు - సూరయపండఁడు కీర్తిమండనుఁడు మహిన్.

నించెన్ బట్టుల నెల్లఁ బేర్మి వెలయన్ బెట్టించె సత్త్రంబు గ
ట్టించెన్ భక్తి శివాలయంబులను బ్రోడింపం దాల్మి యొప్పంగఁ ద్ర
విఁపించెన్ బూర్ణతటాకముల్ జలధిగంభీరంబుగాఁ బెన్నిధుల్
సించెన్ సూరయపండఁ డర్థిభవనాళీకంబులన్ గీర్తిమై.

లాటవిలాసినీ లాలాటతిలకుని ఁ గేరళకరలగ్న కేళిపద్మం
గర్ణాటసుందరీ కర్ణావతంసుని ఁ గుండలికుంతలకుసుమదాము
గౌడసతీనేత్ర కాలాంజనుని అంగభామాకపోలాస్త పత్రరచను
నేపాళకామినీ నీరంధ్ర కుచహార సంశ్రితనూకుంకుమాంగరాగు
రమణతో నాదిరాజుల రాశి కెక్కి - దీనజనముల యాపదల్లెల్లఁ దీర్చుచున్న
అనఘచారిత్రుఁ పండసినను దనంబు-పొగడఁబెందుము సకలభూభుజులు సభలు.

# మదరాసు అసెంబ్లీ, కౌన్సిళ్ల ఆంధ్ర కాంగ్రెసుసభ్యులు



వేముల కూర్మయ్య



కె. వెంకటస్వామినాయుడు



శ్రీమతి డాక్టరు లక్ష్మీదేవిఅమ్మ



ఆర్. వెంకటప్పనాయుడు



శ్రీమతి ఆచంట రుక్మిణిలక్ష్మీపతి



గద్దె రంగయ్య. నాయుడు



# ప్రస్తుత భారతదేశము

యం. కామేశ్వరరావు

భారతదేశము యొక్క ప్రాచీనౌన్నత్యమును ప్రస్తుత దౌర్భాగ్యముతో పోల్చినచో ప్రతిభారతీయుని హృదయమందును ఘోరమైన ఆవేదన కలుగకమానదు. ఒకప్పుడు దేశములలో కెల్ల నాగరికతలోను, విజ్ఞానములోను, ఆర్థికముగాను, రాజకీయముగాను, సాంఘికముగాను అగ్రస్థానము వహించిన దేశము ప్రస్తుత మింత యధఃపతనము చెందుటకు కారణ మేమి? పరాధీనత యేనని చెప్పుటలో నతిశయోక్తి లేదు. వాక్స్వాతంత్ర్యముగాని, ముద్రణస్వాతంత్ర్యముగాని, వ్యక్తి స్వాతంత్ర్యముగాని లేక, అభివృద్ధినొందు అవకాశము లరికట్టబడి క్రమేణ తన పారిశామిక ప్రథమస్థానమును కోల్పోయి కనిష్ఠస్థానము నాక్రమించుచు, పన్నుల వలన పీల్చి పిప్పిచేయబడుచు, తలబరువైన పరిపాలన (Top-heavy administration) క్రిందక్రుంగి కృశించుచున్నది. అవిద్య, తత్సంజనితమగు సాంఘిక, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ (Scientific) అజ్ఞానము హెచ్చైపోయినవి. భారతదేశమే కనుక స్వతంత్రరాజ్యమై యుండిన క్రమాభివృద్ధివలన ఉచ్ఛస్థితిలో నుండి తనపూర్వాగ్రస్థానము నిలుపుకొనెడి దనుటలో సంశయము లేదు. ప్రస్తుతపు అంతర్జాతీయ విషయములలో భారతమాతపుత్రులు నాయకులుగా నుండెడివారు. అఖండమేధావులు దేశములో నున్నప్పటికిని, పరరాజ్యము వేళ్లుపారి పాతుకొనిపోవుటచే దాని దారుణశృంఖలములలో తగుల్కొని యున్నారు. అయినను ప్రజలలో వేడి పుట్టించి ఐక్యముగా సమరము చేసియున్నారు; మరల చేయుటకు వేచియున్నారు. మన సమరము శాంతియుతసమరము. పాశ్చాత్య దేశములలోవలె ఘోర వినాశకరములగు ఆయుధములతో కూడుకొన్నది కాదు, సత్యాగ్రహ సమరము.

ఇదివరలోని సమరములవలన ప్రభుత్వాన్ని ప్రతిఘటించి కొంచెము కొంచెము వాక్ స్వాతంత్ర్యము, వ్యక్తి స్వాతంత్ర్యము, ముద్రణస్వాతంత్ర్యము సంపాదించుకొన్నాము. పూర్వము బహిరంగసభలలో రాజకీయములనుగురించి ఉపన్యసించుటకు గాని, నల్గురైదుగురు కలసి రాజకీయములను గురించి మాట్లాడుకొనుటకు గాని, పత్రికలద్వారా స్వాభిప్రాయములను ప్రభుత్వము నెదిరించి ప్రకటించుటకు గాని భయపడేవారము; ఎర్రటోపీకిహడలి బేజారెత్తేవారము. ఇప్పుడు వృద్ధులు గాని, బాలురు గాని, స్త్రీలుగాని, మరెవ్వరుగాని జైళ్లన్నా, పోలీసులన్నా, లాటీఛార్జిలన్నా, ౧౪౪-వ సెక్షనుప్రయోగమన్నా భయం వదలినారు. ఇప్పటికీ ౧౪౪-వ సెక్షను ప్రయోగాలు, లాటీఛార్జీలు, కొంతమంది వ్యక్తులను ఒకవూరుదాటి బయటకు వెళ్లకూడదనియు, ఒక రాష్ట్రము బయట నుంచి ఆరాష్ట్రములోనికి రాకూడదనియు శాసనములును అమలులో నున్నవి. అక్కడక్కడ పత్రికలు భయము లేకుండా జాతీయతను ఘోషించుచున్నవి; ప్రభుత్వ చర్యలను ఖండించుచున్నవి; ధరావతులు వదలుకొనడానికికూడా సంసిద్ధము లగుచున్నవి. అంతర్జాతీయ విషయములు రేడియోలద్వారాను, విదేశములు వెళ్లి తిరిగివచ్చినవారి ద్వారాను, పత్రికలద్వారాను ప్రచారమగుచున్నవి; ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛ బలపర్చుచున్నవి. దేశదౌర్భాగ్యమును విశదీకరించుచున్నవి. పైగా అఖిలభారత కాంగ్రెసువలన స్త్రీలకు, పురుషులకు, వృద్ధులకు, బాలురకు, కర్షకులకు, కార్మికులకు పల్లెలలోను, పట్నములలోను జ్ఞానోద్బోధన చేయబడుచున్నది. తత్ఫలితముగా ప్రజలలో జ్ఞానోదయము వెల్లడి అవుచున్నది. మన ఆర్థికదుస్థితి, రాజకీయ దురవస్థ, సాంఘికపుల్లోట్లు బాగుగా పరిశీలించెదము. మొట్టమొదట ఆర్థిక దుస్థితి

యెట్టిదో చూచెదము. ప్రస్తుతము మన దేశప్రజసంఖ్య 36 కోట్లకుపైగా నున్నది. వీరుగాక తెల్లవారున్నారు. తెల్లవారందరును ఉన్నతోద్యోగులు. మనలో అత్యల్పసంఖ్యాకులు ప్రభుత్వోద్యోగులు. మరికొందరు మిల్లు యజమానులు, జమీందారులు, స్వదేశసంస్థానాధీశ్వరులు. తక్కిన యావన్మంది కర్షకులు, కార్మికులు, నిరుద్యోగులు, చిల్లరవర్తకులు, చిన్న యీనాందార్లు, భిక్షుకులు. చాలమందికి కట్టగుడ్డ కుడువకూడైనను లేదు. మనకు పరిశ్రమలు లేవు. ఏకొలదియో యంత్రపరిశ్రమలున్నా అవి ధనికులకు, ప్రభుత్వమునకు లాభకరములే కాని ప్రజోపకారము చేయజాలవు. ముఖ్యమైన వృత్తి వ్యవసాయము. విద్యవలన పెంపొందింపబడినట్టిది గాక మన పూర్వులు చేయుచుండిన మాదిరి వ్యవసాయము. అమెరికా మొదలయిన మిగిలిన దేశములలో నూతనపద్ధతుల మీద వ్యవసాయము నడుపబడుచు అనేకరెట్లెక్కువ పండింపబడుచున్నది. మన కొద్దిపంటలే మనకు కూడు, గుడ్డ, విద్య, సమస్తమైన వాంఛలకు సరిపడవలెను. మన ముడి పదార్థములను తక్కువధరల కెగుమతిచేసి తయారయిన సరకులను న్యాయసమ్మతముగాని యెక్కువధరలకు దిగుమతి చేసుకొనుచున్నాము. దిగుమతి సుంకములవలన ఖరీదులు మరీ పెరుగుచున్నవి. మన వ్యవసాయ ధనము బట్టలకు పోగా కడుపునిండుటకయినను సరిపడదు. ప్రతిచిన్నవస్తువుకు కూడ అన్యదేశములమీదనే ఆధారపడియున్నాము. యంత్రపరిశ్రమలు లేవు సరికదా, యిదివరలో నున్న గృహపరిశ్రమలుకూడ నాశనమైనవి. వీటికి సాయము ప్రభుత్వపు పన్నులు: ఉప్పుపన్ను, భూమిపన్ను, దిగుమతిపన్ను మొదలయినవి. ఈ పన్నులు తెల్లవారి పెద్ద జీతములకొరకు, నల్లవారి కొంది జీతములకు, అనవసరమైన కమిటీలు కమిషన్ల తిరుగుళ్లకు, పనిపాటులులేని తెల్లసిపాయిలకొరకూ ముఖ్యముగా ఖర్చుపెట్టబడుచున్నవి. మన కుపయోగకరముగా ఖర్చుపెట్టబడుచున్న పైకము తక్కువ. నూతనరాజ్యాంగ ప్రకారం గవర్నరుల స్టాఫులంటూ దానికి ఖర్చులుకూడ భరించాలి. అతని ఉపయోగార్థం బయలుదేరు నూతనోద్యోగులకు కూడ జీతాలు భరించవలెను

కర్షకులదుస్థితి ఎంతకఠినునకైనను గుండె నీరుచేయును. ఇతడు పూర్వీకులమాదిరి వ్యవసాయమే కాని శాస్త్రీయపద్ధతులవలన అభివృద్ధి నొందిన పద్ధతుల నెరుగడని యిదివరకే చెప్పియున్నాను. అందుచే సంవత్సర సంవత్సరమునకు తగ్గుచున్న భూసారమును తిరిగీ సంపాదించుట యెరుగడు. సంవత్సరానికి కొన్నిచోట్ల ఒక పంటే; కొన్నిచోట్ల మట్టుకు రెండు పంటలు. కొన్ని భూములు నీటివసతి లేక సరిగా సాగుబడియగుటలేదు. క్రొత్తగా కట్టబడుచున్న ప్రాజెక్టులవల్ల క్రొత్తభూములు సాగుబడిలోనికి వచ్చుచున్నవి. మొదటిపంటకు కొన్నిపంటలు, రెండవ పంటకు మరికొన్ని రకముల పంటలు పండుచున్నవి. సరియైనకాలములో దున్ని విత్తులను జల్లి సృష్టి మీద నగు వర్షముకొరకు సూర్యరశ్మికొరకు ఆధారపడుచున్నాడు. అతనికి సంవత్సరమంతయూ చేయవలసిన పనులు: భూమి మరమ్మత్తు చేయుట, దున్నుట, విత్తనములుజల్లుట, నీరు పెట్టుకొనుట, కలుపుతీయుట, గట్లువేయుట, పశుపక్ష్యాదులనుండియు దొంగలనుండియు పంటను రక్షించుకొనుట మొదలైనవి. మరి వేరు పని దొరకకపోవుటచే రేయింబవళ్లు తన క్షేత్రములోనే జీవితమును గడుపుచున్నాడు. ఇతడు భూమినిబట్టియూ, పంటను బట్టియూ యీనాందారు శిస్తు, నీటిపన్ను, తదితరమైన గవర్నమెంటు పన్నులు చెల్లించవలెను. భూమి మరమ్మత్తులకు, విత్తులు కొనుటకు, కోతలరోజులలోను కలుపు రోజులలోను కూలివాళ్లకు ఖర్చు పెట్టవలెను. పశువుల గ్రాసము కోసం మరికొంత ఖర్చుచేయవలెను. పంట వలన మిగిలినది తనకూ, సంసారమునకూ అన్నవస్త్రములకు, తదితరమైన ఖర్చులకు సరిపడవలెను. స్వతః రైతు బీదవాడు. గవర్నమెంటువారి పన్ను లెక్కువ. ఈనాందారుల శిస్తులు కూడ అక్కడక్కడ ఎక్కువయే. ఇతనికి ఋణము పుట్టుట కష్టము. పుట్టినా యెక్కువరేటుకు కొంప గోడి పశువుల హామీమీద పుట్టును. పంటల ధరలు తక్కువ. దీనికి సాయము తుపానులు, భూకంపాలు, వరదలు అతివృష్టి, అనావృష్టి మొదలైనవి. బెంగాలు, పంజాబు, అస్సాము వరదలవలనను, ఒంగోలు గుంటూరు జిల్లాల తుపానులవలనను, బీహారు క్వెట్టా భూకంపాలవలనను రైతులకును తదితరులకును అపారమైన

నష్టమని వార్తాపత్రికలలో చూచి యున్నాము. పైగా రైతు కరణాలకు, మునసబులకు, రెవిన్యూ యినస్పెక్టర్లకు, ఓవర్‌సీర్లకు లంచాలిచ్చుకొనవలెను. పంటపోతే యీనాందారు కొద్దియో గొప్పయో మాని కరుణించినా, ప్రభుత్వమువారు కరుణించరు. వాని స్థిరాస్తిని, చరాస్తిని జప్తుచేసి పన్నులు వసూలుచేసుకొంటారు. చివరకు కారాగృహశిక్ష కూడా విధిస్తారు. ఋణములవలన కొందరు రైతులు పన్నులు, శిస్తులూ యిచ్చుకొంటున్నారు. కాని ఆ ఋణాలు పెరిగి బోలెడంత యగుటా, అవి తీర్చుకొనలేకపోవుటచే ఋణభారముతో నానాటికి రైతులు క్రుంగిపోవుటా చూచుచున్నాము. అతని దౌర్భాగ్యస్థితి చూచినచో కడుపు తరుగుకొనిపోవును. సూర్యరశ్మి [illegible] తగులపెట్టబడిన అతని శరీరమూ, ఇంచుమించు దిగంబరత్వమూ, ఆహారము లేక కృశించుచున్న దేహమూ, అతని గుడిసె, గోలపెట్టుచున్న గృహిణి బిడ్డలూ అతని దుస్థితిని చాటుచున్నవి. అతడు కూలికొరకు దేవులాడి, యెక్కడైననూ దొరికితే రోజంతా కష్టపడి ౦-[illegible] మాత్రమే సంపాదించుచున్నాడు. దానితోనే సంసారపుఖర్చులు మరల కూలిదొరకు వరకూ గడుపుకోవలసి వచ్చుచున్నది. క్షామమువల్లనూ, అకస్మాత్తుగా పశువులను కోల్పోవుటవల్లనూ కల్గుబాధకు మేరయే లేదు. అమెరికా దేశములోని రైతుస్థితి పోల్చుకొందము. అతడు సమస్తవిధములా మంచిస్థితిలో నున్నాడు. అతనికి విద్యకలదు. శాస్త్రీయాభివృద్ధినొందుచున్న వ్యవసాయము నడిపించి పంటను వృద్ధిచేసుకొనును. క్రొత్తపరిశోధనలనుచేయు అవకాశములు కల్గియున్నాడు. పశుభీమా, పంటభీమాలవలన క్షామమునుండి రక్షించబడుచున్నాడు. అతని సరకులధర విషయములో ప్రభుత్వమువారు జాగ్రత్త తీసుకొందురు. ఈ పరిస్థితు లేర్పడిన రోజున మన రైతు అభ్యుదయమును పొందగలడు. మన రాజప్రతినిధిగారు వ్యవసాయమును గురించి శ్రద్ధతీసుకొనుటచే ఆయన కెంతయూ మనము కృతజ్ఞులము. నిరుద్యోగులగు పట్టభద్రులకు వ్యవసాయము నేర్పించుటయూ, అక్కడక్కడ వారి కుచితముగా భూముల నిచ్చుటయూ, వ్యవసాయపరిశోధనలను ప్రోత్సాహపరచుటయూ, జంతువృద్ధి చేయించుటయూ, వ్యవసాయోద్యోగుల ద్వారా రైతుల వ్యవసాయజ్ఞానమును పెంపొందించుటయూ, రైతులకు తక్కువ రేటుతో ఎక్కువవాయిదాలకు ఋణముల నిచ్చు బ్యాంకులను ఏర్పాటు చేయించుటయూ జరుగుచున్నవి. క్షామనివారణ నిధులు కూడ ఏర్పాటు చేయబడవలెను. బ్యాంకులు పల్లెలన్నిటిలోను నెలకొల్పబడవలెను. పన్నులు తగ్గింపబడవలెను. కొన్నిపన్నులు రద్దుచేయబడవలెను. ఎక్కువగా క్రొత్తప్రాజెక్టులను కట్టించి చాలభూమి నూతనముగా సాగుబడిలోనికి తీసుకొని రాబడవలెను. పశువుల భీమాలు, పంట భీమాలు స్థాపింపబడవలెను. పంటలకు తగుధరలు కల్పింపబడవలెను. క్రొత్తపంటలను ప్రవేశపెట్టించవలెను. మైసూరు దేశమునందువలె విద్యుచ్ఛక్తిద్వారా కూడ వ్యవసాయము నడుపబడవలెను. వీటిని పొందుటకొరకు అఖిలభారత కాంగ్రెసువారు రయితుసంస్థకు వారిలో ముఖ్యస్థాన మిచ్చి, రయితుసంఘము లేర్పాటుచేసి, వారికి రాజకీయ - ఆర్థికజ్ఞాన ముపదేశించి వారి ప్రచారము గావింపవలెను. పల్లెలలోనుండు రయితులందరిని తమవ్యవహారములను తామే పరిష్కరించుకొనులాగున తయారుచేయవలెను. ఇందుకొరకే పాటుపడుచున్నారు బాబూ రాజేంద్రప్రసాదుగారూ, జవహరలాలు నెహ్రూగారూ, ఆచార్య రంగాగారూ, తదితర కాంగ్రెసు నాయకులూనూ.

కూలివాళ్లసంగతి వీక్షించుదము. వీరు పల్లెలలోకన్న పట్నములలో ఎక్కువగా నున్నారు. వీరిజీవితము కర్షకుల జీవితముకన్న కొంత బాగు. కూలిదొరకిన రోజున తింటున్నారు; లేనిరోజున పస్తుంటున్నారు. సామాన్యముగా పట్నములలో వీరి కనుదినమూ కూలి దొరకునుగాని కిట్టుబడి తక్కువ. వీరనేకవిధములుగా కూలిపని చేసుకొందురు. కొందరు రయిల్వే కూలీలు, కొందరు బళ్లుతోలువారు, తదితరులు కూరలమార్కెట్లవద్దనుంచి యితరమార్కెట్లవద్దనుంచి సామానులుమోయువారు, మరికొందరు పడవలరేవులలోను స్టీమరురేవులలోను కూలీలు. ఇంక కొందరు వర్తకుల వద్దనూ, మిల్లులలోనూ కూలీలు. తదితరులు మ్యునిసిపాలిటీలలోను, స్కూళ్లలోను, ధనికుల యిళ్లలోను బంట్రో

తులు. ఇందులో చాలా విధముల ఆడువాళ్లు కూడ కూలి సంపాదించు కొందురు. వీరికి దొరకు కొద్దికూలి తోనే పల్లెటూరికంటె యెక్కువ ధరలుగల తినుబడి వస్తువులు, గుడ్డలు, మిగిలిన సరకులు కొనవలెను. పైగా వీరి నివాసస్థానములు అనారోగ్యా శ్రయములు. వీరున్న తావులను మ్యునిసిపాలిటీవారు బాగుచేయించరు. వీరి గుడిసెలు ఒకదానికొకటి వెల్తురుకు గాలికి ప్రతిబంధకముగా వుంటవి. మలము, మురికి యిళ్లలోను వీధుల లోను సదా కన్పట్టును బంట్రోతుల నౌకరిలు ఎప్పుడూ అనిశ్చయములే. ప్రభుత్వమువలననూ, మిల్లు యజమానుల వలననూ, మ్యునిసిపాలిటీల వలననూ కూడ యెప్పుడైన పని చేయలేకపోయినయెడల తీసివేయ బడుదురు. శెలవు లుండవు. రేయింబవల్లు చాకిరీ. ప్రతిఫలము మిక్కిలి తక్కువ. వీరుకూడ అవిద్య అజ్ఞానములవలన మిక్కిలి బాధపడుచున్నారు. వీరి బాగుకొరకు గూడ అఖిలభారత కాంగ్రెసు మిక్కిలి శ్రద్ధ తీసుకొనవలెను. వీరికి సంఘాలు ఏర్పాటుచేసి, జ్ఞానోద్బోధనచేసి, వీరి సంగతులు వీరే పరిష్కరించుకొనులాగున తయారుచేయవలెను. వీరికి కొంత పరిమితిదాటి తక్కువ కూలి యీయకూడదనియూ, రోజుకు కొన్నిగంటలకంటెఎక్కువపనిచేయించకూడదనియూ, అస్వస్థతగా నున్న దినములలో నిండు జీతముమీద శెలవిచ్చుటయూ, వారికి ఆరోగ్యము చేకూర్చు వసతులు ఆటస్థలములు కల్పించుటయూ యేర్పాటుచేయబడవలెను. అందరకు పని దొరకులాగున చూడవలెను. కొలదికాలము క్రిందటనే ఫ్రెంచి సోషలిస్టు ప్రధాని లియాంబ్లూమ్‌గారు కార్మికులకు చేసిన సౌకర్యములు వార్తాపత్రికలలో చూచినాము. ౪౦ గంటలు పనిచేయవలసిన వారము, నిండువేతనముమీద శెలవు ఆయన చేసిన ముఖ్య యేర్పాట్లు. ఇప్పట్లో మన కూలివాళ్లలో కూడ సంచలనము వినుచున్నాము రైల్వే పనివాండ్ర సమ్మె, మిల్లు పనివాండ్ర సమ్మె, ఓడలరేవులోని పనివాండ్ర సమ్మె మొదలైనవి వినుచున్నాము. కార్మికులు ఏకీభవించి పనిచేసినచో తమ అభీష్టములను పొందగలరు.

ఎప్పటికైనను కార్మిక కర్షక సమస్య సోషలిజమే పరిష్కరింప గలదు. వారి కెక్కువ కూలి, అస్వస్థతగానున్న నిండుజీతముమీద శెలవు, వారమునకు పనిచేయు కాలము తగ్గింపు, వారి నివాసములు, విద్య, ఆటవసతులు, జీవితభీమా మొదలైనవి జరుగగలవు. కర్షకులకు సమష్టి క్షేత్రములు, విద్య ఆరోగ్యముల వసతులు, పైరు భీమాలు, పశుభీమాలు మొదలైనవి చేకూర్చబడును. కొంచెమించుమించు రష్యాస్థితి సంపాదించవలెను.

మనపరిశ్రమల విషయము పరీక్షకావించుదము. యంత్రపరిశ్రమలు తక్కువ. అసలు లేనట్టే లెక్క. పూర్వము గృహపరిశ్రమలవలన మన దేశము అగ్రస్థానమువహించుట చెప్పియుంటిని. ఆపరిశ్రమలుకూడ అరికట్టబడి చాలమట్టుకు నశించినవి. కొన్నికొన్ని మాత్రము చావ, బతుకలేని స్థితిలోనున్నవి. అట్టివి కుండలుచేయుట, జోళ్లుకుట్టుట, వెండి బంగారపుపని, కొంతమట్టుకు శిల్పము, శిలా విగ్రహములను చేయుట, దంతపు నగిషీపని, నూలువడికి స్వదేశ వస్త్రములను నేయుట, కమ్మరము, తాపీపని మొదలయినవి. ఇటువంటివి పునరుద్ధరించి విదేశవస్తు బహిష్కారము సాధ్యమైనంతవరకు నడుపవలెను. ముఖ్యముగా విదేశవస్త్ర బహిష్కారము జరుపవలెను. ఇప్పటికీ మన దేశస్థులలో వస్త్రములనేయు నిపుణతవింటాము. పూర్వము మనవారు తయారుచేసిన చీర ఒక అగ్గిపెట్టెలో నిముడగల్గెనని చెప్పుదురు. వారిశిల్పకౌశలము గొప్పది. కనుక మనము నశించినట్టియు, నశించుచున్నట్టియు గృహపరిశ్రమలను పునరుద్ధరించవలెను. అప్పుడే ఆర్థికస్థితి కొంతవరకు బాగుపడగలదు. కనుకనే మహామేధావి గాంధీమహాత్ముడు "ఆల్ ఇండియా విలేజ్ యిండస్ట్రీస్ అసోసియేషన్" అంటూ పెట్టినాడు. రేడియోలు, టెలివిజన్లు, సినిమా యంత్రములు, శాస్త్రీయ పరిశోధనల కుపకరించు సామానులుకూడ చేసుకొనగల ప్రవీణత సంపాదించుకొని పరాధీనత మానుకొనవలెను. స్వదేశ వస్తుప్రదర్శనముల ద్వారానూ, ఉపన్యాసముల వార్తాపత్రికల ద్వారానూ స్వదేశ పరిశ్రమలను ప్రోత్సాహ పరచవలెను. ఈ ఉద్యమానికి ప్రతిఫలముగా ప్రస్తుతంలో మనమూ మంచిమంచి వస్త్రములు, తలనూనెలు, ఫేసుపౌడర్లు, స్నోలు, సబ్బులు, బిస్కెట్లు, సిగరెట్లు, చాకులు, కత్తులు,

బ్లేడులు, బూట్లు, హేట్లు మొదలైనవి చేసుకొన గల్గుచున్నాము. కష్టపడిన ఇంకను ఎన్నో చేసుకొనగలము. కొలదికాలము క్రిందట మాపరిసరప్రాంతీయు డొకడు గ్రామఫోనుపాండుబాక్సు చేసియున్నాడు.

ఆర్థికముగా మరొక విషయం చూడవలెను; మారకపు రేటు. మొన్న మొన్ననే చాల పాశ్చాత్యదేశములు తమనాణెముల విలువను తగ్గించుకొనెను. ఇంగ్లండుకూడ జాగ్రత్తపడెను. కాని మనరూపాయి తగ్గింపు విషయము అసంబ్లీకి వచ్చినప్పుడు మన ఆర్థికసభ్యుడు సర్ జేమ్సుగ్రిగ్గు గారు తీర్మానమును త్రోసివేసిరి. ఇది యెంత సమంజసమో పాఠకుల కెరుకయే. మన రూపాయి విలువ తగ్గకపోవుటచేత కొంతవరకు మన ఆర్థికమాంద్యము, ఎగుమతులు తగ్గినవి. బంగారపు విదేశగమనము హెచ్చినది. దీనిని గురించి చర్చించుట నా యభిమతము గాదు. ఇంకను అనేకవిషయములవలన మన ఆర్థికదుస్థితి కల్గియున్నది. వాటి నన్నిటిని వర్ణించిన వ్యాస విస్తారము కల్గునని భయపడుచున్నాను. ముఖ్యమైన సంగతు లివ్వియే.

రాజకీయముగా మన కావంతయైనను స్వాతంత్ర్యము లేదు. ఉన్నతోద్యోగము లన్నియు బ్రిటిషువారివే. యుద్ధభటులలో బాధ్యతాయుతమైన ఉద్యోగము లన్నియును తెల్లవారివే. ఉన్నతోద్యోగములే కొన్ని భారతీయుల కీయబడుచున్నను అవి వారికి అనుకూలముగానుండువారికే యిచ్చుచున్నారు. నూతనరాజ్యాంగపద్ధతి ప్రకారము ఇదివరకున్న మేలు కూడ అదృశ్య మగుచున్నది. రాష్ట్రీయస్వపరిపాలన, ద్వంద్వపరిపాలన యొక్క అంతము, లెజిస్లేటివు ఎగ్జిక్యూటివు సభములకు బాధ్యత నొసగుట మొదలగున వన్నియు శుద్ధ కల్లలు. నిరంకుశ గవర్నరు, అతనికి జోహారులొసగు మంత్రులు మాత్రము బయలు దేరెదరు. రక్షకభటశాఖ, ఆర్థికశాఖ ముఖ్యముగా గవర్నరు చేతిలో నుండును. అతని ప్రత్యేక హక్కులవలనను, ప్రత్యేకబాధ్యతలవలనను యిష్టమువచ్చినంతవరకు చెలాయించవచ్చును.

ఫెడరల్ రాజ్యాంగములో గవర్నరు జనరలు నిరంకుశానికాడి. అతడు యావద్భారతదేశముమీదను అంగీకారపత్రము (Instrument of Accession) లో నున్నంతమేర సంస్థానాధీశులమీదను అధికారము చెలాయించవచ్చును. అతడు రాష్ట్రీయగవర్నరులు పొరపాటుననయిననూ భారతీయులకనుకూలముగను బ్రిటీషువారికి ప్రతికూలముగను ప్రవర్తింపకుండునట్లు చూచుచుందురు. అతనిని కూడ కనిపెట్టుటకు సెక్రటరీ ఆఫ్ స్టేటున్నాడు. ప్రజాప్రతినిధులకు రాష్ట్రీయ లెజిస్లేటివ్ ఎగ్జిక్యూటివులలో గాని, ఫెడరల్ లెజిస్లేటివ్ లో కాని అధికారము తక్కువ.

పైగా మన జమీందార్లు, స్వదేశసంస్థానికులు, మిల్లు యజమానులు, తదితరధనికులు బ్రిటీషుసామ్రాజ్యతత్త్వానికి అండయై నిలచియున్నారు. వీరితోకూడ మనము పోరవలసి యున్నది.

కాంగ్రెసుసభలో నిర్ణయించబడినరీతిని మనము ఎసెంబ్లీలలో పోటీ చేయబోవుచున్నాము. ఎందుకు? నూతనరాజ్యాంగమున కడుగడుగునను ప్రతిబంధకములు కల్పించి దేశానుకూలముగా మార్చుటకు.

రాజకీయముగా మనకు ఏమికావలయును? సంపూర్ణ స్వాతంత్ర్యమే మన పరమావధి. స్వాతంత్ర్యానంతరము సోషలిజస్థాపన. అంతటితో కాని మనకు తృప్తి కలుగదు. కాని ప్రస్తుతములో అధికారము గల ప్రజాప్రతినిధులను కల్గియున్న లెజిస్లేచరు, వారికి బాధ్యులై పాలించునట్టియు, ప్రతినిధులనుండి యెన్నుకొనబడినట్టియు మంత్రులను కల్గియున్న ఎగ్జిక్యూటివు సంపాదించుకొనుట కూడ ఉపయోగమే. ఆర్థిక విషయములు సోషలిస్టుపద్ధతుల ననుసరించవలెను. అనవసరపు ఖర్చులను తగ్గించవలెను. ప్రజోపకారకముగా పన్నులు ఖర్చగునట్లు చూడవలెను. సైనికోద్యోగములు' గవర్నరు వరకుగల ఉన్నతోద్యోగములును చాలవరకు భారతీయులకే లభించునట్లు చూడవలెను. ఈఉద్యోగులు ప్రజాప్రతినిధులకు లోబడియుండవలెను. పన్నులు తగ్గించుట, కార్మిక కర్షకులకు లాభములు జరగవలెను. డొమినియనుస్టేటసు అని కొంద రందురుకాని ప్రస్తుతం లో కెనడా, న్యూజిలాండు, ఆస్ట్రేలియా అనుభవిస్తున్న పద్ధతులమీదనైతే ఒప్పుకొనవచ్చును. ఎట్లయినను ఏకీభవించి అనవసరముగా వివిధ పక్షములను లేవదీయక కాంగ్రెసుసంస్థ యిష్టముచొప్పున సంపూర్ణ స్వాతం

త్ర్యముకొరకు నిరంతరము పాటుపడవలెను.

సాంఘికముగా మనలో చాల లోట్లున్నవి: బాల్యవివాహములు, స్త్రీలకు స్వాతంత్ర్యము లేకపోవుట (అనగా స్త్రీ సంఘములోనికి వచ్చుటకు పూర్వాచారమువలన నిరోధింపబడి పర్దాపద్ధతికి లోనయియున్నది), బాలవితంతువులకు పునర్వివాహము లేకపోవుట, వర్ణాంతరకక్షలు, జాతిమతభేద జనితములగు వైషమ్యములు, హరిజనసమస్య మొదలైనవి. ఇప్పట్లో సాంఘికముగా మంచిమార్పులు జరిగియున్నవి: శారదా చట్టము, స్త్రీలు జాతీయసమరములో పాల్గొని పర్దాపద్ధతిని వీడుట, విద్యాభ్యాసము చేయుట, జాతీయ అంతర్జాతీయ విషయములను తెలుసుకొనుట, విదేశగమనము, పునర్వివాహము, ఉపన్యాసములు గావించుట, పత్రికలకు వ్యాసములు వ్రాయుట, సంఘములుగా నేర్పడుట మొదలైనవి. కాని వారికి ఆస్తి వారసత్వపు హక్కు, ఉద్యోగములు చేయుట ప్రస్తుతములో తగవు. సంపాదన పురుషుని కర్తవ్యముగా తలపవలెను. ఆసంపాదన అనుభవించుచు, వారు గృహపరిశ్రమలలో మిక్కిలి పాల్గొని, విద్యావతులై, భారతాభ్యుదయమునకు తోడ్పడుచు మంచి పుత్రికాపుత్రులను తయారుచేసి స్వాతంత్ర్యసమరమునకు పంపవలెను. సన్మాతృత్వమే వారికి పరమావధి. రాజకీయములలో, అనగా స్థానిక స్వపరిపాలనలలోను, జిల్లాబోర్డులలోను, రాష్ట్రీయ కేంద్ర పరిపాలనలలోను పాల్గొనవచ్చును. కాని నిరుద్యోగసమస్యవలన బాధపడుచున్న పురుషునికి పోటీగ నిల్చి వాని వేదనను అధికముచేయ తగదు. గత అసహాయోద్యమములో వీరు పడిన కష్టములకు వీరు ఎంతయు శ్లాఘ్యులు. వీరి ఉద్యమముకూడ కాంగ్రెసుసంస్థలోనికి గ్రహింపబడవలెను.

హరిజనసమస్య మొదటలో చాల క్లిష్టమనిపించినది. కాని అవతారపురుషుడు మహాత్ముడు పూనుకొనుటచే జయము గాంచినది. తిరువాంకూరు మహారాజుగారు తమ దేవాలయములందు హరిజనులకు స్వేచ్ఛగా ప్రవేశించుటకాజ్ఞ యిచ్చుటచేత మహాత్ముని తపస్సు సిద్ధించినది. చాలచోట్ల హరిజనులు సవర్ణహిందువులచేత కరుణింపబడి సమముగా చూడబడుచున్నారు. కాంగ్రెసుతో పోటీచేయుచున్న దేశములోని పక్షములూ, ప్రభుత్వమూ కూడ వీరి సమస్యను తమ కార్యక్రమములోని దని చాటుచున్నారు. కాని ప్రభుత్వము వారు వీరిని రెచ్చగొట్టి సవర్ణ హిందువులయందు ద్వేషము పుట్టించుచున్నారు. కాంగ్రెసు మైత్రి ఒనగూర్చుచున్నది.

హిందూ మహమ్మదీయ, శిక్కు మహమ్మదీయ కలహములు ఉత్తరహిందూదేశములో తీక్ష్ణముగా నున్నవి. అయినప్పటికిని పూర్వముకంటె చాల నయము. క్రమముగా కాంగ్రెసునాయకులు మైత్రి చేకూర్చుచున్నారు. అబ్దులు గఫూరుఖాను, మహాత్మగాంధి ఈ విషయములో నెక్కువగ పాటుపడుచున్నారు. అనవసరమైన కక్షలను వదలి జాతియైక్యత చేకూర్చుకొనవలెనని నా ప్రార్థన. శిక్కు మహమ్మదీయులలో కూడ కొంతవరకు మైత్రి ఏర్పడుచున్నది. వర్ణాంతర వైషమ్యములు కూడ అదృశ్యమగుచున్నవి. కనుక త్వరలో జాతిమత వర్ణైక్యత ఏర్పడగలదని నా ప్రత్యాశ.

విజ్ఞాన శాస్త్రములు ప్రస్తుతంలో ఎంతవరకు సాగుచున్నవో అంతవరకు వృద్ధిపొందుచున్నవి. ఆర్థిక స్వాతంత్ర్యము వచ్చిననే తప్ప ఇయ్యవి మిక్కిలి వృద్ధిపొందుట కవకాశము లేదు. మన నాట్యకళ సినీమాలద్వారా అభివృద్ధి నొందుట గాంచుచునే యున్నాము. మన శాస్త్రీయాభివృద్ధికూడ బాగుగా జరుగుచున్నది. దీనికి తార్కాణము ప్రపంచఖ్యాతి వడసిన రామనుగారు, బోసుగారు, ప్రఫుల్ల చంద్రరాయి గార్లు. పరిశోధనలు జరుగుచున్నవి కాని విశేషధనము లేకపోవుటచే కష్టమగుచున్నది. సిద్ధాంతరీత్యా మనవారు మేధావులవగల్గుచున్నారు.

కనుక ఈ ప్రస్తుత స్థితినుండి మన భారతదేశమును ఉచ్చస్థితికి తీసుకొనివచ్చుట ప్రతిభారతీయుని యొక్కయు కర్తవ్యము. పైన చెప్పిన విషయములను గమనించుచు రాజకీయములను ముఖ్యముగా గమనించుచు అఖిలభారత కాంగ్రెసు సంచరించవలసియుండును. అప్పుడే భారతమాతను దాస్యశృంఖలములనుండి విడిపింపగలము.

భోజనము, వేదపాఠములు, యజ్ఞములున్, జపముల్, శివార్చనల్
చేపడివారలొక్కరుదు లేరట, నయ్యది కాంచి సంతిన్.

'ఋషిపంచమీవ్రత మెప్పు డుద్యాపనఁ
జేయింతు'వని తల్లి చెవినిఁ గోరక
మంగళసూత్రంబు మట్టియల్ దక్క నా
భరణమేదియు లేమి కరుణఁ గాంచ
బతి దూరమైనఁ గాల్నడకను బోవకఁ
ఎప్పనిసరియౌటఁ దనయుఁ దెలియఁ
బండుగ కేతెంచియుండిన యల్లుండు
కట్నముల్ చాలమిఁ గినలు బూండ
దిగులుఁ జెందక మదిని దదేకదీక్ష
దివ్యకావ్యవినిర్మాణ భవ్యకార్య
తత్పరుండయియున్న సత్కవిని జూచి
సంభ్రమాశ్చర్యదుర్వ్యథాచకిత నైతి.

వివేకనీతిదాయకము విశ్వజగద్ధితమున్ మనోజ్ఞమున్
లలితకథాసమన్వితము నైకగుణాన్వితమైన కావ్యమున్
గలితగతిన్ రచించి యది క్ష్మాస్థలిపైఁ బ్రచరింపలేక వి
హ్వలతను జూపుచుండె నతఁ డక్కట! శూన్యవిలోకనంబులన్."

అనవుడు విగ్రహంబనియె "నారవిచంద్రముగా స్థిరంబుగా
మను పృథుకావ్యమున్ బ్రచురణంబొనరించి విశేషసౌరభం
బును వెదఁజల్లఁగావలెను భూస్థలిభూపతి యందుచే రయం
బునఁ గొనిపొమ్ము కంటఁగల భూరిమణిన్ గవివర్యునొద్దకున్."

'పెన్నిధానముఁ గాంచిన పేదవోలె'
ననుచు రచియించుటేగాని యనుభవించి
యెరుఁగఁ డాతఁడు తొల్లింట, నిప్డు దద్ది
స్వానుభవమయ్యె నతనికిఁ బ్రతిమకృపను.

*     *     *     *

ఆపంటలు నాశనంబయిన బన్నునొసంగ ధనంబులేక వా
ల్లింటికి నన్న పుస్తెయును గ్రక్కననమ్మి కుటుంబపోషణా
బింటికి నింటికిం దిరిగి యెత్తిన బిచ్చముతోడఁ జేయుమున్
గంటికి మంటి రెప్ప హలికవ్రజమున్ గని యిందువచ్చితిన్."

వ. అని యవ్విహగ మవ్విభున కనిన

"సార్థజన్ముఁడై బహుళ సస్యకదంబములన్ 'పరోప కా
రార్థ మిదం శరీ' మను న్యాయము నే మదిఁబూని సర్వ సా
ఖ్యార్థము పెంచుచుంటి హలికావళిసౌఖ్యము దేశసౌఖ్య సం
వర్ధనకార్య మౌనుగద! పక్షివతంసము! యక్కటంబునన్.

శ్రమలం జెందెడి కర్షకప్రతతి కష్టంబుల్ నివారించుటం
బె మహోత్కృష్టత యొందు నున్నదిగదో? నా నేత్రనిస్థమైయున్న భ
వ్యమణివ్రాతము కొంచనమ్ముఁగొని యిమ్మా వానికిన్; సజ్జన
శ్రమలన్ బాపఁగలేని సొమ్ము లతితుచ్ఛంబుల్ గదా!" నావుడున్.

రాజాజ్ఞన్ శిరసావహించి యతిసంరంభంబునన్ జేసె న
య్యోజన్ నీసజ మెట్టి భారమయినన్ యోగ్యుండు సత్కార్యమున్
దాఁ జేయండె; పరోపకారమున నాత్మక్షేమమున్ జూడకన్
దాఁ జీర్ణించెఁ గదన్; పతత్త్రిపతి; స్వార్థత్యాగ మిట్లొప్పునే!

"కాలముచేరువయ్యె, వరకారుణికోత్తమ! మిమ్ముఁబోలు స
చ్ఛీలుర దివ్యసన్నిధిని జీవము లన్ విడనాడు భాగ్య మీ
లీల లభించె నాకు; బలుక్లేశములొందెడివారి యక్కరల్
నేలవమైనఁ దీర్పఁగను నేర్చితి మీకడనుండుటన్ బ్రభూ!

వీడెద స్థూలదేహమును విస్ఫుటతేజక నూత్నమూర్తి నేఁ
జూడఁగఁ బోవుచుంటి"ననుచున్ ఖగముం దెను కాలధర్మమున్;
బోడిమిఁ దక్క మౌనగుణముద్ర వహించెను విగ్రహంబు; ఆ
రేఁడు హితార్థమై నిజశరీరమునైనను ధారవోయఁడే!

"ఇతఁడే రాజన; నితఁడే ప్రభుఁడౌనన్; ఈతండే ప్రాపన్న నీ
క్షితిపై దీనులకున్, గతించియును, నీ సత్కీర్తి సత్కార్యముల్
మృతజీవుల్ గద సత్పురుషుల్; గుణవ్రతుల్ జీవన్మృతుల్ గారె"యం
చతిభక్తిన్ గని ప్రాసె నంతయును గాథాశక్తి సంపన్నతన్.



## మదరాసు అసెంబ్లీ, కౌన్సిళ్ల ఆంధ్రకాంగ్రెసు సభ్యులు



కోటిరెడ్డి



టంగుటూరి ప్రకాశం



కల్లూరి సుబ్బారావు



పి. ఆర్. కె. శర్మ



సి. రాజగోపాలాచారి (కాంగ్రెసుపక్ష నాయకులు)



యన్. శంకరరెడ్డి

# ఆంధ్రవిశ్వ విద్యాలయము - కళాప్రపూర్ణ బిరుదములు



౧. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు - (విజయనగరము)



౨. జనమంచి శేషాద్రిశర్మగారు (కడప)




౩. మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులుగారు (తిరుపతి)



౪. మహామహోపాధ్యాయ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు (రాజమహేంద్రవరము)





యం. యన్. రాయిగారు, వారి అమెరికనుసతీమణి

